

సంపు. ౧౩ ధాత సంవత్సరము, కార్తికమాసము (నవంబరు ౧౯౩౬) సంఖ్య ౧౧

# కొండకోన

మంచిపాక పార్వతీశ్వరశాస్త్రి

మూఁడుదారులు కలసి మొత్తమై తగుచోట
మూఁడుకాల్వలు కలసి మొత్తమై తగుచోట
మూఁడుమాటలు కలసి మొత్తమై తగుచోట
మూఁడుమూఁ డేకమైమురియుచుండెడుచోట
తొలిమేడలో నీవు తెలిగద్దెఁ గూర్చుండఁ,
జేమోడ్చి యెదురుగాఁ జేరియుండితి నేను;
చూచి చూడక నన్నుఁ జూచుచుంటివి నీవు
నీమ్రోలఁ జేమోడ్చి నిలిచియుండితి నేను;
పిలిచి దరిఁ జేర్తువని తలఁచుచుంటిని నేను.

పిలువవైతివి నీవు —తలఁకుఁ బొందితి నేను;
నీపాదములవద్ద నిలిపితిని నాతలను;
దయవీడి, డాకాలఁ దన్నితివి నాతలను;
తాకులో లీనమై తనివిఁ జెందితిని;
తనివిలో నానందతనువుఁ దాల్చితిని.

అడవిలోఁ గల దొక్క యమృతంపు బావి; ఆ
బావిచెంతనె కలదు పారిజాతపుఁ జెట్టు;—
చెట్టుక్రిందనె కలదు చిన్నయిల్లొకటి; ఆ
యింటిలో నివసింతు మేము నాయిల్లాలు;
ఇల్లాలు నేను నా యింటిలోపలనుందు
ఎన్ని నాళ్లయ్యెనో యెఱుక లేదయ్యె—

ఒకనాటిమలుసంజ నొ ప్పెఱుంగగ లేక,
యడవి వీడితి, —నూరికరిగి, తడసితిని.—
ఊరిమేడలలోన, ఊరియిల్లాండ్రలోఁ
జిక్కితిని, —సుక్కితిని— సుక్కి యేడ్చితిని.

నన్ను వెదకుచు వచ్చి, నాయింతి ననుఁజూచి
జాలిగొనె; కౌఁగింటఁ జనవుమై నిలిపికొనె,—
అడవిలో మాయింటి కరిగి మే మిర్వురము
తొంటియానందానఁ దూఁగితిమి మరల.

మూఁడేళ్ల మొత్తాన, మూఁడుకొమ్ములకొండ—
ఏడుగోడలనడుమ నిల్లొకటి కలదచట—
ఇల్లాలితోడ నాయింటఁ గాపురముందు;
ఒకరియింటికిఁ బోదు; ఒకరికంటను బడదు;
గుట్టుగా నిల్లాలు కూర్చుందు నింటిలో;—
ఎఱుఁగ దెవ్వరిని నాయిల్లాలు ననుఁదక్క;

ఇలువీడి పెరచోట్ల కిల్లాలుపోకుండ,
గుమ్మాన నేవేళఁ గూర్చుందుఁ గనిపెట్టి;
పెరవారు నాయింటఁ జొరకుండఁ గాచుకొని,
గుట్టుగా నిల్లాలిఁ గూడి యానందింతు;
ఇల్లాలిఁ బైకి రానీను నేననునింద,
ఇల్లాలిగుట్టు పైకెఱుఁగనీ ననునింద;
నిందలన్నియుఁ దలను నిలుపుకొందును గాని,
యెఱుఁగనీ నొరుల నాయిల్లాలి గుట్టు.

ఏల నీయిల్లాలి నిచ్చోట నచ్చోట
తిరుగనిచ్చెద వోరి తెలివితక్కువవాఁడ?
గుట్టులేనిల్లాలు కూడునా నీతోడ?
మనసిచ్చి నీతోడ మాటాడవచ్చునా?
పట్నాన కాపురము పాడుచేసెను నిన్ను;
అడవిలోనికిఁ బోయి యుం దుండరాదా?
కొండపై నివసింపఁగూడదా నీకు?

అల్లిబిల్లిఁదీగ లల్లుకొనుకానఁ
నిలువుట[illegible]గల ద[illegible] యెఱుఁగవా?
ఆమఱ్ఱిక్రింద [illegible]రటిని గట్టి
యిల్లాలితోడ నీవేల నిల్వఁగ లేవు?
గుట్టుగా మట్టుగాఁ గూడి యిల్లాలితో
ఒరులకంటఁ బడకుండ నుండఁగల వచ్చోట;
అట కేగి నిలువుమా ... ... ... ... ...
... ... ... ...ఆనందమొందుమా.

అడవిలోఁ గొండపై నాకుటింటను మేము
నివసింతు మేవేళ-నేను నా యిల్లాలు;

నడురేయి నొకనాఁడు,—నా ప్రక్కనే పరుండి
తను వెఱుంగని నిద్దురను జెందె నిల్లాలు;
తళతళని మింటఁ జుక్కలు వెల్గుచుండెఁ; ఆ
వెలుఁగులోఁ జీకట్లు విలసిల్లుచుండెఁ;
వెలుఁగుచీకటిఁ గూడి చెలువొందఁ దనివొంది
యిలువీడి దవ్వుగా నేగితిని; తడసితిని;
కారుమబ్బులు క్రమ్మె; గాలివానయు వచ్చెఁ;
త్రోవకన్పడకుండెఁ; ద్రోవఁబాటయ్యెఁ;

ఇల్లింత పడిపోయె; ఇల్లాలు నను బోలె
వెఱకిరొ, నను(గూడ వెడలివచ్చుచునుండె;

గాలిలో, వానలో, కారుచీకటిలోన
కలసితిమి, మెఱపులోఁ గలసి తనిసితిమి-

అదిగదిగో, నెచ్చెలీ, ఆ కొండచూడుమా,
ఆకొండపై, అదిగో, ఆమఱ్ఱి చూచితే,
మఱ్ఱిక్రిందనె కలదు మాయాకుటిల్లు;

చాల సేపయ్యె, నీసరసనే కూర్చుంటి;
క్రమ్మంగాఁ జొచ్చెఁ జీకట్లు నల్గడల;

నాయింతి యొక్కతే, నాకోసమై చూచు;
పోకున్న విలపించు; పొక్కి యేడ్చుచునుండు;
చలికిఁ దాళఁగలేక, యులికిచూచుచునుండు;
కలికి యేడ్పులకు నేఁ గలతచెందుదు నయ్య;
విడువుమా నన్ను నే వెడలిపోవలయు;

మంచుబిందువుల కమ్మందనంబులు క్రోలి,
నడురేయి, చలివేళ, నాయింతి కౌఁగింట,
నాయాకుటింట నెన్నఁగరాని తనివితో
నన్ను నేమఱచి—

బీదకాపురము; నా ప్రియురాలితో- అదిగో—
ఆచిన్నయింటిలో — ఆనందమునునుందు—

కూడుగుడ్డలకైనఁ గొదువయే మాయింట —
గాని, నా ప్రియురాలు కనలొందదే వేళ;
ప్రియురాలిఁజూచి నేఁ బ్రియము చెందుచునుందు
ననుఁజూచి ప్రియురాలు తనివిచెందుచునుండు;

పనికిమాలినపాట్లు పడి పైని దరుగాడి,
వేళ కింటికి రాక జాలంబు కావించి,
వెలిఁ దిన్న చీవాట్లు ప్రియురాలిపైఁ జూపి,
కోపంబు తెప్పింపఁ గోరుచుందునుగాని,
కోపింప దెపుడు, సంతాపింప దెపుడు;

పరితాపమును బొంది పలుకరించెడువేళ,
కలికిపాదము లంటి, కన్నీరు కార్తు;
కన్నీటఁ బాదాలు కడిగి, మైమఱతు.

ఇల్లాలు రాణి యం చెఱుఁగలేకుంటి;
ఇల్లాలు వేల్పంచు నెంచలేకుంటి;
ఇల్లాలి మఱచితిని; ఇంటినే మఱచితిని;
పెరవారి తనివికై పెనగులాడితిని;
పనిపాట్లు కావించి, తనివోసంగెడు వేళ,
బళిబళీయని వెంటఁబడుచుండిరే కాని,
తలకుమించిన మోత తలపెట్టి, నేలఁబడి,
యిక్కట్లలోఁ జిక్కి యీదులాడెడు వేళ,
దరిఁ జేర లే దొకఁడు, తలకు మాన్పఁగలేను,
ఇల్లాలె దిక్కయ్యె—ఇల్లె దిక్కయ్యె —

కోపంబులేక, సంతాపంబులేక, నా
యింతి నను సేవించె నిక్కట్లవేళ—

పరితపించితి; ఇంతిపాదములు పట్టితిని;
కన్నీటఁ గడిగితిని; కౌఁగింటఁ దనిసితిని.

విరిసెజ్జపైని నాప్రియురాలు కూర్చుండి,
నవ్వుచును, మురియుచును, నన్నుఁ జూచెడు [వేళ,
తనువెల్ల పులకలై తనివి చెందుచునుందు;
తనువెల్ల కన్నులై కనుగొంచునుందు;

పట్టుచీరలు లేవు; బంగారములు లేవు;
పేదవారము మేము; ప్రియురాలు నేను;

ఆకొండపై-అదిగో-ఆమఱ్ఱిక్రిందనే,
ఆపూరికుటింటనే——అందె మేముండెదము;

విరిబంతి సిగపైని, విరిదండ మెడలోన,
విరిగుత్తి చేఁ దాల్చి, విరిసెజ్జఁ గూర్చుండి,
విరిరాణివలె నున్న విరిబోడిఁ గనువేళ,
విరిఁబోలె నామనము వికసించి వలచినది;
వలచి వలపించినది; వలపించి వలచినది;
వలచువలపునఁ గూడఁ దలపు మఱచినది.

ఇరుగెలంకుల మల్లె లిరికిరికి పూయఁగా,
పలపలని పారు చిఱుసెలయేటిదరిఁ జేరి,
యిసుకపైఁ గూర్చుంటి మేము నాయిల్లాలు;

ఆకసంబునఁ జుక్క లందందుఁ గన్పట్టె;
కారుచీకట్లు నల్లెడఁ గప్పియొప్పె.

ఆకులల్లాడక, అగపొడలు గనరాక,
గాలి యేడనో డాగె, కౌతుకంబయ్యె;
శాంతమహానన్వేళఁ గాంతకౌఁగిటిలోన
నానందరూపుండనై కూరుచుంటి.

పరుగెత్తి పంతాన వచ్చె మబ్బును గాలి;
వాన తొండాలతోఁ బడి ముంచి యెత్తాడె;
ఉప్పొంగె సెలయేఱు; కప్పె నిద్దఱను;
ఒక రొకరి కౌఁగిళ్ల నొదిగి మేమిద్దఱము,
మునుఁగుచును, దేలుచును, జనుచుంటి మేటిలో——

వద్దువద్దంటావు, వద్దుండు మంటావు,
నీవద్దకూర్చుండి నేనిలువఁగలనయ్యా ?
పగలంత యిచట నీవద్దనే కూర్చుంటి;
నీవు చెప్పినదంత నిలిచి నే వినుచుంటి;
నీవు చేసినదంత నిలిచి నేఁ గనుచుంటి;
వేళమించినదయ్య ప్రియురాలికడ కేఁగ;

నాపైని జాలిగొను; నను వెడలి పోనిమ్ము;
తరలిపోవలె వేగ; దవ్వయ్య మాయిల్లు;
కాకి గూరఁగలేని కారడవి దాటవలె;
ఇరులు గ్రమ్మగనున్న విఁకవిడువుమయ్యనను;

అడవి కావలఁ గొండ, అడవి కీవలఁ గొండ;
కొండపై మాయిల్లు కొలనిచెంతనె యుండు;

కొలనియొడ్డున నింతి కూర్చుండు కనిపెట్టి;
విడువుమా నను; నీకు వేవేలదండాలు.

నీసేవ చేసితిని; నిన్నుఁ బూజించితిని;
నీకడ్డ నిందాక నిలచియుండితినయ్య;
జామురాతిరి యయ్యె;జాలిగొనుమోయయ్య;
ఎదురుతెన్నులు చూచు నింతి నాకోసమై
తెలతెల్లవారగనె, తిరిగివచ్చెదనయ్య,
జాగుచేసినదారి సాగిపోవలె నయ్య;
తడయనీయకుమయ్య, దయచూపుమో
యయ్య;
నడురేయి నొకయింత నాయింట నేనున్న,
పగలంత నెంతైనపనిచేయఁగల నన్న;
నీ పనులు లెస్సఁగా నేఁజేయువలె నన్న
నను నిలువనిమ్మన్న నడురేయి నాయింట;
నాయింట నడురేయి, నీయింట పగలంత,
నీకు నాకును బ్రీతి నిలువని మ్మోరీతి—

ప్రియురాలిసేవకై ప్రీతి నిను సేవింతు.

తొలికొండపై నినుఁడు తోచితోచకమున్న,
పనిచేయ వచ్చితిని; పనివారి లేపితిని;
పనివారు తమపనులు పనిపూని చేయఁగా,
పనిపూని నేను నాపనులు సేయుచునుంటి;
పనివారిపని గంటి, పనిచేసి చూపితిని;

మలికొండపైకినుఁడుమరలి,సంద్రముఁజొచ్చె;
పనివారికపని మాన్చి, పంపితిని నిదురింప;

జామురాతిరి యయ్యె;చందమామయుఁదోచె;
ప్రియురాలికడ కేగ బయలుదేరితిని.
వెన్నెలలు విలసిల్లె; పిల్లగాలులు వీచె;
కొలనియొడ్డునఁ గనుచుఁ గూర్చుండెఁ బ్రియు
[రాలు

ప్రియురాలి చేఁబట్టి, ప్రీతి నింటికిఁబోయి,
ప్రియురాలితోఁ గూడి, విరిసెజ్జపై నుండి,
ప్రియురాలి కౌఁగింటఁ బ్రేమలో మునిఁగితిని.

పనికివచ్చేవేళ పనికిరావేమిరా?
పనికిమాలినపనులఁ బడియుందు వేమిరా?
పనిచేయువేళ నీ పనులన్నియు ముగించి,
పని తీరినంతనే చనరాదె యింటికిని;
ఇల్లులేదా నీకు; ఇంతి లేదా నీకు?
నీయిల్లు నీయింతి నీకుఁ గావలదా?

పనిచేయు పగలంత, చనురేయి నింటికిని;
పగలు రాతిరి యిట్లు పంచి తిరుగాడుమా;
పనిమానితిరుగాడ వల దెన్నటికి నీవు;
వేళ కింటికిఁ బొమ్ము; వెకిలిగాఁ దిరుగకుము;

పగలంత శ్రమకోర్చి, పనితీర్చుకొని పొమ్ము;
ప్రియురాలికౌఁగింట విశ్రమింపుము రేయి;

పనికానిపని చేయవలదన్న వినుమన్న,
ప్రియురాలిపైఁ బ్రీతి విడిచిపోవలదన్న—

ఎంతసంప్రీతిమో యీత్రోవఁబోవ;

కొక్కొరోకోయంచుఁ గోడికూయకమున్న
మేలుకొని, పనివాళ్ల మేలుకొల్పితిని;
పనివాళ్లు ప్రేమతో పనులుచేయుచు నుండ
పనులుచెప్పచునుంటి; పనిచేయుచుంటి;
చేయుచుంటిని పనులు; చెప్పచుంటిని పనులు
చెప్ప చేతల మప్పి త్రిప్పకొనుచుంటి—

జాము రాత్రిదాఁక ప్రేమతో నీరీతి
పనిచెప్పి, పనిచేసి, పని పూర్తిచేసి,
పనివారు నిదురింప, బయలుదేరితి నింటఁ
బ్రియురాలితోఁగూడి ప్రీతి చెందంగ;
ప్రియురాలి కౌఁగిట విరిసెజ్జ నిదురించి,
బయలుదేరితి మరలఁ బనివారిలేప;

ఎంత యానందమో యీసేవ త్రోవ!



ఐక్యము D. A R.

ఆంధ్రులు రచించిన

# సంగీతరత్నాకర వ్యాఖ్యలు

సంగీతరత్నాకర మనునది సంగీతభరతశాస్త్రముల లక్షణముల నిరూపించు ప్రకరణగ్రంథము. దేవగిరి రాజధానిగా మహారాష్ట్రాంధ్రదేశ భాగములఁ బ్రౌఢ ప్రతాపముతోఁ బరిపాలించిన సేవుణరాజులలో ముఖ్యుఁడగు సింగణభూపాలుని యాస్థాన మలంకరించిన శార్ఙ్గదేవుడు ప్రాచీనగ్రంథజాలముల విషయవిమర్శము సేసి భరతమతవ్యాఖ్యాతల సిద్ధాంతభేదముల మర్మము గ్రహించి నిర్వాహక మగుమతమును స్వీకరించి సంగీతశాస్త్రము దుర్గాహవిపుల విషయకమైనను సంక్షేపరూపముగా సంగీతరత్నాకర మనుపేర నిబంధరూపముగా రచించెను. శార్ఙ్గదేవుఁడు కాశ్మీరదేశీయుఁడగు సోఢలునితనయుఁడు. అతఁడును సింగణునితండ్రి యగు భిల్లమునికాలముననే కాశ్మీరమునుండి మహారాష్ట్రమునకుఁ దరలివచ్చెను. క్రీ. శ. ౭-వ శతాబ్దిమొదలు ౧౨-వ శతాబ్దితుదకుఁ గాశ్మీరము సరస్వతీపీఠము నామము నన్వర్థము సేసికొనుచు సకలశాస్త్రములలో నుత్తీర్ణు లగు కవులచేతను, శాస్త్రజ్ఞులచేతను బ్రఖ్యాతి వహించియు క్షీణగతి చెందఁగా ౧౨,౧౩-వ శతాబ్దులఁ దద్దేశపండితులు దేశాంతరముల విద్వత్పోషకు లగు నరనాథుల సభాంతరంబుల విద్యాచాతుర్యముఁ జూపుచుఁ గాలము పుచ్చుచుండిరి. సోఢలశార్ఙ్గదేవు లట్టివారే. సోఢలుఁడు భిల్లమునియొద్ద రాజవ్యవహార భారము నెతము వహించియుండె నని యూహింపవలసి యున్నది.

రత్నాకరమున స్వర, రాగ, ప్రకీర్ణ, ప్రబంధ, తాళ, వాద్య, నృత్యప్రకరణము లేడును యథోచిత విస్తరముగాఁ బ్రపంచింపఁబడియె. భరతకోహళాదిమహర్షి ప్రణీతశాస్త్రములలో విషయమతివిపులమై కపిలకణాద జైమిన్యాది దర్శనకారుల పారిభాషిక పదములతో నిబిడమై హైమవత వింధ్యారణ్య గహనములవలె శ్రోత్ర రమణీయమై హృదయాకర్షకము వలెఁ దోచినను దుష్ప్రవేశదుర్గ్రాహ మగుచుండును. వానిలో స్వరరాగాది వస్తువిభాగములలో సహితము న్యూనాధిక విచారముచే గ్రంథాంతర పరీక్షాపేక్ష కలుగుచుండును. అల్పకాలములో విషయమును సమగ్రముగా స్థూలరూపముగానైన నెఱుఁగఁగోరు వారలకు దోషహీనమై గుణాధికమై నాతి విస్తృత నాతిసంక్షిప్త విషయవిభాగక మగుగ్రంథమే శరణ్యమగును. అట్టిది ప్రాయశః సూత్రరూపమై పూర్వపక్షఖండన వాక్యసంవృద్ధము కాక కేవలసిద్ధాంత జాలముతో నిండి పాఠకులకుఁ బరామర్శక్లేశము గలిగించుచు నచ్చటచ్చట లౌకికార్థకమా, లేక శాస్త్రసంకేతితార్థకమా యనుసందేహము పుట్టించు పదప్రయోగముచే వాదపరివాదాస్పదమై వ్యాఖ్యానసాపేక్ష మగుచుండును. ఇట్టివి నూతననిబంధములు పుట్టుటచే నతివిస్తరము లగుమహర్షిప్రణీత పూర్వగ్రంథములు రాజసంరక్షణము లేకుంటను, పాఠకులు బుద్ధిపరిశ్రమము నోర్వఁజాలక సారమునే వడకి తెల్పఁగోరుచేఁ గృతార్థంమన్యు లగుటచేతను, క్షణభంగుర మగు తాళపత్రాది లేఖన సామగ్రి క్షీణించుచోఁ బద్విన్యస్త మగుగ్రంథసముదాయము స్థలాంతరమునకు మార్పమిచేతను, కొన్నియెడలఁ జేరలేకయుఁ, గొన్నిచోటులఁ గేవలనామావశిష్టములై యితరత్ర పూర్వోత్తరసంబంధభ్రష్టము లగువాక్యభాగములతోఁ జెను గ్రిమికీటదగ్ధములై శోచ్యదశావిదగ్ధము లగుచున్నవి.

ఇట్టిస్థితిలో సర్వతంత్రస్వతంత్ర నిశ్శంకగామి యనుమహర్షుల యాశయము మఱుఁగువడుటచేఁ గేవల పాశ్చాత్యబుద్ధిపరిశ్రమసాధితాంశముల మెచ్చుకొనువారు ప్రకరణగ్రంథములే మూలగ్రంథము లని భ్రమించి మన మహర్షుల కేకదేశవిషయ విచారప్రవృత్తియు నసాంగతా దోషాపత్తియు నారోపించుచుండుట యచ్చెరువు కానేరదు.

రత్నాకరము ప్రకరణగ్రంథ మగుట సంక్షిప్త మతసార మగుటచే నందును గొన్ని యెడల సందిగ్ధాంశములు కలవు. అవి కాలక్రమమున సంగీత మనుష్ఠాన ప్రధానమై గురుపర్వ క్రమావతరణశరణం బగుటచే దురవగాహము లయ్యె. కావుననే కుంభకర్ణుఁడు సంగీతరాజమునఁ గిన్నరీవాదనప్రకరణమున రత్నాకరకారుని రాగలక్షణము ననువదించుచు-

"రాగాలపనమాత్రాహుః కేచిత్పణ్డితమానినః,
శార్ఙ్గదేవాదయ స్తేషాంమతం నమమసంమతమ్.
యద్రత్నాకరకారేణ మన్ద్రిమారభ్య వర్ణితమ్,
రాగాలపన మేతన్మే ర క్తిహానేర్న సంమతమ్.
తస్మాత్సర్వేషు రాగేషు మధ్యస్థం కంచనస్వరమ్,
స్థాయినం పరికల్ప్యైవ తం రాగాలపనమారభేత్.
తస్మాన్మహానుభావానా మేషా మేషా పరిస్థితిః,
లీలాయితస్య సా నైవాస్మదాదీనా మిహాస్పదమ్.
విచారస్యతతో ఽ స్మాకం తద్గురుభ్యో నమః సదా,

అని శార్ఙ్గదేవమతంబుల మధ్యమాదిరాగముల స్థాయిగ్రహలక్షణము నాక్షేపించె. తంజాపురిరఘునాథుఁడును దన సంగీతసుధలో-

"శ్రీ శార్ఙ్గదేవేన కృతాం చ సప్తాధ్యాయీం తథా లక్ష్యవిరోధిలక్ష్యామ్, అబోధకాత్యల్పతరప్రయోగా మద్దిష్ట రాగానుదితస్వరూపాన్

ఏనాం స్వటీకర్తుమిహ ప్రవృత్తౌ తౌ బ్రాహ్మణౌ కేశవకల్లినాథౌ, యేన ద్వయేనాపి కృతేన తాభ్యామబోధితాస్పష్టపదార్థభేదాన్."

అని రత్నాకరగ్రంథములోని యవగాహన కాఠిన్యమును వర్ణించెను.

ఇందాపాదింపఁబడినదోషములు - లక్ష్యలక్షణ విరోధము, ఉద్దిష్టరాగములకు లక్షణము చెప్పకుండుటయు, వివరణమున సంశయమును, ప్రయోగమున లేని వానికి స్వరూపబోధనమును, పదార్థభేదము సూచింపమియు మొదలగునవి - సంగీతశాస్త్రమున కనుష్ఠానక్రమమునను, దేశాంతర మతసంక్రమణమునను, నిలుకడలేక దానిస్వరూపము మాఱుచుండెను. అందుచేఁ బూర్వకాల లక్షణములు నేఁటికాలపురాగములకుఁ జెల్లఁజాలవు.

(౧) లక్ష్యలక్షణవిరోధము సంగీతశాస్త్రమున సాధారణదోషము. ఒక్కొక గ్రంథకర్తయు లక్ష్యలక్షణముల సమత్వము గలిగింప గ్రంథము రచించెద నని చెప్పుచున్నాఁడు. లక్షణము వాడుకలో నున్నదానికి భేదించినచో నది మునిమతము కేవలము 'అదృష్ట'సాధకము. జనరంజకమునకు వాడుకలోనుండు లక్ష్యమే ప్రధాన మని శార్ఙ్గదేవుఁడు పెక్కుచోటులఁ జెప్పుచున్నాఁడు (౨) ఉద్దిష్టము లగు ౨౬౪ రాగములకు శార్ఙ్గదేవుఁడు లక్షణము చెప్పక ౧౦౫ రాగములు ప్రసిద్ధము లని వానినే గైకొనియె. ౨౬౦ రాగములలోఁ బెక్కింటిఁ గల్లినాథుఁడు సోమపతి మను గ్రంథము నుండి కొన్ని లక్షణము లిచ్చె. విద్యారణ్యులవారు సంగీతసారములో వాని కన్నిటికి లక్షణము చెప్పఁగా గ్రహించి రఘునాథుఁడు తన సంగీతసుధలో వివరించి రచించెను. అయినను శార్ఙ్గదేవుఁడు లక్షణ మిచ్చిన ౧౦౫ రాగములలోఁ బెక్కులు వాడుకలో లేవు. కొన్నిటికి స్వరూపమే మాఱెను. తక్కిన దోషములు కాలాతిక్రమముచే శార్ఙ్గదేవుఁ డొసగిన విషయములఁ బరామర్శము లేక ప్రాంతవడుటచేఁ గలిగినవి.

ఇట్లు కుంభకర్ణరఘునాథాదులు దూషించినను రత్నాకరము ప్రౌఢగ్రంథ మనుటకు సంశయము లేదు. పైదూషక మహానుభావులుగూడ రత్నాకరమునే పెక్కుస్థలముల ననువాదము సేయుచు దాని ప్రక్రియనే నఖశిఖాపర్యంతము గ్రహించి తమప్రతిభాదారిద్ర్యమును బయలుపఱచిరి. వాద్యాధ్యాయముల రత్నాకరమతమునే కుంభకర్ణవేమభూపాదులు మక్షికి మక్షిగాఁ బర్యాయపదవైఖరి మాపుచు రచించుట చదువువారలకుఁ జిన్నతనము నారోపించుచున్నది. శార్ఙ్గదేవుఁడు ప్రాచీనమతములఁ బరీక్షించి సారము వెదకి విప్రతిపన్నస్థలముల నభినవగుప్తాచార్యమతమునే స్వీకరించి తననిబంధన మొనర్చె. విషయములు ప్రాచీనములే యైనను బ్రక్రియ మాత్ర మతనిచేఁ గల్పిత మనియే చెప్పఁదగును.

ఏది యెట్లుండినను రత్నాకరము వ్యాఖ్యాసాపేక్ష మనుట నిర్వివాదాంశము. దాని కాంధ్రమున నొండురెండు వ్యాఖ్యలును, సంస్కృతమున మూఁడు నాలుగును, హిందీలో నొండును వ్యాఖ్యానములు కలవు. వీనిఁగూర్చి కొంతవిచారించుటకు మున్న వ్యాఖ్యానరచనా ప్రణాళిక యెట్టిదో గ్రహింపఁదగు.

వ్యాఖ్యారచనలోఁ బెక్కు సరణులు గాన వచ్చుచున్నవి. కొందఱు కేవలము మూలమునకు దండాన్వయముగాఁ బర్యాయపదముల నిత్తురు. కొందఱు కఠినపదములకును బారిభాషిక పదములకును బర్యాయపదము లొసఁగి వ్యాకరణలక్షణములతోఁ బ్రయోగముల సమర్థింతురు. కొందఱు ధ్వనితార్థమును సూచించుచు రసభావ విశేషముల నెత్తిచూపుదురు. ఇవి యెల్లఁ గావ్యనాటక వ్యాఖ్యాసరణులు. శాస్త్రసరణులలో దండాన్వయరచయితలును, కఠినపద టీకాకారులును గాక అంశములు, లేక సూత్రము లారంభించునపుడు పూర్వోత్తరసంగతి నెత్తిచూపుచు వ్యాఖ్యేయ వాక్యమునకుఁ దాత్పర్యము మతభేదములు విచారింపక పక్షానువాద సిద్ధాంతభావములు సూచించుచు నవతారిక వ్రాసి ప్రతీకము నిత్తురు. కొందఱు గ్రంథకర్తృమతమును వివరింపఁ బూర్వపక్ష సిద్ధాంతముల నాక్షేపసమాధానములుగా విషయము విమర్శింతురు. మఱికొందఱు తేలిక భాగముల వదలి గ్రంథిస్థలముల విపులముగా విచారించుచు మతభేదములఁ జర్చించుచు గ్రంథములోని యుత్కర్షము విశదీకరింతురు. ఈమార్గములు పాఠకాధికారుల ననుసరించి యుపయోగకరము లగు. కడపటిది భాష్యపద్ధతి ప్రౌఢులకుఁ జాల రంజకముగా నుండును. కొంద ఱనవసరముగా శాస్త్రాంతర విషయములఁ బ్రలాపించుచుఁ దమశక్తి చూపుదురు. దానిచే గ్రంథవిస్తర దోషము ప్రాపించును. కేవలము విడంబవాదీక్షితులగు దుర్వ్యాఖ్యాతలఁగూర్చి భోజుఁ డిట్లు చెప్పెను.—

దుర్బోధం యదతీవ తద్ధి జహతి స్పష్టార్థ మిత్యుక్తిభిః
స్పష్టార్థేష్వతివిస్తృతిం విదధతి వ్యర్థైః సమాసాదికైః,
అస్థానేఽనుపయోగిభిశ్చ బహుభిర్జల్పైర్భ్రమం తన్వతే
శ్రోతౄణామితి వస్తువిప్లవకృతః సర్వేఽపి టీకాకృతః.

అని దుర్బోధమును సుగమమని వదలి సుగమమును విస్తరముగా వివరించి యసందర్భవిషయములఁ జర్చించుచు వ్రాయుదురు.

ఇఁక వ్యాఖ్యానములఁ గైకొందము. హిందీ భాషలో రచించిన గంగారామపండితుఁడు సీమాసంస్థానాధీశుఁ డగు రామనృపతి కాశ్రితుఁడు. ౧౬౫౦-క్రీస్తుశక కాలములో నుండెనేమో. ఆవ్యాఖ్యానమునఁ బ్రాయశః శ్లోకములు కన్వయక్రమముగా నర్థ మొసఁగఁబడియె. సందిగ్ధస్థలములలోఁ దద్వ్యాఖ్యాతకు సుగమబుద్ధియే తోచుచుండెను. ఇతఁడు షట్రాగచంద్రోదయము నుదాహరించినందునఁ దత్కర్త విట్ఠలుఁడు క్రీ-శ-౧౬౦౦ కాలమున నుండినందున గంగారాముఁడు తదనంతరకాలమున నుండె నని చెప్పఁదగు.

సంస్కృతవ్యాఖ్యాతలలో—

(౧) సింగభూపాలుఁడు, (౨) కల్లినాథుఁడు, (౩) సింగణభట్టు, (౪) హంసభూపాలుఁడు, (౫) కుంభకర్ణుఁడు, (౬) భీమభూపాలుఁడు, (౭) కేశవుఁడు మొదలగువారు.

వీరిలో భీమభూపతి యనుట సింగరాజు వ్యాఖ్యలో "భుజబలభీమ సింహభూపాలరచిత" మను వాక్యమున భీమశబ్దమును వ్యాఖ్యాతృనామముగా గ్రహించుటచే భ్రమోత్పాదక మయ్యెను. అది నిక్కముగా సింగభూపాలుని బిరుదవాక్యమున నుత్తరపదము. హంసభూపాలశబ్దము సైతము సింగభూపాల పదమునకు లేఖకదోషమా యను సందియము కలుగుచున్నది. హంసగోపాలుఁడను పండితుఁడు వ్యాఖ్యరచించినట్లు తోచుచున్నది కాని నిక్క మెఱుంగరాదు. మాకు హంస

* చూడుఁడు—సంగీత రత్నాకరమున—కల్లినాథుని వ్యాఖ్య—(సం-ర-ప్రబంధాధ్యాయమున ౧౨౬ శ్లోకమున ఆలపన, ఆలప్తిశబ్దములకు వ్యాఖ్యఁ జూడఁదగు.)

భూపాలవ్యాఖ్య దృగ్గోచరము కాదయ్యె. సంగీతసుధలో రఘునాథుఁడు కేశవుని పేరొక్కనియె. మాయొద్ద నత్యల్పభాగము కేవల ప్రతిపదార్థటీకారూప మగు రత్నాకరకౌస్తుభ మనువ్యాఖ్య యనామకర్తృకముగాఁ గలదు. అది కేశవకృతమనుట కాధారము లేదు. దాని యందెట్టి ప్రౌఢిమయుఁ గానరాదు.

కుంభకర్ణుఁ డొక్కటీక రచించినట్లు చెప్పుదురు. అది మాకు లబ్ధము కానందున దాని స్వరూపము నిర్ణయింప సాధ్యము కాదు. అయినను రత్నాకరములోని విషయముల నెల్లఁ బురస్కరించుకొని విప్రతిపత్తి పూర్వపక్షఖండనములతో శాస్త్రమర్యాద ననుసరించి కుంభకర్ణుఁడు సంగీతరాజ మనుపేర ౧౬౦౦౦ (షోడశ సహస్ర) శ్లోకములలో విపులగ్రంథము రచించె. అందుచే రత్నాకరవ్యాఖ్య ప్రత్యేకముగా రచింప నావశ్యకము లేదు. బాలురు మేలుబంతి చూచి యక్షరములు కుదుర్చుకొనుటకు వ్రాసినదానినే వ్రాయునట్లు గ్రంథపరిశోధకులకును, చరిత్రకారులకును వ్రాసిన విషయములనే పునఃపునః లఘువ్యాసరూపముల వ్రాయు దుర్వ్యాప నేటికాలమునఁ గలదు. ఇది ప్రాచీనసంప్రదాయము కానందునఁ గుంభకర్ణుఁడు ప్రత్యేకముగా రత్నాకరమునకు వ్యాఖ్య రచించెనా యను సంశయము కలదు.

కుంభకర్ణుఁడు క్రీ-శ- ౧౪౩౦ నుండి ౧౪౬౯ వఱకును రాజపుత్రస్థానమున మేవాడుదేశమునకుఁ బ్రభువై యసంఖ్యాకము లగు యుద్ధములలోఁ బాతి పోక నిలచి ధారానాగపురాది బహుపురముల నాక్రమించుకొని మహమ్మదీయులఁ బెక్కుమాఱు లోడించి శత్రుభీకరుఁడై యుండెను. మేవాడు రాజసంతతివారు శుద్ధక్షత్రియులై క్షత్రశబ్దము నన్వర్థము సేయుచు నిరంకుశ ప్రవృత్త మగు తురుష్కులధాటి చెదరిపోవుటకుఁ గారణభూతులైరి. కుంభకర్ణుని యాశ్రితుఁడే మండన సూత్రధారుఁ డను ప్రఖ్యాత శిల్పగ్రంథకారుఁడు. సుమారు వేయేండ్లలోపుగా రచింపఁబడిన సంగీతగ్రంథములలో రత్నాకరముఁ గుంభకర్ణుని సంగీతరాజమును, ఖెదకోమటి వేమభూపతి సంగీత చింతామణియు నిర్దుష్టములై బహుగుణసంపన్నములైనవి. కుంభకర్ణుని శైలి యించుకకఠినమై శాస్త్రవాక్యవిచారగుంభితమై వ్యాపఘట్టములవలె నచ్చటచ్చటఁ గంతము పట్టుచున్న పట్టులలో ఘటితమై యున్నది. వేమారెడ్డిసరణి యతిసరళమై యేకవారశ్రవణముచేతనే వాక్యార్థము హృదయగోచర మగుచుండును. ఇరువురును విషయమును జాల విస్తరముగా సంప్రదాయప్రయోగముల చాతుర్యములఁ జూపుచు సందేహములు రానీయకయె గ్రంథము నడప సమర్థులు.

ఇఁక శేషించినముగ్గురు నాంధ్రులు. వీరిగుఱించి కొంత విచారింతము. కల్లినాథుఁడు ప్రౌఢదేవరాయలు (మల్లికార్జునుఁడు) యావద్రాజ్యము సేయుచు నుదయగిరిరాష్ట్రము పరిపాలించుకాలమునఁ దదంకితముగా సంగీతకలానిధి యనుపేర రత్నాకరమున కొకవ్యాఖ్య విరచించె. అది యనేకవిధములఁ బ్రౌఢమైనది. అది సంపూర్ణముగా ముద్రితమై ప్రచారములో నున్నది.

కల్లినాథుఁడు స్వరమేళకళానిధి రచించిన బయకారరామ దండాధిపతికి మాతామహుఁ డని తోఁచుచున్నది. రామప్ప స్వగ్రంథములో నళియరామరాయలు తన్ను గ్రంథరచనకుఁ బ్రోత్సహించుట,

"విద్యానిధిః కల్లపదేశకస్తే
మాతామహో దత్తిలవన్మహీయాన్,
గాంధర్వశాస్త్రేషు తతోఽపి తాని
తత్సంప్రదాయేన తవ స్ఫురంతి"

యని కల్లప్ప (కల్లినాథుఁడు) బయకారరామప్పకు మాతామహుఁ డని సూచించె. ఈ రామప్ప యాంధ్రబ్రాహ్మణుఁడు. కొండవీటిప్రభువై కృష్ణరాయలయొద్ద దండనాథుఁడై రామరాయలకు సుందరప్రాసాదములు కట్టి శిల్పవరుఁడని కీర్తిగాంచి బహుగానప్రబంధకర్త యయ్యెను. ఇతని క్రింద నుండిన దండనాథుఁ డగు బ్రాహ్మణుఁడు బాచిరాజు సూరనార్యునివలన నుదయనోదయ మను రసవత్తరకావ్యము నంకితము గొనియె. అందుచేఁ గల్లినాథుఁ డంధ్రబ్రాహ్మణుఁ డని యూహింపఁదగు.

ప్రౌఢదేవరాయనిపుత్రుఁ డగు మల్లికార్జునుఁ డుదయగిరిలో యువరాజుగాఁ బాలించుచున్నప్పుడే కల్లినాథుఁడు వ్యాఖ్య రచించియుండును. తంజాపురి గ్రంథభండారములో నెం ౧౧౫౦౩, ౧౧౫౦౪ గల మాతృకలలోఁ గల్లినాథుని పేరు లేక వ్యాఖ్యయంతయు (మూఁడవ) దేవరాయఁడే రచించినట్లున్నది. రాజు బహుశః ప్రారంభముఁ దత్కర్తృత్వముఁ దనపై నారోపించుకొని తాను పెద్దవాఁడై రాజ్యమునకు వచ్చినపిదప నట్టిపదవి గర్హ్యమని కల్లినాథుని పేరనే దానిఁ బ్రకటించె నని తోచుచున్నది. కల్లినాథునిం బేర్కొని తట్టికలోనుండి కుంభకర్ణుఁడు సంగీతరాజమున నృత్తరత్నకోశమున మధుపుల నామాంతరము గల పాదపాటల లక్షణము గైకొనియె. సంగీతరాజము క్రీ. శ. ౧౪౪౯ లో రచింపఁబడినందునఁ గల్లినాథీయ మంతకుముందే, యనఁగా ప్రౌఢప్రతాప దేవరాయలు విజయనగరమునను, కుమారుఁ డుదయగిరిలో రాజ్యము సేయునప్పుడే వ్రాయఁబడియుండు నని యూహింపఁ దగు. దీని కనుగుణముగా కల్లినాథుఁడు తనయవతారికలో

> పురీహ విద్యానగరీ చకాస్తి
> తుఙ్గాతరఙ్గైరభితః పవిత్రా,
> ఏతాం శాస్తి ప్రశస్త ప్రతిభట
> ముకుటప్రోతనిర్యత్ననిర్య-
> ద్రత్నజ్యోతిః ప్రవాలావసమన
> చటులాటోపతాపప్రతాపః।
> కర్ణాటాఘాటలక్ష్మీవరణ
> పరిలసత్పౌరుషోత్కర్షశాలీ
> ప్రౌఢ శ్రీదేవరాజో విజయ
> నృపసుతో యాదవానాం వరేణ్యః।
> విశ్వంభరాభాగ్యకృతావతార
> స్తస్యాస్తిపుత్రో యశసా పవిత్రః,
> సఙ్గీతసాహిత్యకలాస్వభిజ్ఞః
> ప్రతాపవానిమ్మడిదేవరాయః॥

విజయసుతుఁ డగు దేవరాజు "శాస్తి విజయనగర్యా" మనుటచే ముమ్మడి దేవరాయఁడు యువరాజని యూహింపవచ్చును. మఱియు, కడపమండలములో నొకానొక శాసనములో మల్లికార్జునునకు "సంగీతరత్నాకరుఁ" డని బిరుదము ప్రయుక్తమై యుండుటయుఁ బైయంశమును బలపఱచుచున్నది.

సింగభూపాలుఁడు—రత్నాకరమున కితఁడు రచించిన వ్యాఖ్య సంగీతసుధాకర మనఁబడును. దీనిలోఁ బ్రథమాధ్యాయ మగు స్వరలక్షణము మాత్రము కలకత్తా నగరమున క్రీ-శ-౧౮౮౧లో ముద్రితమయ్యె. తరువాతి భాగము లెచ్చట ముద్రితములు గావు. ముద్రిత గ్రంథమున నధ్యాయాంతమున "సింహభూపాల విరచితాయాం...సంగీతసుధాకరాఖ్యాయాం" అని కలదు. ఈవ్యాఖ్యాత నామమును భీమసింహుఁ డనియు, రుద్రసింహుఁ డనియు భ్రమించి కొంద ఱితఁడు కామరూప (Assam) దేశజుఁ డనియు, మాగధుఁ డని కొందఱును భ్రమించిరి.

ఇటీవల నాసిక ప్రాంతమున నాకొకమాతృక లభించె. దానిలోఁ బ్రథమాధ్యాయాంతమున—

"ఇతి శ్రీనర్మదాతటాధీశ్వర మహారాజాధిరాజ శ్రీగోపినాథ ధర్మాధికార భట్టశ్రీనాగనాథసుత శ్రీగంగాధర విరచితాయాం సంగీతరత్నాకరటీకాయాం సంగీతసుధాకరాఖ్యాయాం స్వరగతాధ్యాయః ప్రథమః"

అనియు రెండవ యధ్యాయముకుదను—

"ఇతి శ్రీమదంధ్రమండలాధీశ్వర ప్రతిగండ భైరవ శ్రీ అనపోతనరేంద్ర నందన భుజబలభీమ శ్రీసింగభూపాల విరచితాయాం సంగీత సుధాకరాఖ్యాయాం రాగవివేకాధ్యాయో ద్వితీయః"

అనియు మూఁడవదానితుద—

"ఇతి శ్రీనర్మదాతటాధీశ్వర నందపురివాస్తవ్య మహారాజాధిరాజ శ్రీగోపీనాథ ధర్మాధికారి శ్రీనాథసుత శ్రీగంగాధర విరచితాయాం......ప్రకీర్ణాధ్యాయస్తృతీయః"

అనియు చతుర్థపఞ్చాధ్యాయాంతముల — ఇతి శ్రీమదంధ్ర మండలాధీశ్వర—అను ప్రక్రియయే కలదు.

పంచమ సప్తమాధ్యాయముల గద్య ముండఁ దగిన పత్రములు గానరావు.

ప్రథమాధ్యాయవ్యాఖ్య ముద్రితభాగమునకు సరిపోవుచున్నది. అయినను ముద్రాపకులు సింగభూపాలవ్యాఖ్యలో గ్రంథపాత మైనప్పుడెల్ల సూచించియుఁ గొన్నిచోట్ల సూచింపకయుఁ గల్లినాథవ్యాఖ్య జంటించి ముద్రించిరి. దానిచే సింగభూపాలుఁడు కల్లినాథునికిఁ దరువాతివాఁడనియు గ్రహింప నాస్పదమయ్యెఁ గాని యిది ముద్రాపకులదోషము. వ్యాఖ్యాత కల్లినాథు నెచ్చటఁ బేర్కొనలేదు, కాఁడు.

ఇఁక నీసింగభూపతి యెవ్వఁడని విచారింపఁదగు. వ్యాఖ్యానారంభమున నవతారికా శ్లోకములలో దేవతా గ్రంథస్తుతి దక్క గ్రంథకర్తృ వంశావళి కానరాదు.

"అతిగంభీరే విషయే కతిపయవేద్యే త్రిహ గ్రంథే,
సమ్యగ్వ్యాఖ్యాకుశలః సర్వజ్ఞః సింహ(గ?)భూపస్థ్యైకః"

అని మాత్రమే కలదు. అధ్యాయాంతగద్యముల వలన నితఁడు రేచెర్లవంశజుఁడును రసార్ణవసుధాకర కర్తయు నగు సింగభూపతి యన్న యనుమానము సులభముగాఁ దెలియును.

చమత్కారచంద్రికలోని చక్రపద్మబంధములు విజయనగర హరిహరుని కాలములో సాయణాచార్యునిచే రచింపఁబడిన యలంకారసుధానిధిలో నుదాహరింపఁబడినందున నది క్రీ. శ. ౧౩౭౦ లకు పూర్వమే రచింపఁబడియె. దానిలో "రసార్ణవ సుధాకరము సింగభూపాలకృతము కలదు శిష్టాంశముల వందే చూడఁదగు" నని తత్కర్తయగు విశ్వేశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. కావున సింగభూపతి క్రీ. శ. ౧౩౬౦ ప్రాంతమున నుండియుండు నని యూహింపఁదగు. శ్రీనాథుని కాలమున నొక సింగభూపాలుఁ డున్నట్లు చాటువులవలనఁ దెలియుచున్నది. గ్రంథకర్తలు సాధారణముగాఁ గృతులకు నామకరణము సేయునప్పు డొకజాతీయ ప్రక్రియ నవలంబింతురు. స్ఫోటసిద్ధి బ్రహ్మసిద్ధి, యనియు, విధివివేక, భావనావివేక, విభ్రమవివేకము లనియు, సాహిత్య చింతామణియు, సంగీతచింతామణియు, అలంకారసుధానిధి పురుషార్థసుధానిధి యనియు—అను నామములలో సిద్ధి, వివేక, చింతామణి, సుధానిధి శబ్దము లేక కర్తృత్వసూచకము లగునట్లు చమత్కృతి తోచుచున్నది. అట్లే సంగీతసుధాకర, రసార్ణవసుధాకర నామము లేకకర్తృత చూపవచ్చును. ఇది యంత ఒలీయమగు వాధారముగాదు. కాని సంగీతసుధాకర రసార్ణవ సుధాకరముల నధ్యాయాంతగద్యము లొకటియే యగుటచే నేకకర్తృకత్వము సూచింపఁబడు. సింగభూపతికి సహాయ మొనర్చిన గంగాధరుఁడు నాగనాథుని పుత్రుఁడు. గోపీనాథ నరపతికిఁ దండ్రియో కుమారుఁడో ధర్మాధికారిపదవిలో నాశ్రితుఁడై యుండెను. గోపీనాథుఁడు నర్మదాతటాధీశ్వరుఁడు (అనఁగా నేరాజ్యమో యెఱుఁగరాదు). ఎవ్వఁడు నందపురివాస్తవ్యుఁడు? రాజా, నాగనాథుఁడా, గంగాధరుఁడా? నర్మదాతటాధీశ్వరుఁడును రాజా, లేక నాగనాథ గంగాధరులలో నొక్కఁడా? దేశచరిత్రములలో "మహారాజాధిరాజ" బిరుదము గల గోపీనాథుఁ డెవ్వఁడు? ఈ ప్రశ్నములకు సమాధానము కాలక్రమమునఁ జరిత్రపరిశోధనమువలనఁ గాని తేలదు. నందపురి రాజపుత్రస్థానదేశమున నందోరి (Nandori) యనియు లేక బేరారుదేశమున పంగర్ ఖెడ్ (Pangarkad. E. I. Vol XXII-౫౪) సమీపమునఁ బల్లిగామం డెననియు, నర్మదానదీ సముద్రసంగమున "నందోడ్" అను పురము కలదనియు చెప్పుదురు. అది వీనిలో నొకటిగా నుండనోపు.

గోపీనాథనామ లగురాజుల విచారింపఁగా రాజపుత్రస్థానమున డంగర్పూరు సంస్థానాధీశ్వరుఁ డగు రావల్ గోపీనాథుఁ డొక్కఁ డగపడుచున్నాఁడు. అతఁడు క్రీ. శ. ౧౪౪౭ లో నుండినట్లు తెలియును. (Annual Report, Rajaputana museum

— * "సింగభూపాలరచితే రసార్ణవ సుధాకరే ఆదిద్వితీయయోః సాధు శీలనీయా విలాసయోః పంచమ విలాసము.

౧౯౧౪-౧౫.) మఱియొక్కఁడు క్రీ. శ. ౧౬౬౪ లో దాన మొనర్చిన రాజునకు సుమారు ౩౦ వ పూర్వ పురుషుఁ డైనట్లు వంశావళి దానశాసనములోఁ గలదు. ఆ దానశాసనము మధ్యరాష్ట్రముల మండ్లజిల్లాలో రామనగరములో లభించినందున దానకర్త యక్కడి వాఁడే కాఁదగినను ౩౦ వ తాత యక్కడివాఁ డనుట యుక్తియుక్తము కాదు. (N. I. Ins. No. ౧౦౧౭. E. I. Vcl) మఱియొవ్వఁడు గోపీనాథుఁడు చరిత్రముల లభింపఁడయ్యె. భావికాలవిమర్శకులపుణ్య మెట్లున్నదో.

ఇఁకఁ గేవల మూహయే మనకు శరణ్యము. మాలికాఫరోరుంగంటిరాజ్యము నిర్మూలము చేసిపోఁగా నిరువదిసంవత్సరములలో మహమ్మదీయులు దాని విడిచి పోయిన దద్రాజ్యమను వీరభద్రాదు లేలి నశింపఁ జేసిరి. అప్పుడే రెడ్డిరాజులును, వెలమరాజులును బూర్వము దండనాయకులై సైన్యములతో నుండినందున స్వతంత్రరాజ్యముల స్థాపింపఁగలిగిరి. రాచగిరి, భువనగిరి, రామదుర్గము మొదలగుచోటులు రేచెర్లవా రధిష్ఠానముగాఁ బరిపాలించుచుండిరి. అట్టికాలమున నుదీచ్యుఁ డగు గోపీనాథుఁడు ధారానాగపురాది ప్రాంతముల నుండు మహమ్మదీయులఁ దోలి దేవగిరి నాక్రమించుకొని రామగిరిప్రాంతమునకు వచ్చియుండును. సింగభూపతి యతనిక్రిందఁ మండలికత్వ మంగీకరించియుండవచ్చును. గోపీనాథునిధర్మాధికారి గంగాధరుఁడు సింగభూపతి సర్వజ్ఞతకు మెచ్చి రాజుతోఁ గలసి యీ వ్యాఖ్యను రచించియుండవచ్చును. తరువాత ౭౦ సంవత్సరముల కోరుగల్లు తురకలదండుచేతఁ బడుటయు, విజయనగరరాజులు, గజపతులును మాటిమాటికి వారిఁ దోలుటయు దేశచరిత్రకారులు విస్తరించి వర్ణింపఁగలరు. కావున నర్మదాతటస్థదేశాధిపతి నందపురి రాజధానిగాఁ బాలించువాఁడు గోపీనాథుఁడు సింగభూపతికి మిత్రుఁ డయ్యె. "మహారాజాధిరాజు" అనుబిరుదము సింగపతివంటి సామంతులు గ్రహింపరు. శాసనముల స్పష్టముగా బిరుదప్రయోగములో భేద మగపడుచున్నది. ఇది యంతయుఁ గేవల మూహ యనియు గ్రహింపఁదగు. శ్రీనాథుఁడు దర్శించిన సింగభూపతియే వ్యాఖ్యాత కావచ్చు నని కొంద ఱాక్షేపింతురు. ఊహాప్రపంచము గంధర్వనగరమువంటిది. అయ్యది యాక్షేపవిక్షేపములకు లక్ష్యము కానేరదు. రసార్ణవసుధాకరకారుఁడే దీనికిని గర్తయని యూహాప్రౌఢిమచేతనే చెప్పుచున్నారము. కర్తృత్వసూచకగద్యములు సమాన మగుటచే నీయూహ బలీయసి యగును. గ్రంథపరిశోధకులు సత్యము తేల్తురుకాక.

వెలుగోటివారి చరిత్రములో వచ్చుపురుషులు. మనము సర్వజ్ఞసింగభూపతి యని తలఁచినయతని పినతండ్రియగు మాధవరాజువంశమునఁ బుట్టినవాఁడు. ఆమాధవుని కుమారుఁడు పెద్ద వేదగిరి. అతని యిరువురు కుమారులలోఁ గుమారమాధవుని కుమారుఁ డగు లింగ



భూపతిని శ్రీనాథుఁడు దర్శించెను. మఱియు సర్వజ్ఞ సింగని కుమారుఁ డగు ననపోతభూపతి కుమారుఁ డగు సింగభూపాలుని శ్రీనాథుఁడు చూచినట్లు తోఁచుచున్నది. ఇతఁడే పోచమాంబా కుమారుఁడు. రసార్ణవ సుధాకరకర్త యన్నమాంబా కుమారుఁడు. కావున బమ్మెరపోతనయు, శ్రీనాథుఁడును దర్శించినయతఁడు మూఁడవ సింగభూపతి. రాచగిరిలో నుండిన సింగభూపతియే సర్వజ్ఞుఁ డగును. అతనిమనుమని శ్రీనాథుఁడు చూచియుండుట యసందర్భము గాదు. మాధవరాజాదులు దేవరకొండలో నేలి కడు ప్రతాప కీర్తుల నాపాదించు వీరసంగ్రామముల జయించి కేవల స్వైర నిర్యాతనమే పురుషార్థ మనునట్లు సోమవంశ రాజులను రెడ్డిరాజులను మూలోచ్ఛేదము చేసిరి. కాని రాజ్యకాంక్షచే వారిరాజ్యముల నపహరించినట్లు కానరాదు.

పై వంశవృక్షమున (౧౮) మాధవరాజు అనవేమున్నపోతరెడ్డిరాజులఁ జంపె (౧౩౬౦)

౧ అనపోతరాజు రాచగిరిలోను, ౧ మాధవరాజు దేవరకొండలోను స్థిరవాసములు చేసికొని పాలించుచుండిరి.

౨వ పెద్దవేదగిరి కుమారుఁడు రామచంద్రరాజు ఫిరోజ్‌షాను ఓడించె. పెద్దవేదగిరి యయ్యలార్యునిచే యుద్ధకాండము రచియింపించెఁగాబోలు.

3 కుమారమాదయు — కొమరగిరిరెడ్డిని జంపె. (౧౪౦౦-A. D.)

౪వ లింగరాజు అళ్ళయవేమ వీరభద్రులఁ జంపె. (౧౪౩౪-A.-D.)

౪వ పినవేదగిరి—పెద్దకోమటి వేమారెడ్డి తమ్ముని మాచరెడ్డిని జంపి తాను కోమటి వేమారెడ్డిచేఁ జచ్చెను.

సింగభూపాలుఁడు విశ్వేశ్వర కవిసహాయముతో రత్నపాంచాలిక యను నామాంతరము గల కువలయావళి యను చతురంకనాటిక శ్రీకృష్ణుఁడు కువలయావళిఁ బొందునట్టి కథాంశముగలదాని రచించెను. అదియు నిప్పుడు లభించుచున్నది. శ్రీనాథుని సమకాలికుఁ డగు సింగభూపతి కావ్యకర్తృత్వ కారయితృత్వములచేఁ ప్రసిద్ధుఁ డని తోఁచరాదు. శ్రీనాథుఁడు రచించిన సంస్కృతనాటకములఁ బెదకోమటి వేమభూపతి సాహిత్య చింతామణిలో నుదాహరించినందున నవి శ్రీనాథునిచే సింగభూపతి వర్ణనమునకుఁ బూర్వము రచితములగుటచే సింగభూనాయక కీర్తికందాంకురములని యంగీకరింపఁదగవు.

బొమ్మకంటి యప్పయాచార్యుఁడు తా రచించిన యమరవ్యాఖ్యలో మంగళాంతముగా సింగభూపాలుని మిక్కిలిగా స్తుతించె. అందుచేతను సింగపతి గొప్ప విద్వాంసుఁ డని తేలును.

"కావ్యాలంకార నానార్థతత్త్వభావితమానసః,
కుమార సింగభూపాల ఏక ఏవాస్తి నాపరః,
కుమారసింగభూపాల కృతయస్తస్యవిత్యకాః,
ఏధయన్తి ముదం దృష్ట్వా దృష్టాంతాకృతి నః పరమ్."

రసార్ణవసుధాకరకర్తకుఁ గుమార సింగభూప నామము గలదు. "కుమారశ్రీసింగే జలధిరశనాం శాసతి మహీం" అని చమత్కారచంద్రికలోఁ జెప్పఁబడియె. అతనితాతయు సింగఁ డగుటచే నితఁడు రెండవ, లేక కుమారసింగఁ డనఁబడును.

సింగభూపతివ్యాఖ్యలోఁ జతుర్థాధ్యాయమునఁ దృతీయాధ్యాయవ్యాఖ్యలో నిట్లు చెప్పితినని యనువాదము సేయుఘట్టము తృతీయమునఁ గలదు. అందుచే తృతీయము గంగాధరకృతముగాను, చతుర్థము సింగరాజకృతముగా నుండినను రెండు నేకకర్తృకమే. ఇరువురు కలసియే గ్రంథమంతయు శైలిభేదము కానరాకుండునట్లు రచించిరనియుఁ జెప్పవచ్చును. సింగభూపాలాదులు నిరంతరరాజ్యరక్షణ క్రియామగ్నులై యవకాశము చిక్కినప్పుడే విద్యావినోదముల మనస్సు ద్రిప్పుచుండినందునఁ బండితులచే గ్రంథరచనలఁ జేయించి తమ యూహాపోహలచే వానికి వన్నె దిద్దించుచుందురు. గంగాధరుఁడు రాజునకు మిత్రుఁడై గోపీనాథుని యనుజ్ఞ వడసి సింగభూపాలునకుఁ గీర్తిస్తంభస్థాపనమునకుఁ దోడ్పడియెఁ గాఁబోలు.

నేటికాలమునను కొలఁది క్రమించి రచించిన గ్రంథమును రాజాధికారమునకో, నియోగధర్మ దోషము

నన్ యాద్ధత్యప్రభావముచేతనో యత్యల్పసాహాయ్యమా
కీభూతులవలన, లేక ప్రత్యాశా ప్రతిబద్ధచేతస్కులవలన
గ్రహించి స్వకర్తృకత్వమును బ్రకటించుకొను మహాను
భావులు గల రనుట వింతగాదు గాని యీ పాపమో
లేక దోషమో కాలోపాధి లేక భూతవర్తమానముల
నిర్విశంకముగా జరుగుచున్న దనుటయే వింత. భవిష్య
త్ప్రవృత్తియు గతానుగతికమై యుండుఁగాక యని
యాశీర్వదించెదము.

సింగభూపతివ్యాఖ్య మొత్తముమీఁద గుణవంత
మై యన్నిచోటుల సమానవిస్తృతముగా నుండును.
కల్లినాథుఁడు కొన్నిచోటుల నమితముగాను దుర్బోధము
లగుపట్టుల మౌనము నవలంబించి నిగదవ్యాఖ్యాన మ
నుచుఁ గొన్నిమతభేదము లవచ్చినప్పుడు పూర్వపక్షీకృత
మతముల నంగీకరించును. కల్లినాథుఁడు విడిచినపట్టు
లకును సింగభూపాలవ్యాఖ్య గలదు.

ఇఁక సింగణభట్టు రచించినవ్యాఖ్య యేది? అతఁ
డెవ్వఁడు? ఒండురెం డాంధ్రభాషావ్యాఖ్యానము లేవి?
వానికర్త లెవ్వరు?

ఆంధ్రభాషలో రచింపఁబడిన రత్నాకరవ్యాఖ్య
యొకటి ప్రథమాధ్యాయభాగ మాత్రము లభించె. దాని
లో నవతారిక సంస్కృతశ్లోకములతో నున్నది. వాని
లోఁ గొన్నిటి నుదాహరించెదము.

“అస్తి సిఙ్గరిభట్టసూరిరితి ఋగ్వేద......
ఋక్శాఖాస్మృతిమాయిభట్టతనయో బ (హ్వ?)
ల్లాళరాట్పూజితః|
తస్మాదల్ప యవేమభూపసుమనస్సంతోషమాపూరయన్
శ్రీవిద్యా.........తి ప్రౌఢేన సంప్రార్థితః ||

వ్యాసీయే జైమినీయే ఫణిపతిఫణితే కాపిలే కాశ్యపీయే
న్యాయే గీతే కలాసు ప్రతినవక...న్నిద్ర సాహిత్య...|
......తే సులలితనటనే భావదక్షే కటాక్షే
వాదిత్వే వైదికత్వే ప్రభవతి భరతే సిఙ్గణార్యో ధరణ్యామ్ ||

స్వస్తి శ్రీకులదేవతా విజయతే శ్రీ......
......తథా భరతమిత్యాఖ్యం సుశాస్త్రం మహత్ |

తత్సూర్యత్రయపూర్వశాస్త్రవిధినా సంగీతరత్నాకర
స్యేయం ప్రౌఢనరేన్ద్రపాలన......తేన సా ||

ప్రౌఢదేవనరనాయకాఙ్కిత
.........................

ప్రాస్తవాన్ సకలలక్ష్యలక్షణ...
......భిర్బహుధన్దిత స్తథా ||

తత్పుత్రో లోకమిత్రః సుభగజనమనోభాస్కరో విష్ణు
భట్టా
చార్యాఖ్యో మాణ్డలీశం మహమదుజగయా స్తీన్ సుర
త్రాణమేత్య |
......శాస్త్రతిమాత్రై (?).........
అస్త్యైర్విజ్ఞాపితోఽభూదితి యవనపతి ర్నాపరస్సూర్య
శాస్త్రే ||

సురత్రాణః స్వైరం స్వయమపి సమాక్షిప్య సమితౌ
శ్రుతిప్రాధాన్యత్వం స్వరయుగవిభేదప్రకటనమ్ ।
దశప్రాణాన్ తాసాం.........
విలోక్యాథ ప్రౌఢాద్దశశతతులం స్వర్ణమతులం
తస్యాత్మ (సు?)జో విఠ్ఠలనామధేయః
సూరిః స్వపిత్రార్జితపుణ్యరాశిః
...... రామచన్ద్రః
ప్రస్తారముఖ్యాన్ ప్రవిధాయ చాస్తి ||

సోఽహం సంగీతరత్నాకర ... వీక్ష్య తాతోక్తటీకాం
వక్ష్యే మన్మన్దబుద్ధ్యా ప్రకటితవచసైరన్ధ్రభాషానుటీకాం
సిద్ధాం తాం బాలశోభాం సుఘటజనమనోహారిణీం
వీక్ష్య సన్తో
నన్దన్త్వాస్యే వదన్తు ప్రఘటితద...... వాగ్విలాసం
యథేష్టమ్ ||

అని యున్నది. (కాశ్యపీయ మన వైశేషికసూత్రములు-
కణాదుఁడు కాశ్యపగోత్రుఁడు) పై శ్లోకములలో వంశా
వళి ప్రక్కపుటలో చూపిన ట్లున్నది.

విఠ్ఠలభట్టుతండ్రి సంస్కృతమున రచించినటీక
కనుటీక యాంధ్రభాషలోఁ గూర్చె. సింగణభట్టు
ప్రౌఢదేవరాయల కంకితముగా రత్నాకరటీక సంస్కృ
తమున రచించెను. కావునసే ‘తస్యాత్మజో’ అనుటకు
‘తస్యానుజో’ యని యుండునేమో యని సందేహించె




దము. గ్రంథాక్షర లిఖితముఁ గావునఁ దదక్షరములలో 'ష్ణు', 'ఠ్ఠ' లకు మిక్కిలివ్యత్యాసము గానరాక భ్రమ కలిగించుచుండును.

సింగణ రచించిన భరతమితి గాని, రత్నాకర వ్యాఖ్యగాని లభించినది కాదు. కృష్ణరాయల యనుజ్ఞచే సంగీత సూర్యోదయ మను ప్రకరణగ్రంథము రచించిన భండారు లక్ష్మీనారాయణకవి తాను విష్ణుభట్టారకుని వలన శాస్త్రమర్మముల నెల్ల నేర్చినట్లు చెప్పుచున్నాఁడు.

సఙ్గీతాగమలక్ష్మ లక్ష్యనిపుణాత్ శ్రీవిష్ణుభట్టారకాత్
జ్ఞాత్వా దత్తిలకోహళాదిభరతగ్రన్థాన్ సుటీకాన్వితాన్।
భూపాలాకీర్తిశరీరరత్నగంధియాగ్రన్థః కృతో ఒయం మయా
సంప్రాప్తః క్రమయోగ్యతాదికరతః సఙ్గీతసూర్యోదయః

అని, అతనిగురు వగు విష్ణుభట్టు మహమ్మద్ గయాస్త్రీఁను మెప్పించిన విష్ణుభట్టాచార్యుఁడే యగునని యూహించెదము.

ఆంధ్రవ్యాఖ్య బహుగుణవిశిష్టము గాకున్నను సరళముగా దోషరహితముగా సుకుమార మనోమోహనముగా నున్నది. పై నుదాహరించిన వ్యాఖ్యావతారికా శ్లోకము లతిశిథిలతాళపత్రములనుండి యుద్ధరింపఁబడెను. చుక్కలుంచినభాగము లందుఁ గ్రిమిదిగ్ధములు లేక మూషకవిద్ధములు. శ్లోకములు లేఖకదోష దూషితములు. యథాసంభవముగా నుదాహరించితిమి.

ఇందుఁ బేర్కొనఁబడిన మాండవీసుఁడు మహమ్మదు గయాస్త్రీఁ అనువాఁడు క్రీ.శ.౧౪౭౫లో ధారాసురత్రాణుఁడై యనేక దానధర్మములు చేసినట్లు శిలాశాసనములు గలవు (J. B. B. R. A. S. Vol XX 1111 page E. I. vol X1XSupplement Nos-851. 159 చూడఁదగు) శ్లోకమున మహమ్మదుజగయాస్త్రీఁ అనుటలో జకార మొకటి యెక్కువగలదు. దానికి గతి యేదో యెఱుఁగరాదు. ఈధారాసురత్రాణుఁడు వేయితులముల బంగారము కేవలము విద్వత్పాత్రిమై దేశాంతరస్థుఁడగు నంధ్రబ్రాహ్మణున కిచ్చె ననుట స్వదేశాంధ్రరాజులకు స్వనామ్నమస్థానము నుపదేశించుచున్నది.

చెన్నపురిప్రాచ్యలిఖిత పుస్తకభండారమున సంపూర్ణ మగురత్నాకరటీక యొకటి యాంధ్రభాషలోఁ గలదు. దాని కవతారిక గానరాదు. అది యావిఠ్ఠలుఁడు రచించినగ్రంథమా యనిసందేహము కలుగుచున్నది. విఠ్ఠలుఁడు క్రీ. శ. ౧౫౧౦ ప్రాంతములఁ దనుఁగుఁడీక రచించియుండవోపు. క్రీ. శ ౧౨౦౦ నుండి, అనఁగా గూర్జర, చాళుక్య, పరమార, చేది, కలుచురి రాజ్యములు క్షీణింపఁగా, నాంధ్రులే సర్వవిధముల సంగీతభరతశాస్త్రములకుఁ జేయూత యొసఁగి వృద్ధికిఁ దెచ్చిరి. కడపటిదినములలోఁ దంజాపురిరఘునాథుఁడు సంగీతవిద్యను జక్కగా స్థాపించినందుననే దక్షిణదేశమున నది యాంధ్రుల గీతప్రౌఢిచేతనే పెరిగి సకలజనశ్రవణామృతముగా వన్నె కెక్కియున్నది. దేవరాయల కట్టి సంగీతాభినివేశము కలుగుటకు ముఖ్యకారణము పెదకోమటి వేమభూపాలుని నిరంతరసంగీతకావ్య గోష్ఠీవిలాసప్రభావమే. వేమన రచించిన సంగీతచింతామణినిగురించి త్వరలో విస్తరించి వ్రాయఁదలఁచియున్నారము.

# కళాకేళి

## (నాటిక)

### వెంపటి నాగభూషణం

వాసు—కథకుడు: కళాభాయి.

లీలీ—వాసువద్ద పెరుగుతూన్న జవ్వని.

భావయ్యచౌదరి—సరోజిని పినతండ్రి

బుచ్చినాయుడు—సరోజిని మేఁబావ

సరోజిని—చెలిమికోసం పలవరించే నూత్న [యౌవనవతి.

నాయర్ :

మోతీ :

*

* *

[స్టేజీ:

వెనుక కర్టెను హద్దుగా ఆక్స్‌ఫర్డు బుక్‌కేస్... దాదాపు స్టేజికి మూడువంతులు పొడవున ఆక్రమించుకొని ఉంటుంది. పక్కనద్వారం...సగం ఒత్తిగిలిన రింగుల కర్టెన్‌తో. దానిపక్కన, కార్నర్‌స్టాండ్‌మీద కనూజ్ ఇత్తడి తొట్టెలో గుబురుగా పెరిగిఉన్న పామ్.

స్టేజికి కుడివైపున పెద్దమేజా; దానిమీద చెల్లాచెదరుగా, దొంతరలుగా పడిఉన్న పుస్తకాలు. వాటి మధ్య సగం కనబడుతూ...ఎలిక్ట్రిక్ టేబిల్ లైట్; బల్లకు కుడి అంచున టెలిఫోన్.

రివాల్వింగ్‌కుర్చీ: దాని కాళ్ళదగ్గరకూడా తెరిచీ మూసీ, చిందరగా పుస్తకాలు.

ఎదురుగా—షెఫీల్డు పడకకుర్చీ చేతిమీద పుస్తకం బోర్లగా తెరిచి పడిఉంటుంది.

వాసు కుర్చీలో పడుకుని ఉంటాడు.

ఫోను మోగుతుంది... ]

వాసు—(విని, మెలకువ తెప్పించుకుని, తలఎత్తి చూసి, మసలుతూ, నిద్రమత్తుతో, ఒత్తిగిలంటాడు. చెయి తగిలి పుస్తకం క్రిందపడుతుంది...ఫోను మళ్లా మోగుతుంది...

అబ్బ!...లీలీ...లీలీ...

(లీలీ పదహారేళ్ల పిల్ల. పరికిణీ-వల్లె: అప్పుడే నిద్రలేచినట్టుగా జుట్టూ, కట్టూ కొంచెం చెదరి ఉంటుంది)

లీలీ—ఏం బాదా? (బల్లదగ్గర నిల్చుని తల సర్దుకుంటూ) ఇంకా...నిద్రపోలేదా ఏం?

వాసు—కథపూర్తిచేసి ఇప్పుడే కనులు మూశాను, కొంచెంసేపు విశ్రాంతిగా ఉందామని. రెండు మూడు రోజులదాకా నిదురకీ మనకూ జిలాయి, చాలాపని ఉన్నదమ్మా......(ఫోను మోగుతుంది).... చూడు, ఎవరో ఆ ఇడియట్, తూరుపు తెలవారక ముందే, వాడి పనంతా మునుకుపోతున్నట్లు పదినిమిషాలనుంచీ తెగమోగుతున్నాడు. (లీలీ రసీవర్ చేత్తో పట్టుకుంటుంది)......వద్దు, వద్దు. విసిగెత్తి వాళ్లే ఊరుకుంటారు వినిపించుకోకపోతే; ఊరుకో...

లీలీ—ఎంత అవసరమో!...పాపం!

వాసు—వాడి మొఖం...

లీలీ — (అందుకుని...మాట్లాడుతూ) హలో, ఆ! యస్, ఉన్నారు, కాని, నిద్రలేవలేదు ఆఁ, ఏమో చెప్పలేను, ఊఁ, పదిగంటలకురండి, ఏ మిటీ! వీల్లేదూ, అయితే ఉండండి. (చేత్తో కప్పిపట్టి) ఎవరో పిలుస్తున్నారు దాదా.

వాసు—అవును: (నవ్వుతూ) ఆసంగతి నాకు తెలియదటమ్మా! ఊరికే మ్రోగడానికి...దానికేమన్నా ప్రాణమున్నదా? ఎవరువారు?

లీలీ—పేరు చెప్పడం లేదు.

వాసు—అయితే పట్నరాలుతాయను...

లీలీ—ఊరుకుందూ. నీతో అవసరమైనపని ఉందట. చాలా ఆదుర్దాగా పిలిచారు, మాటాడుతావా?

వాసు—పేరులేని వెధవాయులకు నాతో ఏం పని?...

లీలీ.—పోనీలెద్దూ: ఇందు (రిసీవరు అందిస్తుంది.)

వాసు—(అలాపడుకునే, చెవివగ్గరఉంచుకుని) ...ఆఁ, నేనే, వస్తారా? ఏమిటి, నాదర్శనానికా? (నవ్వి) అంత శ్రమఎందుకూ? ఏపత్రికలోనైనా నా బొమ్మనుచూచి సరిపెట్టుకోనరాదూ? ఏం, తప్పదూ, ఊఁ, సరోజిని విషయమా, సరోజిని ఎవరు? ఏమిటే? (నవ్వుతూ, రిసీవరు లీలీకి అందిస్తాడు: ఆమె దానిని స్టాండుమీద అమరుస్తుంది.)

లీలీ—ఏమిటి?

వాసు—లీలీ.

లీలీ—(దగ్గరకువచ్చి) ఏం...దాదా!

వాసు—సరోజిని ఎవరు?

లీలీ—ఏ సరోజిని?

వాసు—ఏమో: సరోజిని...అంతవరకే తెలిసింది.

లీలీ—ఏమో: ఆఁ అయితేనేం?

వాసు—సరోజిని, చిన్నదో పెద్దదో, మనిషి అవునోకాదో, మనకు తెలియదుకదా?—ఆ సరోజిని సంగతి మాట్లాడటానికి ఎవరో ఇద్దరు బగర్సు ఇక్కడకు దయచేయబోతున్నారు...

లీలీ—అలానా?...

వాసు—అదే యిప్పుడు వారు పదేపదేంత్రుల మీదుగా సాయించింది.

లీలీ—రమ్మన్నావా మరి?

వాసు—చాలా అందామనుకున్నాను, కాని ఒళ్లు మండుతూంది. వాళ్లకు ఎంత తిరిగిందీ (కుక్కపిల్ల స్పానియల్ సంతోషంగా వస్తుంది)

లీలీ—(కుక్కతో) వద్దు, వెళ్లమోక. దాదా చిరాకుగా ఉన్నాడు: నీముద్దులూ, మురిపాలూ చాలించు.

వాసు—(హుషారుగా లేచికూర్చుని) రా మోతీ: (మోతీ ఎగురుకుంటూవచ్చి ఒళ్లో కూర్చుంటుంది) రా తల్లీ. లీలీ, ఎవరిమీదనమ్మా కోపం నాకు? ఇదీ, (కుక్కను చేతితో నిమురుతూ) నీవూ...ఈ కుమ్మక్కజీవితారానానికి వసంతశోభలు.

లీలీ—లేదు దాదా...ఊరికే అన్నాను. (వచ్చి, కుర్చీ చేతిమీద కూర్చుని) మనసంసారం...

వాసు—ఓహోఁ, సంసారం!......ఒక నిత్యబ్రహ్మచారి,...ఒక నిత్యకల్యాణి, (మోతీని నిర్దేశించి) ఈ...మనుష్యేతర సుమంగలి,...బలే,(మోతి మొరుగుతుంది) ఓ...ఓ...నిన్నేమీ అనలేదమ్మా...

లీలీ—దానికి ఎంత అభిమాన మనుకున్నావు, దాదా! కసురుదామని కోపం తెప్పించుకుంటూండగానే...అలా బుంగమూతి పెట్టుకుని, మారాం చేస్తుంది దాదా!......చ్చో...చ్చో...దా, దా, (మోతీనిపిలుస్తూ లేచివెళుతుంది).

వాసు—కాస్సేపు...కూర్చోవమ్మా.

లీలీ—(వెనుకకు మరలి) నీకే...కాఫీకి ఆలస్యం అవుతుంది.

వాసు—ఇవాళ...అసలు త్రాగాలని లేదు.

లీలీ—ఏమీ?

వాసు—నిదురలేవకముందే...ఆఁ...అన్నట్టు వాళ్లువస్తారు కాబోలు ఇప్పుడు:

లీలీ—ఎవరు?—ఓ...సరోజిని సంగతేనా?—(నిశ్చలంగా) చూడు దాదా!...వాళ్లు ఎవరైతేనేం,—రావడంతోనే మోతీని ఉసిగొల్పుతాను...

వాసు—నీవు వద్దన్నా అధికారం మోతీయే చేస్తుందిలే వాళ్లకు: అయినా, వాని...విశేషమేమిటో వింటాం.



౨. తలిదండ్రుల అనురాగఫలము,
తొలికానుపు
జననము
రిచ్మండు పార్కులోని వైట్‌లాడ్జిలో
23-6-1894 నాడు



౩. నెలల బిడ్డడు



౪. ముత్తవ్వ (విక్టోరియారాణి) ముద్దులపొంతి

లీలీ—తమాషా అంతా ... నన్ను కూడా చూడ నియ్యాలి, అబ్బాయ్ లేకపోతే ...

వాసు—లేకపోతే-

లీలీ—నేను ఊరుకోను: (త్వరగా) యీలోగా మనం కాఫీ తాగేద్దామా?

వాసు—పోనీ, వాళ్లకుకూడా-

లీలీ—సరుకు...ఏలాగూ తగులుతుందికామా? ఇంకా వేడికాఫీకూడా ఎందుకూ?...మరే, నాయర్ను కాఫీసామాను యిక్కడికి తెమ్మంటూనా. నీవు స్నానం చేసిరా: నేనూ టాయ్లెట్ చేసుకుని రెడీఅవుతాను నాటకంచూడటానికి,-ఏం?

వాసు—అచ్చా! (లీలీ వెళుతుంది: వాసు బద్ధకంతో ఒళ్లు విరుచుకుంటూ, కుర్చీలో పడుకుని...సిగరెట్ అందుకుంటూ—) ... లీలీ-

లీలీ—(తిరిగివచ్చి)...ఏమిటీ-

వాసు—మతం మార్చుకున్నాను: ఇప్పుడు స్నానం చేయలేను.

లీలీ—(నవ్వుతూ)అవును, తరువాత ఏలాగూ... సచేలస్నానం చేయాలికదూ-

వాసు—అని కవిభావం.....(లీలీ వెళ్లిపోతుంది: వాసు ఒకదమ్ములాగి, సిగరెట్ చెయ్యి కుర్చీమీదుగా క్రిందకు జారవేసి, పడిఉన్న పుస్తకం అందుకుని,... చదువుకుంటూంటాడు. నాయరు కాఫీసామాను అమర్చిఉన్న చిన్న టీపాయ్ తీసుకొనివచ్చి పక్కన పెడుతాడు.)

నాయరు—సార్!

వాసు—(పుస్తకం కొంచెం క్రిందకుదించి నాయరువేపు చూస్తాడు.)

నాయరు—మిక్స్ చేసి ఇచ్చేదా?

వాసు—వద్దులే:-అదిగో, ఆసొంతరలో రెండో పుస్తకం (నాయరు మేజాదగ్గరకువెళ్లి అందుకుంటూండగా) అదికాదు, దానిక్రిందది, పచ్చఅట్ట, ఆఁ, అదే... (నాయరు తీసుకువచ్చి ఇస్తాడు) పెన్ (అందుకుని) ఇంకో గంటలో బాత్ రెడీచెయ్యి. (నాయరు వెళ్లిపోతాడు: వాసు అందుకున్న పుస్తకంలో ఏదో చదివి తనచేతిలో ఉన్నదానిలో వ్రాసుకుంటాడు.)

లీలీ—(ప్రవేశించి వాసు వ్రాతలో మగ్నుడై ఉండటం చూచి, ఫోనుదగ్గరనిలుచుని, నంబరు తిప్పుతుంది.)

వాసు—(తలఎత్తిచూసి), హాలో...

లీలీ—(ఉలిక్కిపడి) హాలో...ఎవరి బాడీ!

వాసు—ఎవరిబాడి...ఎక్సెప్టింగ్...మీ?

లీలీ—(ఆఫ్)' కోర్స్ నాట్: దాదా...నేను ఎంత అందంగా...ఉన్నానో-

వాసు—(రాగంతో) 'అలరెడు రెప్పలల్లార్చిన యంచాళ అనిమిషకన్య కాదనగ వశమె...'

లీలీ—(వినిపించుకోకుండా) అద్దంలో చూసేటప్పటికి ఎంతముద్దొచ్చాననుకున్నావ్! ఈసంగతి... అందరికీ చెప్పేయమని ఎక్స్ఛేంజిని రింగప్ చేస్తున్నాను...

వాసు—(ఆశ్చర్యంతో, సన్నని కులాసా ఈల వేస్తాడు:)

లీలీ—(రాగయుక్తంగా) 'ఈలవేయమోకు, మొసల వీలులేదు, యీరేయిని...'

వాసు—బాగుంది; ఎప్పుడు వ్రాశావు?

లీలీ—(సిగ్గుపడుతూ) పోనిద్దూ దాదా.

వాసు—అలాకాదు, పాడితేనేకాని... కాఫీ అమృతమస్తు అనను.

లీలీ—కాఫీ మాట మరచిపోతున్నానని...బలే గడుసుగా జ్ఞాపకం చేశావే! (కలిపి అందిస్తూ) తీసుకో.

వాసు—పాడవూ...

లీలీ—తప్పకుండా: ముందు తాగేసెయ్యి (ఇద్దరూ తాగుతూంటారు, మోతీ వస్తుంది).

వాసు—దయచేయండి:

లీలీ—(గమనించనందువల్ల ఎవరో ననుకొని చూసి నవ్వుతుంది)...నీకూ కావాలేం? మాతో సహవాసం చేసినందుకు...అన్నీ మనిషిగుణాలు అబ్బుతున్నాయేం?...ఉండు, పాలు త్రాగుదువు కాని. (ఇద్దరూ త్రాగడం అయిపోతుంది. మోతీ పాలుతాగుతూ ఉంటుంది. లీలీ వెళ్లి ఇసరాజ్ తీసుకువచ్చి)... నాయర్!

నాయర్—(లోపలనుంచే) అమ్మా! (వస్తాడు)

లీలీ—(టీపాయ్ చూపించి) ఇవి అన్నీ తీసెయ్, బల్ల అక్కడనే ఉంచి.

నాయర్—(ట్రే చేత్తో పట్టుకుని)...సార్, ఎవరో యిద్దరు వచ్చారు.

వాసు—ఎవరు? (లీలీవంక అర్థమయిందా అన్నట్టు చూస్తాడు.)

లీలీ—(నవ్వుతూ) ఎవరు...మనుష్యులేనా?

నాయర్—తమరు, కాఫీ తీసుకుంటున్నారని చెపితే, అయినతరువాత చెప్పమని,...వరాండాలో కూర్చున్నారు.

వాసు—సరి: అలాకూర్చోనీ, కొంచెంసేపు: (నాయరు వెళుతాడు.)

లీలీ— (టీపాయ్‌మీద కూర్చొని), పాడనా, దాదా...

వాసు—(ఉత్సాహంగా)....ఊఁ...నీదే ఆలస్యం.

లీలీ—అయితే నీవు ఇక్కడనుంచిలే: ఎదురుగుండా కూర్చుంటే, ఏమిటో సిగ్గువేస్తూంది దాదా...

వాసు—(లేచి, కుర్చీ లెగ్‌రెస్టును లోపలికి నెట్టేసి, మేజాదగ్గరకు వెళుతాడు: లీలీ క్రింద అడియన్నుకు ఎదురుముఖంగా కూర్చుని, సారిస్తుంది: వాసు టీపాయ్‌ని ఆమె ఎడమవైపుకు జరిపి, ఫ్లవర్‌వాజ్ ఒకటి బల్లమీదనుంచి అందుకుని, దానిమీదపెట్టి,... మేజాను ఆనుకుని, సిగరెట్ వెలిగించి, నిలుచుంటాడు.)

లీలీ

'ఈలవేయమోకు, మెసల
కీలుతేదు...యీరేయిని,
జాలిలేనివాని, యి
ల్లాలినోయి, నీలవర్ణ...
మావితోగరు సంజెజాజి
మాలల్లి దాచినాను...
తీవమలచుకున్న పొదల
దోవలోన నిలువనోయి...
పాలవంటి కులమూ, రవ్వ
పాలుచేసి, వేళగాని
వేళ కాగి కీననికో
పాలా? లీలావిహార...
బింకముగా, కోవలకని
వంకబెట్టి వచ్చినపుడూ,
కుంకుమపూవంచుజరీ
కోకచెంగు మాసెనోయి...

(లీలీ పాటచాలించి... 'ఏలా ఉన్నది?'... అన్నట్టు వాసువంక చూస్తుంది, ఇసరాజ్ వాలుస్తూ)

వాసు—ఎంత ఊహ ఉన్నదమ్మా!

లీలీ—కాదూ మరి: ఆరునెలలు సహవాసం చేస్తే...

వాసు—వారు వీరైతేమాత్రం...చెడ్డ చిక్కు వస్తుంది. నేను కోకకట్టుకోలేనమ్మా బాబూ...

లీలీ—(పరిహాసంగా)...అంత శ్రమఎందుకు?.. న్యూడ్‌కల్ట్. (నాయరు. బయటికి సగం కనబడుతూ వింగ్‌దగ్గరకువచ్చి నిలబడుతాడు)

వాసు—(చూసి) రమ్మను. (లీలీతో) ఇంకో చైర్ తెప్పించు.

లీలీ—ఉన్నవి చాలు లెస్తూ. మొగాలనిపట్టి... అంతగా అవసరమైతే అప్పుడు తెప్పించవచ్చును. (తాను ఆఫీస్‌చైరులో కూర్చుంటుంది: వాసు నిలుచునే ఉంటాడు. భావయ్యచౌదరీ సంకోచంగా అడుగులు వేస్తూ ప్రవేశిస్తాడు. సగంనెరిసిన గరిమీసాలు: ఖద్దరు

టోపీ: మెడలో వేలాడుతూ అత్తాకోడలుఅంచు బిళ్ల ఉత్తరీయం: చేతిలో పేముకర్ర: అపక్వాహారి అని కళాకాంతులులేని ముఖంచూడగానే తెలుస్తూన్నది.

బుచ్చినాయుడు ఆయన వెనుకాల. పట్నవాసాన రాటుదేరి, వేషభాషలు మార్చుకున్న 'క్రమ' కుర్రవాడు. తెల్లని పాంట్స్, బ్లేజరుకోటు, మెడలో మఫ్లర్...)

వాసు—(ఒక నిమిషం నిశ్చలంగా వాళ్లను చూసి, సైజప్ చేస్తూన్నట్టు) రండి.

(బుచ్చినాయుడు కుర్చీలో కూర్చొని, నాలుగు మూలలా చూస్తూ, లీలీవంక దొంగచూపులు విసరుతూంటాడు:

భావయ్య టీపాయ్‌మీద, చేతికర్ర పోటీగా రెండు చేతులమీదా గడ్డం ఆనించి, ముందుకు వంగి కూర్చుంటాడు.)

భావయ్య—మీకు...యిది భావ్యం కాదు.

(వాసు ఏమిటనే ప్రశ్నగా ఆయనవంక చూస్తాడు.) పెద్ద మనుష్యులకు లాయకీ అయిన పని.

లీలీ—(అడ్డంవచ్చి)...కథ మొదలునుంచీ ఎత్తుగోండి: నాకు ఏమీ అర్థం కావడంలేదు.

(భావయ్య ఆశ్చర్యంగా ఆమె వంక పక్కకు తిరిగిచూసి, వాసువంక చూస్తాడు.)

వాసు—ఓ...మరచిపోయినాను: ఈమె...లీలీ... నా...(లీలీతో) ఏమమ్మా, నీవు నాకు ఏమవుతావు?

లీలీ—(నవ్వుతుంది.)

వాసు—కళాధర్మ నిర్వహణంలో...నాసహచారిణి, వీరు. (చేతులు తేలవేసి, బాచేస్తూ) మీపరిచయ భాగ్యం మా ఉభయులకూ లభించాలి...

బుచ్చి—(లేచి) వారు...భావయ్యచౌదరీగారు: మా మేనమామ:

వాసు—సంతోషం: మనం ఇదివరకు ఎన్నడూ కలుసుకోలేదు. అందువల్ల-

భావయ్య—(కూర్చునే)...నేను ఏపాటివాణ్ణి లెండి. ఇతడు నామేనల్లుడు, బుచ్చినాయుడు. (నెమ్మదిగా, తీవ్రంగా) సరోజినిని ఇతనికే ఇవ్వబోతున్నాం.

వాసు—(ఏమీ అర్థంకానందున, తొణకకుండా) అలాగా, శుభం.

లీలీ—(కిలకిల నవ్వుతుంది)

బుచ్చి—ఊఁ (...హుంకరిస్తాడు)

వాసు—(తప్పని, ముక్కుమీద వేలువేసుకుని, లీలీనవ్వు మానిపించి)...పసిపిల్ల: శుభవార్తకదా అని నవ్వింది.

లీలీ—నవ్వు నాలుగందాల చేటుకదా, దాదా? (నవ్వుతో) సరిగా (లెక్కపెడుతూ) నలుగురమే ఉన్నామే!

వాసు—నీవు ఊరుకోతల్లీ! (భావయ్యతో)... ఇంకా విశేషాలు ఏమన్నా సెలవీయండి.

బుచ్చి—(దూకుడుగా) చేస్తూన్న పాడుపనికి-

లీలీ—(నిలుచుని) హాఁ!...(పరిహాసంగా)... 'వేణీసంహారం' లో, భీముడివేషానికి పనికివస్తారండీ, నాయుడుగారూ!...అయినా పెద్దలు ఏదోమాటాడుతూంటే, మధ్య మనం కొంటెతనంచేయడం బాగుండదు...

బుచ్చి—(కయ్యానికికాలుదువ్వుతూన్నట్టుసన్నద్ధుడుగా లేచి నిలవబడుతాడు.)

వాసు—(బుచ్చినాయుడుదగ్గరకు వెళ్లి, అతని భుజాలమీద చేతులువేసి, అలాగ్గా కుర్చీలోకి దించేసి,—వెన్నుతట్టుతూ) యంగ్ బ్లడ్, యంగ్ బ్లడ్: ప్రమాదం సుమాబాబూ. లీలీ...అసాధ్యురాలు 'జుజుత్సు' లో.

భావయ్య—(కొంచెం పెద్దగొంతుతో) పంతులుగారూ...చల్లకు వచ్చి ముంతదాచినట్లు, వృథా వాగ్వ్యయం ఎందుకూ? సరోజిని మతివిరచడం... మీకు యుక్తం కాదు:

వాసు—నాకు చేతకాదుకూడాను.

బుచ్చి—రోగ్.

వాసు—(తాపీగా)...పైత్యంచేసే పదార్థాలు ఏమన్నా పుచ్చుకువచ్చారా,...లేక, ప్రకృతే అంతా?

భావయ్య—(వారిస్తూ) నీవు...ఊరుకోవాయనా: వారుచెప్పేదేమో కానీ.

వాసు—చౌదరీగారూ: మీరు వయోవృద్ధులు: మీరు మాటాడేదానిలో ఏమన్నా అర్థం ఉందోలేదో మీకే తెలియాలి!

భావయ్య—మీకు ఏమీ తెలియదంటారా?

వాసు—విషయం తెలుసుకోందీ......ఏమన డానికీ మనస్కరించడం లేదు. అసలు ఈసరోజిని ఎవరు?

భావయ్య—మా అన్నగారి కుమార్తె.

వాసు—తమది ఈ ఊరేనా?

భావయ్య—వింతగా ఉన్నాయి మీప్రశ్నలు!

వాసు—మాయింటికి మీరు దయచేసినందువల్ల కటువుగా మాట్లాడటం పెద్దమనిషితరహా కాదని సంకోచిస్తున్నాను. ఆ మర్యాదా... మీయకూడా పాటిస్తే చాలా బాగుంటుంది:

భావయ్య—చిత్తం: కాని, మీరు ఆగ్రహపడ నవసరములేదు: సరోజిని ఎవరని అడిగితే నాకు వింతగా తోచింది:

వాసు—కావచ్చును: కాని, ఎరుగనప్పుడు అడిగితే తప్పు కాదనుకుంటాను.

భావయ్య— (ఆశ్చర్యంతో) ఎరుగరూ, నిజంగా?

లీలీ—నేనూ ఎరుగనండీ మీ సరోజిని ఎవర్తో? ...ఏలా ఉంటుంది? ఏమన్నా చదువుకూంటున్నదా?

భావయ్య— చదివినందువల్లనే, ఇందాకా వచ్చిందమ్మా! (వాసుతో), మీకథలు...మా అమ్మాయిని చెడగొట్టినవి.

వాసు—అలాగా పాపం...

భావయ్య—వివాహం స్థిరపరిచాము: కాని, యీవరుడు అక్కరలేదని ప్రతిఘటించింది: మీకథలు చదివినందువల్ల, మనసు చాలా మారిపోయిందట; మీవద్దకు వచ్చి ఉండిపోతానని కూర్చున్నది.

లీలీ—(ఉత్సాహంగా) రమ్మను, దాదా! చక్కగా...ఇద్దరం కలిసి సరదాగా ఉంటాము:

వాసు—పంపండి, మాలీలీకి తోడుగా ఉంటుంది:

భావయ్య—అప్రతిష్ఠ! కులంలో మేము తల ఎత్తుకు తిరగగలమా యిక?

వాసు—అలాగా: అయితే మానేయండి. ఇక, మరి నాసలహా ఎందుకు?

భావయ్య—అథం, శుభం ఎరుగని పిల్లను,... మీరు యిలా ప్రోత్సహించకూడదు. మీరు చెపితే ఒప్పుకుంటుంది.

వాసు—ఏమని?

బుచ్చి—(మధ్య అందుకుని) వెర్రివేషాలు మానేయమని! ...అయినయింటిపిల్లను వలలో వేసుకున్నానని మురుస్తున్నావు: ఖబడ్దార్!

(మోతీ మొరుగుతూ వస్తుంది: వాసు కాలితో దాన్ని ఆపి,)

వాసు—ఏమీ లేదమ్మా! వట్టి ఆర్భాటమే, నీలాగా: (నాయుడితో) చూశారా, మామోతీకికూడా కోపం వచ్చింది...

భావయ్య—మేము ఏదో గౌరవ్యంగా కాపురం చేస్తున్నాం: ఘరానా కుటుంబంవాళ్లము. మీ రీ అక్రమం...

వాసు—(తీవ్రంగా) చౌదరీగారూ, ఇంతవరకూ సహించి ఊరుకున్నాను: ఇకనుంచి మీరు కొంచెం జాగ్రత్తగా మాటాడాలి. మీ సరోజిని ఎవర్తో నేను ఎరుగను. ఇంతవరకూ ఎన్నడూ చూడలేదు. ఆమె నాకథలు చదివి ఉండవచ్చును. అచ్చువేసేది...నలుగురూ చదవడానికే కదూ, మరి: కాని, వాటిల్లో

వయసుకన్నెల మతిమరిచేసే మంత్రతంత్రాలు, ఐంద్రజాలికాలు, ఏమీ లేవు: చిన్నతనంబులబాటాన, సరోజిని అల్లాఅన్నదన్నా,...మీరు నన్ను ఎరుగనిదే, నా మీద అపనిందవేయడం...మీలాటి పెద్ద మనుష్యులకు ఉచితమైనదేనాండీ?...అపవాదులకు లక్ష్యంచేస్తానని కాదు...

బుచ్చి—(స్నీర్‌తో) ఇట్ ఈజ్ ఎవిడెంట్:

లీలీ—షటప్, యూ సిల్లీ బేబీ...(బుచ్చి నాయుడు లేచి వెళ్లబోతాడు. వాసు అతన్ని వారించి,)

వాసు—ఉండవయ్యా, మహానుభావా: కొంచెం తమాయించు. (టిన్ చూపిస్తూ) హేవ్ ఎ స్మోక్. (నాయుడు చెయివిదిలించి వెళ్లిపోతాడు: టిన్ క్రింద పడిపోతుంది.)

లీలీ—బ్రూట్! (లేచివచ్చి గొంతుకూర్చొని, సిగరెట్స్ అన్నీ టిన్‌లో అమర్చి) హేవ్ వన్...

(బయట హారన్ మోగుతుంది)...అదుగో పాపం, పెళ్లికొడుకు తొందరపడుతున్నాడు: వచ్చి, మిమ్మల్ని స్వయంగా పిలుచుకు వెళ్లడానికి మేము కరుస్తామేమోనని భయం.

భావయ్య—లేకపోతే...అన్నిటికీ తెగించిన వాళ్లకు మీకేంభయం? చూసుకోండి, రేపీపాటికి సరోజిని పెళ్లిచేసేయకపోతే...నా పేరు మారుపేరు పెట్టండి. ఇంతటితో వదులుతా ననుకున్నారేమో,...మీరు చేసే అవాచ్యపు పనులూ...(వాసుతో) మీరు కథలు వ్రాసి...పడుచుపిల్లలను వలలో వేసుకొని, ఎలా చెడగొడుతూన్నదీ,...మీ జీవనవిధానం ... అంతా వ్రాసి పత్రికల్లోకి ఎక్కిస్తాను. అప్పుడు ఎక్కడ ఉంటారో చూద్దాం. మొదిలారా అంటే కేసుపెడతాను.

లీలీ—ఏమని?

వాసు—చెప్పేదేమో చెప్పనీయవమ్మా, మధ్యలో అడ్డంవస్తే. ఏదీ ఒకటి. (ఒక సిగరెట్ అందుకుంటాడు లీలీ చేతిలోంచి)...మరి, (భావయ్యనుద్దేశించి) మీరుకూడా (భావయ్యకు సిగరెట్ అందిస్తుంది లీలీ).

భావయ్య—వద్దు: నాకు అభ్యాసంలేదమ్మా.

లీలీ—వల్ ఐ సై)...దాదా ?

వాసు—(నవ్వుతూ)...గో ఎహెడ్.

(లీలీ లైటర్‌తో వాసు సిగ్ అంటించి, తాను అంటించుకుని, ఒకదమ్ము ఊతంగాలాగి, ఉక్కిరిబిక్కిరై దగ్గుతుంది.)

భావయ్య—(తల ఊగిస్తూ) ఊహుఁ...పడ లేదు.

వాసు—చిన్నతనం.

లీలీ—(భావయ్యను చురచుర చూస్తూ)...మీ సరోజినిని ఇప్పుడు నిష్క్రమించిన పెళ్లికొడుక్కు ఇచ్చిచేసినా...ఇంతే: సరిపడదు !

భావయ్య—ఊఁ, పిట్ట కొంచెమైనా-

వాసు—కూత ఘనమైనా, యథార్థము సుమండీ, చౌదరీగారూ! ఆ రంకెలగొడ్డుకు కట్టబెట్టి, శుభ్రమైన పిల్లదాన్ని చెడగొట్టమాకండి.

భావయ్య—ఆలోక్యము తమ కెందుకూ? మా యింటి వ్యవహారాలు...తీర్చి దిద్దుకోగలిగిన దక్షత మాకు ఉన్నదిలెండి.

వాసు—అయితే ఇబ్బందిలేదు: నేను కోరేదీ అదిన్నీ:

లీలీ—సరోజినిని...ఎప్పుడు పంపుతారు ఇక్కడికి ?

భావయ్య—ఏమిటమ్మా, పిన్నాపెద్దా తారతమ్యం లేకుండా వెటకారాలూ, వేళాకోళాలూనూ. ఇదిగోనండీ, ఆఖరిపర్యాయం చెప్తున్నాను: మీరు మర్యాదాగా ప్రవర్తించకబోతే...

వాసు—పెద్దమాటలు విసరబోకండి మరి. మీరు మాకు నీతులు ఉపదేశించ నక్కరలేదు.

భావయ్య—మీరు చెడ్డదికాకుండా-

వాసు—(సమీపించి, గంభీరంగా) తమరు ఇక సెలవు పుచ్చుకోవలసి ఉంటుంది: (భావయ్య

లేస్తాను) ఇప్పుడు తెలిసివచ్చింది: మీలాటివాళ్ల చేతుల్లోంచి ఆపిల్లను రక్షిస్తాను.

భావయ్య—చెడిపోతారు.

వాసు—(నవ్వుతూ) ఇంకానా ? ఈ చెడిపోవడం చాలదా? ఇకనుంచి మాజోలికి, మాచాయలకు వస్తే మీరుకూడా చెడిపోతారేమో! కొంచెం ఎడముగా ఉండటం మంచిది!...

భావయ్య—చూద్దాం ఎవరు నెగ్గుతారో.

లీలీ—మీ ఉత్తరకుమారప్రజ్ఞల కేమిలెండి,—భావయ్య, తాతయ్య చౌదరిగారూ, (వాసుతో) నీవుమాటిమాటికి అల్లావారిమాటలకు అడ్డువస్తూంటే ఎల్లా దాదా? పాపం మరచిపోతారేమో: పాపం, ఎంతికష్టపడి వల్లె వేసుకు వచ్చారో...(భావయ్యతో) ఏమండీ, అరె, నామరుపు కూలా...ఇంతలో మరిచిపోయినానేమీ పేరు. ఆఁ...ఆఁ...(జ్ఞాపకం తెచ్చుకోవడం అభినయిస్తుంది: మరిచిపోయినందుకు విసుపుగా) పోనీలెండి, ఏవో తిమాషా పేర్లు పెట్టుకుంటే...నాకు జ్ఞాపకం ఉంటాయా ఏమిటి? అసలే మందమతి నాయెను: ఏమండీ, (జ్ఞాపకంవచ్చినట్లు, అమ్మయ్య! భావయ్యగారూ,...మీరు ఎప్పుడన్నా లెక్చరు ఇచ్చారా? మామంచి వాయిస్ అండీ మీది! (వాసు, లీలీ, గబగబ అంతా, చిరునవ్వుతో వింటూంటాడు.)

భావయ్య—(పట్టరాని రోషంతో) ఛీ! మీతో మాట్లాడితే పాపంవస్తుంది. ఈలాటిచోటికి రావడం...నాదే పొరబాటు.

వాసు—వాయర్!

భావయ్య—(బెదురుతూ) ఆఁ...ఆఁ...కొడతారా ఏమిటి?

వాసు—(వినిపించుకోకుండా వింగ్‌లోకి) వీరు వెళుతున్నారు: గేటుదాకా పంపించిరా: (భావయ్యతో) సెలవు: తమ దర్శన భాగ్యం...ఇలా తలవని తలంపుగా లభించడం కేవలం నా......

భావయ్య—నీ...దౌర్భాగ్యం? ఎంతపొగరు! (ధూమధుగా నడిచిపోతాడు: వాసు విరగబడి నవ్వుతాడు.)

వాసు—అమాయికపు...ఋషి:

లీలీ—అందుచేతనే శాపనార్థాలు కురిపించాడు. ఏమో అనుకున్నాను,...మొత్తానికి గ్రంథసాంగుడవు దాదా!

వాసు—ఆఁ...మరి కొస్తా కూస్తా గ్రంథమనుకున్నావేం? ఇప్పటికే ఎన్నైన్లోపిడిసూత్రిటూనుకాను...మించిపోయింది.

లీలీ—(కపట, సిష్ఠురంగా) ఎంతికన్నా తగుదువు: కథలువ్రాసి పడుచుపిల్లలను మంత్రిస్తావూ? ఉండు, వెళ్లి చెపుతాను మీసరోజినితో...

వాసు—'మా' సరోజినా?

లీలీ—(నవ్వుతూ)...పోనీ, మనసరోజిని......

[సరోజినివచ్చి, బెదురుతూ బల్లదగ్గరగా నిలుచుని ఉంటుంది: వాసు, లీలీ ఒక్కమారే ఆమెను చూస్తారు: వాసు, ఆశ్చర్యంతో తెల్లబోతాడు.)

లీలీ—(ఉత్సాహంగా) ఏం...సరోజినీ.

వాసు—సరోజినా ?

లీలీ—అవును, మరి ఎవరనుకున్నావు?... ఏమమ్మా, నీవు సరోజినివి కావూ ? (సమీపించి చెయ్యి పట్టుకుని) ఏం...అల్లా సిగ్గుపడుతూ నిలుచున్నావేం... ఓహో, పెళ్లికూతురివి కాబోతున్నావనా?...అయినా ఇక్కడ పరాయివాళ్లెవరు, దాదా, నేనేకదూ?... సరి, మిమ్మల్ని ఇంట్రొడ్యూస్ చేయాలికాబోలు: దాదా, ఈ అమ్మాయి...సరోజిని:

వాసు—(విభ్రమంతో) చెప్పావుకాదేం?... మీరిద్దరూ ఓల్డుఫ్రెండ్స్ అన్నమాట:

లీలీ—(కైతవవినయంతో) నాట్ ఓల్డు,... బట్...వెరీ యంగ్ (కర్టెసీచేసి) యువర్ హ్వానర్: సఖ్యం సాప్తపదీనమని దేవరవారు శెలవియ్యాలా. ఇప్పుడు ఆమాత్రం అడుగులన్నా వేయలేదా ఏం? (సరోజిని భుజంమీద చనువుగా చెయివేసి) మా సరోజిని (వాసును చూపిస్తూ)... వీరు శ్రీ శ్రీ శ్రీ వాసు

దేవ కథాసుల్తాన్ బహదూర్ వారు (నవ్వుతూ) కమ్మ కన్యాకుమారీ జమీందారులు...

వాసు—ఛాయా హోలెవా...లాగు ఉన్నారు!

లీలీ—శెహబాస్ చంద్రకేతూ, ... మాకు సవతివైరం పెంచినా,...నీరొట్టె నేతిలో పడదు: (సరోజినితో) మనకెందుకు...ఈ నిలువుజీతం,... రా, కూర్చుందాం! (కుర్చీలో బలవంతాన కూర్చో పెట్టి, తాను చేతిమీద పక్కవాలుగా కూర్చుం టుంది:) (వాసుతో) మీరూ 'మను' అనుకుని దయచేయాలికాని, వేరే మనవిచేయాలా: (వాసు రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుంటాడు) (సరోజినితో) నైట్‌క్వీన్ పెట్టావే తల్లో: పరుగెత్తుకు వచ్చావా ఏమిటి...జుట్టంతా రేగిపోయింది: కారులో రాలేక పోయినావ్, డ్రైవింగ్ చేతకాదూ? (ఈమాటలన్నీ తిలావక స్థాయిలోనూ, ధోరణిలోనూ అంటుంది)...

వాసు—మీవాళ్లు...ఇప్పుడే వెళ్లారు.

సరోజిని—(తలవంచుకుని) అవును, కారు కనిపించింది దోవలో...

లీలీ—నిన్ను చూడలేదూ...వాళ్లు?

సరోజిని—(లీలీతో బెరుకులేకుండా) దూరాన్నే గుర్తుపట్టి, జట్కా ఉంటే దానిచాటుకు తప్పుకున్నాను: నిజంగా, చూస్తారేమోనని భయంవేసింది.

లీలీ—(సప్రశ్రయంగా) బలే! ...అయినా, ఎందుకూ వాళ్లకు అంతపట్టు: అవునులే, త్వరగా పెళ్లి చేస్తే, అందులో మేనత్త కొడుక్కయిస్తే, కడుపు ఫలించి ఓ పెద్ద మామిడితోట అయిపోతుంది కదా, తిలారిరాముడి సంతానంలాగా? అప్పుడు తాతగారికి అడుగడుక్కీ మహిమలు తగులుతారు! ఏం, బాగుండలా?...చక్కగా, చెప్పిన మాట విను; చెడిపోక. (నవ్వుతుంది.)

సరోజిని—(మేలముగా) నీవు చేసుకోరాదూ.

లీలీ—మీ బావనా?...చెనేదాన్నే ఇంకో నిమిషం ఉంటే: తప్పించుకుపోయినాడు గాని.

వాసు—ఏమమ్మా.

లీలీ—కామమ్మా, నో ఎక్స్‌ప్లనేషన్స్: రామాయణం అంతావిని మళ్లా మొదటికి వస్తావేం? లెక్చరు అర్థంకాలేదూ? చిన్నపిల్ల, సరదాగా జీవితం గడుపుతానంటే, మంగళసూత్రం ముడిపెట్టించి, ఇంట్లో బంధిస్తానంటారేం?

వాసు—అబ్బ! ఊరికే రేగమోక. నేను అదే అడగబోతున్నది: ఏమమ్మా.

లీలీ—(సరోజినితో) నోటిముత్యాలు రాలినా, ఖరీదు ఇయ్యకుండా, మేము లేకగా కాజేయములే నీకో చిన్న లెక్చరు దంచు...

వాసు—అసలే భయపడుతూన్నది, మరీ బెదరగొట్టమోక. ఏమమ్మా...నీ విషయం భావయ్యగారు చెప్పారు.

సరోజిని—అన్నీ అబద్ధాలు.

లీలీ—అవునులే! ఆయన మట్టుకు నిజమనుకున్నాడు: ఎంత బుకాయించాడనుకున్నావు! చూసి తీరాలి సరే మీ బావ,...సాక్షాత్తూ గ్రామసింహావతారమే.

(మోతీవస్తుంది) ఆఁ...తయారైనావూ: అనుకోవడం త్వరధానం: ఇక్కడికి మన సంసారం సంపూర్ణం:—(సరోజినితో) ఇందాక మీబావ మాట్లాడుతూంటే దీనికి కోపంవచ్చింది.

సరోజిని—(నవ్వుతూ)...కులవైరం!

లీలీ—భేష్, మాకోటరీలో మెంబరుషిప్పుకు ఇక నీకు అర్హత కలిగింది: ఉండిపోవచ్చు.

సరోజిని—వెళ్లమన్నా...వెళ్లను.

లీలీ—వెళితే, పెళ్లి చేయరూ? ఏమిటో, నీవంటే పారిపోయివచ్చావు కాని, నాకు ఎవరన్నా పెళ్లిచేస్తానంటేనా...

వాసు—అదొక్కటే తక్కువ!

లీలీ—కాదు: అసలు పెళ్లికొడుకేడీ? ఎవరన్నా, ఎన్నిగుండెలతో, తగుదునమ్మా అని వస్తాడు?

వాసు—చేసుకున్నా, ఓవేళ, వాణ్ని బ్రతకనిస్తావూ?

లీలీ—మరీమంచిది!...ద్రౌపదిలాగా, వన్స్‌మోర్, వన్స్‌మోర్ అయిదింటిదాకా కాంక్షస్ ఉందిగా భారతంలో.

వాసు—మంచి పతివ్రతవు.

లీలీ—పతులు మహాప్రస్థానానికి వెళ్లిపోతే... వ్రతంమాత్రం ఎందుకేమిటి? (మోతీ మొరుగుతుంది) నీవూ...ఏకీభవిస్తున్నావ్, నాతో.

వాసు—కాదు, ప్రొటెస్టు: ధోరణిచాలించి, సరోజిన్ని మాట్లాడనీయమని.

లీలీ—అవునులే...ముందువచ్చిన చెవులకన్నా వచ్చేవచ్చే కొమ్ములు వాడికాదూ?

వాసు—కాఫీతాగుదామా?...నాయర్. (నాయర్ వస్తాడు: లీలీ, తర్జనితో, త్రాగడానికి కాఫీ అని సైగచేసి చూపించి,)

లీలీ—ఔర్ ఏక్ దఫా.

వాసు—స్ట్రాంగ్.

సరోజిని—నాకు అక్కరలేదు.

లీలీ—అవును: పెళ్లి అక్కరలేదు సరే: కాఫీకేం?

వాసు—పెళ్లి మాత్రమేం?

లీలీ—మనది కాకపోతే, పెళ్లీ ఓశుభకార్యమే కాదూ దాదా? అంతేలే, ఈకథలకామరాజునుచూస్తే నే కడుపు నిండుతుంది.

(భావయ్యప్రవేశిస్తాడు పునః)

భావయ్య—కడుపు నిండేపోయింది: (సరోజినితో) ఇంతకు తెగిస్తావనుకోలేదు: (సరోజిని ఉలికిపడి లేచి, లీలీచాటుకుజరుగుతుంది) మావంశాన చెడబుట్టావు: నిల్చుంటావేం, బెల్లంకొట్టినరాయిలాగా: నడు, ముందర ఇంటికి: ఏం మాట్లాడవేం?

లీలీ—ఏం మాట్లాడాలేం?

భావయ్య—నీకెందుకూ మధ్య: ఇందులో నీకైక్యం ఏమీలేదు.

లీలీ—గనుకనే...ఇంతనిదానంగా అడిగింది.

భావయ్య—లేకపోతే.

లీలీ—కుర్చీ ఖాళీగా లేకపోతే మామామూలు ఆసనం ఉన్నదిగా! బల్లమీద విశ్రమించి మరీ ఆజ్ఞ పెట్టండి!

వాసు—(కుర్చీలోనుంచి లేచి) పోనీ, ఇలా కూర్చోండి.

భావయ్య—నేను వియ్యమందడానికి రాలేదు:

లీలీ—(నవ్వుతూ) వచ్చినా లాభం ఉండదు. మాదాదా పెళ్లి మానేశాడు. మాసరోజిని...

భావయ్య—'మాసరోజిని'.

లీలీ—లేకపోతే, మీరే మహాదాచపెట్టారా ఏం?

భావయ్య—(సరోజినితో) రావేం? ఎన్నిమాట్లు చెప్పాలి?

వాసు—కూర్చోండి: నిదానంగా మాట్లాడుకుందాం: (భావయ్య దిక్కులుచూసి, ఇష్టంలేనట్టుగా కుర్చీలో కూలబడుతాడు: వాసు నిలుచునే ఉంటాడు, టీపాయ్ మీదకు ఎక్కిన మోతీని సంకిట జేర్చుకుంటూ.)

భావయ్య— మర్యాదగా పంపించివేయండి మాపిల్లను!

లీలీ—సారెగూడా పెట్టవద్దూ!! ...ఏంగడుసుదనం చేస్తున్నారండీ తాతగారూ...

వాసు—(నిదానంగా) ఇక్కడ ఉండనీయండి:

భావయ్య — ఇంకా ఏం?...అబద్ధమాడలేదు కదూ మీరు? సరోజిని ఎవరో ఎరుగరు కదూ మీరు? మీకు ఏమీ తెలియదు కాదూ?

లీలీ—తెలియకపోవడమేమిటి, మీరు అంత శ్రమపడి చెప్పిన తరువాత!...మాసరోజిని బదులు నేను చెబుతాను...మీకు జవాబు. సరోజిని మీవెంటరాదు. మమ్మాటికీ రాదు: తెలిసిందా? వచ్చి, ఏంచేవు

కావాలేం? మేం మిద్దరమూ యిక్కడే ఉంటాము. అంతగా అపేక్షఉంటే, మమ్మల్ని చూడటానికి మీరే రండి. వస్తూ, ఉత్తచేతులతో మాత్రం రాకండేం. ఎన్నడన్నా, సరదాగా, ఇలాకస్సుబుస్సు మనకుండా మీరు వస్తే,...నేను సంగీతం పాడుతాను: అప్పటికి సరోజిని కథలు వ్రాయడంలో బాగా తయారు అవుతుంది.

భావయ్య—ఆఁ...అంతా కథగానే ఉంది:

లీలీ—కథలసంగతి మీ కేం తెలుసు? అయినా వద్దు లెండి: మా దాదా వ్రాసే కథలు చదివితే మీరూ యిల్లువదలి ఇక్కడికే వచ్చేస్తా నంటారు! కళాజీవనం కోసం ఇంత పెద్ద పాపాయిని...మేము పెంచలేం బాబోయ్!

భావయ్య—(సరోజినితో) ఆఖరుసారి చెపుతున్నాను. చెడిపోతావు: ఇక నీముఖంచూడము ఎవరమున్నూ. ఒంటరిగా ముక్కు మొగం ఎరుగని పరాయి మొగవాడి దగ్గరకు...తెగించి వస్తావ్? (గుండెమీద చేయివేసుకుని)...అమ్మ! ఎంతదానవైనావూ? చదివిన చదువంతా ఇందుకేనా, పాడిస్తిదానా?

వాసు—(చేయెత్తి, వారిస్తూ) జాగ్రత!

భావయ్య—(సరోజినితో)...ఏం, రావూ?

వాసు—రాదు: ఆపిల్ల, తెలియక వెళుతానన్నా, నేను పంపను.

భావయ్య—రెక్కపట్టుకు, యీడ్చుకు వెళ్లి, యింట్లో పడేస్తాను. రాకపోవడ మేమిటో చూద్దాం. ఊరుకున్నకొద్దీ ఆగడం మీరిపోతున్నది. (లేస్తాడు.)

లీలీ—(ముందుకువచ్చి, చప్పున భావయ్య రెక్కపట్టుకుని) ఇంటిదాకా దిగబెట్టాలా, ఒక్కరూ వెళ్లగలరా?

వాసు—వదులు: ఆయనే వెళుతారు.

(భావయ్య విదిలించుకుని వెళుతూండగా వాయర్ కాఫీట్రేతో ఎదురౌతాడు.)

లీలీ—(భావయ్యను ఆపి) కాఫీ!...ఊరికే వెళ్లిపోవడమే!

భావయ్య—కడుపు నిండేఉన్నది.

లీలీ—ఎంతనిండినా, కాఫీకి సందు లేకుండా పోతుందా ఏం? (చేతులుపట్టుకుని, భావయ్య వెనుగులాడటంచూసి) ఆట్టే మారాంచేస్తే, పసిపిల్లవానిచేత ఆముదం త్రాగించినట్టు, పట్టిపొయ్యాలిసి వస్తుంది; (కుడిచేయి వదిలించుకుని, కప్ అందుకుని, భావయ్యకు యిస్తుంది. సరోజినికి, వాసుకూకూడా అందిచ్చి, తాము ముగ్గురూ ఒకగుంపుగా నిలుచుని త్రాగేసమయాన భావయ్య కప్, సాసర్ జారవిడిచి నిక్కిమిస్తాడు.)

లీలీ—త్రాగలేనిపిల్లి...బోర్ల వోసుకున్నదట!

వాసు—ఏమమ్మా, సరోజిని.

(సరోజిని తలఎత్తి, కప్‌మీదనుంచి వాసును చూస్తుంది: లీలీ ఇవతలకు జరుగుతుంది)...నీవుయింటికి వెళ్లిపో...

లీలీ—అదేమిటి దాదా?

వాసు—అవునమ్మ,...వెళ్లిపోనీ.

(సరోజిని లీలీని కౌగలించుకుంటుంది భయంతో.)

లీలీ—(సముదాయిస్తూ) నవ్వులాటకమ్మ, బెదరకు.

వాసు—కాదు, నిజంగానే.

లీలీ—ఏమిటి, ఊరికేనా, దాదా? అసలే ఎలా భయపడుతున్నదో, చూడు.

వాసు—(సమీపించి)భయమెందుకమ్మ, నిర్భయంగా వెళ్లవచ్చును.

లీలీ—ఇదా.. నీవు చెప్పేది.

వాసు—తెలియకపోతే, సాంతం విను. భావయ్యగారికి భయపడి, ఇందాక పంపించివేసినట్లయితే, మనం ఓడిపోయినట్లే. ఇప్పుడు మాశాప్, ఆయన ధిమాకీగా వెళ్లిపోయినాడుగనుక, సరోజిని యింటికి

వెళ్లాలి. తనంతట తాను మళ్లారావాలి! ఇక మెదలకు; నాకు తెలుసును.

సరోజిని—నేను ఉండటం మీకు యిష్టం లేదా?

వాసు—అదికాదమ్మా, తల్లీ! నాయిల్లు కలకలలాడిపోవడం యిష్టంలేకనా? కాని, యీకొత్తతనుకు నిరంతరసాహచర్యంవల్ల మాసిపోతే, నీకు బాధాకరంగ మారుతుంది. కళాజగన్మోహనానికి, ఇల్లువిడిచి రానక్కరలేదు: ఎవరినీ ఎదిరించ నక్కరలేదు; స్వతంత్రమంటే ఏమిటో, నియమాల్లో చిక్కుకుని ఉన్నప్పుడే అర్థం అవుతుంది. నీయిష్టం వచ్చినప్పుడు రా...

లీలీ—ఆ స్వతంత్రమే.. యిక్కడాను, అన్న మాట.

వాసు—మరి, నీసహవాసం చేసినతరువాత.

లీలీ—ఉక్రోషం, ఓ అబ్బాయి! (సరోజినితో) రా, నేనుకూడా వస్తాను. దాదా నేను అక్కడే భోజనం ఇవ్వాళ. పెళ్లికొడుకును మరోమారు కవ్వించాలి. వెళుతున్నానని చెప్పవేం? పోనీ, ముందు ఒకసారి నవ్వు. ఏదీ...ఇంకాబాగా...ఆఁ...

సరోజిని—వెళ్లివస్తాను...

లీలీ—గుడ్ బై, యూ జేడ్ బాయ్?

వాసు—లీలీ, వెయిట్ ఎ మినిట్.

లీలీ—ఊహుఁ...వెళ్లిపోతున్నాం, ఎంతఎంతగా ఉందో. యూ వెయిట్ (సరోజినితో నడిచిపోయి, వింగ్ దాటి వెళ్లబోతూ, వెనుదిరిగి) అండ్ హోప్ (వెళ్లిపోతుంది.)

వాసు—(ఆమెవెళ్లినవైపే చూస్తూ) డార్లింగ్.

[తెర]

## 'ఇనుపగొట్టాలు'

కాళ్లకూరి సూర్యనారాయణ

ఈపదాన్ని 'ఎనుపగొడ్లు' లేక 'ఎనుముగొడ్లు' అని మార్చిచెప్పవలెను. అంటే గుంటూరుజిల్లామొదలైన వాటిలో బర్రెలనన్ని, విశాఖపట్నం జిల్లాలో గేదలనన్ని అర్థంచెపుతారు. గుంటూరులో నేటికిన్నీ బర్రెలకు ఎనుంగొడ్లు అంటారు; మేకలను, గొర్రెలను చిన్నగొడ్లంటారు. గుడ్ (గుడ్ = బెల్లం) అనే హిందీ, లేక హిందూస్థానీ పదంలో ట్ ఏలాపలకవలెనో, అల్లే తెనుగు 'ఱ' ను తెలుగువారు పలికి ఉండవలెను. దీనితో సంబంధించిన కొన్నిమాటలు:

| | |
|---|---|
| గొడ్డు, గోద | గేదె |
| కుదిరై (తమిళం) | బర్రె |
| గుఱ్ఱం | ఎనుము |
| గోడా, గొడీ (హిం) | ఎద్దు |
| గాడిద | |
| కయిద (తమిళం) | |
| గొర్రె (గొఱ్ఱె) | |

ఇంకా చాలా ఉన్నది. ఇప్పటికి ఇవి చాలును.

# శిక్షలు

ఏలేశ్వరపు కృష్ణమూర్తి

* శిక్ష లన నేమి?

నేరపరిహారమే శిక్ష. నేరాలన్నిటిని నిర్వచిం చేది శాసనం. శాసనాన్ని అతిక్రమించేవారు నేరస్థులు. జరిగిన దోషకృత్యములను పరిశోధించువారు రక్షక భటులు. పాడుపని చేసినందుకు నేరగానికి జరిగే ప్రతి క్రియ శిక్ష. ఆశిక్ష ఏరూపం దాల్చాలో, ఏప్రాశంగా వుండాలో, ఎంతబలంగా వాడాలో నిర్ణయించేది న్యాయమూర్తులు. శిక్షను ముట్టజెప్పేది రాజభటులు. శిక్షను పొందేది నేరగాడు. నేరగాడులేకుంటే శిక్షలుం డవు. 'సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలా స్సుసంయు తాః' అన్నట్టయితే శిక్ష లుండవు.

* శాసన మెట్టిది?

శాసనం అనేది దేశ కాల పాత్రలను పాటించి శిక్షణ క్రమాన్ని తెలుపుతుంది. శాసనములు రెండు విధాలు. రక్షణకుగా నున్నవి కొన్ని; శిక్షణ కేర్పడినవి కొన్ని. రాజే శాసనకర్త.

* రా జెట్టివాడు?

పూర్వులు చక్కగా నాలుగు ముక్కలలో తెలిపినారు.

'రాజా సత్యంచ ధర్మశ్చ
రాజా కులవతాం కులం,
రాజా మాతా పితాచైవ
రాజా హితకరో నృణాం.'

* శిక్షణోపాయము లేవి?

లోకమున 'చెట్టుగా వంగనిది మాను అయి వం గడంకష్టము' అందుచేత వెంటనే గుణాన్ని చక్క జేయుట మంచిది. కాని 'మనకు దిద్దరాదు మహి నెంత వారికి' అన్నమాట మరువరాదు. నీతికోవిదులు సప్తో పాయములు వివరించారు. మంచిమాట చేసుకోవడం ఒకవుపాయం. అంటే తియ్యనిమాటలతో బుద్ధిచెప్పడం. ఇది సామం. బెదరించడం, జడిపించడం భేదోపాయం. అప్పలుంటే వాటిని తీర్చివేయడం, ధనమివ్వడం, అపూర్వమైన వస్తువుల నివ్వడంలాంటివి దానో పాయాలు. వధించడం, ధన ముంటే లాక్కోడం, పీడించడం దండోపాయం. మాయచేసి దారికి తీసుకు రావడం ఒకవుపాయం. ఉపేక్షతో ఊ ఊ అనిపించడం మరోవుపాయం. కడకు గమ్మత్తుగా యింద్రజాల మ హేంద్రజాల విద్యను ప్రయోగించడం ఒకవుపాయం. ఇవి శిక్షణకు సుప్తోపాయాలు. మానవప్రకృతిని జాగ రూకతతో పరీక్షించి ఉపాయములను ప్రయోగించాలి. 'సుతీక్ష్ణదండా సంప్రేక్ష్య పురుషస్య బలాబలం' అనే ముక్క కూడా జ్ఞాపకం వుంచుకోవాలి.

* నేరమేమి?

శాసనవిరుద్ధముగు ప్రవర్తన నేరం. సంఘనిరో ధన నేరం. రాజాజ్ఞకు లోబడని నడత నేరం. సంఘ పోషణకుగా నేర్పడినది శాసనం. ప్రవర్తన చక్కజేసి కొనిన శాసనతిరస్కార ముండదు. శిక్ష లుండవు.

* నేరములకు కారణమేమి?

దండించకపోతే నేరములు పెక్కు పెరుగు తాయి. సంఘం పాడవుతుంది. దుష్ప్రవర్తన ప్రబలు తుంది. శిక్షవేస్తేనే ప్రాతమనిషి క్రొత్తమనిషి అవుతాడు. నేరగానిమనసు మారాలి. నడతమారాలి. ప్రవర్తనమారాలి. హత్య నేరం కాదంటే సంఘం కేపటికి ఏకాటికెడుతుందో తలవండి. అదిగాక తప్పుచేసినవారిని దండించకపోవటం ఒక పెద్దతప్పు. నేరగానిమనసు దిద్దాలి. నిజమేకాని దొంగ దారి నెల్లాగు మళ్లించడం? ఏనేరానికి ఆనేరమే గొప్పది లా గుంటుంది. స్వల్పనేరము లేవి? ఘోరకృత్యము లెవ్వి? మనలో చిన్ననేరాలకి చిన్నదండనలు, గొప్పనేరాలకి గొప్పదండనలు వుండాలని అంటారు. ఈ చిన్నపెద్ద భేదం కనుక్కోడం ఏలాగు? ఈభేదం నేరగానివయసు లోనిదా? బుద్ధిలోనిదా? పుట్టుకలోనిదా? పదవి

లోనిదా? పలుకుబడిలోనిదా? భాగ్యములోనిదా? నేర గానికి దొరికిన సందులోనిదా? చేజిక్కిన అవకాశము లోనిదా ? ఈ నేరనిరూపణ ముఖ్యంగా రాజ శాసనములోనిది. ఎట్టి ప్రవర్తనను శాసనం నేరం అంటుందో అదే నేరం. నేరానికి ఎన్ని నిరూపణలున్నా, ఎన్నికట్టుబాట్లున్నా నేరం ఎవ డెప్పుడు చేస్తాడో ముందుగా చెప్పడం కడుదుర్లభం. పూర్వం జ్యోతిషం చదువుకున్న పెద్దలు చోరత్వానికి వాటికి సూత్రము లిచ్చారు. రాజ్యాధిపతి షష్ఠమం దుంటే చోరుడని, కుజబుధులు లగ్నంలో ఉంటే చోరుడని వ్రాశారు. ఈ గొడవలో పడేవాళ్లు తక్కువ. జననకాలపుఘడియలు మక్కువ చూసుకునేవారు కొలదిమంది. ఇంతకు ముందుగా నష్ట జాతకం గుణించుకొని చేసేదిలేదు. లోకంఅంతా నేరస్థులతోనే నిండిపోలేదు; సుచరిత్రులతోనే నిండిపోలేదు. నేరంచేసేవాడికిమాత్రం ముందుగా నేరంచేయబోతానని తెలుస్తుందా ? ఆలోచనే లేకుండా హఠాత్తుగా జరిగే నేరాలు ఎన్నోవున్నాయి గొప్ప నేరాలకు కారణ మేమిటో! ఉద్రేక మదమా ? అసూయయా ? మతిభ్రమేమో ? విరక్తియా ? వంశలో బాహ్యమా? పిచ్చితనమా? త్రాగుబోతుతనమా ? వదరుబోతుతనమా ? వ్యభిచారగుణమా ? లేక ప్రాయాన్ని విచ్చలవిడిగా తిరగడమా? మతవివాదలా? దుర్వంశోద్భవమా? సాధుశీలంపకమా? కలిమియా? లేమియా? దేశపు రీతోవ్యవస్థితియా? మహా సంగ్రామములా? ఘోరయుద్ధములా? ప్రపంచములా? ఆర్థిక దుస్థితియా? నిరుద్యోగసమస్య? చెడు సంప్రదాయములా? అజ్ఞానాంధకారమా? విద్యాధికతయా? జాదగొండెతనమా? అనుకరణా? త్యాగమా? చులకత్తమా? ఇట్టివి అన్నీ కారణములే. తలచినకొద్దీ కారణము లుంటాయి. క్లుప్తంగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములే నేరాలకు ముఖ్యకారణం అందాం ప్రారబ్ధకర్మం అన్నిటికంటె గొప్పకారణం. దీనిని బట్టే పూర్వులు ప్రాయశ్చిత్తాలు చెప్పారు. గ్రహశాంతులు చెప్పారు. హోమాలనీ, జపాలనీ దేవులాడారు. ఈ యుగంలో నేరాలు నేరాలే. పాపాలు పాపాలే. గ్రహాలగతి గ్రహాలది. నరులగతి నరులది. ఎన్నిచెప్పినా, ఎంతచేసినా నేరాలులేని యుగంలేదు.

* శిక్ష లెన్నివిధాలు?

తలచినన్ని విధాలున్నాయి. 'రాజు తలచిన దెబ్బలకు కొదువా' అనికదా సామెత. ఎవరికి తోచిన శిక్షలు వారు లోకంలో వేస్తూవచ్చారు. చరిత్రాత్మకంగా చూస్తే రకరకాల శిక్షలున్నాయి మరణశిక్ష మొదటిది. ఉరితీయడం. తుపాకీతో కాల్చడం. ప్రాణం తీయడం. నడినెత్తిని మోదడం. గండ్రగొడ్డలితో తలతెగయ్యడం. వెన్నెముకను చెదరగొట్టడం. విద్యుచ్ఛక్తితో కూర్చున్నపాటున కుర్చీలోమాడ్చడం. మానుకు నిలవేసి మేకులు దిగగొట్టడం మనిషిని నిలువునా చీల్చడం. చర్మం ఒలిచేయడం వేదనాయంత్రం వాడడం. రంపాలతో కొయ్యడం. నీటిలో బుడుంగున ముంచడం. ముక్కలు ముక్కలుగా కోసిపారవేయడం. అగ్నిలో పడవేయడం. మనిషిని పుక్కిరిబిక్కిరిచేయడం. వికలాంగులను చేయడం. వనవాసానికి పంపడం అజ్ఞాతవాసానికి పొమ్మనడం. కాకులకు గ్రద్దలకు ఎగరవేయడం. లక్కయింట్లోవుంచి నిప్పంటించడం. అడవిమృగాలతో పోరాడించడం. నేరగానిని విషసర్పములను పంచులలోకట్టి నట్టేట్లో పారవేయడం. జీవంతో భూమిలో పాతిపెట్టడం. కొరతవెయ్యడం. ఉప్పుపాతరవెయ్యడం. ఎద్దులచేత కొమ్ములతో పొడిపించడం. పళ్లుపూడగొట్టడం. గుడ్లుపీకివేయడం. నిదురపోనీయక బాధించడం. వాతలుపెట్టడం. సలసలకాచిననూనెలో వేయించడం. వేటకుక్కలను వుసికొల్పి చీల్పించడం. మెడకు రెడ్డబండ కట్టడం. నేలమీద బరబరయీడ్పించడం. చిచ్చులుపెట్టడం. మనిషిని కొయ్యకు గ్రేలాడగట్టి కాళ్లకు బరువులుకట్టడం. కీళ్లు పదునుతప్పించడం. బహిరంగంగా బోనులోవుంచి అవమానించడం. నాలుక తెగెయ్యడం. కర్ణచ్ఛేదంగావించడం. ముక్కుకోయడం. మొగతనంపోగొట్టడం. మీసాలుతీయించడం. బుర్ర నున్నగాగొరిగించడం. కులంలోంచివెలివెయ్యడం. సహపంక్తిని కూర్చోనీకపోవడం. గాడిదనెక్కించి వూరేగించడం. తలాకర రాయి నెత్తిని వేయడం. ఇల్లా పూర్వ

కాలంలో అన్నిదేశాల్లోను గట్టిగా రోగంవదిలేట్టు ప్రాయశ్చిత్తం నేరాలకు చేసేవారు. రోమకరాజ్యంలో యిట్టి వొకవింతకాదు. మనుస్మృతిచూచినా యిదేతీరు. సంభావనగట్టిగా ముట్టితేగాని నేరగాడు బాగుపడడని వారిభావం. సంభావన ఎటున్నా బ్రాహ్మణుడికి మరణ దండన యిప్పటికి తిరువాన్కూరులో విధించరు. పూర్వకాలంలో ఇంగ్లండులోను, యూరపుదేశము లోను యిట్టి శిక్షలుండేవి. 'ప్రాప్తకాలంతు తే దండం ధారయేయు స్సుతేష్వపి' అని పూర్వులు వచించారు. ఇది దండనీతి. క్రోధం, కినుక పూర్వుల శిక్షణవిధానపు సూత్రం. భక్తుడగు ప్రహ్లాదునికి తండ్రి శిక్షలెన్నో చేశాడు. ఆ శిక్షలతీరు కొంచెం పరీక్షిద్దాం. అప్పుడెట్టి శిక్షలు వాడుకలోనుండేవో మనకు తెలియగలదు. రోమక రాజ్యమున పురాతనకాలమున పుత్రుల ప్రాణములు కూడ తీయు హక్కు[1] తండ్రికుండెననుట అది జ్ఞప్తికిరాగలదు. ఈ క్రిందిపద్యములు చదవండి

సీ. ఒకమాటు దిక్కుంభియాఘాతంబు దప్పించి
  కరలి డింభకుని ద్రొక్కింపబంపు
నొకమాటు విషభీకరోరగ శ్రేణుల
  గఱవని సర్పరు గఱవబంపు
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన
  విసరి కుమారుని వేయ బంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో
  మొత్తించి బాలకు ముంపబంపు
విషముపెట్టబంపు విసరింపగాబంపు
దొడ్డకొండచరుల ద్రోయబంపు
బట్టి కట్ట బంపు బాధింపగాబంపు
బాలుఁ గినిసి దనుజపాలు డధిప.

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు
  నొకవేళ సెండల నుండబంచు
నొకవేళ వానల నుపహతినొందించు
  నొకవేళ రంధ్రంబు లుక్కబట్టు
నొకవేళ దనమాయ నొదవించిబెగడించు
  నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళ బెనుగాలి కున్ముఖు గావించు
  నొకవేళ బాధించు నుర్వియందు
నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు
గళల నడిపించు బుర్వించు గండశిలల
గదల ద్రేయించు నేయించు ఘనశరముల
గొడుకు నొకవేళ నమరారి క్రోధియగుచు.

పూర్వుల దండనీతి యీతీరున నుండెడిది. ఇట్టి శిక్షలు నానారాజ్యములలోను వాడబడేవి. ఈ పూహను బట్టే రౌరవాది నరకాలు మనకండ్లకు కనబడతాయి. ఇట్టిశిక్షలు పూర్వం వుండబట్టే యిప్పటికి నాడుక భాషలో తిట్లుకొన్ని మిగిలాయి. కొన్నిరూపాలు అట్టేవున్నాయి. కోపంవచ్చినప్పుడు నీ ముఖంమండ, నీ కళ్లారిపోను, నీడీవంపడ, నీతలపగల, నిన్నుతగలెయ్య, నిన్నుకాల్చెయ్య, నిన్నుపాతెయ్య లాంటిపదాలు తామసులు వాడుతారు. ఇప్పటికి అనాగరికులమాటలకు ముందువచ్చే పదములు యివే.

ఏ రాజ్యంలోను తలకుమించిన ఆజ్ఞ ఎప్పుడు లేదు. ఇప్పుడు మరణదండన మొదలు మందలింపుదాకా దండన లమిరాయి. దేశాంతరములకు పంపుటకలదు. ద్వీపాంతరవాసశిక్ష కలదు. రాజ్యంనుండి వెడలగొట్టడ వుంది. రాజకార్యములనుండి తొలగించడంమామూలు. పౌరుడు నేరంచేస్తే తనహక్కులను గోల్పోతాడు. న్యాయస్థానములలో సాక్షిగా రానీయకుండడం. భార్యాభర్తలహక్కులు రద్దుకావడం. విదేశములకు పోవుటకు సెలవు లేక పోవడం. ఇచ్ఛాక సర్వంగా కర్మ జరుగనీయకపోవడం. నేరగాని వారసులకు ఆస్తిచెందనీయకపోవడం. ఉన్న వుద్యోగం వూడడం. ఖైదీగా ఉంచడం. ఏకాంతవాసశిక్షకు లోనవడం. కొరడాదెబ్బలు కొట్టడం. ఆస్తిని లాక్కోడం. జుల్మానా విధించడం. గట్టిగా చీవాట్లు పెట్టి కరారుచేయడం. పోలీసుపహరాలో నుంచడం. బోధనశాలలలో బుద్ధి చెప్పడం. పిచ్చివారిని చికిత్సకు పంపడం. ఇంట్లోనే కట్టుబాటులో నుంచడం. దురలవాట్లు పోగొట్టడం. సన్మార్గానువర్తిగానుండుటకు ఒప్పందపడమనడం. విల్లు

1. Patria Potestas.

వ్రాయుటకు ఆటంకం కలగడం. తల్లిగాని, తండ్రిగాని నేరంచేస్తే వారికి పిల్లలమీద నుండే హక్కులు తొలగించడం. భర్త నేరాలు చేస్తే యింటియిల్లాలుమీద చెలాయించే హక్కులు పోవడం. పత్రికలలో నేరగాడు మన్ననకోరుకున్న విషయం ప్రకటించడం. ఓటింగు హక్కు లాక్కోడం. విశ్వవిద్యాలయాల్లో సంపాదించిన డిగ్రీలు పోవడం. ఉపకార వేతనాలు నిలిపివేయడం ఇవి క్రొత్త పద్ధతులు. నూతన శిక్షావిధానంతీ రిది.

* ఉరి శిక్ష

నేరం చేశాక శిక్షించాలి. కాని మరణదండన ఏ ఏ నేరములకు వాడవలెను? అసలు వాడవలయునా? అనెడి ప్రశ్నలు రెండు చిక్కు ప్రశ్నలు. మరణ దండన శిక్షలన్నిటిలోకి క్రూరమైనది. దానికి తిరుగులేదు. ప్రాణం తీశాక ప్రాణం పోయడం కష్టం. ఈ శిక్ష విధిస్తే నేరగాని ఆలుబిడ్డలకు తీరని నష్టం. రెక్కలాడవు. జీవనం గడువదు. వారికి నష్టపరిహారం ఏమియూ యుండదు. ప్రాణంతీయడం పాపం అన్నారు కొందరు పండితులు. ఈ శిక్షతో కక్షతీరుతుందని కొందరు అభిప్రాయపడ్డారు. ఈ దండన పూర్వంనుంచి వస్తోంది ఎందుకు తీసివేయడం అని ఒకరు, పూర్వాచారాలన్నీ యీ కాలంలో ఎగరగొట్టడం లేదా, ఆచారం కాలంతో బాటు మారాలని ఒకరు వివాద పడుతున్నారు. ఇంతకు ఏ ఆచారం ఎటున్నా ప్రాణం అంటే మానవుడికి రుచి కదా? మరణదండన విధించేవాడికి కష్టం, దగ్గరవుండి ప్రాణం తీసేవాడికి కష్టం, కర్మం చాలక చూచేవాడికి మరీ కష్టం. వేరు శిక్షలు బాగావిధిస్తే చాలు న్యాయ పరిపాలన కని బ్రిటిష్ న్యాయాధిపతు లన్నారు. లార్డుబక్ మాస్టరు[2] అను న్యాయమూర్తి యీ అభిప్రాయము తెలిపారు. ఈ దండన చూచేటందుకు ఉరిస్తంభం చుట్టు ప్రజలు గుమిగూడడం ఘోరమని ఒక పక్షం, కాదు తప్పుచేస్తే జరిగే తంతు తెలియజేసేటందుకు యిది మంచి పద్ధతని ఒకపక్షం వాదించుచున్నారు. ఫ్రాన్సులోను, స్పెయినులోను యీ దండన విధించినా గొప్పనేరాలు ఆగడం లేదని తీర్మానించారు. ఇంగ్లండులో ఎనిమిదో హెన్రీరాజుకాలంలో వేనకువేలు-సుమారు ౭౨,౦౦౦ మంది-మరణదండనకు పాత్రులైనారు. కాని ఘోరనేరము లడుగంటినవా? లేదు. వృద్ధియైనవట. మనుస్మృతిని మన పూర్వులు విరివిగా వాడలేదా? అందులో హత్యయను పదం మాయమైపోయిందా? లేదు. కాని రాజద్రోహుల యెడ యీ శిక్షను జర్మనీలోను, జపానులోను, ఇటలీలోను, రష్యాలోను వాడుచున్నారు. నాగరికతనుబట్టి, సంఘపోషణనుబట్టి ప్రజాభిప్రాయమునుబట్టి, అవసరమునుబట్టి యీ శిక్ష వాడబడుతోంది. లోకంలో అన్ని తావుల నేరము లొకతీరుగ నుండవు. నేరాధిక్యమును బట్టి మరణదండన విధిస్తున్నారు. చంపుతే మనిషి బాగుపడతాడా? బాగుపడినా యీ లోకాని కేం మెరుగు? చచ్చాక యిక బాగేమిటి? ఒక లేబాగు. ఆస్ట్రియాలో యీ మరణదండన లేదు. బెల్జియంలో లేదు. డెన్మార్కు యీ శిక్ష మానివేసింది. హాలండు తీసివేసింది. పోర్చుగల్ యీ శిక్ష వద్దంది. యునైటెడ్ స్టేట్సులో కొన్ని రాష్ట్రాలలో లేదు. మరణదండనతో మనిషి ఫైసలవుతాడు. దానివలన సంఘానికి వుపయోగమేమిటి? జ్వరం పోవడానికి రోగిని చంపుతాడా వైద్యుడు? ఏ నేరానికీ మరణదండన కూడదని ఇంగ్లండులో గొప్ప మతగురువు లన్నారు. ఆర్చిబిషప్ ఆఫ్ యార్కు పోయిన యేడాది యిదే సెలవిచ్చాడు.[3] జీవితంలో కీడు నేరాలు చేయడానికే పుట్టాననిపించేవారిని వురిస్తంభంమీదకి ఎక్కించడంలో తప్పు లేదన్నారు కొందరు న్యాయమార్గులు. రాజవంచకులకు మరణదండన మంచిదని యిప్పటి జర్మనీలోను, ఇటలీలోను దృఢాభిప్రాయం కలదు; రాజ్యానకు మొదటి హక్కు ఆత్మరక్షణ అని వారి వాదం. రష్యాలోను రాజ వంచకులకు మరణదండన రూఢి. మరణదండన వుండాలా, వద్దా అంటే దేశకాల పరిస్థితులను చూచి కనుక్కోవాలి. ప్రజాభిప్రాయాన్ని బట్టి కూడా తీర్మానించాలి.

* హింస - చిత్రవధ[4]

ఒకరు మరొకరి మనశ్శరీరములకు బాధకలిగించడం హింస; హింసలేని శిక్షణవిధానం లేదు. చచ్చేచావు

2. Lord Buckmaster, J. 3. Spectator పత్రికలో. 4. Torture.

కాకుండా, బ్రతికీ బ్రతుకుకాకుండా అమానుషంగా బాధించడం చిత్రహింస. నేరశిక్షణకే గాక నేరాంగీకారమునకు కూడ నేరగాడు హింసింపబడడం కొన్ని దేశాల్లో కలదు. యూరపియను రాజ్యములలో చిత్రహింస నేరాంగీకారమునకు వాడుదురు. మనశ్శరీరములకు బాధ కలిగించడానికి విధాలెన్నో గలవు. 'అశ్వత్థామా హతః' అనడం ఒక దారి; చేయి జేసుకోవడం మరొకదారి. యుద్ధాలు జరిగేటప్పుడు అహింస మాట ఎవరు తలపరు. అప్పుడు శిక్షలు కఠినముగా వుంటాయి. చిత్రహింసకు కారణము లేమి? క్రూరస్వభావం; కసి; నిర్దయ; వైరిఆనందం; ప్రాణికోటులయెడ నిరసన; మూఢవిశ్వాసములు; తామసగుణం - ఇవి. మహమ్మదీయ రాజ్య పాలనలో నుండెడిదట చిత్రహింస; యిప్పటికి జర్మనీ బోలు యూరపియను రాజ్యములలో కలదు. లోకమునకు హింస యన్న వెరవు. హింసించునపుడు ఒకవిధమైన మైమరుపు. అహింస యన్న తియ్యని తలపు. గ్రీకుదేశములోను, రోమకరాజ్యములోను, పురాతన కాలపు ఇంగ్లండులోను చిత్రహింసకుగాను సామగ్రి యుండెడిది. ఒక కాలమున నొకరాజ్యములో క్రమమని తలపబడినది వేరొక కాలమున వేరొక రాజ్యమున అక్రమముగ తోచును. ఈశతాబ్దమున చిత్రహింసకు బ్రిటిష్ రాజ్యాంగంలో నేర పరిశోధనలో గాని, న్యాయపరిపాలనలోనుగాని తావులేదు; యీశతాబ్దంలోనే మిగతా యూరపియను రాజ్యములలో చిత్రహింస సాధనాలు చేతులార వాడుచున్నారు.

* శిక్షలెందుకు?

'లోకాస్సమస్తాస్సుఖినో భవంతు' అనడానికి, పాపము శమించడానికే శిక్షలు. నేరములను నివారించుటకు, నేరగానిపై కసితీర్చుకొనుటకు, దుష్ప్రవర్తనకు నేరగానికి తగిన శాస్తిచేయుటకుగాను శిక్షలు. నేరాలు చేస్తే యీలాంటి శిక్ష మనకు పడుతుందనే భావం ప్రజలకు కలుగజేయడానికి. శాసన తిరస్కారముగా వించినందుకు రాజాగ్రహము తీరుటకుగాను శిక్షలు. నేరగాడు నొప్పించినవారికి నష్టపరిహారం యివ్వడానికి, ముఖ్యంగా పౌరులను రక్షించడానికి శిక్ష లేర్పడినవి. శిక్షలనేవి లేకుండావుంటే ఏరాజ్యంలోను బ్రతుకడం కష్టం. న్యాయపరిపాలనకు, సామ్రాజ్యవిధమునకు శిక్షలు. ప్రజాశాంతి నెలకొల్పుటకు శిక్షలు. నేరగాడు పశ్చాత్తాపంలో మునగడానికి దండనలు. నేరం చేయకుండా ప్రజలకు జంకుకలిగించడానికి శిక్షలు. శిక్షించడం పాలకుని విధి. శిక్ష జనకునికి జన్మహక్కు. శిక్ష తల్లిచేతితంత్రము. గురునిచేతి గారడీవిద్య. సంఘరక్షణకుగానే శిక్ష. ఎందుకేమన్నావురా పిల్లవాడాఅంటే పిల్లుండి మావాళ్ళు కొట్టుతారన్నాడట. ఇది శిక్షనుజా. దుష్కార్యములనుంచి దృష్టిమళ్ళించడానికి, సత్కార్యములయందు ఆసక్తికలిగించడానికి శిక్ష. శిక్ష నేరప్రతిబంధకమార్గము. అయితే తీవ్రాలోచనచేసి నేరంచేసే దుండగీడు శిక్షపడకుండా తప్పించుకోవడానికి జాగ్రత్తపడడా, పడలేడా? నేరగాడు ఏ శిక్షవున్నా భద్రపడతాడు. వాడిని కనుక్కొని మంచిదారిని పెట్టడం సంఘధర్మం. సంఘానికి కష్టనష్టాలు కలుగజేసేది నేరగాడు. నేరగాడు సాంఘికధర్మ విముఖుడుకదా! నేరంవున్నాక శిక్షలుండాలి. శిక్షతో రాజభక్తి పెంపొందుతుంది. ఎన్ని చెప్పినా పశ్చాత్తాపం పుట్టించని ప్రాయశ్చిత్తం నిరుపయోగం. హేత్వాభాసవాదులు 5 నేరగానిని బాగుచేయడానికి, నేరాలు లేకుండా పోవడానికి శిక్షించాలన్నారు. సోక్రటిజ్ 6 మహాశయుడు కట్టకడకు సన్మార్గానువర్తులు నీతిమంతులు కడతేరుటకే లోకంలో శిక్షలన్నాడు. ప్లేటో 7 శిక్ష దైవికాత్మకమన్నాడు. అరిస్టాటిల్ 8 శిక్షలు రెండువిధాల మంచివన్నాడు. నేరగానికి రోగచికిత్స జరపడానికి, నష్టపడినవారికి పరిహారం, సంతృప్తి కలిగించడానికి అన్నాడు. సుఖదుఃఖ సమభావులు 9 అంతా లోకంలో జరగవలసి జరుగుతోంది అన్నారు. శిక్షలనేవి అప్రధానవిషయములు, పనిలేకన్నారు. ఉదరపరాయణులు 10 శిక్షలు లోకంలో గొప్పదురదృష్టం అన్నారు. మార్క్స్

5. Sophists, 6. Socrates, 7. Plato, 8. Aristotle, 9. Stoics, 10. Epicureans.

అరెలియస్ 11 శిక్ష తప్పులను ఒప్పులుగా జేయుట కన్నాడు. శిక్ష అంటే దిద్దుబాటు అన్నాడు. హెయిరోక్లిస్ 12 న్యాయం అనేది నిలబడడానికే శిక్ష లన్నాడు. లెయిస్టినర్ 1 రాజాడంబరం కోసం శిక్ష లన్నాడు. గ్రోషియస్ 4 కసితో బయలుపడలింది కఠిన దండన అన్నాడు. హాబ్స్ 15 అనునాతడు రాజుగారు క్షైరకేయడం, బెదరించడం శిక్ష అన్నాడు. స్పినోజ 16 తెలిపిందేమిటంటే దేశాన్ని కాయడం కష్టం, కాపుదలకే నేరశిక్షణయని. పుఫెన్‌డార్ఫ్ 17 నేరగానికి శాస్తి జరుగుతుండే అదే శిక్ష అన్నాడు. లాక్ 18 అన్నదేమిటంటే శిక్షలు రాజ్యపోషణకని. లైబ్‌నిజ్ 19 నేరగానిని బాగుచేయుటకు, యితరులు నేరం చేయకుండుటకు శిక్షలన్నాడు. కొకుజి 20 దేవుడు లోకంలో పాపులను దండించడం లేదా, అలాగే రాజ్యంలో రాజుదండిస్తాడు నేరస్థులనన్నాడు. చెడ్డతనాన్ని తొలగించడానికే శిక్షలన్నాడు ఓల్ఫ్.21 రూసో 22 చెప్పిందేమిటంటే నేరగానిసమ్మతిమీదే శిక్ష వాడికి విధింపబడుతోంది, అతగాడు రాజ్యంలో వుండడానికి ఒప్పుకున్నాక శిక్షణరక్షణలకు కట్టుబడ్డట్టే అన్నాడు. బెకెరియా 23 చెప్పడం శిక్షలు పోషణకని. రాజ్యమున అధికసంఖ్యాకుల క్షేమమున కన్నాడు. ఫిలాంగరి24 శిక్షలు నేరనిర్మూలనకన్నాడు. సెర్వెయి25 ఆత్మరక్షణకే శిక్షలన్నాడు. వీలాండ 26 దుష్కృత మెప్పుడూ ఖండనార్హమన్నాడు. కాంట్27 ఏమన్నాడంటే నేరముచేస్తే పాలకపాలితుల కుండే కరారుకి భంగం, అందుచేత శిక్షించి నేరాలని రూపుమాపాలి అని. గ్రోల్‌మన్ 28 రాజునకు స్వయంగా ఖండించే హక్కుందన్నాడు. ఫూర్‌బాక్29 తెలిపిందేమిటంటే నేరము చేయకుండా నిర్బంధన రాజు చేయవలెనని. పరతుల నేర్పరచునది పాదుషా అన్నాడు. బెంథం30 శిక్షలు దేశక్షేమమునకు, ప్రజాశాంతికి అవసర మన్నాడు. రోమగ్నోజి31 శిక్షలు లేకుంటే బ్రతుకలేమన్నాడు. నేరగానిని మందలించడానికే శిక్షలన్నాడు బోర్32. నేరగాని ప్రవర్తన సరిజేయుటకు శిక్షలని గ్రాస్33 చెప్పాడు. క్రాజ్31 జ్ఞానోదయకారణం శిక్షలన్నాడు. ఓ దోషకృత్యం ఓ మూలచేస్తే పరిస్థితులు మారుతాయి; ఆ మారిన పరిస్థితులను చక్కజేయడానికి శిక్షలుండాలి. రోడెర్సు35 శిక్షలెందుకన్నాడంటే కొందరు ప్రజలకుండే దురుద్దేశములు తొలగించడానికని. రోజి36 న్యాయపరిపాలన కావాలంటే శిక్షించాలన్నాడు. శిక్షిస్తే నేరాలు రూపుమాస్తాయి. నేరగానికి మచ్చమాస్తుంది ముందు అన్నాడు. హెగెల్37 నేరమంటే మరేమీ లేదు. సన్మార్గ తిరస్కారం; సంఘధర్మనిరసన. ఈ తిరస్కార నిరసనలకు దివ్యౌషధం దండన అన్నాడు. డాబ్38 శిక్ష అనేది దయాస్వరూపం, లోకంలో చాలా లాభకారి అన్నాడు. హైన్‌జి39 శిక్ష నేరగానిని రాజును ముందు నేరుపరచి వెనుక వారిని కలిపివేసి ఐకమత్యమును కలిగించునన్నాడు. వాన్ కెర్చిమన్40 శిక్ష నీతిదాయకమన్నాడు. బైండింగ్41 శాసనాతిక్రమణకు విరుగుడు శిక్ష అన్నాడు. గరోఫాలో42 రాజపోషణకన్నాడు శిక్ష. ఇటుల ఎందరో పండితులు శిక్షనుగూర్చి అభిప్రాయము లిచ్చినారు.

లోకం శిక్షణక్రమాన్ని పూర్వం మార్చింది. అప్పుడప్పుడు మార్చుతోంది. ఇక ముందు మార్చగలదు. మన శిక్షణక్రమంలో భావి ప్రపంచపరిణామమును మదిసెంచి ఏమి క్రొత్తమార్పులు రావున్నవో చెప్పగలమా?

---

11. Marcus Aurelius. 12. Heirocles. 13. Laistener. 14. Hugo Grotius. 15. Hobbes. 16. Spinoza. 17. Pufendorf. 18 Locke. 19. Leibnitz. 20. Cocueji. 21. Wolff. 22. Rousseau. 23. Beccaria. 24. Filangieri. 25. Servii. 26. Weiland. 27. Kant. Fichte అనునాతని యభిప్రాయమిదే. 28. Grolmann. 29. Feurbach. Schopenhaur అనునాతని అభిప్రాయమిదే. 30. Bentham. 31. Romagnosi. 32 Bauer. 33. Gross. 34. Krause. 35. Roders. 36. Rossi. 37. Hegel. 38. Daub. 39 Heinze. 40. Von kerchmann. 41. Binding. 42. Garofalo.

# పెండ్లిముచ్చట

'కరుణకుమార'

౧

"ఏమండీ! సీత పెళ్లిసంగతి ఏమనుకొన్నారండీ? ఎన్నిసార్లు చెప్పినా నామాటలు చెవిని పెట్టనేపెట్టరుకదా" అని ఒకరోజు సాయంత్రం నాలుగుగంటలప్పుడు రంగమ్మ కూతురు సీతమ్మకు జడవేసి ముఖాన్న చుక్కబొట్టుపెట్టుతూ, వీధివసారాలో దస్త్రం ముందు పెట్టుకొని కరిణీకం లెఖ్ఖలు వ్రాసుకొంటూవున్న భర్త సీనయ్యతో అన్నది.

కళ్లకు అద్దాలు తగిలించుకొని డస్కు బల్లమీద అడంగల్లో సాగుబడి చెల్లువేసుకొంటూవున్న సీనయ్య భార్యమాటలు చెవిని పడంగనే ముఖం అటుతిప్పి, తల కొంచెం ముందుకు వంచి కంటి అద్దాలమీదుగా చూపు నిగిడ్చి భార్య రంగమ్మవైపూ, కూతురు సీతమ్మవైపూ చూచి చిరునవ్వు నవ్వి "ఏమనుకోవడ మేమిటి? ఈయేడు మా చిట్టితల్లికి తప్పకుండా పెళ్లిచేసితీరాలె" అంటూ "నీ కెట్లాంటి మొగుడు కావాలెనే సీతా!" అని ముద్దుకూతుర్ని ప్రశ్నించాడు. "ఊఁ" అని సాగదీసుకొంటూ సిగ్గుతో తల వంచి తల్లిచేతుల్లోనుండి విడిపించుకొని పంజరంలోనుండి బయటపడ్డ చిలకలాగ తుర్రున పారిపోయింది సీత.

"పిల్లకు పదకొండోయేడు వచ్చిందండీ! ఇక ఇట్లాఉంచడానికి వీల్లేదండీ!" అని భార్య మళ్లా ఆ ప్రస్తావనే చేసింది.

"అవును. ఏదో సంబంధం చూచి ముడి పెట్టితేనేకాని వీల్లేదు" అంటూ సీనయ్య తనపనిధోరణిలో పడ్డాడు.

సీనయ్య నియోగుల్లో పుట్టవలసినవాడుకాడు. పేరుకు కరిణీకం చేస్తున్నాడన్నమాటేకాని ఆ చేయడంలో అందమూలేదు, చందమూలేదు. మనిషి భయస్థుడు. అధికార్లంటే హడలిపోతూవుంటాడు; కాని అభిమానధనుడు. నిదానం తక్కువ; ఖంగారెక్కువ. అయినా యింతవరకూ ఎవ్వరిచేతనూ రవ్వంతమాటయినా పడలేదు; ఆయన వయస్సు అరవై సంవత్సరాలు.

సీనయ్యకు ఒకకొడుకూ, ఇద్దరుకూతుళ్లూను. కొడుకు మూడోఫారం ఫేలయి సోదాభాయీలతోచేరి చదువుకోక ఇంటి దగ్గరనే ఉంటున్నాడు. ఎప్పుడయినా బుద్ధితిరిగినపుడుమాత్రం తండ్రికింత కరిణీకం లెఖ్ఖలు వ్రాసిపెట్టుతూ ఉంటాడు.

సీనయ్యపంతులు పెద్దకూతుర్ని మేనరిక మిచ్చి వివాహంచేసి ఆపిల్లను ఈమధ్యనే సంసారానికి పంపివేశాడు. ఇక రెండోపిల్ల

సీతపెళ్లి ఒకటీ, కొడుకుపెళ్లి ఒకటీ తర వాయిగా ఉన్నవి. కొడుక్కి ఇరవై యేళ్లు ఉన్నా మొగవాడికి తొందరలేదులే అనుకొని, ముందు పెళ్లి ఈడుకు వచ్చిన సీత పెళ్లి చేయాలని నిశ్చయపరుచుకొన్నాడు.

అమర్చిపెట్టినట్లు పెద్దకూతురికి మేనరికం సిద్ధంగా ఉండినందున సంబంధాలకోసరం వెతుక్కోవలసిన అవసరంగాని, ఆ వెతుక్కోవడంలో గల కష్టంగాని అతనికి తెలియకుండాపోయింది.

పెళ్లిమాటలు తలపెట్టంగనే ఆయనకూతురుపెళ్లి ఆ సంవత్సరంమూఢమివెళ్లినతరువాత మాఘమాసంలో చేద్దామనుకొన్నాడు కాని తీరావివాహప్రయత్నంచేయబోగాఅతనికి దారీతెన్నూ గోచరించలేదు.వరుణ్ని నిశ్చయపర్చుకోవడంలో అతనిమనస్సుకి తెగింపు కలగలేదు. బాగా చదువుకొన్నవాణ్నీ, వెనక ఇంత ఆస్తిపాస్తులుగలవాణ్నీ తీసుకురావాలని భార్య రంగమ్మ కోరిక. కాని చదువూ ఆస్తీకూడా వుంటే లంచాలుపోయాలన్న భయంచేత అంతపెద్దచదువూ, పెద్ద ఆస్తీ లేకపోయినా ఒకమోస్తరుగా ఏదో థర్డుఫారం అయినా ప్యాసయి, సాలుకు రెండుపుట్లు ధాన్యంవచ్చేభూజీవనంగలిగి, ఏసాహుకారు గుమాస్తాగానో నెలకు పైఖర్చుకు పదిరూపాయలు తెచ్చుకోగలపిల్లవాడు దొరకితే, కాళ్లు కడిగి కన్యాదానం చేసుకొందామని కొద్దిలో మట్టగించుకొని ఉన్నాడు సీనయ్య.

కాని ఎంతదేశం తిరిగినా అట్లాంటిపిల్లవాడుకూడా అతగాడికి దొరకలేదు.తిరిగాడు తిరిగాడు అరికాళ్ల అరిగిపొయ్యేటట్టు తిరిగిన పల్లె తిరగకుండా తిరిగాడు. అక్కడక్కడ ఒకటి రెండు సంబంధాలు మంచివే తటస్థపడినవి కాని చదువుంటే ఆస్తీ, ఆస్తి వుంటే సంపాదనా, సంపాదనవుంటే చదువూ- ఇట్లా ఏదో ఒకటి కొరవపడి అతనిమనస్సుకు నచ్చకుండావచ్చినవి.

రోజులు గడచినకొద్దీ అతనికి పెళ్లిబెంగచేత మతిస్థిరం చెడుతూవచ్చింది. ఎన్నాళ్లు తిరిగినా, ఏసంబంధాన్నీ నిశ్చయపరుచుకోలేకపోయాడు. ఇక రెండునెలల్లో పెళ్లిచేయకపోతే పెద్దమనిషయ్యేటట్టుగా వుంది పిల్ల. పోనీ అందుకయినా సిద్ధమవుదామనుకొంటే ఇక మన్నాటినుండీ ఈ పల్లెకొంపల్లో తద్దినాలకు బ్రాహ్మణులు రారేమో అని అతనికి భయం ఒంటరిగాడు. గ్రామంలో అతనికి రెండో సహాయం లేదు. ఏమీ పాలుపోకుండా వుందతనికి. విస్తరిముందు కూర్చుంటే నోటికి అన్నమూ, నీళ్లూ పోవడం లేదు. రాత్రిళ్లు కంటికి నిద్రపట్టడంలేదు. మనిషికి రాను రాను పిచ్చిధోరణీ, పిచ్చివాలకమూ పడుతున్నది.

భర్తవైఖరి చూస్తే రంగమ్మకు కూడా దిగులు ఆరంభించింది.

౨

ఒకరోజు సాయంత్రం సీనయ్యాయింటికి వాళ్లఫిర్కా రెవిన్యూ ఇన్స్పెక్టరు ముసాఫరు

వచ్చాడు. ఆయనకూడా ఆర్వేలవాడే. పని పాటలన్నీ భయభక్తులతో చేసుకుపొయ్యే సీనయ్యను చూస్తే ఆ ఇన్స్పెక్టరుకు అభిమానం. అదిగాక తనకంటె వయస్సులోనూ, అనుభవంలోనూ పెద్దవాడయినందున సీనయ్యంటే ఆయన కొకవిధమైన గౌరవం కూడాను.

రాత్రి భోజనాలకు కూర్చున్న సమయంలో తన కష్టసుఖాలన్నీ ఇన్స్పెక్టరు పంతులుతో మొరపెట్టుకొంటూ సీతపెళ్లి విషయమై తాను పడుతూవున్న అవస్థంతా ఆయనవద్ద వెళ్లబోసుకొన్నాడు.

"నాభార్యకు పినతండ్రికొడుకు కొకడున్నాడు. వాడికి మీఅమ్మాయి నిస్తారా?" అని భోజనం అవుతూండగానే ఇన్స్పెక్టరు పంతులు సీనయ్య నడిగాడు

ఇన్స్పెక్టరుగారు యోగ్యులనీ, సాటి నియోగు లనీ, వారిది మంచిసంప్రదాయమనీ సీనయ్యకుకూడా ఆయనంటే ఎంతో గౌరవమూ, భయమూ, భక్తీని. తన కధికారిగా వచ్చిన ఇన్స్పెక్టరుగారితో సంబంధం చేయడమంటే సీనయ్యకు బ్రహ్మానందమయిపోయింది.

వీధి అరుగు మీద మంచం మీద కూర్చుని తాంబూలం వేసుకొంటూ వున్న ఇన్స్పెక్టరువద్దకు పోయి "అయ్యా! ఈపిల్ల మీపిల్లకాని మాపిల్లకాదు. తమ యిష్టప్రకారం ఖాయపర్చండి; తమచేతుల్లో ఉంచుతున్నాను మాసీతమ్మను. ఏంచేసినా తమదే భారం" అని సీనయ్య ఆయనగారి రెండు చేతులూ పట్టుకొని "ఇవి చేతులు కావు కాళ్లనుకోండి" అని బారుమని కన్నీళ్లు నింపాడు.

ఇన్స్పెక్టరుకు జాలివేసింది.

"పెళ్లికొడుకుది అంతగొప్పస్థితి కాదు. హైయరుగ్రేడు ట్రెయినింగు అయి స్వగ్రామంలోనే గ్రాంటుస్కూలు పెట్టుకొని బడి చెప్పుకొంటున్నాడు. సాలుకు నూటఏభయి రూపాయలు గ్రాంటు వస్తుంది. మూడెకరాల మాగాణి ఉన్నది. ముప్పందుంగింజలు మక్తా వస్తుంది. ఇల్లు ఉన్నది: తల్లి ఉన్నది గాని తండ్రిలేడు. అన్న ఒక్కడున్నాడుకాని అతగాడు వేరుపడి ప్రత్యేకంగా సంసారంచేసుకొంటున్నాడు. పిల్లవాడిపేరు రామారావు. బుద్ధిమంతుడు. వయస్సు ఇరవైయేళ్లు. మీ కిష్టమేనా?" అని ఇన్స్పెక్టరు సీనయ్యను అడిగాడు.

కొంచెంసేపు సీనయ్యా, రంగమ్మా లోపలికిపోయి గుసగుసలాడుకొని బయటికి వచ్చి "ఇంతకంటె మంచిసంబంధం తేగలమా యేమిటి మేము? అవశ్యం కానివ్వండి" అని సీనయ్యా, రంగమ్మాకూడా తథాస్తంటే తథాస్తన్నారు.

ఆ మర్నాడే ఇన్స్పెక్టరూ, సీనయ్యా కలిసి వరుని గ్రామానికి పోయి పిల్లవాణ్ని చూచుకొన్నారు. రామారావు సీనయ్య

కంటికి నదరుగా అగుపడ్డాడు. సరేనంటే సరేననుకొని తాంబూలాలు తీసుకొన్నారు. వస్తువులకుగాను పెళ్లికూతురికి రు. ౮౦౦ లు పెళ్లికొడుకువారు ముట్టచెప్పేటట్టు నిర్ణయమయింది. ఇందుకు సీనయ్యకంటెనూ అతని భార్య అపరిమితానందం పొందిపోయింది. ఫాల్గుణశుద్ధదశమి॥ మంగళవారండుదయం ఏడుగంటలకు కర్కాటకలగ్నానికి ముహూర్తనిశ్చయం చేసుకొన్నారు.

3

ఇన్‌స్పెక్టరుగారు తనమీద అనుగ్రహించి తీసుకువచ్చిన మనువయినందున సీనయ్య వివాహం కొంత గొప్పగా చేయాలనుకొన్నాడు. అదికాక, ఇక పెళ్లిచేయవలసిన ఆడపిల్లకాయలు లేనందున ఈపెళ్లి కొంచెం దర్జాగా చేస్తేనేకాని వీల్లేదని రంగమ్మ ఒత్తిడిచేసింది. పెళ్లిరోజుకుముందు సోమవారంనాటి సాయంత్రం అయిదున్నరగంటలకు రెండు స్పెషల్‌బస్సులు వేసుకొని మొగా, ఆడా కలిసి అంతా ఏభయి, అరవైమందివస్తారని పెళ్లివారు ముందుగా తెలియపరిచారు. పెళ్లికి కావలసిన సమస్తమైన వస్తువులూ తెచ్చి సిద్ధపరిచి అన్నియేర్పాటులూ చేశాడు సీనయ్యపంతులు. సోమవారంనాడు సాయంత్రం ఆరున్నరగంటలకు ఎదుర్కోలూ, వరలక్ష్మీపూజానూ, పెళ్లివారికి ప్రత్యేకం విడిది యేర్పాటుచేసి, ఎదుర్కోలు జరపడానికి గ్రామచావడిదగ్గర చిమ్మించి శుభ్రపరిచి సర్వమూ సిద్ధంచేశారు.

ఆడపెళ్లివారి తరఫున రావలసినబంధువులు నలభై, ఏభయిమంది వచ్చారు. మొగపెళ్లివారి తరఫున రెవిన్యూ ఇన్స్పెక్టరూ, ఆయనభార్యా, పిల్లవాడూ మాత్రమే వచ్చారు. అయితే వీరు వారికీవీరికీకూడా సంబంధించినవారే. అందువల్ల ముందుగావచ్చి పెళ్లిసన్నాహంలో సీనయ్యగారికి సహాయపడుతూవున్నారు. ఎదుర్కోలునాటిరాత్రి గ్రామంలోని బ్రాహ్మణ్యాన్నందరినీ - ఆడవాళ్లనూ, మొగవాళ్లనూ - భోజనాలకు పిలిచి, గ్రామస్థులకూ, పెళ్లివారికీ కలిపి అంతా రెండు మూడు వందలమందికి వంటప్రయత్నం చేశారు. సాయంత్రం అయిదుగంటలు కాగానే, పెళ్లివారు వచ్చేసమయమయిందని ఎదుర్కోవడానికి గ్రామచావడిదగ్గర చాపలు వేయించి సన్నాయిమేళంతోసహా సీనయ్యా, రెవిన్యూ ఇన్స్పెక్టరుపంతులూ తయారుగా వున్నారు.

సాయంత్రం ఆరయింది. ఆరున్నర అయింది. ఏడయింది. ఏడున్నరఅయింది. గ్యాసులైట్లు వెలిగించారు. పెళ్లివారు రాలేదు. అయిదుగంటలకే వస్తామని చెప్పిపంపిన పెళ్లివారు రాత్రి దీపాలుపెట్టినతరువాతకూడా రాకపోవడంచూచి సీనయ్యకు మనస్సులో కొంతఖంగారు పుట్టుకువచ్చింది. కాని ఇన్స్పెక్టరుపంతులంత పెద్దమనిషి స్వయంగా కుదిర్చిన సంబంధం కాబట్టి రాకుండా మోసంచేస్తారా అని మొదట మొదటలో తనలోతానే సరిపెట్టుకొంటూ

వచ్చారు. కాని యెనిమిది, యెనిమిదిన్నర, తొమ్మిదిగంటలయ్యేవరకు నిట్టూర్పు లధికమైనవి. అసలే ఖంగారుమనిషి. అందులో ఇంతప్రయత్నంచేసి బంధువులు యావన్మందీ వచ్చి, రెండు మూడు వందలమందికి వంటలు చేయించి — ఇంతవరకూ వచ్చినతరువాత కూడా పెళ్లివారు రాకుంటే ఆయన కెట్లా ఉంటుంది? పెళ్లివారు రాకపోవడానికి కారణ మేమిటో ఎవ్వరికీ అర్థంకావడంలేదు.

"ఏమండీ పంతులూ! మనవాళ్లు ఇంకా రాలేదే" అని సీనయ్య ఇన్స్పెక్టరును ఒకటి రెండుసార్లు ప్రశ్నించాడు. "వస్తారు లెండి. తప్పకవస్తారు. ఏదో అనివార్యం జరిగిఉంటుంది. అయినా తప్పకుండా వస్తారు" అని ఆయన చెప్పిన సమాధానం ఆరంభంలో కొంత తృప్తికరంగానే వుండినప్పటికీ రాత్రి తొమ్మిదిన్నర అయిన తరువాతకూడా పెళ్లివారు రాకపొయ్యేవరకు సీనయ్యకు గుండెల్లో రాయిపడింది.

"ఏమి పంతులూ! ఈ పెద్దమనుష్యులు మాగొంతుకు కోయరుకదా?" అని సీనయ్య ఇన్స్పెక్టరును మళ్లా తొందరచేశాడు. కాని యేమి చెప్పడానికీ ఆయనకు తోచడంలేదు. ఆయనకుకూడా ఖంగారుపుట్టింది. ఏమి సమాధానం చెప్పగలడు? అట్టే ఆలోచించాడు. "రాకపోవడానికి నాకేమీ కారణం కనబడదు. దారిలోమోటా రేదో చెడివుండాలి. ఏకారణాన్నయినా వాళ్లురాకపోవడమేతటస్థిస్తే వాళ్లునాకయినావర్తమానంపంపేవుందురు: లేదా జాబున్నాసేవారు. ఈ పెండ్లి యిష్టంలేకపోవడమూ, పెండ్లికి రాకపోవడమూ కాదు. ఏదో అనివార్యం జరిగివుండాలె అని తోస్తుంది" అని సమాధానంచెప్పాడు.

చేసినవంటలన్నీ చేసినట్టే ఉన్నవి. యావత్తుపదార్థమూ చప్పగా చల్లారి పోతోంది. రాత్రి పదిగంటలు దాటింది. ఎవ్వరికీ భోజనాలు లేవు. పెండ్లివారు రాలేదన్న దిగులుతో పసిపిల్లల తల్లులు బిడ్డలకు అన్నాలయినా పెట్టడం మరచి నిద్రపోయారు. రాత్రి భోజనానికి పిలిచిన బ్రాహ్మణ్యం ఇంకా రెండోతడవ పిలుపురాలేదేమా అని ఇంటి కాడ వంటలయినా చేసుకోని కారణంచేత తేపతేపకూ వీధిలోకి వచ్చి పిలుపుకోసరం ఎదురుచూస్తూ ఉన్నారు. పెళ్లికూతురు ముఖమూ, రంగమ్మముఖమూ, పెళ్లివారిముఖములూ దిగులుచేత కళావిహీనములైనవి. మొగపెళ్లివారు రాలేదన్న కారణంచేత లైట్లు వెలిగించే సాహెబు నిద్రపోయినాడు. అందువల్ల కాంతితగ్గిపోయే గ్యాసులైట్లు తిరిగీ బాగుచేసే దిక్కు లేక ఆడపెళ్లివారి ముఖాలలాగే వెలవెలబోతూ ఉన్నవి. ఎంగిలి విస్తరాకులకోసరం ఎదురుచూచిచూచి విసిగిన యానాదులు అంటిపెట్టుకుపోయిన కడుపులతో బయట గోడలకింద దుమ్ములోనే పండుకొని గాఢనిద్రలో పడ్డారు.

రాత్రి పదకొండయ్యేవరకు ఇక రెండో పిలుపుతో అవసరం లేకుండగనే మనకరణం

గారేకదా అని గ్రామస్థులు మడిపంచెలూ, పట్టుబట్టలూ కట్టుకొని, చేత చెంబులు పట్టుకొని భోజనానికి తయారయారు. వచ్చిన వారికి ఆడపెళ్లివారు ఆదిగులుతోనే భోజనాలుపెట్టి పంపివేశారు.

రాత్రి పన్నెండుగంటలు దాటింది. మొగపెళ్లివారు రాలేదు. సీనయ్య మన లోకంలో లేడు. మొగపెళ్లివారు కావాలని మోసంచేశారని అతనికి గట్టినమ్మకం తట్టింది. ఇందులో ఇన్స్పెక్టరుపంతులుకూడా కొంత యేదో చేసేవుంటాడన్న అనుమానంకూడా కలిగింది. ఇంతప్రయత్నమూ జరిగి, ఇంత అప్రతిష్ఠా పాలయినతరువాత ఇక మళ్లా తనకూతురికి పెళ్లి అవుతుందా అని అతనికి పెద్దభయం పుట్టింది. అత డెప్పుడూ ఇట్లాంటి కార్యాలు స్వయంగా చేసినవాడు కాడు, చూచినప్పటికీని. ఈపిల్లపెళ్లి తలపెట్టింది లగాయతు అతనిమనస్సుకు అన్నీసంకటాలే ఏర్పడ్డవి. అసలు వరుణ్ణి నిశ్చయపరుచుకోవడానికే పదినెలలు పట్టింది. చివరకు ఆపెళ్లివైభవం ఇట్లా తెల్లవారింది. ఏంచేయగలడు? తానొక వందతిట్లు తిట్టుకొన్నాడు. భార్య నొక వంద తిట్టాడు. పెళ్లికూతురిని రెండువందలు తిట్టాడు. మోసం చేశారని పెళ్లివారిని ముందూ వెనకా చూడకుండా నోటికి వచ్చినట్లు బూతులు తిట్టడం ఆరంభించాడు. అధికారి కాబట్టి రెవిన్యూ ఇన్స్పెక్టరును నేరుగా పేరుపెట్టి తిట్టలేక, అన్యాపదేశంగా పెళ్లి మీదా యెలుకమీదా పెట్టి ఆయనగారికి కూడా కొన్ని వడ్డించాడు.

“ఇంతపని జరుగుతుందని ఎరక్కపోతినే; ఎంతలో ఇంతమందీ కలిసి నాగొంతుకు కోశారురా! ఇంక నాపిల్ల నెవరు చేసుకొంటారురా దేవుడా!” అని రెండుచేతులతోనూ నోరూ నెత్తీ లబ్బున మొత్తుకోవడం మొదలుపెట్టేడు. అతన్ని చూచి రంగమ్మ కళ్లనీళ్లు పెట్టుకొంటోంది. తలిదండ్రుల నిద్దరినీ చూచి పెళ్లికూతురు పిల్లివలె ఒక గోడ మూల నక్కి కూనిదీర్ఘం ఆరంభించింది.

“ఇట్లాంటి పోకిరీజట్టుతో సంబంధం చెయ్యడం మన దే బుద్ధితక్కువ” అని సీనయ్య కొడుకు ఉద్రేకంతో గంతులువేస్తున్నాడు.

ఈ గందరగోళం అంతా చూచేవరకు ఇన్స్పెక్టరుపంతులుకూ, ఆయనభార్యకూ నలుగురిలోనూ తలకొట్టివేసినట్లయింది. కాని ఏంచేయగలరు? తమమాట దక్కించనందుకు వారికి మొగపెళ్లివారిమీద ఆగ్రహం కలుగుతున్నది. ఇంట్లో పరవళ్లే తొక్కే సీనయ్యను చూస్తే సిగ్గవుతున్నది. ఆయన్ని ఓదార్చడానికయినా పంతులుకి ధైర్యం చాలలేదు. పెళ్లికివచ్చిన అమ్మలక్కలందరూ “సెబాస్! బాగా చేశారుకదూ!” అని అంకెళ్లు నొక్కుకొంటున్నారు. అంతమంది ఆడంగులలోనూ ఇన్స్పెక్టరుగారి భార్య తేలుకుట్టిన దొంగలా పలక్కుండా ఊరుకోవలసివచ్చింది.

పెళ్లివారిక రారంటే రారనీ, చేసినప్రయత్నమంతా వృథా అయిందనీ, ఊరందరిలోనూ సీనయ్య అప్రతిష్ఠ పాలుకావలసి వచ్చిందనీ నలుగురూ నానారకాలుగా మాటాడడం మొదలుపెట్టారు. అవన్నీ వింటూంటే సీనయ్యకు చెవిలో సీసం కాచి పోసినట్లయింది. ఇంత పరాభవం జరిగిన తరువాత తానిక బ్రతికి ప్రయోజనంలేదని అతనికి జీవితంమీద రోతకలిగింది. ఇక ఒక్క గడియకూడా జీవించి ఉండడం దుర్భరమనిపించింది. ఆ వేడిమీద కూర్చున్న మనిషి గభాలునలేచి ఉత్తరపుదొడ్లోవున్న భావిలో దూకి చచ్చిపోతానని అందరూ వినేటట్టు అరుస్తూ, ఒక్కగంతువేసి బావిదగ్గరకు పరుగుపెట్టాడు. చుట్టుప్రక్కల ఉన్నవాళ్లందరూ ఉలిక్కిపడి "అయ్యో! చస్తాడు కాబోలర్రా, పట్టుకోండర్రా" అని అతనివెంట పరుగెత్తి పదిమందీ అదిమిపట్టుకొని బలవంతాన్ని ఇంట్లోకి లాక్కువచ్చి, దక్షిణపు గదిలోకి త్రోసి తలుపు బయట బిగించారు.

ఇక తాను పలక్కుండా కూర్చోవడం బాగుండదని ఇన్స్పెక్టరుపంతులు ఆ సమయంలో గదితలుపు తెరుచుకొని సీనయ్య దగ్గరకు పోయి "తొందరపడవద్దు సీనయ్యా! మనవాళ్లు తెల్లవారేలోపల తప్పక వస్తారు. కాస్త తమాయించండి. మీ అమ్మాయి పెళ్లికేమీ భయంలేదు. ఇంకో కాస్సేపటికయినా రావాలి. మోటారేదో చెడిపోయి వుంటుందంతే. తొందరపడకు" అని చాలా దూరం మంచిమాటలు చెప్పి సీనయ్యను అనునయించాడు. కాని ప్రాణత్యాగం చేసుకోవడం తప్ప మరోగత్యంతరంలేదని స్థిరపరుచుకొన్న సీనయ్య ఆమాటలు చెవికెక్కలేదు సరికదా, పైగా ఒళ్లు చుర్రుమని "చాలు చాల్లేవయ్యా! మహాపెద్దమనిషివి! చూస్తూచూస్తూ నీచేతిలో ఇరుక్కున్నాను. తెగీతెగనికత్తితో నాగొంతుకోశావు. పైగా నీతులు చెప్పడానికి వచ్చావు" అని తనకు అధికారి అన్నగౌరవమైనా లేకుండా తీసి పారవేసి విదిలించి జవాబిచ్చాడు. దానితో ఆయనముఖం చిన్నబుచ్చుకొని బయటికి చక్కావచ్చాడు.

౪

రాత్రి ఒంటిగంటన్నర అయింది. పెళ్లివారు రాలేదు. సీనయ్య చీకటిగదిలోనే ఉన్నాడు. గదితలుపు బయట బిగించివుంది. అతడు ఏవిధంచేతనయినా ప్రాణం పోగొట్టుకోవాలని పెద్దప్రయత్నంమీదనే ఉన్నాడు. "చేసినప్రయత్నం బూడిదపాలయిపోవడమే కాకుండా ఇంత అప్రతిష్ఠపాలయినతరువాత ఇంకా పిల్లనెవరైనా చేసుకొంటారా? పాముకు గడవవలసినట్లు నూరేళ్లు గడవవలెనే ఈ బిడ్డజీవనం! పెళ్లికాని పిల్లని ఎన్నాళ్లని ఎదురొమ్ముమీద కుంపటిలా భరించడం? దానినిట్లా గొంతుకు కోసి ఇంకా బ్రతికివుండడం కంటెచావడంమేలు. ఈగుక్కెడుప్రాణంఎట్లా

పోతుందో పోతుంది. ఎప్పటికయినా పోవలసిన వాళ్లమేకదా! ఛీ! ఈయమబాధ నేను పడలేను. ఇంతటితోనయినా సునాయాసంగా పోగలిగితే ధన్యుణ్ణే" అని అతడు ప్రాణత్యాగం ఎట్లాగయినా చేసుకోవాలని నిశ్చయించుకొన్నాడు. గొంతుక్కు ఉరిపోసుకు చావాలని మెడకు గుడ్డ చుట్టి బిగించాలని చూశాడు. కాని ప్రాణంపోయేదాకా బిగించుకోగలనో లేనో అని అతనికి సందేహం కలిగింది. అదిగాక ఈ పనిలో ప్రాణికి చాలాబాధ కలుగుతుందని భయంవేసింది. ఏదయినా విషవస్తువు మింగి సునాయాసంగా ప్రాణం పోగొట్టుకోవడం మేలనిపించింది. కాని యెట్లా? గదంతా చీకటిగా వుంది. కన్నూ కన్నూ కనిపించడం లేదు. అతనికి తన కోర్కె నెరవేర్చుకోవడ మెట్లాగో తెలియడం లేదు. గన్నేరుపప్పు తింటే చస్తారన్న సంగతి ఆకస్మికంగా తట్టింది. ఇక్కడ గన్నేరు కాయ లెవ్వి? గన్నేరుచెట్లు దొడ్లో వున్నవి. బయటికిపోతే గన్నేరుకాయలు తెచ్చుకోవచ్చు. కాని బయట తలుపు బిగించివుంది. కూతురు సీతమ్మ తోటిపిల్లకాయలతో రోజూ ఆడుకొంటూవుండే గన్నేరుకాయలూ, చింతగింజలూ, గవ్వలూ వగైరాలు బుట్టలో వేసి ఆగదిలోనే గూటిలో దాచుకోవడం అతనికి తటాలున జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఆగూటికోసం వెదకులాడాడు. గూడూ, గూటిలో బుట్టా చేతికి తగిలినవి. సీనయ్య బుట్టలో చెయ్యిపెట్టాడు. బుట్టలో కాయలు చేతికి నున్నగా తగిలినవి. గుండెలు దడదడ కొట్టుకొన్నవి. ఈరభసం, ఈరొప్పూ తానుచూడకుండా వెళ్లిపోతే తరువాత వాళ్లతిప్పలువాళ్లు పడతారని సమాధానం చెప్పుకొన్నాడు. పిడికిలితో పిడికిలి కాయలు తీసుకొన్నాడు. ఎట్లో పగలగొట్టి పప్పు నోట్లో వేసుకొని హరహరా అంటూ కళ్లుమూసుకు నమిలి మింగేశాడు. వెంటనే మంచమెక్కి ముసుగు తన్ని భగవన్నామస్మరణ చేస్తూ ప్రాణాచారంపట్టి పండుకొన్నాడు.

సీనయ్య పప్పుతిని అరగంటయింది. ఈ సంగతి బయట ఎవ్వరికీ తెలియదు. అదివరదాకా అరచి అరచి గాభరాచేస్తూవున్న సీనయ్య అర్థగంటనుండీ చడీచప్పుడూ లేకుండా నిశ్శబ్దంగా ఉండడం చూచి అలసి నిద్రపోయాడు కాబోలునని బయటనున్న వాళ్లనుకొన్నారు. పెళ్లివారు రారని నిరాశ చేసుకొని విధి ఎట్లావుంటే అట్లాజరుగుతుం దని జనం యావన్మందీ నిద్రపోయారు. "నాకు లేనిపోని తద్దినం వచ్చి పడిందేమిరా భగవంతుడా" అని ఇన్స్పెక్టరుపంతులు గ్రామచావడిలోనే పక్కపరుచుకొని నడుం వాల్చాడు. విషం ఎప్పటికి పనిచేస్తుందో అని సీనయ్య నిమిషాలు లెక్కపెట్టుకొంటూ ఐహికాన్ని మరచి, ఆముష్మికంమీద దృష్టి వుంచి భగవన్నామం జపిస్తున్నాడు.

ఇంతలో వీధిలో 'బంయ్యో', 'బంయ్యో' మని మోటారుహార్ను చప్పుడయింది. పెళ్లి పందిట్లో పండుకొన్న యావన్మందీ ఉలిక్కి-

పడి లేచి బిలబిలలాడుతూ వీధిలోకి పేరంటే
శారు. రెండుమోటార్లు వచ్చి గ్రామచావడి
దగ్గర నిలచినవి. ఇన్‌స్పెక్టరుపంతులు పెళ్లి
పెళ్లివారిని విచారించగా పెళ్లికొడుకు అన్న
గారు వచ్చి ఆయన్ని ఓపక్కకు తీసుకువెళ్లి
"ఏంచేయమంటావు బావా! ఇక్కడికి తెమి
లివచ్చేవరకు తల్పప్రాణం తోకకు వచ్చింది"
అని పెళ్లికూతురికి పెళ్లిసమయంలో వస్తువు
లకుగాను ఇస్తామని ఒప్పుకొన్న రు.౮౦౦లు
సమయానికి దొరకక నానాఅవస్థా పడినట్టూ,
అదివరదాకా తప్పకుండా ఇస్తానని ఖరారు
చేసిన ఒకపెద్దమనిషి వాయిదాలు వేసి వేసి
చివరకు తొంటచెయ్యిచూపి మోనంచేసి
నట్టూ, అందువల్ల మరొకచోటా, మరొక
చోటా తిరిగి అడబ్బు సంపాదించుకు రావ
డంలో అనివార్యంగా ఒక పూటకుపూట
ఆలస్యమయినట్టూ కథంతా చెప్పాడు మెల్లిగా.
అదిన్నీగాక, తమమేనమామ- పెద్దవాడు-
బయలుదేరేవేళకు వస్తానని చెప్పికూడా
సరిగా ఆ సమయానికి రాక ఆలస్యంచేయ
డంవల్ల ఆయనకోసం గంగారం మనిషినిపంపి
పిలిపించడంలోకూడా కొంత ఆలస్యమయిం
దన్నాడు. "సరే, బాగానే వుంది కథ; కాని
యీ సంగతు లెవరికీ తెలియనీయకండి
ఇక్కడ. నేను చెపుతున్నాను మోటారు
చెడిపోయివుంటుందని. మీరుకూడా గమ్మున
వూరుకొని ఆలస్యమయిందని మాత్రమే
చెప్పండి, ఎవరైనా అడిగితేనే అదయినా"
అని సలహా చెప్పి ఇన్‌స్పెక్టరుపంతులు పెళ్లి
వారు వచ్చారని సీనయ్యకు కబురుచేశాడు.

రంగమ్మ వచ్చి గదితలుపు తెరిచి 'పెళ్లి
వారు వచ్చారటండీ!" అని చేత్తోతట్టి సీన
య్యను లేపింది. ఆమాటలు చెవినిపడేసరికి
చేస్తూవున్న భగవన్నామస్మరణ మరచి
"ఆఁ! వచ్చారూ!" అని లేచి కూర్చున్నాడు
సీనయ్య. కాని మంచం దిగలేకపోయాడు.
అప్పుడే నవనాళ్లూ లాక్కుపోతూ వున్నట్టుగా
వుం దతనికి. చావడమా బతకడమా అనే
సందిగ్ధావస్థలో పడ్డాడు సీనయ్య. లగ్నానికి
ముందుగానే అందుకొన్నారు పెళ్లివారు —
ఎంత ఆలస్యం చేసినాను. ఇక చావవలసిన
అవసర మేమిటి ?

"అయ్యో! దేవుడా! ఇదేందిరా బాబూ!
ఏంఖర్మం వచ్చిందిరా ఇప్పుడు. ఎరక్క
పోయి తిన్నాను పప్పు. విరుగు డుందో లేదో
దీనికి. చాలాసేపయింది తిని. అప్పుడే నవ
నాళ్లూ లాక్కుపోతున్నవి. ఏంబుద్ధి?....."
అనుకొంటూ కళ్లవెంబడి నీరు కుక్కుకొంటూ
ఏడుస్తూ మంచంమీదకూర్చున్నాడుసీనయ్య.

పెళ్లివారు వచ్చారనేసరికి ఇంటికి మళ్లా
కళవచ్చింది. గ్యాసులైట్లు వెలిగించారు.
"అమ్మయ్య! సీతమ్మ అదృష్టవంతురాల్రా"
అని ఒకరూ, "మోటారు దారిలో చెడిపో
యిందట, లేకపోతే సాయంత్రానికే రావల
సినవారటమ్మా" అని యింకొకరూ, "ఈసీన
య్యపంతులిది మొదటినుండీ ఒకటేఖులగాకు;

నిదానమా వల్లకాదా ? ఎంత అఘాయిత్యం చేశాడమ్మా!" అని మరొకరూ, "ఎంతటి వాళ్లకయినా ఇబ్బందులు రాకుండా ఉంటవా, కాస్త ఓపిక పట్టాలి కాని" అని వేరొకరూ—ఇట్లా ఎవరికితోచినట్లు వారంటున్నారు. బయట బయలుదేరిన ఉత్సాహం చూచేవరకు సీనయ్యకు బతికి మళ్లీ పెళ్లి కార్యం జరిపించాలని ఆశపుట్టింది.

"పెళ్లివారు వచ్చి అరగంటసేపయినప్పటికీ బయటికి రాడేం సీనయ్య? ఇంకా కోపమేనా యేమిటి? పోయి వియ్యాలవారిని పలకరించమని ఆయనతో చెప్పండమ్మా! బాగుండదు" అని కొందరమ్మలక్కలారంభించారు. ఈమాటలన్నీ సీనయ్య చెవిలో పడుతున్నవి. ఇంతలో సీనయ్యకొడుకు వచ్చి "నాన్నా! పెళ్లివారు వచ్చారు. నిన్ను గ్రామ చావడిదగ్గరకు పిలుచుకురమ్మన్నాడు ఇన్‌స్పెక్టరుపంతులు" అని తండ్రితో చెప్పాడు.

సీనయ్యకు దిక్కుతోచడంలేదు. తొందరగా పోయి వియ్యాలవారిని మర్యాద చేయాలని వుంది. కాని తిన్న విషంమూలాన్ని అసలు అంతదూరం పోగలనో లేనో అని అతనిభయం. కాళ్లూ, చేతులూ లాగడం ఎక్కువయిపోతోంది. పోనీ, బయటికి ఉన్న సంగతి చెప్పివేసి ఏ విరుగుడయినా తిందామనుకొంటే - పైకి చెప్పడానికి సిగ్గు. ఎదురుగా నిలబడ్డకొడుక్కు ఏసమాధానమూ చెప్పకుండానే సీనయ్య గొంతులోకి లోతుగా రెండువేళ్లూ పోనిచ్చి బలవంతంగా ఓక్కు, ఓక్కుమని డోక్కోవడం ఆరంభించాడు కాని పైత్యపు నీరేకాని పైకి పచ్చేమీ రాలేదు. క్రమంగా కడుపులో తిప్పుతున్నట్టూ, తల తిరుగుతున్నట్టూ, విషం గుండె కెగతన్నుతున్నట్టూ అయి అతని బాధవేదన జాస్తి అయింది. ఇక ఆలస్యం చేస్తే విష మెక్కుతుందని భయం. ఇప్పటికే వొళ్లు కంపరం పుట్టింది. బయటికి చెప్పక విధిలేక తెగించి సీనయ్య కొడుకును దగ్గఱకుతీసి కౌగలించుకొని "నన్ను బతికించరానాయనా! ఏవైద్యున్నయినా తొందరగా పిలిపించరా! నాప్రాణం కాపాడరా బాబూ!" అని బారుమని ఒక్కయేడుపు ఏడ్చాడు. కొడుక్కు ఇదేమీ అర్థంకాలేదు.

"ఏందే ? ఈ యేడుపు నాన్నా! పెళ్లివారు వచ్చారే.- ఇక భయంలేదు. ఉదయం ముహూర్తానికి పెళ్లిజరుగుతుందిలేవే- నాన్న ఇదేమిటిదే- అమ్మా! అమ్మా! ఇట్లారా! ఇట్లా అంటున్నాడు ఇదేందే" అని అతడు తల్లిని పిలిచాడు. రంగమ్మ పరుగునవచ్చి ఏమిటేమిటి సంగతని అడిగింది.

"అయ్యో! ఇక నేను బతకనే- సావు సమీపించిందర్రో! చద్దామని గన్నేరు పప్పు తిన్నానర్రో! చాలాసేపయిందర్రో! పిల్లపెళ్లి చేసుకు మరీ చస్తానర్రో! నన్ను బతికించండర్రో! బుద్ధితక్కువై తిన్నానర్రో!" అని సీనయ్య వెర్రికేకలుపెట్టి మంచంమీద పడి కాళ్లూచేతులూ గిల గిల తన్నుకోవడ మారంభించాడు. విషయమంతా వెల్లడయింది.

ఈ సంగతి తెలిసి రంగమ్మ రెండుచేతులతోనూ గుండెలు బాదుకొని "గన్నేరుపప్పే-మింగడమే- అయ్యబాబో!- ఇంకేముందిరా నాయనా! కొంపమునిగిందిరా తండ్రీ! ఇదేం ఖర్మంరా దేవుడా!- ఆయన్ని బతికించే ఉపాయం చూడరా కొడకా!" అని గొల్లుమనింది. ఆ రొదతో బంధువులందరూ మూగారు. నిమిషంలో సంగతంతా గ్రామంలో పాక్కిపోయింది. "సీనయ్య విషం తిని చచ్చా"డని కొందరూ, "చచ్చిపోతున్నా"డని కొందరూ, "ఇంకా చావలేదు. చస్తా"డని కొందరూ- ఇట్లా ఊరంతా గగ్గోలు పుట్టింది. "రామరామా" అనేవారూ, "శివశివా" అనేవారూను. ప్రతీవాళ్లూ చేలాంతరు తీసుకొని కడసారిచూపు చూచి పోదామని జనం వస్తున్నారు.

సీనయ్య రెండుచేతులతోనూ కడుపు పిసుక్కొంటున్నాడు; ఆయాసపడుతున్నాడు; డొక్క ఎగరేస్తున్నాడు; మంచంమీద ఈపక్కకూ ఆ పక్కకూ దొర్లుతున్నాడు. కాళ్లూ చేతులూ మంచాన్ని వేసి కొట్టుకొంటున్నాడు. దాహం దాహం అంటూవుంటే మధ్యమధ్య సీనయ్యకు కాసినన్ని నీళ్లు పోసి నాలుకతడుపుతున్నారు. "నాగతి ఏంచేసి పోతున్నావయ్యా" అని రంగమ్మ భర్తమీద పడి మొత్తుకొంటోంది. ఇంటిల్లిపాదీ, పిన్నా పెద్దా గోల ఆరంభించారు. సీనయ్య వంటిమీద చెయ్యివేసిచూడగా రంగమ్మచేతికి చల్లగా తగిలినట్లయింది. "ఇంకేముంది? అయ్యబాబో, ముంచుకువచ్చిందర్రో" అని వెర్రికేక పెట్టింది. జనంలో గందరగోళం ఎక్కువయింది.

ఈ సంగతంతా మొగపెళ్లివారికి తెలిసింది. అప్పటికి తొలికోడికూసి రెండుగడియలయింది. గ్రామం అశేషజనానికీ రాత్రితెల్లవార్లూ నిద్రలేదు. ఇన్స్పెక్టరు పంతులూ, మగపెళ్లివారిలో కొంతమందీ సీనయ్యను చూడడానికి వచ్చారు. ఎటుపోయి ఎటువస్తుందో అని పెళ్లికొడుకును కూడా రావద్దన్నారు. ఇన్స్పెక్టరుపంతులు వచ్చి సీనయ్యను చేత్తో తాకి పరీక్షించి "ఏమీ విపరీతమయిన గుణాలు లేవే?" అన్నాడు. కాని ఆయన మాటల్లో ఎవ్వరికీ నమ్మకం లేకపోయింది. ఇంతలో నారాయణసింగుకు వర్తమానం వెళ్లింది.

*

నారాయణసింగు ఇదివరలో సర్కారులో కంపౌండరు నౌకరీచేసి రిటైరయి ఆ గ్రామంలో కాస్తోకూస్తో ప్రైవేటుగా వైద్యం చేస్తున్నాడు. చిరకాలాన్నుంచి గడించినఅనుభవంచేత అతనిమందులు కొందరికి పనిచేస్తున్నవి. కొందరికి పనిచేయటంలేదు. అయినా ఇంజక్షను వైద్యంలో గట్టివాడని ఆ చుట్టుపక్కల అతనికెట్లాగో పేరువచ్చింది. సీనయ్య కొడుకు పిలుపుమీద స్టెతాస్కోపు తీసుకొని నారాయణసింగు చక్కావచ్చాడు. విషయం అంతా విన్నాడు. గన్నేరుకాయలు పగులగొట్టి పప్పు తిన్నాడనని రోగి తానే

స్వయంగా ఒప్పుకొంటున్నాడుకాబట్టి కడుపులోకి విషం పోయినసంగతి అనుమానమేమీలేదని స్థిరపరచుకొన్నాడు నారాయణసింగు. గుండెలు పరీక్షించాడు. కళ్లూ నాలుకా చూశాడు. తిన్నపప్పు జీర్ణమై ఈపాటికి విషం రక్తంలోకెక్కివుంటుందనీ, ఇప్పుడిక విషం విరుగుడునిమిత్తం డోకు మందులిచ్చి ఉపయోగంలేదనీ, ఇంజక్షను ఒక్కటే ఇప్పుడు చేయవలసిన చికిత్స అనీ చెప్పాడు. ఇంజక్షనుకు పదిహేనురూపాయలవుతుందనీ, అప్పటికి ఒకమందు అక్కడికి ఆరుమైళ్లదూరానవున్న పట్నంనుంచి తెప్పించవలసి ఉంటుందనీ సింగు ఖచ్చితంగా తెలిపాడు. ఇది అంతా వినేవరకు ఇంజక్షను ఇచ్చేవరకు చాలా ఆలస్యమయ్యేటట్టు ఉన్నదని తలచి "తెల్లవారినతరువాత ఆలోచిస్తాం లెండి" అని చెప్పి ఆ నారాయణసింగును పంపివేశారు.

ఆగ్రామంలో కంసాలి భద్రయ్యా గొప్ప నాటువైద్యుడని పేరు. అతన్ని పిలిపిస్తే ప్రస్తుతం తాత్కాలికంగా ఏదో చిట్కా వైద్యం చేస్తాడని ఎవరో అన్నారు. వెంటనే అతనికోసం మనిషి పరుగెత్తాడు. భద్రయ్య తన మందులసంచి తీసుకొని వచ్చి సీనయ్య నాడి చూశాడు. కడుపు నొక్కాడు. కళ్లు చూశాడు—పెదవి విరిచాడు. లాభం లేదన్నాడు. సూర్యోదయం అయి పైత్యపు ఎండ ఎక్కిందంటే ఇక మనిషి మీకు దక్కడన్నాడు. సీనయ్యకు మూలు గెక్కువయింది. దాహం అంతకన్న ఎక్కువయింది. తాపం హెచ్చిపోతోంది. ఒగర్పు అధికమయింది. సీనయ్యకు దొర్లాట హెచ్చింది. "ఈమనిషిని బ్రతికించడానికి నావల్లకా" దంటూ కంసాలి భద్రయ్య తనసంచి తీసుకొని వచ్చిన దారినే వెళ్లిపోయాడు. ఇంటిల్లిపాదీ గొల్లుమన్నారు.

తెల్లవారుతోంది. తూర్పురేఖలు కనబడుతున్నవి. ఉదయం అయిదున్నరదాటింది. సీనయ్య యింటిదగ్గర రోదనశబ్దం మిన్ను ముట్టింది. సూర్యోదయం అయిన తరువాత ఇక ఘటం నిలవదని భద్రయ్య చెప్పాడు. సూర్యోదయం ఎప్పుడవుతుందో, ప్రాణం ఎప్పుడు పోతుందో అని చూస్తున్నారు అంతాను. ఆగదిలోనే కింద గడ్డిపరిచి సీనయ్యను భూశయనం చేశారు. మా మా టేం చెప్పావంటే మామాటేంచెప్పావని సీనయ్యచుట్టూ మూగారు బంధువులు. సీనయ్య తెలివిగానే వున్నాడింకా! కాని వెర్రిచూపులు చూస్తున్నాడు. వొళ్లంతా తెగచెమటలు పోస్తున్నవి. ఆరాటం ఇంకా హెచ్చవుతోంది.

ఇన్స్పెక్టరుపంతులూ, మొగపెళ్లివారూ సంప్రతించుకొని ఇక ఈ పరిస్థితుల్లో పెళ్లి సంగతి ప్రస్తావనచేయడం బాగుండదని, తరువాత సంగతి చూచుకోవచ్చునని అప్పటికి పెళ్లివారందరూ ఎవ్వరితోనూ చెప్పకుండా స్వగ్రామానికి చక్కాపోయారు. "ఇంత వెర్రి వెంగళప్ప సీనయ్యకూతురిని తానిక పెళ్లిచే

సుకో"నని పెళ్లికొడుకుమాత్రం ఏమేమో శాబ్దీలుతీసి మరీ వెళ్లిపోయాడు. భార్యనూ, పిల్లవాణ్ని ఇంటికిపంపి వేసి ఇన్‌స్పెక్టరుపంతులు మాత్రం తాను సీనయ్యఇంటివద్దనే నిలిచి పోయాడు. 'శుభం తలిస్తే ఇట్లావచ్చిందేమిటిరా' అని విచారించాడు ఇన్‌స్పెక్టరు పంతులు.

౬

అప్పుడే సూర్యోదయమయి బారెడు పొద్దెక్కింది. కాని సీనయ్య కింకా ప్రాణంపోలేదు. ఏడుస్తున్నవారు కొందరూ, ఓదారుస్తున్నవారు కొందరూను

అంతకుముందు రెండురోజులక్రిందట ఆ ప్రక్కగ్రామానికి ఇద్దరు అత్తరుసాహేబులు వచ్చి అత్తర్లమ్ముకొంటున్నారు. ఉదయాన్నే ఆగ్రామాన్నుండి బయలుదేరి కరణంగారింట పెళ్లి అని విని అత్తరేమైనా ఖర్చవుతుందేమో అని పందిరిని ఆనవాలు కట్టి కరణంగారిఇంటికి వచ్చారు. అక్కడ పెళ్లీ లేదు: ఏమీ లేదు. ఏడుపులూ పెడబొబ్బలూను. కరణంగారికుటుంబం అంతా మహాసముద్రంలో మునిగివుంది. ఇక గంటకో అరగంటకో సీనయ్యప్రాణం పోతుందని నిరాశచేసుకొని దుఃఖసాగరంలో మునిగి వున్నారు అంతాను.

ఆ యిద్దరుసాహేబులలో ఒకనికి కొంచెం యూనానీవైద్యం తెలుసును. అతడు జబ్బేమిటి, విషయమేమిటని బయటపందిట్లో వున్న ఒకమనిషి నడిగాడు. "గన్నేరుకాయ పప్పు తిన్నాడు కరణంగారు నిన్నరాత్రి. ప్రాణంమీదికివచ్చింది." అని జవాబిచ్చాడు ఆమనిషి. నన్నుచూడనివ్వం డన్నాడు సాహేబు. సీనయ్యనుమంచంమీదపరుండబెట్టించి యువతలికితీసుకువచ్చారు. సాహేబు ఆపాదమస్తకమూ పరీక్షచేశాడు. దుర్గుణాలు కనిపించకపోయినా ఉపేక్షచేయడానికి ఆ సాహేబుకు ధైర్యం చిక్కలేదు. అరగంటలోనే మందు తయారుచేసి యిస్తాననీ, వేసిన అరగంటకల్లా మందు జవాబిస్తుందనీ నమ్మకం చెప్పుతూ మందు తయారుచేయడానికి ఒక ద్యేబులం బాదంకాయలూ, అయిదుపలాల పుట్టతేనె, అర్ధశేరు ఆవుపాలూ వెంటనే తెప్పించమని సాహేబు ఉత్తరువుచేస్తూ "మీ అమ్మాయి ఆడుకొనే చింతగింజలూ, గన్నేరుకాయల బుట్టాకూడా తెప్పించండి. కావా"లన్నాడు. ఆవుపాలకోసరమూ, పుట్టతేనెకోసరమూ సీనయ్యకొడుకూ, ఇన్‌స్పెక్టరు పంతులు జవానూ పరుగుపెట్టారు.

చింతగింజలూ, గన్నేరుకాయల బుట్ట కోసరం సీతమ్మ దక్షిణపుగదిలోకి పోయి మామూలుగా పెట్టే గూటిలో వెతికిందికాని ఆ బుట్ట కనబడలేదు. పెళ్లికిగాను తెచ్చిన బాదంకాయలబుట్ట ఆ గూటిలోనే వుంటే అది బయటికి తీసుకువస్తూ సీనయ్యపక్క కూర్చున్న తల్లి రంగమ్మతో "అన్నట్టు మరచిపోయినానే అమ్మా! ఆ బుట్టమళ్లీ తీసుకు

రానేలేదు- నారంరోజుల క్రిందట రెడ్డిగారి చెల్లక్క నా గన్నేరుకాయలబుట్ట తీసుకు పోయింది. ఆ గూట్లోవున్నదల్లా ఈ బాదం కాయలబుట్టే" అని ఆబుట్ట అక్కడ పెట్టింది.

ఆబుట్టకేసి చూస్తూ "ఈ బుట్టలో కాయలేనా నేను పగలగొట్టితిన్నది" అంటూ మంచంమీద పరున్న సీనయ్య లేచి ఒక్క గంతువేశాడు.



'నేనూ ఫోటో తీస్తా' —వాహన్.

# వెలిచెర్ల శాసనము-పాఠభేదము

వ. వెంకటరంగయ్య

గడచిన ఆగష్టుమాసపు భారతియందు ఈ శాసనము ప్రకటింపబడియున్నది. ఈ శాసనము ౧౪ వ బంతిలో నుండు "చోకమండల" నిర్ణయముంగూర్చి గొప్ప పండితులు, విజ్ఞులు, శోధకులు, విమర్శకులు, మాన్యులు నగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "చోక మండల" స్థానే "చోళమండల"మని చదివిన శాసనపంక్తి సుగమముగ నుండునని తెలిపినారు. ఇందుకు వారికి ప్రతివందనముల నర్పించుచున్నాను. "పాంకనాడు" నెల్లూరగునెడల "పాంకనాంటి చోకమండల" లేక ఉదాహృత పండితులు సవరించినటుల "పాంకనాంటి చోళమండల" నాయకత్వము సమన్వయముగుచున్నది.

అయితే "చో" ప్రక్కనసుండు యక్కరము "క" యగునా లేక "ళ" యగునా యను విచారమున కవకాశము కలుగుచున్నది. ఈ శాసనమున "క" కారములు పలుమారు తగులుచున్నవి. ప్రస్తుత "చోక" శబ్దమునకు కుడివైపునను, ఎడమవైపునను "క" కారములున్నవి. వానికిని "చోక" యని సందిగ్ధాక్షరమునకును విశేషభేద మగపడదు. కించిద్భేదము కలదనియునొప్పుకొనవలసియున్నది. కాని ఈ కొలదిపాటి భేదరూపము "ళ" కారమునకంటె "క" కారమునె యనుగమించుచున్నటుల తోచుచున్నది.

మరియు నీ శాసనమున నీ విమర్శగ్రస్తమయిన యక్షరముగాక నిస్సందేహములగు నాలుగు స్థలములందు "ళ" కారము తగులుచున్నది: (౧) శాసనపు నాల్గవ బంతియందు "క్రీడాకళేబరో" యను చోట నొకటి. (౨) ఆరవబంతియందు "కళానిధి" యను చోట నొకటి (౩) ఇరువది యారవబంతియందు (పులు) "గుళ్ల నివాసికి" యనుచోట నొకటి. (౪) ముప్పది మూడవబంతి "చెముళ్ల" యను చోట నొకటి. ఈ నాల్గింటిలో "కళానిధి" యను చోట నుండు "ళా" యాకారము "చోళ" యని వివాదాక్షరరూపమును కలిగియున్నది. "చోళ"ను "చోక" యనినటులు "కళానిధిని" "కకానిధి" యన్న నింతకంటె యాభాస మింకొకటి యుండజాలదు. "చోక" యనునది "చొక్క" శబ్దవికారమని సాధించిన సాధింపవచ్చునేమోగాని కళానిధిని కకానిధిని జేసి యే యర్థమును సాధింపనలవిగానటులున్నది. "చొక్కనాథక" "చొక్కత్తైవక" "చొక్కలింగం" ఇత్యాది యరవవారి పేళ్లున్నవి. ఏకాలమున ఏయరవ "చొక్కడు" పాంకనాండిలోని కొంతభాగ మాక్రమించి తన పేరు శాశ్వతము చేసెనో తెలియలేదు. పాంకనాండిలో చొక్కని ప్రవేశమే లేదనునెడల "చోళమండల" పాఠము పరమసమ్మతముగ గ్రహింపదగియున్నది.

మిగిలిన మూడుదాహరణములలోని "ళ" కారము స్పష్టముగ నిప్పుడు తెలుగున వ్రాయు "ళ" కారము వలెనే యున్నవి. ఈ విషయమున సందియమేమియు లేదు. అధికసంఖ్యాక (Majority) సాక్ష్యముపై ఈ వ్యాజ్యెమును పరిష్కరింపబూనినచో జయపత్రము "చొక్క"నికిగాక యేర్పడవలసియుండును. శాసనపు వ్రాతలలో ద్విత్వములు దీర్ఘముల దెలుపు పొల్లులు తప్పిపోవుచుండుట గలదు. అయినను ఏ విధముచేతనైనను చొక్కనికి పట్టాభిషేకము చేయ నుద్దేశము కాదు.

ఈశాసనశిల్పి "ళ" కారమును రెండువిధములుగ చెక్కుచుండెనని సిద్ధాంతము చేయగలిగిన "చోకమండల"మునకు బదులు "చోళమండల"మును ఆదరింపవచ్చును.

ఈ శాసనపు పందొమ్మిదవ బంతియందుండు "ఉండ్రుకొండ" హైదరాబాదు రాజ్యమున నున్నటుల తెలియుచున్నది. ఆ గ్రామనామ మింటిపేరుగ గల బ్రాహ్మణులు అచటచట నున్నారు.

# తిల్లిక

## ( మహేంజోదారో కుండగుర్తులు )

కాళ్లకూరి సూర్యనారాయణ

తిల్లికఅనే తెనుగుమాటతో సంబంధం ఉన్న మరికొన్ని మాటలను ఉదహరించి వాటిని ఏయే అర్థాలలో ఇప్పటి తెలుగువారు ఉపయోగిస్తున్నారో తెలియపరచిన తరువాత నాటి వ్యుత్పత్తినిగురించి చర్చిస్తాను.

(౧) తిలకం - 'వాడు తిలకం దిద్దినాడు.'

(౨) టిల్లక్కం - 'వాడికి టిల్లక్కం పెట్టి పంపించినారు.'

(౩) టొల్లెక్కం-'వాడికి టొల్లెక్కం చూపించి నారు.'

(౪) టిల్ల - 'ఆబిడ్డ టిల్ల (టిళ్ల) టిల్ల అంటూ ఆడకుండా నిలబడిపోయినది;' లేకుంటే, "టిళ్ల పెట్టాను, అంటూ ఆడకుండా నిలిచిపోయినది"

(౫) తిల్లిక-'పిండితిల్లిక నిలిచిపోయినది; వెయ్య వలెను.'

(౬) తిల, ఘుల్లక (క్షుల్లక), దీనికి సరిఅయిన అచ్చతెనుగుపదమున్నా కూడా 'తిల్లిక' అనేమాటతో సంబంధంగలవే. ఇవిగాక తల, తలకాయ, టెంకాయ అనేమాటలుకూడా ఈ జాబితాలో చేర్చడం అవశ్యం.

ఈ పదం తెనుగా, సంస్కృతమా, అన్యదేశ పదమా అన్న చర్చ ఇక్కడ చేయనక్కరలేదు. ఎవరికి ఏలాగున అనుకోవలెనని ఉంటే వారు ఆలాగున అనుకో వచ్చును. అందువల్ల సత్యానికి అంతగా విరుద్ధం ఉండదు. నన్ను అడిగితే మానవజాతివారు ఏర్పరచిన "మానవ భాష"లోని మాట అని చెప్పతాను.

చిత్రము ౧



చిత్రము ౨



చిత్రము 3



1 2 3

చిత్రము ౪





8

చిత్రము ౫

///



2

చిత్రము ౬



చిత్రము ౭



1 2 3

(౧) తిలకం: ఇది పూర్ణతిలకంగా ఉండేటప్పుడు దీని ఆకారము చిత్రము ౧-1 వలె ఉండవలెను.

రానురాను చుట్టూఉన్న సున్న జారిపోయినది. అందువల్ల మిగిలినదానికే తిలకం అని పేరువచ్చినది. (చూ. చి. ౧-2.)

మరికొన్నాళ్లకు మధ్యనున్న ఊర్ధ్వపుండ్రము మాత్రం నిలిచి మిగిలినది రాలిపోయినది. దీని ఆకారము నువ్వుగింజవలెగాని, విరుగకుండా ఉన్న బియ్యపు గింజవలెగాని ఉండును. సంపూర్ణతిలకము కొందరు ఎఱ్ఱని కుంకుమతో పెట్టకొందురు. వైష్ణవులు తిలకము నకు ఉండవలసిన రెక్కలను విడిచి, వెలుపలిభాగము నకు తెల్లని నామమును, మధ్యనున్న తిలవంటి నిడివి రేఖకు ఎఱ్ఱని తిరుచూర్ణమును ఉపయోగపరతురు.

ఉత్తనిదుపురేఖను ఉపయోగించేవారు కుంకుమగాని, తిరుచూర్ణముగాని వాడుతారు. కుంకుమతో పెట్టిన ఊర్ధ్వ పుండ్రాన్ని గోవిందం అని అనడంకూడా కద్దు. "వాడు తిలకం దిద్దినాడు" అంటే ముఖాన్న తన వర్ణమునకు నియమించియున్న బొట్టును పెట్టుకున్నాడని భావము. వర్ణము అనగా ఫక్తు ఎరుపా, లేక ఎరుపు తెలుపు కలిసినదా, లేక తెలుపు పసుపు మిశ్రమా, లేకుంటే పూర్ణంగా తెలుపేనా, లేక నలుపేనా అని మొదటి ఉద్దేశం. ఈ నాడు "మీది ఏవర్ణం" అని ఒకరు మరి ఎవరినైనా అడిగితే "మేము బ్రాహ్మలము", లేక "శూద్రులం" అని చెప్పుకోవడం వారివారి బొట్టుపెట్టుకొనే పూర్వపు ఆచారంనుంచే.

(౨) టెల్లకట్రం : ఈ మాటకుకూడా తిలకం (అనగా బొట్టు) అనే అర్థం. 'వాడికి టెల్లకట్రం పెట్టి పంపించినారు' అంటే, బొట్టు పెట్టుకోనిచ్చినారుగాని భోజనం పెట్టకుండా మాయచేసి పంపించినారు అని అర్థం. 'దగా' అన్న అర్థంలోకూడా వాడుతారేమో. "నామంపెట్టినారు."

(౩) "వాడికి టొల్లెకట్రం చూపించినాడు." తెలుగువారందరికీ దీనిఅర్థం తెలిసే ఉంటుంది. "చూపరానిది చూపినాడని" భావం. దౌర్జన్యం వల్ల, తాను ఇతరులకు ఇవ్వవలసినదానిని ఇవ్వనని చెప్పుటకు మారుగా, ఇట్టినామర్దాకనిని చేసినాడని భావం. ఈ అర్థంలో దీనితో చేరినమాటలు : తులక (ఘుల్లక) అనేదిన్నీ, దీనికి సమానమగు అచ్చతెనుగు మాటానూ.

(౪) టిల్ల, టిళ్ల : ఆటలో పిల్లలు వాడుకచేసే పదము ఇది. ఏకారణంచేతనైనా, అక్షణానికి ఆటలో నుంచి విడబడవలసిన అవసరం ఏపిల్లకైనా కలిగితే, ఆపిల్ల తన చూపుడువేలునీ మధ్యవేలునీ కొనలవద్ద ఒకటిగాచేర్చి వానిని వంచినయెడల ఆ రెండింటికిన్నీ నడుమభాగము తిలకాకారమును వహించును. తిలకమును వహించినబిడ్డ భగవంతునితో సమానం. కస్తూరి తిలకం అలంకారంగా గలవాడు విష్ణుమూర్తిగదా! అందుచేత "టిల్లపెట్టుకొన్నబిడ్డను" మిగిలినవారు ఆ రీతిని భావించి విడిచిపెట్టవలెనని అర్థం. (చూ. చి. ౨.)

(౫) తిల్లిక: పిండితిల్లిక. జ్యోతిఅంటే కాంతితో వెలిగేదీపము. అయితే వరిపిండితోగాని, గోధుమపిండితోగాని చేసినకుండలో ఆవునెయ్యిపోసి దీపంపెట్టడం తెలుగువారిలో ఆచారమై ఉన్నది. మొదట కుండతో కూడిన దీపమునకు జ్యోతి అనిన్నీ, ఇటీవల పిండికుండకే జ్యోతిఅనిన్నీ అర్థములు ఏర్పడ్డవి. తల్లులచాటున ఉన్నబిడ్డలకు "జ్యోతి"అంటే నేతితో ఉడికిన పిండికుండ అనిన్నీ, తినడానికి అపరిమితమైన రుచిగా ఉంటుందనిన్నీ వారికి అర్థం స్ఫురిస్తుంది. ఆలాగునే 'పిండితిల్లిక' అంటే 'పిండికుండ' అని ఇటీవలి అర్థం. ఇదే వాస్తవంఅయినచో "తిల్లిక"కు దీపం అని అర్థంచెప్పవలెను.

(౬) తిలకంలో ముఖ్యభాగమునకు ఎట్టి ఆకారము ఉండవలెనో ఇంతకుముందే చెప్పియున్నాను. దీనికి ఏ ఆకారమో అదే ఆకారముగల ఇతరవస్తువులకున్నూ ఈపేరు వచ్చినది. తిలకము, తిలగింజ, టిల్ల, వెలిగేదీపము మొదలైనవాటి ఆకారము ఇంచుమించుగా ఒకటే; వరిగని బియ్యపుగింజకుకూడాను. అందుచేతనే తలపైనగాని, ముఖమునగాని వాడుకొనుటకు తగిన అధికారము తిలలకుగాని, అక్షతలకుగానివచ్చినది. ఘుల్లకమునకుకూడాఇదే ఆకారము. ఈకడవరిని చెప్పినవస్తువునకుగౌరవము కలుగుటకు ఇంకొక కారణమున్నది. అది తరువాత వివరిస్తాను. భాషాజ్ఞానులు ఇదివరకు మనకు చెప్పినమాటే.

ఇంతవరకు తిలకం, టెల్లకట్రం, టొల్లెకట్రం, టిల్ల (టిళ్ల), తిల్లిక, తిల, ఘుల్లక, చు — యా, అనే మాటలకుగల పరస్పరసంబంధం చూపించినాను. "తల" అనేపదమునకున్నూ "తిలక"మునకున్నూ గల సంబంధం చూపిస్తే ఈ మాటలన్నీ ఒకతోరణములోనివని తేలుతుంది.

అనాదినుండిన్నీ, మృగములలో మృగమువలె సంచరిస్తూ ఉండేరోజుల దగ్గరనుంచీకూడా మనుష్యుడు మూడింటియందు పరమభక్తిని కనపరచేవాడనుటకు తగిన

నిదర్శనములు అనేకము లున్నవి. అవి ఏవంటే, 'పుట్టుక, జీవము, చావు. పుట్టుకను దేవునిగా భావించి బ్రహ్మరూపంగా పూజిస్తున్నాడు. జీవమును దేవునిగా భావించి విష్ణుమూర్తిగా పూజిస్తున్నాడు. చావును దేవునిగా భావించి ఈశ్వరునిగా పూజిస్తున్నాడు. ఈమూడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. శిశుజననమే భగవంతుడు, బ్రహ్మ, పూజనీయుడు. అట్టిజననమునకు సహాయపడు మనుష్యావయవసామగ్రికూడా పూజనీయమే. కాబట్టి అట్టి అవయవములను గురుత్వముతో చూచేవాడుక. అందుచేతనే వాటిని పూజించుట. 'పుట్టుట' అనునది ఎంత వింతో జీవమున్నా అంతే వింత. కాబట్టి జీవమును విష్ణువు అనే భగవంతునిగా యోచించి ప్రజలు దానిని పూజిస్తున్నారు. జీవమునకు శరీరము ఆధారము. శరీర అవయవములన్నిటిలోనూ శిరస్సు ప్రధానముగా పూర్వీకులు యోచించినట్లు తోస్తుంది. "సర్వస్యగాత్రస్య శిరః ప్రధానం". మనుష్యునకును, మృగమునకును వ్యత్యాసమును కల్పించి, వానికి ఉన్నతస్థలము నిచ్చినది వాని శిరస్సే. అందుకు జ్ఞానమంటూ మనుష్యునకు కలిగిన దగ్గరనుంచీ అతడు శిరస్సును పూజిస్తూ వస్తున్నాడనుటకు తగిన ఆధారములు చాలా ఉన్నవి. ఈ ఆచారాన్నిబట్టి తెలుగువారికి "తల" పూజనీయమైనది. శిరస్సు కుంభముగా ఉంటుందికాబట్టి తిలకంలో నెలుపలిసున్న. దానిలో ముఖాకారము ఈరీతిగా నుండును. (చూ. చి 3-1) ఇందులో కండ్లు, ముక్కు, నోరు కనపడ్డ లేదు. చెవులుమాత్రము సూచించియున్నవి. ముఖగహ్వరమందు శబ్దము పలుకగలిగినది నాలుక. దాని ఆకారము చి. ౪-1. లో వలె ఉండును. ఈ రెండున్నూ చేర్చితే చి. 3-2 ఆకారముగల గుర్తు ఏర్పడినది. దీనియందు ఈ యీ అవయవములు ఇమిడియున్నవి: నాదము కలుగజేయునవి: నోరు, నాలుక; నాదమును వినగలిగినవి: చెవులు. దీనినే ఇంకొక జాతివారు మరియొకరీతిగా వ్రాసి పూజిస్తున్నారు. (చూ. చి. ౪-2, 3.) నాదువంటిది శిరస్సు; దిగువగీత నాలుక; ప్రక్కనున్నవి చెవులు. మధ్యనున్నవి లలాటమందు వ్రాసిన మూడుగీతలును; అడ్డుగాఉంటే శివుడు; నిలువుగావుంటే విష్ణువు. శివకేశవులకు భేదములేదు. నిలువుగాఉన్న మూడుగీతలూ రానురాను తిలకముగా మారినవి. (చూ. చి. ౧-౩, 4.) తిలకమునకున్నూ తలకున్నూ గల సంబంధము ఇప్పుడు కనబరచినాను. ఈ శివ, విష్ణు ఆకారముగల పటములే ఇంకొక జాతివారిలో చవరముదాదిరిని ఏర్పడినవి. (చూ. చి. ౫-1.)

మహేంజొదారొపటములో కుండమార్కుకు అర్థము ఇది. ఈ పటమునకు ప్రక్కనే తిలకము ఈరీతిని వ్రాసియున్నది: (చూ. చి ౬-1. 2.) చూడు మహేంజొదారొ పటము కుండమార్కు.

ఇందులో ఇంకొకచిత్రము. దీనికి ఎడమప్రక్కను రెండు చుక్కలున్నవి. వాటితోసహితము ఈ కుండ మార్కు చి. ౬-3. వలె కనపడును.

మొదటి మూడుగీతలున్నూ ఏమో నేనుచెప్పితే వాని పక్కనున్న రెండుగీతలకున్నూ అర్థం సులభమవుతుంది. తిలకంలో ఎడమచేతివైపుగీత మీదపెదవి, కుడిచేతివైపుది క్రిందిపెదవి. రెంటికి నడుమగీత నాలుక. ఇకనే రుద్రుడు-ఎర్రగా ఉంటాడు. మూడుగీతలున్నూ మాటను కలిగించగల నోరు, నాలుక అయితే ఎడమచేతివైపు ఉన్నచుక్కలు రెండున్నూ రెండు కండ్లు. ఆపటమునే మరియొకరీతిగా అర్థమయ్యేటట్టు వ్రాయవచ్చును. తలగాని, తోకగాని తెలియక ప్రక్కగా అచ్చుపడినది అని చదువరులు తలంపరాదు. అదే సరియైనది. ఆ స్థితికి అర్థము ఉన్నది. (చూ. చి. ౭-1, 2, 8.)

చదరముగావ్రాయుట తమిళసంప్రదాయముగా ఉన్నట్లు కనిపిస్తుంది. కుండ్రముగా వ్రాయుట తెలుగు సంప్రదాయము. వాస్తవమునకు దగ్గరగానున్నది తెలుగు సంప్రదాయమే. చాలాకాలమునకు మార్పుచెందిన తరువాత నిలకడ అయినది తమిళ సంప్రదాయము. చదరపు బొమ్మలో మీదగీత ఆర్చివలె ఉంటే నిజమునకు దగ్గర. (చూ. చి. ౫-2.) మహేంజొదారొ(మహనీయొధరొ) బొమ్మలో ప్రక్కనున్న మూడుగీతలున్న ఒక్కటిగా కనబడుతున్నవి.

చావుదేవుడు ఈశ్వరుడు. ఈశ్వరారాధన అందరికిన్నీ తెలిసినవిషయమే. అతడిని తెలియచేసే బొమ్మయున్ను ఇదేకాని, నుదుటగీతలు అడ్డుగా ఉంటవి. నిలువుగీతలకు అర్థం నాదసహితమైన ఊపిరి; అడ్డు వాటికి అర్థం నాదరహితమైన ఊపిరి; ఈ రెండున్నూ జీవచిహ్నములే. ఒకరు ఊపిరేముఖ్యంఅంటే, నాదంతో కూడుకొంటేనేగాని ఊపిరివల్ల ఫలం ఏమిటి, మృగాలికి లేదా అంటారు మరికొందరు.

టెంకాయ అనగా తలకాయ. తలకాయవలెనే దీనికిన్నీ జుట్టు ఉన్నది. తలనుండి "ఉద్భవమైన" శివుని కివలెనే దీనికిన్నీ మూడుకండ్లు. అందుకే శివకేశవులకు దీనియందు ప్రీతి. దేవునికి కొబ్బరికాయకొట్టినారంటే మనిషితలకుమారుగా తలవంటి కాయను వేట, లేక బలి వేస్తున్నారని భావము. మీదవివరించిన కారణముచేతనే వరలక్ష్మీవ్రతము చేస్తున్నప్పుడు లక్ష్మీ ముఖముగా కనపడేటట్టు టెంకాయకు ముక్కు, చెవులు, నోరు ఏర్పరచి కలశ అనే గర్భంపైని ఉంచి దానిని పూజించడం.

తిల్లికతో సంబంధించినమాటలు రెండురకములు:

(౧) 'క' తో అంతమయినవి; (౨) 'క' అంతమున లేనివి. ఈ మాటలన్నిటికీ ఒకటేభావం అయితే, స్వార్థమందు 'క' ప్రత్యయం వచ్చిందంటారుగాబోలు సంస్కృతవైయాకరణులు. అలాగే కావచ్చును. నిజముకు ఈమాట త్ ల్ ః అని ఉండవలెను. కడపటి ః గ్రీకు ఒమెగా, సంస్కృతంలో విసర్గ తెలుగులో ః గా ఉండి ఉండును. ఆరోజులలో అచ్చులు లేవు. ఈ 'ల' కారోచ్చారణ రెండురకములు: నాలుక వెనుకభాగమువల్ల మార్పుచెందినది ఒకటి; నాలుక ముందుభాగమువల్ల మార్పుచెందినది రెండవది. ఒకప్పుడు మొదటిదిన్ని, మరియొకప్పుడు రెండవదిన్నీ వాడినట్లు కనిపిస్తుంది. మొదటి ఉచ్చారణవల్ల అ,ఉ అచ్చులున్న, రెండవదానివల్ల ఇ, ఎ అచ్చులున్నగల రెండుతరగతుల కొత్తమాటలు రాను రాను ఏర్పడినవి. ప్రతి ఒకదానికిన్ని అర్థం వేరు.

(౧) ముందుచెప్పిన ఉచ్చారణ 'ల' కారం: తిలకం, టిల్లక్కం, టిల్ల, టొల్లక్కం, తిల, తుల్లక, చు—యు, తల, తలకాయ.

(౨) వెనకచెప్పిన ఉచ్చారణ 'ల' కారం: 'తిల్లిక', టొల్లెక్కం,

"టొల్లెక్కం"లో 'ల' మీద ఉన్న ఎత్వం ఇకారలిమార్పు ఏహ్యార్థమున వాడినది.

ఈ తిల్లిక, లేక, తిలకంతో సంబంధించిన ఆచారాలు నాల్గింటిని వివరిస్తాను.

(౧) పిల్లవానికి పుట్టిన దినంచేసేటప్పుడుగాని, వానిని పెండ్లికొడుకును చేసేటప్పుడుగాని వానిని తూర్పుముఖంగా కూర్చోబెట్టి కుంకుమతో ముఖాన తిలకం పెట్టి, తలకు తైలము (తిలతో సంబంధించినది) రాసి హారతి (తిల్లిక) ఇస్తారు. తరువాత తలంటుస్నానము చేస్తారు. ఇందులో వాడినవి: తల, తిలకం, తైలం (తిల), తిల్లిక. అన్నీ గౌరవమైనవస్తువులు. నువ్వులు మరియొకసమయమప్పుడు వాడుతారుగనుక ఇప్పుడు తైలం వాడుట ఆచారం.

(౨) కొన్నికోవెలలలో భగవంతునకు నిత్యతలగడుగు. అక్కడనూ ఇదే ఆచారము: తల, తిలకం, తైలం, హారతి.

(3) రాజును మూర్ధాభిషిక్తుని చేసేటప్పుడున్నూ చేసేపని ఇదే. సింహాసనం, తల,తిలకం, తైలం, హారతి: సింహాసనం ఎందుకువాడుతారో ఇప్పుడు చెప్పపనిలేదు.

(౪) దివాలాదీసినవాడు తన ఇంటిని శుద్ధశూన్యంగా ఊడ్చి, ఎదురుగుండా ఉన్న గూటిలో దీపం పెట్టి దిగంబరిగా కాళ్లుచాచుకుని ఇంటిహాలులో నడుమ కూర్చుంటాడు. తనతల భగవంతుడు, తనపురుషావయవము భగవంతుడు, దీపం భగవంతుడు (ఆకారంవల్లనైతేనేమి, ఇతరకారణములవల్లనైతేనేమి). అప్పుఇచ్చినవానికిన్నీ, పుచ్చుకున్న తనకున్నూకూడా భగవంతుడే గతి. అప్పుతీర్చుటకు వేరుమార్గము లేదని భావము.

# తిర్లిక

## పం. వెంకటాచార్యులు

శ్రీయుత జి. జాషువగారు 'తిర్లిక'ను గుఱించి బ్ర. శ్రీ. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి పూర్వవాదమును బరామర్శించుచు ౧౯౩౬ ఆగస్టునెల భారతిలో 'తిల్లిక' అరవభాషలోని 'తిర్వళిఘు' యొక్క యపభ్రంశ రూపమనుట యుచితము కాదనియు, సమీప సంబంధమును బట్టి విమర్శింపఁబూనినచోఁ బ్రతిమాటయు నన్యభాషాపదమై తేలిపోయి ఆంధ్రభాష ముక్కు మొగము లేనిదై యెంగిలిభాష యైపోవుననియు "తిల్లిక" తెలుఁగుపలుకే కాని యన్యము కాదనియుఁ దమ యభిప్రాయమును దెల్పిరి.

వాస్తవమునకు "తిరువిళక్" అను నరవపదము యొక్క యపభ్రంశరూపమే 'తిల్లిక'. మొదట 'తిరువిళకు' 'తిర్విళ' కయి తిర్లికగా మారి 'తిల్లిక' యైనది. వికృతిపదములందు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు విధిగాఁ గన్పడును. ప్రకృతి వికృతితత్త్వమును బరిశీలించునపుడు సమీపసంబంధమే ముఖ్యముగఁ జేకొనఁదగినది. సాధ్యమగునంతవఱకు సత్యమునే వెల్లడించు తలంపుగల విమర్శకులెవ్వరును దూరపుసంబంధమునుగొని తత్త్వనిర్ణయమునకుఁ బూనరు. అట్టియెడ సుప్రసిద్ధమగు నవ యథార్థము గోచరింపకయుండు నీ 'తిల్లిక' వంటి మాటలు దేశము - అర్థము - అక్షరములు - వీనివలన నేర్పడు సమీపసంబంధమును జూచికొని యన్యదేశ పదజన్యములనినచో నాంధ్రభాష యెంగిలిభాషయగునా? అట్లయిన నిరుగుపొరుగు నేలలవారి మాటలు ప్రతిదేశభాష యందును బ్రవేశింపక యుండవు. అట్లు ప్రవేశించిన మాటలు కాలాతిపాతముతో నన్నివిధములఁ దారుమారై యుండకపోవు. ఇట్టి భ్రష్టపదజాలము ప్రతిభాష యందును బ్రత్యక్షమగుచుండును. కనుక నీ యెంగిలి యొకయాంధ్రభాషకే కాక యన్నిభాషలకు సహజముగ నుండెడిదే. సహజగుణములెల్ల లక్షణములుగాఁ బరిగణింపఁబడుట నీగుణము భాషకు న్యూనతనాపాదించునది కాదు. ఇట్లుండ నరవవారి 'తిరువిళకు' తెలుఁగునాట 'తిల్లిక' గా మారినదన 'దివ్వె' 'దివ్వెము' మున్నగు దీపవాచకములు మఱియు నున్నందున నాంధ్రభాషకువచ్చెడి పొచ్చెమేమి? తొల్లిటిరూపు నేర్పరుచు తీరులుతోఁచుచుండ 'తిల్లిక' వంటిమాటలు తెలుఁగునాటి చొక్కపుమడుగులనుటకు తత్త్వశోధకులు సమ్మతింపరు.

అరవములో 'విళక్' దీపసామాన్యవాచకము. ("......ఉణర్వెనుం శుడర్ విళక్కేత్తి") 'తిరు'పదము శ్రేష్ఠవాచకము. ఈ యుభయపదములను మేళవించి పూజాసమయములందు 'తిరువిళక్కు' నుపయోగించుట శ్రీవైష్ణవ సంప్రదాయము. ఈ శ్రీవైష్ణవ సంప్రదాయమును బట్టియే 'తిరువిళకు' 'తిర్విళకు' లాంధ్రదేశమునఁ జొచ్చి జనసామాన్యముచేఁ జిక్కి 'తిర్లిక' 'తిల్లిక' రూపములు దాల్చి దీపసామాన్యవాచకములై ప్రామాణిక కవిగణస్నేహము లేక నిజప్రభఁ గోల్పోయి మిణుకు మిణుకు మనుచున్నవి. నేటికి నాంధ్రదేశస్థ శ్రీవైష్ణవగృహములందు 'తిరువిళకు' 'తిర్విళకులు', దత్తమండలస్థాంధ్రగృహములందు 'తిర్లిక' 'తిల్లిక'లు వెలుఁగుచున్నవి. ఆంధ్రదేశస్థ కతిపయ శ్రీవైష్ణవగృహములందు నిజస్వరూపము తెలియక 'తిర్విళకు'ను 'తిర్వళిఘు' యని వాడుటయుఁ గలదు. "దివటీలుఁ దిర్వళికలుఁ బంజాల్ మహాజ్యోతులున్" అని హంసవింశతిలో "తిర్విళకు" "తిర్వళిక"గా నున్నది. ఇత్యాది మీఁదిపద్యములో యతిస్థానమున లేమి లేఖకప్రమాదమున స్వరవ్యత్యయము నొందినదని చెప్పనొప్పు. మఱియు లక్ష్మీనారాయణీయమను శుద్ధాంధ్రనిఘంటువునందు దీపపర్యాయములలో 'తిర్వళిక' చూపఁబడినది. ఏతన్నిఘంటు నిర్మాతలు గృహవిహారమునకు కవికులవ్యవహారమునకు దూరమైనందున తారుమారైన యిప్పలుకు హంసవింశతిలోఁ జూచిన

దాని నట్టే యెత్తి వ్రాసియున్నారు. ఇట్లనుటకు దేశీయ సోదరులు నాపై కినియకుందురుగాకయని వేడికోలు. శబ్దరత్నాకరకర్తలు శ్రీమాన్ బ. సీతారామాచార్యులు గారు తులుభాషాపదమైన 'పంజు'ను గొని, దివటీయుండ దీప మెందుకనికాఁబోలు 'తిర్లిక' 'తిల్లిక'లను మాతృక సమేతముగఁ దమతిరుహస్తములతో మలిపినచిరి.

ఇంకొక విశేషము. ఈ 'తిరు' పదరహితమైన 'విళకు' కన్నడమున 'బెళకు'(=కాంతి)గా మారి తెలుఁగున 'బెళుకు'రూపుతో వెలయుచున్నది. ఇంక ననేక పదములు ద్రావిడసమములు, ద్రావిడభవములు నాంధ్ర భాషలలోఁ గలవు. ఇవిగాక తత్సమతద్భవము లటుంచి శుద్ధదేశ్యములు తెలుఁగు కన్నడములఁ దుల్యప్రచారము కలవి వందలాదిగలవు. అట్టిమాట లిప్పటికి నాచే సహ స్రాధికము సేకరింపఁబడినవి. ఇంకను కన్నడగ్రంథములు తఱిచి చూచిన నెన్నిమాటలు వెలువడునో యిప్పటికిఁ జెప్పనలవికాదు. ఈ తెలుఁగు కన్నడభాషల, ముందు వెనుకల విచారము విజ్ఞులకు విడిచి యీ ప్రసంగమింతతో నిలుపువాఁడ.

## బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పంద్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవ మతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్ర ములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను, కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురములగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్ర మాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందు గలదు. ఆకాలపు టపూర్వసారస్వత చారిత్రక విశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల, నెం. 2, తంబుసెట్టివీధి, మదరాసు

# ఆకాశ పుష్పములు


## డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు


ఆనాడమావాస్య. రాత్రి సుమారు రెండు గంటలైయుండును. మిక్కుటమగు చలి. అంతయు నిశ్శబ్దము. అంతటను ఆవరించిన యంధకారము జనులనే గాక జంతుజాలములను గూడ సమ్మూర్ఛితులను జేసిన ట్లుండెను. ఒకచోట మాత్రము ఒక చిన్న ఇంటి యందు మినుకుమినుకు మని ఒకచిన్న దీపము వెలుగు చుండెను. దీపమునకు సమీపముననే యొక పురుషుడును, ఒక స్త్రీయును గూర్చుండి కడు జాగరూకులై ఒక విచిత్రయంత్రముతో ఆకసమును పరీక్షించుచుండిరి. నిర్మల నీలాకాశమున మినుకుమినుకు మనుచు, ప్రశాంత తటాకమునందలి తెల్ల కలువలవలె గాన్పించు నక్షత్రరాసులను ఆనిశ్శమున పరికించిపరికించి చూచు ఆ స్త్రీ పురుషు లెవ్వరు? వారి విచిత్రచర్య కేమి కారణము?

కారణమేమో ఎవరు చెప్పగలరు? కాని వారిద్దరు మాత్రము నక్షత్రశాస్త్రమునకై తమ జీవితమును ధారపోసిన సోదరీసోదరులు. పేరు హర్షల్. నాటి నుండి నేటివరకును, అనగా సుమారు నూరు నూట ఏబది సంవత్సరములుగా ఎంతమంది నక్షత్రశాస్త్రజ్ఞులు నిద్రాహారములు మాని జ్ఞానాభివృద్ధికై పాటుపడుచున్నారో? కాని వీరందరిలో ముఖ్యుడనియు, నక్షత్రశాస్త్ర పితామహుడనియు పేరుగన్న సర్ విలియమ్ హర్షల్ (Sir William Hershell) దొరపేరైనను మనలో నెంతమందికి దెలియును? ఇక వారి ఉత్సాహాసక్తు లెట్టివో, వాని కెట్టి కారణము లుండెనో ఎవరు చెప్పగలరు? కాని శరద్రాత్రులందు చంద్రకాంతి ఇసుమంతయులేని చిమ్మ చీకటియందు ఆకసమువంక దిరిగి ఒక్కమారైనను సావధానముగ వీక్షించినచో ఈశాస్త్రవేత్తలను నక్షత్రశాస్త్ర పరిశోధనా దీక్షాబద్ధులుగ చేసిన యాకర్షకశక్తి ఏదియో మన కొకింత బోధపడును. అట్టి సమయములందు ఏయేనక్షత్రము లెవ్వియో తెలియ జెప్పుట కొక మిత్రుడుగాని, లేక నక్షత్రమండల పటములుగాని మనవద్ద నుండినయెడల మనము సులభముగ ఆకసమునందలి ముఖ్య నక్షత్రముల నన్నిటిని గుర్తింప నేర్చి, అవి యాకసమున నెప్పుడెప్పు డెచ్చట నుండునో, వాని కాంతియందును, రంగునందును ఎట్టి భేదము లున్నవో పరిశీలించుచు అత్యంతప్రమోదము నొందగలము.

ఆకసమునందలి నక్షత్రములను శ్రద్ధతో పరీక్షించుటకు మానవు డెప్పు డారంభముచేసెనో తెలియరాదు. మానవ నాగరకతా చరిత్రమున ప్రథమాధ్యాయమునందే విజ్ఞానవిభాగములలో నొకటగు జ్యోతిర్విజ్ఞానము కూడ కొంత యభివృద్ధి గాంచియున్నట్లు తెలియుచున్నది. తమ తమ పురాణేతిహాసములందలి ప్రాచీన గాథలకును నక్షత్రములకును ఏదోసంబంధ ముండవలెనని తలచి ప్రాచీనవిద్వాంసులు-ప్రాచ్యులేమి, పాశ్చాత్యులేమి కొన్నికొన్ని నక్షత్రముల స్థానమునుబట్టి, వారికి తోచినట్లెల్ల, ఆనక్షత్రములకు, పురుష, స్త్రీజంతునామములును, పదార్థముల పేర్లను, నానా విధములుగ బెట్టిరి. ఉదాహరణముగ పెద్దఎలుగు (Great Bear) అను పాశ్చాత్యనామము గల నక్షత్రమండలమును గైకొందము. ఏయేనక్షత్రము లిందు గలవో, ఈ నక్షత్ర సమూహపు ఆకారమునకును ఎలుగునకును ఏమిసామ్యము గలదో ఒకటవ చిత్రమును జూచినయెడల బోధపడును. ఎలుగుతోకయందును, వెనుకభాగమునందును ఉన్న నక్షత్రములనే మనము సప్తర్షులని యందుము. ఈ ఎలుగున కింతటి పొడుగాటి తోక ఏల యుండవలెనో యర్థముగాదు. ఈ సమూహమునందలి నక్షత్రములను జూచినంతనే ప్రాచీనులకు ఎలుగుఆకార మెట్లు స్ఫురించెనో! ఇట్లే వివిధ నక్షత్రమండలములను పరీక్షించి





చిత్రము ౧

ప్రాచ్యులుగాని, పాశ్చాత్యులుగాని, వీరి కట్టిపేర్ల నొసంగిరో, ఈపే ర్లెంతమట్టుకు తగినవో పరీక్షింప వచ్చును౧

ఆకసమునందలి నక్షత్రములను పరిచయముజేసి కొనుట సాధ్యముగాని పని యని ప్రారంభమున దోచ వచ్చును. ఆకసమున లెక్కలేనన్ని నక్షత్రము లున్న ప్పుడు వానినిగూర్చి పరిశోధించుట ఎవరికి తరము? అని మొదట అనిపించవచ్చును. కాని తలచినంత యధికముగ ఆకసమున నక్షత్రములు గలవా? చూచుట కెన్నియో ఉన్నట్లు గాన్పించుచున్నను సుమారు ౨౫౦౦ కంటె నెక్కువగ నక్షత్రము లొకటేసారి యాకసమున మనకంటికి కనబడజాలవు. వీరిలో కొన్ని కొన్నిటి యొక్క ప్రత్యేకసమూహముగ నెంచి వానికి మన ప్రాచీనులు అశ్విన్యాది నామములను, ఇతర నామములను ఒసంగియున్నారు. మేషాదిరాశి నామములు గూడ ఈవిధముగ నేర్పడినవే. రాశినామములు మనకును పాశ్చాత్యులకును ఒకటేగాని, ఈపేర్ల నెవ్వరొసగిరో తెలిసికొనుటకు చాలమంది కృషిచేసియున్నారు. అట్టి వారిలో కొందరు ఈపేర్లు హిందూదేశమున ప్రారంభ మయ్యెననియు, కొందరు ఈజిప్టుదేశమున ప్రారంభ మయ్యెననియు, ఇంకనుకొందరు బాబిలోనియాలో ప్రారంభమయ్యెననియు వక్కాణించుచున్నారు. ఇట్టి పేర్లొసగునపుడు ప్రాచీనులు తమకు పరిచయముగల జంతువుల పేర్లనుగాని, వస్తువుల పేర్లనుగాని ఉపయోగించియుందురు. హిందూదేశముననే ఈపేర్లు ప్రథమమున బయలుదేరియుండినయెడల హిందువుల కెక్కువ పరిచయముగ ముఖ్యజంతువులగు ఏనుగు పేరుగాని, పెద్దపులిపేరుగాని ఒక నక్షత్రరాశికైనను లేకుండ నుండునా? అట్లుగాక ఈజిప్టులో ఈపే ర్లుద్భవించి యుండినయెడల ఆదేశమున ముఖ్యములగు మొసలిపేర గాని, పిల్లిపేరగాని ఒకరాశికైనను పేరు వచ్చియుండదా? కాన ఈపేర్లు బహుశః బాబిలోనియాదేశమున మొదలు ప్రారంభమయ్యేనేమో యనుకొనుటకు కొంత యాధారము గలదు.

ఎవరొసగిన నేమి? ఇట్టిపేర్లవలన కొన్నికొన్ని నక్షత్రసమూహములను సులభముగ గుర్తించుటకు వీలు గలదు. కాని ఒకమండలమునను్న వివిధ నక్షత్రములను పేర్కొనవలసిన యవసరము వచ్చినప్పుడు మాత్రము ఈపద్ధతి యంతగా అనుకూలపడజాలదు. "ఎలుగుతోకలోని రెండవనక్షత్రము," అనిగాని, "వృషభము

౧. శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు హైందవ పౌరాణిక గాథలలోని సందర్భములను వివిధ నక్షత్రమండలముల ఆకారములను పరీక్షించిసమన్వయించి ప్రతినెలయును భారతిలో వ్రాయుచున్నారు. ఈవిషయమున నెక్కువ శ్రద్ధగలవారు వారివ్యాసముల జూడనగును.

"కంటిపద్ది పెద్ద నక్షత్రము" అనిగాని, ఈవిధముగ ప్రస్తావనచేయుటకు శాస్త్రచర్చలందు వీలుపడదు. కాన క్రీ. శ. ౧౬౦౩ వ సంవత్సరమునందు బేయర్ (Bayer) అను పాశ్చాత్య నక్షత్రశాస్త్రజ్ఞుడు తాను ఉరనో మెట్రియా (Urano metria) అను నక్షత్రపటముల సంపుటమును ప్రచురించుచున్నప్పుడు, ఒకొక్క మండలమునందలి నక్షత్రములను నిర్దేశించుటకు క్రమముగ ఆయానక్షత్రముల కాంతిప్రమాణములనుబట్టి గ్రీకు వర్ణములను వరుసగ నుపయోగించుచువచ్చెను. ఉదాహరణముగ క్యానిస్ మేజర్ (Canis Major=మృగవ్యాధుడు) అను నక్షత్రమండలమును గైకొందము. ఈ మండలమునందలి కాంతివత్తమ నక్షత్రము సిరియస్ (Sirius=రుద్రుడు). బేయర్ (Bayer) పద్ధతిప్రకారము సిరియస్ (Sirius) నక్షత్రమును క్యానిస్ మేజర్ నందలి ఆల్ఫా (Alpha Canis Majors) యనవలసి వచ్చును. ఈ మండలమునందలి దీనితరువాతి నక్షత్రములన్నిటికిని వరుసగ వాని కాంతిప్రకారము బీటా, గామా, డెల్టా మొదలగు గ్రీకువర్ణములనే బేయరుదొర పేర్లుగా నొసంగెను. ఇతర మండలములందలి నక్షత్రములకుగూడ ఈవిధముగనే పేర్లొసగబడెను. ఆల్ఫా ఓరియానిస్ (Alpha Orionis) అనినయెడల ఓరియన్ మండలమునందు అత్యుత్తమ కాంతిగల నక్షత్రమని యర్థము. దీనినే బీటల్‌గూస్ (Betelgeause = ఆర్ద్ర) యనిగూడ అందురు.

ఈపద్ధతి వెనుకపద్ధతికన్న చాల అనుకూలముగ నుండెను కాని దూరదర్శినీయంత్రముల సామర్థ్య మధికమై, క్రొత్తగ కనిపించిన నక్షత్రముల సంఖ్య యధికమైన కొలదిని ఈపద్ధతియందలి అసమగ్రత విశదమగుచువచ్చెను. కాన ఆంగ్లదేశమున ఆస్థాననక్షత్రశాస్త్రజ్ఞపదవిని వహించినవారిలో ప్రథము డగు ఫ్లామ్‌స్టీడ్ (Flamsteed) దొర పేర్లకు బదులుగ సంఖ్యలనే నక్షత్రములకు సంకేతములుగ నుపయోగింపజొచ్చెను. నేటికిని కొన్ని నక్షత్రముల నీపద్ధతినే పేర్కొనవలెను. ఉదాహరణము సిగ్ని (Cygni) ౬౧, అనగా సిగ్ని (Cygni) మండలములో ౬౧ సంఖ్య గుర్తుగాగల నక్షత్రము. ఇంకను కొన్ని నక్షత్రములు లలాండె (Lalande) అను శాస్త్రజ్ఞుడు తయారుచేసిన నక్షత్రముల ప్రథమపట్టికలో నొసగిన సంఖ్యలను బట్టియే నిర్దేశింపబడుచున్నవి. ఉదాహరణము లలాండె ౨౧౧౮౫.

నక్షత్రముల కాంతినిబట్టి వానిని వేర్వేరు రకములుగ చేర్పరచవచ్చునని పైన జూచితిమి. క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమునందుండిన హిప్పార్కస్ (Hipparchus) అను గ్రీసుదేశపుశాస్త్రజ్ఞుడు కాంతిప్రమాణమును బట్టి నక్షత్రములను ఆరుతరగతులుగ ప్రథమమున విభజించెను. కాని ఇందు ఒకటవ రెండవతరగతి నక్షత్రముల కున్నంతభేదమే మూడవనాల్గవ తరగతి నక్షత్రములకుగూడ నుండునని తలప సాధ్యముగాదు. ఈక్రింది పట్టికను జూచినచో వివిధ తరగతుల నక్షత్రములకు వాని కాంతియందెట్టి తారతమ్యముగలదో తెలియును. ఇందు మొదటి తరగతినక్షత్రముల కాంతిప్రమాణమును ౧౦౦ గ గైకొని తదనుగుణముగ ఇతర తరగతి నక్షత్రముల కాంతి నిర్ధరింపబడినది.

| తరగతి | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ |
|---|---|---|---|---|---|---|
| కాంతిప్రమాణము | ౧౦౦ | ౪౦ | ౧౬ | ౬ ౨/౫ | ౨ ౧/౨ | ౧ |

ఏతరగతి నక్షత్రపు కాంతియైనను దానిక్రింది తరగతి నక్షత్రము కాంతికన్న ౨ ౧/౨ రెట్లు అధికముగ నుండునని పై పట్టికనుండి విశదమగుచున్నది.

పైన జూపిన దానికన్నను తక్కువ ప్రమాణపు కాంతిగల నక్షత్రములను సైతము దూరదర్శినీ యంత్ర సహాయమున చూడనగును. విల్సన్ దూరదర్శినీయంత్రాలయము (Wilson Obssoatomy) నందలి యంత్ర సహాయముచే ౨౦, లేక ౨౧ వ తరగతి నక్షత్రములను గూడ శాస్త్రజ్ఞులు పరీక్షింపగలరు. మొదటి తరగతినక్షత్రపుకాంతి ప్రమాణము౧యని తలచినయెడల ఈతక్కువ తరగతి నక్షత్రముల కాంతిప్రమాణ మెంతయల్పముగ నుండునో, వీనితో పోల్చిచూచినట్లైన సూర్యచంద్రుల కాంతిప్రమాణ మెంతయధికముగ నున్నదో ఈక్రింది పట్టికవలన విశదమగును.

సూర్యుడు ౧౨ వేలకోట్లు(౧౨,౦౦౦,౦౦,౦౦,౦౦౦)
చంద్రుడు ౨ ౩/౪ లక్షలు (౨,౭౫,౦౦౦)
౧ వ తరగతి నక్షత్రము ౧
౬ వ ,, ,,నూరుభాగములలో నొకభాగము .౦౧
౧౧ వ ,, ,,పదివేల ,, ,,.౦౦౦౨౧
౧౬ వ ,, ,,పదిలక్షల ,, ,,.౦౦౦౦౦౧
౨౧ వ ,, ,,పదికోట్ల ,, .౦౦౦౦౦౦౦౧

రానురాను ఈకాంతి ఎంతతక్కువయగునో చూచితిరా. కాననే ఎన్ని నక్షత్రము లున్ననేమి, చంద్రకళల మిసుమంతయైనను లేకున్నచో జిమ్మచీకటిగ నుండును. వృద్ధినిదియనాడుగూడ చంద్రుని కాంతి అన్ని నక్షత్రము లొసగు కాంతికన్న చాలనధికముగనే యుండును. పూర్ణచంద్రునినుండి మనకు, అన్ని నక్షత్రముల మొత్తముకాంతికన్నను ౨౦౦ రెట్లు అధికముగ కాంతి వచ్చుచున్నది.

ఇక ఏతరగతినక్షత్రము లధికసంఖ్యాకములో ఈక్రిందిపట్టికవలన విశదమగును.

| తరగతి | | నక్షత్రముల సంఖ్య |
|---|---|---|
| రెండవతరగతి నక్షత్రములు | | ౯౧ |
| మూడవ ,, | ,, | ౧౩౮ |
| నాలుగవ ,, | ,, | ౫౩౦ |
| ఐదవ ,, | ,, | ౧,౬౨౦ |
| ఆరవ ,, | ,, | ౪,౮౫౦ |
| ఏడవ ,, | ,, | ౩,౨౪,౦౦౦ |
| పదునారవ | ,, | ౭,౧౦,౦౦,౦౦౦ |
| పదునెనిమిదవ | ,, | ౨౯,౬౦,౦౦,,౦౦౦ |
| ఇరువదవ | ,, | ౧౦౦,౦౦,౦౦,౦౦౦ |

తరగతి హెచ్చినకొలదిని, అనగా కాంతిప్రమాణము తగ్గినకొలదిని నక్షత్రముల సంఖ్యమాత్ర మధికమగుచునే యుండునని ఇందువలన స్పష్ట మగుచున్నది కాని అల్పకాంతి నొసగు ఇన్నికోట్ల నక్షత్రము లుండుటకన్న ౧౪౮౦ మొదటితరగతి నక్షత్రము లున్నను జాలును; మన కిప్పటియంతకాంతియే యుండును.

ఇంతవరకును మనము భూమిపైబడు కాంతిప్రమాణమునే గమనించితిమిగాని ఈనక్షత్రముల సహజ తేజ మెంతెంత యుండునో యోచింపమైతిమి. నక్షత్రము లన్నియు భూమినుండియు ఒకటే దూరమున నుండిన యెడల వాని కాంతియందు మన కిచ్చటినుండి కాన్పించు తారతమ్యములే వాని సహజకాంతులందలి తారతమ్యములనుగూడ దెల్పుచున్నవనవచ్చును. కాని కొన్ని నక్షత్రములు కడుదూరమునను, మరికొన్ని మిగతవాని సామ్యమున కడు దగ్గరను ఉన్నయెడల ఈపద్ధతిపైననే యాధారముచేసి వివిధ నక్షత్రముల సహజకాంతినిగూర్చి నిశ్చయముగ నేయు జెప్ప సాధ్యముగాదు. ఒక కొవ్వువత్తిదీపము నూరుగజముల దూరమునుండి ఎంత కాంతిమంతముగా గాన్పించునో, నాలుగు కొవ్వువత్తి దీపములు ౨౦౦ గజముల దూరమునుండి అంత మాత్రమే కాంతిమంతముగ నున్నట్లు గన్పడును. ౩౦౦ గజముల దూరమునుండి అంతయే ప్రకాశముగావలెనన్నచో తొమ్మిది కొవ్వువత్తిదీపములు గావలసివచ్చును. ఒక నక్షత్రము హఠాత్తుగా మనలను సమీపించి, ఇప్పుడున్న దూరమున పదవవంతు దూరమునకే వచ్చినయెడల ఆ నక్షత్రము ఇప్పటికన్న నూరురెట్లు అధికముగ ప్రకాశించుచున్నట్లు కనబడును; తొలుదొల్త ఆ నక్షత్రము ఆరవ తరగతి నక్షత్రముగ గన్పడినచో ఇప్పుడు ఒక ౬వ తరగతి నక్షత్రముగ నున్నట్లు తోచును. కాన ఒకొక నక్షత్ర మెంతదూరమున నున్నదో కనుగొనిన గాని మనకు వివిధనక్షత్రముల సహజకాంతిగాని, కొన్ని ఇతర విషయములుగాని బోధపడవు.

కాని అత్యధికదూరమున నున్న నక్షత్రముల దూరము నెట్లు కొలువవగును ? కరణముల లెక్కలనుగాని, సర్వే లెక్కలనుగాని ఎరిగియున్నవారి కెవరికైనను ఈ విషయము తెలిసియే యుండును. ఒకకాలువగాని, నదిగాని ఎంత వెడల్పుగలదో కనుగొనవలసిన యెడల ఒక గట్టునుండియే జాగ్రత్తగ పరిశీలించి దాని వెడల్పు ఇంత యని సర్వే సుబాస్తాగాని, కరణముగాని చెప్పగలడు. ప్రక్క పటమును జూడుడు.

పఫ, బభలు ఒక కాలువ యిరువైపులనుండు గట్లనుకొందము. కాలువ వెడల్పు, అనగా ఈ రెండు గీట్లకును మధ్య నున్న వెడల్పు కనుగొనవలెను. మనమున్న వైపు బభవైపు అనుకొందము. ఇందు పరస్పరము

ప-                                    ———ఫ

బ- ———————————————ఫ
క    త    చ

చిత్రము ౨

సుమారు ౨౦ గజముల దూరమునన్న క, చ లను రెండుస్థలముల నేం, ౧౦ గజముల కొక యంగుళము చొప్పున మన పటమునందు రెండంగుళముల వెడల్పుగల కచగీతను వ్రాయుదము. దీనిపై నాధారముచేసియే మనము కాలవవెడల్పును కనుగొనవలయునుగాన దీనిని ఆధారరేఖ (Base line) అని యందురు. ఇప్పుడు క వద్ద నుండియు చ వద్దనుండియు పరీక్షించి హంస పాదము వైచిన కోణములను రెంటిని (అనగా టకచ కోణమును, టచక కోణమును) కనుగొని మనపటము నందు వ్రాసినయెడల టకచ యను ముక్కోణ మేర్పడినది. ఇప్పుడు ట వద్దనుండి తవరకు నొక చక్కని నిలువు గీత వ్రాసి దానిని కొలచినచో కాలువవెడల్పు తెలియగలదు.

పై పటమునందలి యాధారరేఖ ౨౦ గజములు మాత్రమే. కొన్ని గజముల దూరమునుమాత్రమే కొలవవలసి వచ్చినపుడు ౨౦ గజముల నిడివిగల యాధారరేఖ చాలును. కాని ఇంకను అధికదూరమునన్న వస్తువుల నీవిధముగ పరీక్షించి, వానిదూరమును సరిగా నిర్ధరించి చెప్పుటకు ఇంతటి చిన్నయాధారరేఖ చాలదు. ౨ గజముల యాధారరేఖ సహాయమున సుమారు ౨౦ మైళ్ల దూరమునన్న ఒక పర్వతశిఖరమును పరీక్షించి కోణములను సరిగా గుర్తించి, దూరమును లెక్కపెట్టుటకు ఎట్టి సూక్ష్మ యంత్రములున్నను సాధ్యముగాదు. అట్టి సందర్భములందు పరీక్షాస్థలము లింకను దూరమునుండి, ఆధారరేఖ ఇంకను వెడల్పుగ నుండవలెను. కాన చంద్రుడో, లేక కుజగ్రహమో ఎంతదూరమునన్నదో ఈపద్ధతిని గనిపెట్టవలెనన్న సామాన్యపువెడల్పు గల యాధారరేఖ చాలునా? అట్టి సందర్భములందు లండను నందలి దూరదర్శినీ యంత్రాలయము మొక పరీక్షాస్థలముగను, ఆఫ్రికా దక్షిణము చివరనున్న కేప్ఆఫ్ గుడ్ హోప్ (Cape of Good Hope) దూరదర్శినీ యంత్రాలయము రెండవ పరీక్షాస్థలముగను నిశ్చయించి, ఈ రెండు ప్రదేశములకును మధ్యనున్న దూరమును ఆధారరేఖగ గైకొందురు.

కాని నక్షత్రము లింకను ఎన్నియోరెట్లు అధికమగు దూరమున నున్నందున వానిదూరమును కనిపెట్టుటకు ఎన్నియోవేలమైళ్ల విస్తీర్ణము గల ఈ ఆధారరేఖ గూడ చాలదు. ఆధారరేఖ కొన్నికోట్ల మైళ్ల విస్తీర్ణముండినయెడల బహుశః సాధ్యమగునేమో! భూమి వ్యాసమే కొన్నినూర్ల మైళ్లదూరమును మించనపుడు భూమిపైనున్న మనకు కొన్నికోట్ల మైళ్ల విస్తీర్ణముగల ఆధారరేఖ ఎట్లు లభించును?

భూమి సూర్యునికిచుట్టును సుమారు ౯,౩౦,౦౦,౦౦౦ మైళ్లదూరమున ఇంచుమించుగా వలయాకారముగ నున్న పథమున తిరుగుచు, సరిగా సంవత్సరమున కొకమారు సూర్యునిచుట్టును ప్రదక్షిణము చేయుచుండునని మన కందరికిని తెలిసిన విషయమే. కాన ఇప్పు డొక నక్షత్రమును పరీక్షించి మరల సరిగా ఆరునెలలకు ఆ నక్షత్రమునే పరీక్షించినయెడల అప్పుడు భూమి తన వలయాకార మార్గమున సరిగా సగము దూరము ప్రయాణముచేసి యుండును. గాన సూర్యుని కవతల ౯,౩౦,౦౦,౦౦౦ మైళ్లదూరమున, అనగా ఇప్పుడున్న స్థానమునకు సుమారు ౧౮,౬౦,౦౦,౦౦౦ మైళ్ల దూరముననుండును. ౧౮౬ కోట్లకు మించిన యాధారరేఖ సహాయమున అత్యంత సూక్ష్మయంత్రములతో పరీక్షించినను గూడ కడుసమీపముననున్న నక్షత్రములదూరమునైనను గణనచేసిచెప్పుట కష్టసాధ్యము.

ఈపని నెరవేర్చుటకు వా రుపయోగించు పద్ధతి ఈ క్రిందిపటమును జూచిన బోధపడును.




చిత్రము 3

పై పటమునందు 'ట' సూర్యుడనియు, 'త' 'డ' లు రెండు నక్షత్రములనియు, ఇవి సరిగా సూర్యునికట్ట యెదుట ఒకదాని వెనుక నొకటి యున్నవనియు అనుకొందము. సూర్యునిచుట్టు నున్న వలయము భూమి మార్గము. ఈవలయపు వ్యాసము కచ యను రేఖ; కాన 'క' నుండి 'చ' వరకును ప్రయాణించుటకు భూమికి ఆరునెలలు పట్టును. 'క' వద్దనుండి 'త' యను నక్షత్రమును చూచినయెడల అది 'డ' నక్షత్రమునకు కొంత కుడివైపుననున్నట్లు కనబడును. దీనిపిమ్మట సరిగా ఆరు నెలలకు అనగా భూమి 'చ' వద్ద నున్నప్పుడు అదే నక్షత్రమును పరీక్షించినయెడల అది 'డ' నక్షత్రమునకు కొంచెము ఎడమవైపున నున్నట్లు గనపడును. అత్యంత సూక్ష్మయంత్రసహాయముచే ఇట్టి అత్యల్పభేదములను గూడ కడుజాగ్రత్తతో కనిపెట్టి, కొలతచేసి, శాస్త్రజ్ఞులు పై పద్ధతినే నక్షత్రముల దూరమును కనిపెట్టగలిగిరి. కాని ఇది ఎంత కష్టసాధ్యమో పై యుదాహరణము నుండియే బోధపడును. త మన కత్యంత సమీపమున నున్న నక్షత్ర మనుకొందము. ఇప్పుడు మన కొలతలను ఒక నిర్ణీత ప్రమాణపు కొలతననుసరించి పైపటమునందు వలె వ్రాయ యత్నింతము. మన యాధారరేఖ యగు భూమార్గపు వ్యాసమును (అనగా ౧౮,౬౦,౦౦,౦౦౦ మైళ్ల దూరమును) నిర్దేశించుటకు మనపటమునందు రెండంగుళముల వెడల్పుగల గీతను వ్రాసితి మనుకొందము. ఇక ఆధారరేఖ రెండు కొనలవద్దను మనము కనిపెట్టిన కోణములను నిర్మింతము. ఈకోణముల ఊర్ధ్వభుజములు కలియుస్థానమే 'త' నక్షత్రపు స్థానము. ఈకోణములు ౯౦ డిగ్రీలకన్న ఏమంత తక్కువ లేనందున, వానియూర్ధ్వ భుజములను చాల దూరము పొడిగించినగాని కలియవు. అట్లు పొడిగించి 'త' నక్షత్రపు స్థానమును గుర్తుచేయుటకు ఒక సామాన్యపు వెడల్పుగల కాగితము చాలదు; ఆకాగితము కనీసము ౪ మైళ్లపొడవైనను ఉండవలెను. ౨ అంగుళముల దూరము ౧౮౬ కోట్లమైళ్లకు సమానము అను అంచనాపైన ఈ నక్షత్రము మన యాధారరేఖకు ౪ మైళ్ల దూరముననుండినయెడల అది ఎన్నికోట్ల మైళ్ల దూరమున నున్నదో మనమే యోచించుకొనవచ్చును.

నక్షత్రముల దూరమును మైళ్లలో లెక్కచేసి చెప్పినచో వాని దూరము మనకు సులభముగ బోధపడదు. పుట్టపర్తి గ్రామము మదరాసునుండి ౨ కోట్ల అంగుళముల దూరమున నున్నదనినయెడల దాని దూరమెంతమాత్రమును అవగాహన గాజాలదు. అట్లుగాక రమారమి ౩౦౦ మైళ్ల దూరమున నున్నదనిగాని, లేక ౩౦ ఆమడలదూరమున నున్నదనిగాని చెప్పిన సులభముగ బోధపడును. అట్లే మన కత్యంత సమీపముననున్న నక్షత్రము ౨౫ లక్షలకోట్ల (౨౫ మిల్లియన్ల మిల్లియన్లు) మైళ్లదూరమున నున్నదని చెప్పినయెడల అట్టి గణనాతీతమైన దూరము మనకు సరిగా అవగాహన గాజాలదు. అందువలననే నక్షత్ర శాస్త్రమునందుపయోగించు మాన ప్రమాణము మైలునకన్నను, ఆమడకన్నను ఎన్నియో రెట్లధికముగ నుండవలెను. ఒక సెకండు (Second) కాలములో వెల్తురుకిరణము లెంతదూరము ప్రయాణము చేయగలవో దానినే నక్షత్రశాస్త్రజ్ఞులు తమ మాన ప్రమాణముగ నిశ్చయించియున్నారు. వెల్తురుకిరణములు ఒక సెకండునకు ౧,౮౬,౦౦౦ మైళ్ల దూరము ప్రయాణము చేయగలవు. కాన చంద్రుడు భూమికి ౧¼ కాంతి సెకండుల దూరమున నున్నాడనినయెడల ౧¼ సెకండుల కాలములో కాంతికిరణము లెంతదూరము ప్రయాణించగలవో అంతదూరమున (అనగా సుమారు రెండులక్షల ముప్పైవేల మైళ్లదూరమున) నున్నాడని

యర్థము. ఈ పద్ధతిని జూచినచో సూర్యుడు ౮ కాంతి నిమిషముల దూరమున నున్నాడు. సూర్యచంద్రులకును భూమికిని మధ్యనున్న దూరములో నెంత తారతమ్య మున్నదో చూచితిరా?

ఇతరగ్రహము లన్నిటికన్నను దూరముననున్న ప్లూటోగ్రహము (Pluto) ౫½ కాంతిగంటల దూరమున నున్నది. ఆల్ఫా సెంటారి (Alpha centauri) అను అశ్వినీనక్షత్రములు మన కత్యంతసన్నిహితములగు నక్షత్రములైనను ౪½ కాంతిసంవత్సరముల దూరమున నున్నవి. అనగా ఒక సెకండునకు ఒకలక్ష ఎనభైయారు వేల మైళ్లు ప్రయాణము చేయగల కాంతికిరణములు విశ్రాంతి ఎరుగక ౪½ సంవత్సరములు ప్రయాణముచేసినచో ఎంతదూరము పోగలవో, భూమినుండి అంతదూరమున ఈ నక్షత్రము కలదని యర్థము. దగ్గరి నక్షత్రముల దూరమే ఇంత యధికమైనపుడు ఇక ఇతర నక్షత్రములనుగూర్చి చెప్పనగునా? ఐనను ౫౦౦ కాంతి సంవత్సరముల దూరముననున్న నక్షత్రముల దూరమును గూడ శాస్త్రజ్ఞులు ఈ పద్ధతిపైననే పరీక్షచేసి కనుగొనియున్నారు. ఒక అడుగు వెడల్పుగల ఆధారరేఖ రెండుకొసలనుండి పరీక్షించి సుమారు ౩౦౦౦ మైళ్లదూరమున నున్న వస్తువు దూరమును సరిగా కనిపెట్టుట ఎంత కష్టసాధ్యమైన కార్యమో, సుమారు ౫౦౦ కాంతి సంవత్సరముల దూరమున నున్న నక్షత్రముల దూరమును సరిగా కనిపెట్టుటగూడ అంత కష్టసాధ్యమైన కార్యమే.

ఒక నక్షత్ర మెంతదూరమున నున్నదో తెలిసినవెంటనే దానికి నిజముగ నెంతకాంతి గలదో కనిపెట్టవచ్చునని ఇదివరకే చూచితిమి. కాని ఇంకొక విషయమునుగూడ కనిపెట్టినయెడల నక్షత్రపు పరిమాణమును గూడ కనిపెట్టవచ్చును. ఇది నక్షత్రపు ఉష్ణస్థితి. నక్షత్రముల యుపరితల మెంత యుష్ణముగ నున్నదో వాని రంగునుబట్టి కనిపెట్టవచ్చును. కొన్ని నక్షత్రములు తెలుపుగను, కొన్ని ఎరుపుగను, కొన్ని నారింజపండు వన్నెగను, కొన్ని పసుపుగను, ఇంకను కొన్ని నీలముగను ఉన్నవని మనకందరికిని తెలియును. ఇందుకు కారణము నక్షత్రముల యత్యధికోష్ణస్థితియే. సామాన్యముగ నల్లగనున్నపుడు ఇనుపముక్కను కాల్చినచుగూడ ఉష్ణ మెక్కినకొలదిని అది ఎరుపుగను, కడకు తెలుపుగను మారునని విదితమే. దీనినిబట్టి నక్షత్రముల రంగులు వాని యుష్ణస్థితిపైననే యాధారపడియున్నవని విశదమగుచున్నది.

సూర్యుని ఉష్ణము సుమారు ౬౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీల (Sentigrade degrees) ప్రమాణముండునని వెనుకటి వ్యాసమున దెల్పితిని. ఎరుపురంగు నక్షత్రములు ౩౦౦౦ సెంటిగ్రేడుడిగ్రీలకు మించిన యుష్ణస్థితియం దుండజాలవు. కాన సూర్యునితో పోల్చినపుడు ఇవి చల్లనివనవచ్చును. నీలిరంగుగల నక్షత్రముల యుష్ణము సుమారు ౧౫౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీల నుండి సుమారు ౩౦,౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీలవరకును ఉండును. కనుక సూక్ష్మయంత్రముల సహాయముతో ఏనక్షత్రమైనను సరే అది ఎరుపుగనున్నదో, తెలుపుగనున్నదో, వరి ఇంకేరంగుననున్నదో పరీక్షించి ఆనక్షత్రపు ఉష్ణస్థితిని కనుగొనవచ్చును. నక్షత్ర కాంతిని బట్టియు, ఉష్ణస్థితినిబట్టియు జ్యోతిః శాస్త్రజ్ఞులు నక్షత్రోపరితల వైశాల్యమును, నక్షత్రవ్యాసమును కనుగొని నిర్ధారించుచున్నారు.

ఈవిధముగ కొన్ని నక్షత్రములను పరీక్షించి, గుణించి సిద్ధాంతీకరించిన కొన్ని యంశములను ఈ క్రింది పట్టికయందు గాననగును. ఇందు మనకు ఉజ్జ్వలముగ గానవచ్చెడి ౧౨ నక్షత్రముల దూరమును, మొత్తము కాంతియు, అర్ధవ్యాసమును ఇయ్యబడినవి. ఈలెక్కల యందు సూర్యుని కాంతిని, అర్ధవ్యాసమును మానప్రమాణముగ గైకొని వానినే ఒకటిగ పరిగణించియున్నాను.

పై పట్టికను జాగ్రత్తగ పరిశీలించినచో కొన్ని విచిత్రాంశములు బోధపడును. మనకు అతి ప్రకాశవంతములుగ గన్పడు ఈ ౧౨ నక్షత్రములలో కొన్ని మనకు చాల సమీపమున నున్నవి. కొన్ని చాల దూరమున నున్నవి. మన కత్యంత సమీపముననున్న అశ్విని (Alpha centauri) ఈ పండ్రెంటిలో నొక్కటి.

| సంఖ్య | నక్షత్రము | దూరము కాంతి సంవత్సరములు | సహజకాంతి. సూర్యకాంతి ౧ | అర్ధవ్యాసము. సూర్యుని అ॥వ్యా॥ ౧ |
|---|---|---|---|---|
| ౧ | అశ్విని (Alpha Centauri) | ౪ | ౧ | ౧ |
| ౨ | మృగవ్యాధుడు (Sirius) | ౯ | ౨౬ | ౨ |
| ౩ | పూర్వశ్వానము (Procyon) | ౧౦ | ౫ | ౨ |
| ౪ | శ్రవణము (Altair) | ౧౬ | ౯ | ౧ |
| ౫ | బ్రహ్మ (Vega) | ౨౬ | ౫౦ | ౨ |
| ౬ | స్వాతి (Arcturus) | ౪౧ | ౧౦౦ | ౩౦ |
| ౭ | బ్రహ్మహృదయము (Capella) | ౪౭ | ౧౫౦ | ౧౨ |
| ౮ | (Acherner) | ౬౬ | ౨౦౦ | ౪ |
| ౯ | ఆర్ద్ర (Betelgeause) | ౧౯౦ | ౧,౨౦౦ | ౨౫౦ |
| ౧౦ | అశ్విని (Beta Centauri) | ౩౦౦ | ౩,౦౦౦ | ౧౧ |
| ౧౧ | (Rigel) | ౫౪౦ | ౧౮,౦౦౦ | ౩౮ |
| ౧౨ | అగస్త్యుడు (Canopus) | ౬౫౦ | ౮౦,౦౦౦ | ౧౮౦ |

నక్షత్రము లన్నిటిలో ఉజ్జ్వలముగ గన్పడు మృగవ్యాధుడు (Sirius) ౯ కాంతి సంవత్సరముల దూరమున మాత్రమే గలదు. ఇతర నక్షత్రములతో పోల్చి చూచినచో ఇది చాల సమీపమనియే చెప్పవలెను. కాని దీనికి తరువాతి దనదగు అగస్త్యుడు (Canopus) చూచుటకు అన్నిటికన్నను (ఒక్క మృగవ్యాధుని తప్ప) ఉజ్జ్వలముగ నున్నట్లు గాన్పించుచున్నను మనకు సుమారు ౬౫౦ కాంతి సంవత్సరముల దూరమున గలదు. అంత దూరమున నుండియు మన కంత ఉజ్జ్వలముగ గనపడవలెనన్నచో ఇతని సహజతేజ మెంతయుండవలెనో, మృగవ్యాధుని సహజతేజమునకన్న ఎన్ని రెట్లు అధికముగ నుండవలెనో ఊహింపవచ్చును.

నక్షత్రముల సహజకాంతియందు గూడ తారతమ్య మెక్కువగా గాన్పించుచున్నది. అశ్విని (Alpha centauri) సహజకాంతి రమారమి సూర్యుని సహజకాంతి యంతయే ఉన్నది. కాని అగస్త్యునికి (Canopus) మాత్రము సూర్యునికన్న ౮౦,౦౦౦ రెట్లు అధికముగ కాంతి గలదు. ఈ నక్షత్రమును మొదటి నక్షత్రమంత సమీపమునకు గైకొనివచ్చినయెడల మన కత్యంత కాంతిమంతముగా గన్పడి, మనకు పూర్ణచంద్రుని కాంతిలో సగముకాంతి నొసగును.

పరిమాణమునందు గూడ ఈ నక్షత్రములలో నెక్కువ తారతమ్యము గాన్పించుచున్నది. అశ్విని (Alpha centauri) శ్రవణ (Altair) నక్షత్రములించుమించుగా సూర్యునియంతయే పరిమాణము గలవి. మృగవ్యాధుడు (Sirius) పూర్వశ్వానము (rPocyon) అచెర్నర్ (Acherner), నక్షత్రముల పరిమాణము గూడ సూర్యోపమానమున అంత యధికమని చెప్పలేము. కాని ఆర్ద్ర (Betelgeause), అగస్త్యుడు (Canopus) నక్షత్రములు సూర్యునితో పోల్చిచూచినచో నిజముగ రాక్షసనక్షత్రము లనవచ్చును. రెండుకోట్ల నలభై లక్షల సూర్యుల నొకముద్దచేసినచో బహుశః అది ఆర్ద్ర (Batelgeause) అంత పెద్దగోళ మగునేమో!

అట్లయినచో మన కొక సందేహము కలుగవచ్చును. ఇంత పెద్దనక్షత్రము లాకాశమున నుండిన యెడల అవి ఒకదాని నొకటి యాకర్షించినవైనను, లేక తమ చలనమునందు ఇంకొక నక్షత్రమునకు దగ్గరగవచ్చి సంఘట్టనము చెందినవైనను, మరి ఇంకేవిధముగనైనను హాని యొదవింపవా? ఈ సమస్యను విడదీయుటకు ఏదైన నొక నక్షత్రమును గైకొని దాని చుట్టుపట్లనెన్ని నక్షత్రములు గలవో, అవి ఎంతెంతదూరమున నున్నవో ఎట్టి పరిమాణకాంతులు గలవో పరీక్షింపవలెను. ఉదా

హారణమునకు మన సూర్యునే గైకొందము. ఈ క్రింది పట్టికయందు, సూర్యునికి సమీపమున (అనగా ౧౦ కాంతి సంవత్సరముల దూరమునకు మించని) ౧౦ నక్షత్రముల పరిణామకాంతులును, దూరమును తెలియగలవు.

| సంఖ్య | నక్షత్రము-పాశ్చాత్యనామము | సూర్యునినుండి దూరము. కాంతి సంవత్సరములు | సహజకాంతి. సూర్యుని సహజ కాంతి ౧ | పరిమాణము సూర్యుని పరిమాణము |
|---|---|---|---|---|
| ౧ | ప్రాక్సిమా సెంటారీ (Proxima Centauri) | ౪.౨ | ౦ ౦౦౦౧ | ౦.౦౫ |
| ౨ | ఆల్ఫా సెంటారీ ఏ (Alpha Centauri A) | ౪.౩ | ౧.౨ | ౧.౦ |
| ౩ | ,, బి ( ,, B) | ౪.౩ | ౦.౩ | ౧.౨ |
| ౪ | బర్నార్డు నక్షత్రము (Bernards Star) | ౬.౦ | ౦.౦౦౦౪ | ౦.౧ |
| ౫ | ఉల్ఫ ౩౫౯ (Wolf 359) | ౮.౦ | ౦.౦౦౦౦౨ | ౦.౦౨౫ |
| ౬ | లెలాండె ౨౧౧౮౫ (Lalande 21185) | ౮.౩ | ౦ ౦౦౫ | ౦ ౩౮ |
| ౭ | మృగవ్యాధుడు ఎ (Sirius A) | ౮.౬ | ౨౬.౦ | ౧ ౮ |
| ౮ | ఇన్ నక్షత్రము (Innes Star) | ౯.౬ | ౦.౦౦౦౧ | ౦ ౦౬ |
| ౯ | పూర్వశ్వానము ఏ (Procyon A) | ౧౦.౪ | ౫.౬ | ౧ ౯ |
| ౧౦ | పూర్వశ్వానము బి (Procyon B) | ౧౦.౪ | ౦.౦౦౦౦౬ | ౦.౦౦౪ |

పైపట్టికలోని నక్షత్రము లొంటొకటి సుమారు ఒకరబ్బరుబంతి పరిమాణముగల వనినయెడల, ౧౦ కాంతిసంవత్సరముల అర్ధవ్యాసముగల గోళము అదే అంచనాపైన సుమారు మనభూమియంత ఘనవైశాల్యము గలిగియుండును. భూమిని బోలగజేసి అందు పది బంతులను దూరదూరముగ నుంచియున్నా మనుకొందము. గోళము బంతులచే క్రిక్కిరిసియున్నదని చెప్పనగునా? ఎన్నియోవేలమైళ్ల ఘనపరిమాణము గల వైశాల్యమునగాని ఒక్కొక్క బంతి యుండదు. అట్టిసందర్భమున ఒక బంతి ఇటునటు పొర్లినను, కొంత యాకర్షకశక్తిని బరపినను దానివలన తక్కినబంతుల కేమైన నష్టము కలుగగలదా? రెండుబంతులు ఒకదాని నొకటి సమీపించి సంఘట్టనము చెందుట కెంతయవకాశమున్నది? అట్లే చూచుటకు ఇన్ని నక్షత్రములు గాన్పించుచున్నను, ఇవన్నియు పరస్పరము చాల దూరమున నున్నవిగాన ఆకాశము (Space) నిజముగ శూన్యప్రదేశమని చెప్పవచ్చునేమో. నక్షత్రములు చాల అరుదుగనుండుట ఇందువలన విశదమగుచున్నది. స్వేచ్ఛావిహారియైన నారదునివంటివాడెవడైన గమ్యమేమియు లేక విశ్వమునందు ప్రయాణముచేయవలచి వాయువేగముతోగాక కాంతివేగముతో ప్రయాణముచేయుచు బోయినను, ఒకనక్షత్రమును దాటిపోయినపిమ్మట మరియొక నక్షత్రమును సమీపించుటకు ఎన్నియో సంవత్సరముల కాలము పట్టును.

సూర్యకాంతితో పోల్చినపుడు చాల తక్కువ కాంతిగల నక్షత్రములు గూడ గలవనియు, కాంతి కనుగుణముగ వాని పరిమాణముగూడ చాల తక్కువయేయనియు పైపట్టికవలననే తెలియుచున్నది. పూర్వశ్వానము బి (Procyon B) నక్షత్రము రమారమి బుధగ్రహమంతయే యుండును. బహుశః పూర్వశ్వానము బి (Procyon B) వంటి నక్షత్రములను ఒక కోటి ౫౦ లక్షలను జేర్చినచో సూర్యునియంత పరిమాణముగల గోళ మేర్పడునేమో! కాంతియందుగూడ అట్టి యధికభేదములు గానవచ్చుచున్నవి. కొన్ని నక్షత్రముల కాంతియొక్క తీవ్రత దీపపుకాంతితో పోల్చినయెడల కొన్ని నక్షత్రములు మిణుగురుపురుగులకును, మరికొన్ని దీపగృహదీపములకును పోల్పవలసి వచ్చును.

ఇంకను ఒకవిషయమునుగూర్చి పరిశోధించినగాని మనకు నక్షత్రములనుగూర్చి సరియైన యభిప్రాయము లేర్పడవు. ఈవిషయము నక్షత్రముల బరువు, బరువు పదార్థముయొక్క సాంద్రతనుబట్టియు,

పరిమాణమునుబట్టియు ఉండును. కాన రెండువస్తువులలో నొకటి యధిక పరిమాణముగలదైనను, సాంద్రత యందు రెండవదానికన్న తక్కువదైనపుడు అల్ప భారముగలదై యుండును. ఒకసేరు బియ్యమును, ఒక సేరు ఉలవలను సరిగా కొలిచి వానిని తూచినయెడల ఉలవలు బియ్యమునకన్న నెక్కువభార ముండును: కారణము ఉలవల యధికసాంద్రతయే. ఒక గిన్నెడునీటిని పాదరసమును తూచినయెడల పాదరస మెక్కువబరువుగ నుండును. కడకు అందు సగముపాదరసమైనను రెండుగిన్నెలనీటికన్నను బరువుగ నుండును. కాన నక్షత్రముల సాంద్రత తెలియక కేవల మొక్క పరిమాణము మాత్రము తెలిసియుండినయెడల మనకు వాని భారము గాని, భారముపై నాధారపడు వాని యాకర్షకశక్తిగాని ఎట్టివో బోధపడదు.

కాని నక్షత్రముల భారము నెట్లు తూచవగును? మానవుని కసాధ్యములైన కార్యము లెన్నియో లేవు. నక్షత్రముల భారమును కనుగొనుట దుస్సాధ్యమే యైనను, శాస్త్రజ్ఞుల బుద్ధిబలముచే నదిగూడ సుసాధ్యమైనది.

మనుముందు 'భారము' అననేమో కొంత విశదీకరింతము. ఒక త్రాసులో నొక శేరుమీద కొంత చక్కెరను బోసి రెండవదానియందు ఒకసేరు రాతిని వేసి పైకెత్తిపట్టి రెండుశేరులను ఒక మట్టము (Level) నం దుండినయెడల ఆచక్కెర యొక సేరు బరువున్న దని యందుము. చక్కెరకుబదులు అందు దూదియున్నను నొకటే. కాని రెండవపళ్లెరమున సేరు రాతికిబదులు ఒకఅర్ధసేరు రాతిని ఉంచినచో, చక్కెర యున్న పళ్లెము క్రిందికి వ్రాలును. ఎందువలన? భూమి యాకర్షకశక్తివలననే. రెండవపళ్లెములో సేరురాయి యుండినపుడు, ఆపళ్లెముపై భూమి ప్రసరించిన యాకర్షకశక్తియును, చక్కెరగల పళ్లెముపై ప్రసరించిన యాకర్షకశక్తియును సమానముగ నున్నందున, రెండు పళ్లెములును ఒకమట్టమున నుండెను. కాని ఇప్పుడు అర్ధసేరురాతిపైన ప్రసరించిన యాకర్షకశక్తి తక్కువ; గాన చక్కెరగలపళ్లెము నేలవైపునకు వ్రాలుచున్నది. కాన ఒకపదార్థమును తూచుటయనినయెడల ఆపదార్థముపై భూమి పరపు ఆకర్షకశక్తిని కొలుచుటయనియే యర్థము. కాననే కొన్నికొన్నిచోట్ల సాధారణత్రాసు గాక తీగత్రాసు (Spring balance) ఉండును. ఈ తీగకొనను మనము తూచనుద్దేశించిన వస్తువును తగిలించినవెంటనే భూమి యాకర్షణమువలన తీగ జారును. దీనినిబట్టి ఆవస్తు వింతబరువుగలదని కనుగొనవచ్చును. రైలుస్టేషనువద్ద మన సామాను తూచుయంత్రముగూడ ఇంచుమించుగ నిటువంటిదే.

కాన ఒక నక్షత్రము మంకొక నక్షత్రముపై బఱపు ఆకర్షకశక్తిని లెక్కచేసి కనుగొని ఆ రెండు నక్షత్రముల భారమునందలి తారతమ్యమును కనుగొనవచ్చును. కాని ఇందు ఒక చిక్కున్నది. ఒక నక్షత్రపు ఆకర్షకశక్తిని కనుగొనవలెననిన దానిసమీపమునందే మరియొక నక్షత్ర ముండవలెను. దూరము హెచ్చిన కొలదిని ఆకర్షకశక్తి తగ్గును గాన కడుదూరమున ఒంటరిగనున్న నక్షత్రముల యాకర్షకశక్తిని లెక్కచేసి దాని భార మింతయని దృఢముగా జెప్పుటకు వీలులేదు. కాని చాల నక్షత్రములు జతలు జతలుగా నున్నందున అవి పరస్పర మొకదానిపై నొకటి బఱపు ఆకర్షకశక్తిని సులభముగా కనిపెట్టగలము. ఇవి ఒకదానికొకటి సమీపమున నున్నందున సామాన్యముగా చూచుటకు ఒకటే నక్షత్రమువలె కనబడును. దూరదర్శినియంత్రముతో పరీక్షించినగాని ఇవి నిజముగా రెండు నక్షత్రములనియు, పరస్పర మొకదాని చుట్టు నొకటి తిరుగుచున్నవనియు తెలియదు. అట్లుతిరుగనియెడల, ఇవి పరస్పరాకర్షణమున కధికముగ లోనై క్రమక్రమముగా నొండొంటిని సమీపించి కడకు ఒకదానితో నొకటి సంఘట్టనము చెంది రెండును నశించును. వీనినిగూర్చి ముందు చర్చింతము. ప్రకృతము వీని పరస్పరాకర్షణశక్తుల నెట్లు లెక్కపెట్టవగునో కనుగొందము.

జత నక్షత్రములలో సాధారణముగా నొకటి పెద్దదిగను, ఒకటి చిన్నదిగను ఉండును. భారమునందు గూడ రెంటికిని కొంతభేద ముండును. కాని వీని పర

ప్పరదూర మెప్పుడును మారదుగాన వీని పరస్పరాకర్షణ శక్తులు సమానముగనుండి తీరును. అనగా ఈరెండు నక్షత్రములలో నొకదాని కున్నంత సహజాకర్షణశక్తియే రెండవదాని కున్నదని యర్థముగాదు. ఒక చిన్నయుదాహరణమున ఈ యంశము సులభముగ నర్థమగును.




పై పటమున 'క' 'ఖ' అనునవి రెండుసూదంటురాళ్లనియు చ అనునది ఒక ఇనుపముక్కయనియు అనుకొందము. కయను సూదంటురాయికన్న 'ఖ'యను దానికి రెండింత లాకర్షణశక్తి గలదు. కాన 'క' నుండి చిన్నసూదంటురాయి తన యాకర్షణశక్తిని ఇనుపముక్కపై ప్రసరించుచున్నను. ఇనుపముక్క ఖ వైపునకు ఆకర్షింపబడును. కాని ఖ వద్దనున్న పెద్ద సూదంటురాతిని రెండింతలు దూరమునకు అనగా 'గ' వద్దకు తీసికొనిపోయినచో దాని యాకర్షణశక్తి ఎప్పటివలెనే ఉన్నను ఇప్పుడది రెండింతల దూరమున నున్నందున ఇనుపముక్కమీది యాకర్షణము తగ్గును. ఈ విధముగ రెండు సూదంటురాళ్లందు దూరమునందు మార్పులుచేసి, ఇనుపముక్కకు వానినుండి కలుగుఆకర్షణము సరిసమానముగ నుండునట్లు చేయవచ్చును. ఒకవేళ మనకీరెండు సూదంటురాళ్ల ఆకర్షణశక్తుల ప్రమాణమును తెలియకపోయినను ఇనుపముక్కపైన వీని యాకర్షణము సరిసమానముగా నుండవలెనన్న ఒకటొకటి ఎంతదూరమున నుండవలెనో కనుగొని వీని పరస్పరాకర్షణశక్తి ఇంతయని నిర్ధారణచేయవచ్చును. సమానాకర్షణము కలుగుటకు పెద్ద సూదంటురాయి చిన్నదానికన్న రెండింతలు దూరమునందున్నయెడల దానికి రెండింత లధికముగు ఆకర్షణశక్తి గలదనియు, మూడింతల దూరమునందున్న మూడురెట్లధికముగు శక్తి గలదనియు నిర్ధారణ చేయవచ్చును.

ఈ సూత్రముపైననే ఆధారపడి శాస్త్రజ్ఞులు వీని పరస్పరాకర్షణశక్తిని కనిపెట్టగలిగిరి. ఈయంశము పైనను, వీని అయతవృత్త మార్గమునకును (elliptic path) ప్రదక్షిణ కాలమునకును గల సంబంధముపైనను, ఒకటిరెండు ఇతరవిషయములపైనను ఆధారపడి శాస్త్రజ్ఞులు ఈనక్షత్రముల భారమును సరిగా కనుగొనగలరు. దుర్గ్రాహ్యమగు నీయంశము నింకను అధికముగ నిట చర్చింపబనిలేదు.

కాని ఈవిధముగ పరీక్షించి కనిపెట్టిన ఫలితముల సారాంశమేమో కొంత గమనింతము.

ఇదివరకెన్నియో నక్షత్రముల భారమును కనిపెట్టియున్నారు. కాని విచిత్రమేమన నక్షత్రములన్నియు ఇంచుమించుగా మన సూర్యుని యంతభారమునే కలిగియున్నవి. ఇతర నక్షత్రములలోగూడ వాని పరస్పర పరిమాణమునం దెంతయో భేదము గాన్పించుచున్నను, వాని భారమునందు మాత్ర మట్టిభేదము గాన్పించదు. భేదమే లేదని చెప్ప వీలులేదు. కొన్నిటికి సూర్యుని భారములో పాతికవంతుమాత్రమే యుండవచ్చును. మరి కొన్ని సూర్యునికన్న పదింత లెక్కువబరువుగ నుండవచ్చును. కాని ఇట్టి యల్పభేదములకును కాంతియందుగాని, పరిమాణమునందుగాని కావనగు అత్యధిక భేదములకును సంబంధమే లేదు.

ఒకటి రెండు ఉదాహరణములు ఈ విషయము నింకను స్పష్టము చేయును. మృగవ్యాధుడు (Sirius) అను నక్షత్ర యుగ్మములోని రెండు నక్షత్రములను పోల్చిచూతము. పరిమాణమున రెండవది (అనగా సిరియస్ బి. (Sirius B) మొదటిదానిలో సుమారు రెండు లక్షలపాళ్లలో (నిజముగ ౧,౮౦,౦౦౦) నొకపాలంత యుండును. సహజకాంతియందు మొదటిదాని కన్న దానిలో పదికేలింట నొకపాలుండునేమో. కాని

* ౧. సూర్యునికన్న అధికభారము గల నక్షత్రములను కొన్నిటిని శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. వీనిలో ప్లాస్కెట్ నక్షత్రము (Plaskett's Star) అనునది ముఖ్యము. ఇందు నిజముగ, రెండునక్షత్రములున్నవి. కాని రెంటిని గలిపినచో సూర్యునికన్న ౧౬౦ రెట్లు భారమధికముగ నుండును,

భారమునందుమాత్రము మొదటిది రెండవదానికన్న ౨౩ రెట్లుమాత్రమే యధికము. ఇంతచిన్న నక్షత్రము ఇంతభారము కలిగియుండుట యొకవిచిత్రమే. ఇందుకు కారణము దాని యధికసాంద్రతయే. నీటి సాంద్రతకన్న సూర్యుని సాంద్రత ౧౩ రెట్లధికము, గాని పైని పేర్కొనిన సిరియస్ బి (Sirius B) నక్షత్రపు సాంద్రత నీటిసాంద్రతకన్న ౫౦,౦౦౦ రెట్లధికముగ నుండును. ఈనక్షత్రమున నున్న పదార్థములో నొక చిన్న యగ్గిపెట్టెను నింపినయెడల అది రెండునూర్ల మణువుల కధికముగ నుండును. పూర్వశ్వానమునద్దనున్న నక్షత్రమింకను అధిక సాంద్రతగలది. అందున్న పదార్థములో నొక యగ్గిపెట్టెను నింపినచో నది బహుశః ౮౦,౦౦౦ మణువుల భారముండునేమో!

కాని యత్యల్పసాంద్రత గల నక్షత్రములుగూడ లేకపోలేదు. ఉదాహరణముగ జ్యేష్ఠా (Antares) నక్షత్రమును గైకొందము. దీని వ్యాసము సూర్యుని వ్యాసముకన్న ౪౭౦ రెట్లధికము. దీనినిబట్టి దీని పరిమాణమెంతయధికముగ నుండునో యూహించుకొనవచ్చును. దీని భారము మనకు సరిగా తెలియకపోయినను, సాధారణముగ ఇతరనక్షత్రములయంత యుండవచ్చును. ఒకవేళ ఇది ఇంకను బరువుగ నున్నదని దీని భారము సూర్యుని భారమునకన్న ౩౦ రెట్లధికమనియన్నను దీని సాంద్రత యత్యల్పముగ నుండును. యంత్రసహాయముతో ఇంచుమించుగ పూర్తిగ వాయురహితముగ జేసిన గాజుగొట్టపు అంతర్భాగమున సాంద్రత ఎంతయుండునో, దానికన్నను దీని సాంద్రత తక్కువగ నుండును. ఇంటిలి పదార్థములో నొక గూడ్సుపెట్టెను నింపినను అది రెండు మూడు తులములకన్న నెక్కువగ నుండజాలదు.

విశ్వవిచిత్రములు వర్ణనాతీతములు. నలభైవేల మణువుల భారముగల పదార్థమును ఒక చిన్న యగ్గిపెట్టెనిండ కుదించి చేర్చిపెట్టగలిగినయెడల అనంతకోటి బ్రహ్మాండములనుగూడ కుక్షిలోనికిజొప్పించి పరుండ సాధ్యమగునేమో విశ్వలీలాకారునికి.

[ఇంతవరకును నక్షత్రముల పరిమాణము, భారము, కాంతి మొదలగు విషయములను మాత్రమే చర్చించితిని; కాని నక్షత్రము లెట్టిపదార్థములతో చేయబడియున్నవో, ఎన్నిరకముల నక్షత్రములు గలవో అవి ఒకదానిపై నొకటిపడి నాశనముగాకుండ ఎట్లుండగలవో మొదలగు నంశములను చర్చించనైతిని. వాని నన్నిటినిగూర్చి రాబోవుసంచికయందు దెల్పెదను].

# మెండలీయము - రక్తస్పర్శ

యస్. యం. వేణు.

రమారమి ఆరేండ్లక్రిందట చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకాకుచేరిన ఉప్పరపల్లెగ్రామమునందు జనులు గాడను ఇర్లవాడు ఉన్నట్టులుండి స్త్రీగా మార్పుజెందె నను విషయము వార్తాపత్రికలయందు పాఠకులు గమనించియేయుందురు. వీ డిప్పటికిని సజీవుడుగనేయున్నా డు. వైద్యులు, ప్రభుత్వోద్యోగులు, ప్రజలు చాలమంది యీ విచిత్రమును జూచి ఆశ్చర్యనిమగ్నులైరి.

ఇరువదియొక్క సంవత్సరముల వయస్సుగల 'జెండాకాబ్కోవా' యను జకోస్లోవకియా నివాసిని నిపుణులగు వైద్యులచే జేయబడిన శస్త్రచికిత్స ఫలితముగ పురుషుడుగ మార్పుజెందినది. 'మిస్ కాబ్కోవా' అని పిలువబడుచుండిన స్త్రీ యిప్పుడు 'మిస్టర్ కాబెక్' అని వ్యవహరింపబడుచున్నది. ఈ మార్పునుగురించిన వార్తలు గడచిన ఫిబ్రవరిమాసమున పత్రికలమూలమున పాఠకలోకము గుర్తించియేయుండును. ఈవిడ లింగభేదమునందకముందు చిత్రము, తరువాతి చిత్రమును ఇట గలవు.

హాలండుదేశ ప్రాంతములందు కప్పలు పుట్టినప్పుడే లెక్కించినచో నూటికి తొంభై ఆడుకప్పలుగా నుండును. అవి పెద్దవైనతర్వాత గమనించినచో నూటికి ఏబది మగవి, తక్కినవి యాడువిగను ఉండును. వడిమి వయస్సుగల ఆడుకప్పలను కొన్నిటిని కడుపుచీల్చి పరీక్షింపగా నందుండవలసిన యండకోశమంతయు నశించి పోయి, దానిస్థానమున మగకప్పలకువలె విత్తనము లంకురించుటను విట్షి (Witschi) గారు కనిపెట్టిరి. చాల యేండ్లుగా గ్రుడ్లుపెట్టుచుండిన ఒకానొక కోడిపెట్ట ముసలితనమున పుంజుగా మారుటనుగూర్చి క్ర్యూ (Crew) గారు వ్రాసియున్నారు. ఈకోడి, పుంజువలె జుట్టును, ఈకలును పొందుటయేగాక, పుంజువలె కూయుటయు కోడిపెట్టలపై నెక్కుటయుగూడ జేయుచుండెడిదట!



కాబెక్



కాబెక్-ఆడుది, మగవాడు

ఇది చనిపోయిన తర్వాత లోపలి అవయవములను బరీక్షింపగా అండాశయముగాక సూక్ష్మబీజదములగు విత్తు లుండినవి. కొన్ని గొఱ్ఱెమందలలో నొకటి రెండు జంతువులు ఆడుదియు గాక మగదియు గాక యుండునట్టివి గానవగును. దీనిని గొల్లవాండ్రు "అల్లిపోట్టె" లందురు. మందలో

౨౯-౨-౩౬ తేదినాడు సాయంత్రము నేను మాయూరియందు (కార్వేటి నగరము) షికారు వెళ్లుచు దారిలో పైజెప్పిన అల్లిపొట్టేలి వంటిదానిని, ఆవును గాక ఎద్దును గాక యుండు ఒక దూడను జూచితిని. దీనికి ఎద్దుకువలె విత్తులు లేవు; ఆవుకువలె పొదుగుగాని, యోనిగానికన్పడలేదు. సాధారణముగా పశువులకువలె ఉండు తోకకు దిగువ జేనెడుపొడుగున మఱియొకతోక వంటి యాకారము మాత్రము గన్పడుచున్నది. ఇది వికృత రూపము దాల్చిన నిష్ప్రయోజనకారియగు విత్తులేయని నే నూహించెదను.

దీని యునికి యదృష్ట సూచకమట. ఇది గొఱ్ఱెలవలె పిల్లల నీనదు; పాలనివ్వదు. పొట్టేలి

వలె గొఱ్ఱెలపై బొర్లించుటకును పనికిరాదు. తెగతేరరు కసవుమేసి బలసియుండును. కసాయివానిచేతికి బోయి నప్పుడుదప్ప నితరవిధముగ నిది ఎందునను వినియోగ పడదు. ఇది కంచరగాడిదవలె రెండుభిన్నజాతులనుండి జనించినది గాదు. తక్కినవానివలె సహజముగా మంద లోని పొట్టేలిచే బొర్లింపబడిన గొఱ్ఱెకే పుట్టియుండును.

క్రిందటిసారిచెప్పినట్లు కలుగబోవుశిశువు స్త్రీ గానున్నదియు, పురుషుడు కానున్నదియు స్థూలసూక్ష్మ బీజాళయసమ్మేళనమప్పుడే స్థిరపడిపోవునో, పైజెప్పిన మార్పులు కలుగుటకవకాశమెక్కడిది? ఈవిచిత్రము లను ప్రకృతిశాస్త్రసహాయమున నెట్లు సమర్థింప నగును?

స్త్రీపురుషనిర్దేశవిషయమును గూర్చి పలువురు శాస్త్రవేత్తలు పలువిధముల నభిప్రాయపడిరి. వారెల్లరు జేసిన ప్రయోగములను వరుసగా నీక్రింద వివరించుచు పైనచేర్కొన్న సృష్టివిపరీతములకు గారణముల నచ్చ టచ్చట వివరింతును.

గర్భాంతర్భాగమున పిండోత్పత్తికి బూర్వమే జరుగు స్థూలసూక్ష్మబీజాళయసమ్మేళనమప్పుడే లింగము స్థిరమైపోవునా, లేక పిండోత్పత్తిఅనంతరమును, శిశు







చిత్రము ౨౭

బోనల్లియా. (Bonellia)

A. మగది B. ఆడుది

జననమైనతర్వాతను బాహ్యప్రేరణవలన లింగభేదము కలుగవచ్చునా? అనునది ప్రప్రథమమున విచారణీయాం శము. బోనల్లియా (Bonellia) యనునది సముద్రమున నివసించు ఒకపురుగు. దీనిస్వరూపము ౨౭. వ చిత్ర మున జూపినరీతిని కానవచ్చును. రెండుగా చీలియుండు కొన గలిగిన యొక తొండమువంటి యవయవము దీని నోటియందుండును. ఇది యాడుది. దీని నంటుకొని యుండి దీనికంటె చాలరెట్లు తక్కువయాకృతిగల మఱి యొకక్రిమి (చూడుము చిత్రము ౨౭) ఈ జాతిపురుగు లలో మగది. సుమారు పదునెనిమిది అంగుళముల పొడవుగల ఈయాడుదాని అండాగమనాళికయందు (Genital duct) ఈమగది పరాన్నభుక్కు (Parasite) గా జీవించును. ఈక్రిములు జీవితారంభమున గ్రుడ్లనుండి బయటికి వచ్చినదే ట్రోకోఫోర్ (Trochophore) అను 'లార్వా' (Larva) (చూడుము చిత్రము ౨౮.) యాకారము దాల్చియుండును. ఈయవస్థయందుండు నపు డీజంతువులకు స్త్రీపురుష భేదములు లేనేలేవు. ఇవి కొంతకాలము విచ్చలవిడిగా సముద్రమునం దీదు




చిత్రము ౨౮

ట్రోకోఫోరు లార్వా

నో=నోరు, క=కడుపు, పృ=పృష్ఠము.

చుండి తరువాత సముద్రముక్రిందిభాగమున నానుకొని పురుగులుగా మార్పుజెందును. ఇట్లీట్రోకోఫోరు అవస్థ యందుండునప్పుడైనను ఆడుదియగు బోనల్లియా తొండ ముపై నానుకొనినట్లాయెనా, యాలార్వా మగబోనల్లి

యాగా పరిణమించును. అట్లులేక ఆలార్వా సముద్రము క్రిందిభాగమున నేలనిరాతికిగాని, మంటికిగాని అతుకొనినా, అది యాడుదిగా పెరుగును. స్వేచ్ఛజీవిత స్థాపనకై నేలనంటికొనిపోయిన యీ బ్రోకోఫోరను కొన్నినాళ్లయనంతరము వెలుపలికి దీసి ఒక యాడుబోనల్లియా తొండముపై నిడుచో నది సంపూర్ణముగా మగదిగా పరిణమించక, కొన్నినాళ్లు స్వేచ్ఛావృత్తిని మసలుటచే ఆడుదిగను, మఱికొన్నినాళ్లు పరాన్నభుక్కుగా నుండుటచే మగదిగను పెరిగి ద్వైలింగయుతము (Hermophrodite) గా పరిణమించును. ఈపురుగులలోని యీవిచిత్రప్రవర్తనను బట్టి వానిలోని స్త్రీపురుషభేదము స్థూలనూక్ష్మ బీజాళుసమ్మేళనమప్పుడు గాక వానిజీవయాత్ర ప్రారంభమైన తర్వాత వానిజీవిత విధానము ననుసరించి యుండునను సంగతి స్పష్టమగుచున్నది. ఒకేఒక బ్రోకోఫోరు స్వేచ్ఛావృత్తిని జీవింపవలనుపడినా స్త్రీగా నెదుగును, పరాన్నభుక్కయ్యెనా మగదిగా పెరుగును; ఇటు కొన్నినాళ్లు, అటు కొన్నినాళ్లు మనెనా ద్వైలింగయుతమగును.

'ఇనాకస్‌స్కార్పియో' (Inachus scorpio) యనునది మధ్యధరాసముద్ర ప్రాంతమునయందు నొకవిధమైన పీత. (చూడుము చిత్రము ౨౯) 'సాకులైనా నెగ్లెక్టా' (Sacculina neglecta) యనునది యీపీతలను పీడించుకొని జీవించునట్టి ఒకవిధమగు పరాన్నభుక్కు. సాకులైనా యనునది లార్వాయవస్థయం దున్నపుడు జలమందు విచ్చలవిడిగా నీదుచు, పొడవైన కింజల్కములను (Antinnae), కండ్లను నీటిలో నీదుటకు దగిన కాళ్లను గలిగియుండును. ఈయవస్థయందున్నప్పు డిది ఇనాకస్ పీతలలో నేదని ఒకదాని కడుపుక్రింద చేరుకొనినచో నది తన కింజల్కములను, కండ్లను, కాళ్లను గోల్పోయి తన సంతానవృద్ధికై వలసినగ్రుడ్లచే నిండిన యొకతిత్తిగా నేర్పడిపోవును. తనకు కావలసిన యాహారమును పీతదేహములోనికి సన్నని గొట్టములను దింపి వానిద్వారా పీతరక్తమునుండి గ్రహించును. సాకులైనాచే నావహింపబడిన పీతలు జబ్బుపడినట్లుండి ముఖ్యముగా తమ విధ్యుక్తకర్మలగు సంతానవృద్ధి మొదలగు చేష్టలదక్కి, ఆహారసంపాదనకు మాత్ర మటునిటు నడయాడుచు కంఠగతప్రాణులై పడియుండును. ఈవిధముగ తనరెండేండ్ల జీవితకాలము నీసాకులైనా గడిపి తరువాత నది పీతనుండి రాలిపోవును. ఇట్లు వింతపరాన్నభుక్కులగు పీతలు ఆపైన మఱికొన్నినాళ్లు జీవించును. ఇట్లు జీవించినవానిలో సాకులైనాచే నావహింపబడిన పీత కర్మముచాలక మగదిగా నుండుచో, సాకులైనా రాలిపోయిన యనంతరము అది ఆడుదిగా మారును. దేహములో నుండిన మగచిహ్నములగువిత్తులు నశించి యాస్థానమున గ్రుడ్లు కనబడును. గ్రుడ్లుండుటకు దగినట్లు పొట్ట పెద్దదగును. సాకులైనా సోకినపీత మగదిగాక ఆడుదిగనే యుండుచో నెట్టి లింగభేదమేమియు జరుగదు. అది మరల నారోగ్యస్థితి




చిత్రము. ౨౯

ఒ ఇనాకస్ పీత

అ. ఆడుపీత, } కడుపులు—ఆరోగ్యస్థితియందు
ఆ. మగపీత } సాకులైనా అంటకముందు

ఇ ఆడుది } కడుపులు—సాకులైనా
ఈ. మగది } రాలిపోయినతర్వాత

(ఆడుదిగామారినది)

నంది స్వరూపమునందును, దేహ తర్భాగములందును ఏలాటిమార్పును జెందదు. సాధురైనా యునికిచేత పీతల యందు జరిగిన యీ విచిత్రపరిణామమునుగూర్చి జియొఫ్రీ స్మిత్ (Geoffrey Smith) గారిట్లు అభిప్రాయపడిరి. "ప్రతిమగపీతయు తనలో స్త్రీత్వమును కలుగజేయు కొన్నివస్తువిశేషములను రక్తమునందు కలిగియుండును చూపరులకు ఆకారమునందును, అవయవ సంప్రదాయములందును అది మగదిగాకనబడినను నిశ్చయముగా నది ద్వైలింగముగ నెన్నదగును. ఈపీతలలోనుండి పరాన్నభుక్కగు సాధురైనా పురుషత్వముచేకూర్చు వస్తువిశేషములను నిశ్శేషముగ పీల్చివేయును. ఇట్లీపీతలలో పురుషత్వము చేకూర్చువస్తువిశేషములు రక్తమునుండి పీల్చివేయబడుటచే నంతకుముందణగద్రొక్కబడిన స్త్రీత్వము ప్రబలమై సాధురైనా రాలిపోయినతర్వాత మగదిగానుండినపీత ఆడుదిగా మారుచున్నది." మీద పేర్కొనిన జడలుగాడి లింగభేదమునకు సహితము వాని రక్తమునందు గలిగిన యిట్టిమార్పే కారణమని చెప్పవచ్చును జియొఫ్రిస్మిత్ గారి యూహలో కొంత యథార్థము లేకపోలేదు. కాని యిది ఎల్లెడలను అనువర్తించుటమాత్రము సంశయాస్పదము. ఏలననగా కొన్నియెడల ఆడుది మగదిగామారుటయు గలదు క్ర్యూగారు వ్రాసియున్న కోడిపెట్టవిషయమై యీవఱకే మనము చదివియున్నాము. జియొఫ్రీ స్మిత్ గారు మగజీవిలో స్త్రీత్వమును కలుగజేయు కొన్నివస్తువిశేషము లడగియుండునని తలచినట్లు, మన మిప్పట్టున స్త్రీలలో పురుషత్వమును కలుగజేయు కొన్నివస్తువిశేషము లడగియుండునని యూహింపవలసియుండును. లేకున్న క్ర్యూగారి కోడిపెట్ట పుంజుగామారినవిషయమును సమర్థింప వలనుపడదు. మానవులలోసహితము మగవారిలో కొన్ని ఆడుగుణములు, ఆడువారిలో కొన్ని మగగుణము లున్నవనుట నిస్సందేహము. చాలమంది వయస్సుమీరినముసలమ్మలకు మీసములు, గడ్డములు కనబడుటను మనము చూచియే యుందుము. బిడ్డలనుగను కాలము పూర్తిఅయినందుచేత వారిలో నంతవఱకు ప్రబలముగా నుండిన స్త్రీత్వము దుర్బలమైపోవుటచే అణగద్రొక్కబడియుండిన పురుష చిహ్నము లప్పుడు బయల్పడజాలును.

మానవులలోనుండు స్త్రీపురుష మిశ్రమములు మనిషిమనిషికి భేదించుచుండును. కొందఱు సంపూర్ణముగ మోటుతనముగల మగవారుగ నుందురు. ఇట్టి వారినే అమెరికావారు 'మగపురుషులు' (Hemen) అని పిలుతురు. మఱికొందరు సంపూర్ణముగ సరళమగు స్త్రీలుగా నుందురు. ఇందును అందును చేరక మిశ్రితములగువారును ఉందురు. ఇట్టివా రుండబట్టియే గాబోలు మగది (మగవానివలె వర్తించు ఆడుది) "ఆడవాడు, లేక ఆడంగివాడు" (ఆడుదానిచేష్టలుగల మగవాడు) అను పదములు వ్యవహారములోనికివచ్చినవి.

రిచర్డ్ గోల్డ్ స్మిడ్ట్ (Richard Goldschmidt) గారి పరిశోధనలు పైసంగతులను రూఢిపఱచుచున్నవి. వారీవిషయమై యిట్లు నుడువుచున్నారు "ప్రతివ్యక్తియు ప్రప్రథమమున ద్విలింగయుతముగనే యుండును. అది పెరుగుకొలది దానిరక్తమునందలి యుత్పన్నమగు లింగకారకవస్తువిశేషములు (Sexual harmones- 'సెక్ష్యుయల్ హార్మోన్స్') అనబడువానిపై ఆవ్యక్తి స్త్రీకానున్నదియు, పురుషుడు కానున్నదియు ఆధారపడియుండును.

హెర్ట్విఙ్గ్ (Hertwing) గారు కప్పలలో జేసిన పరిశోధనలు, రిచర్డ్ గోల్డ్ స్మిడ్ట్ (Richard Goldschmidt) గారి జపాన్, ఉత్తర అమెరికా, యూరోపా దేశములందుండు ఒక విధమగు శలభములోని ప్రయోగములును, మార్గన్ (Morgan) గారి 'డ్రోసొఫిలా' ఈగలలోనిపరిశీలనలును, మఱియొక విషయమును చాటుచున్నవి. స్థూలసూక్ష్మ బీజాశయములు రెండింటిలోను స్త్రీపురుష భేదము లున్నవని వారి పరిశోధనలు తెలుపుచున్నవి. మఱికొందఱు ప్రాణులలోని స్త్రీపురుష భేదములు మెండెలుగారి ప్రబలగుప్త గుణములవలె తరతరములకు మారుచుండు ననిరి. ఫూట్ (Miss Foote), స్ట్రొబెల్ (Miss. Strobell) కన్యల పరిశోధనలు కొంతవఱకీధోరణి ననుకరించుచున్నవి. కాని మెండెలుసూత్రములు స్త్రీపురుష నిర్ణయములో ననువర్తించుననుట యసంభవము.

అల్లిబొట్టేలిపంటి దృష్టాంతములు మానవులలో సైతము గలవు. స్త్రీలలో గన్పడు మాచకమ్మలు, పురుషులలోని నపుంసకులు ఇట్టితెగకు చేరినవారే. వీరిలోని యపూర్వ పరిస్థితులకు ముఖ్యకారణములు పుట్టుటకు పూర్వమే తల్లిగర్భమున పిండమునకు కావలసిన రక్తప్రసారములోనిలోటును, "సెక్ష్యుయల్ హార్మోన్స్" (Sexual harmones) వలని లోపములేకాని వేరొండు గాదు. ఇట్టి వారియందు శస్త్రచికిత్సకాని, ఔషధసేవగాని ఏమాత్రము లాభించదు.

# ఆంధ్రభాషాసేవ*

సారస్వతము చదువరుల కానందమునిచ్చుట కేర్పడినది. మనమెన్ని భాషల నభ్యసించినను, ఆభాషాకావ్యములలో గల రసము నాస్వాదింపగలిగినను, స్వభాషలోని పద్యము చదివినప్పుడు కాని కీర్తన విన్నప్పుడు కాని జనించిన యానందముతో సరిపోవునది మఱియొకటి లేదు. మన ముగ్గుపాలతోనే భాషను నేర్చితిమో, చిన్ననాటనుండియు తలిదండ్రులతోను, అక్కచెల్లెండ్రతోను, ఏమాటలలో కష్టసుఖములను చెప్పికొనుచుంటిమో, అది మనకు స్వాభావికమగు భాష. ఆకలిగానున్నవాడు కారణాంతరముచే భోజనము దొరకక యంగడిలోని ఫలాహారములను వేర్వేరు దినుసులను రుచిచూడవచ్చును. కాని గుడికిల్లుచేరి కొంచెము పెరుగుతో రెండు కబళములు మ్రింగినపుడే యాతని యాకలి తీరినట్లుండును. ఆరీతిగనే మన భాషలో పాటపాడినను ఇతరులు పాడుచుండ వినినను గలుగు సుఖమున కదియే సాటి. హైదరాబాదు రాష్ట్రములో సగము ప్రజలు తెనుగు మాతృభాషగా గలవారగుటచే ఎవ్వరికి శక్తికొలదిని వారు మనభాషను పోషించి యాంధ్రభాషాభ్యుదయమునకు దోడ్పడుట విద్యార్థుల ప్రథమకర్తవ్యమై యున్నది. వారితరభాషలను చదివిన చదవవచ్చును. చదువవలసినదే.

## మాతృభాషను మాత్రము మఱువరాదు

ఆంధ్రభాషాసేవకులను మూడుతరగతులుగా విభజింపవచ్చును. పూర్వముమాట యటుండనిచ్చి నవ్యాంధ్రసాహిత్యస్థితిని పరిశీలించితిమా, అది యున్నతస్థానమ నలంకరించి యున్నదని చెప్పజాలము. ఆంగ్లము మొదలగు యూరపుఖండమందలి భాషలు రాజకీయాది కారణములచే దేశదేశములయందు వ్యాప్తి జెంది యుండుటయే కాక సాహిత్యలోకమం దత్యంత కీర్తిని సంపాదించియున్నవి. భౌతికవిజ్ఞానమును బోధించు గ్రంథములేమి, పద్య, గద్య, కావ్యములేమి, వేనవేలు కలవు. మనమున్ననో పాశ్చాత్యభాషలమీద నాధారపడి యున్నాము. ఈ శాస్త్రములన్నియు సాధ్యమయినంత త్వరలో నాంధ్రీకరింపబడవలెను. ఆంగ్లము రానివారు మనదేశమందు పెక్కుమంది కలరు. ఆభాష వచ్చినను రాకున్నను స్త్రీపురుషులు సులభముగా నాధునిక విజ్ఞానమును సంపాదించుటకుగాను గ్రంథములు రచియింపవలయును. ఒకానొకప్పుడు ఐరోపాఖండవాసులందఱును సాహిత్యవిషయములో గ్రీసు రోముల నాశ్రయించి యుండిరి. క్రీస్తుశకము ౧౬ వ శతాబ్దమందు షేక్స్పియరు మొదలగు నాటకకర్తలు బయలుదేఱుటచే 'నేటికిక దా మేము లేనిదే లోకము లేదని గర్వించియున్న గ్రీసురోములకు మనము జోహారులొనర్పవలసిన బాధ్యత తగ్గినదని యొకయాంగ్లేయకవివరుడు తనసంతోషమును వెలిబుచ్చినాడు. ఆవిధముననే యెన్నటికయిన మనతెనుగు సర్వతోముఖముగ నభివృద్ధి జెంది, ఇంగ్లీషు, జర్మను, ఫ్రెంచి మొదలగు పశ్చిమభాషలతో నీవా నేనా యని పోరు సలుపగలుగునా యని వేడుచుందుము. ఈ సందర్భమున కీ॥ లక్ష్మణరాయని నిర్యాణము తెనుగుప్రజల దురదృష్టమేయని చెప్పవలెను. మఱియు, నితరభాషలలోని యుత్కృష్ట విషయములను మనమాంధ్రముద్వారా గ్రహించినట్లుగా మనసారస్వతములోని చమత్కృతులను కొన్నింటిని ఆంగ్లాది యితరభాషలలోనికి మార్చుటయు నుపయోగకరమగు కార్యము. దీనినిగూర్చి శ్రద్ధ వహించుచున్న త్రివేణీపత్రికాధిపతులకృషి ప్రశంసా

---

* ఇటీవల ఉస్మానియా యూనివర్సిటీ తెనుగుసంఘమువారి యెదుట నీయబడిన ఉపన్యాసములోని ముఖ్యాంశములు : శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారధ్యక్షత వహించి యుండిరి.

పాత్రము. కాని యెల్లరకును గ్రంథములు రచియింపగల శక్తి సామర్థ్యము లుండవు. ఈరెండవతరగతివారు మాతృభాష నభ్యసించి వానిలోని గ్రంథములను జదువుచుండుటయే భాషాసేవచేయుట యనవచ్చును. ఈమాత్రమను వీలులేని మఱికొందఱుకలరు. ఉదరపోషణమే కష్టముగానున్న ఈ దినములలో జనబాహుళ్యమునకు ప్రత్యేకముగా నాంధ్రభాషాకృషిచేయుటకు వ్యవధి లేకపోవచ్చును. కాని స్వభాషయందభిమానమును వీడక పండితులయందును, కవులయందును సానుభూతియు నాదరమును జూపగలిగినచో వారును బూజ్యులే. ఒక పర్వదినమున తీర్థయాత్రకు పోయియుంటిమనుకొనుడు. కొందఱు దేవాలయములోనికి బోయి యభిషేకాది కార్యములను జక్కగా నిర్వర్తించెదరు. జనసమ్మర్దముచే మఱికొందఱు బయటనే నిలచిపోయి 'దేవదేవా, నీ సందర్శనముచేసి ధన్యతనొందవలయునని దూరమునుండి వచ్చితిమి. లభింపలేదు. అశక్తులము. రక్షింపుము.' అని ప్రార్థించినవారు ముక్తి పొందరా? కాశికి పోయినవారికి గొప్పపుణ్యము. పోవలేనను మతూహలము గలవారికిని పుణ్యమేయని లోకోక్తి కలదు. ఇట్టి యభిప్రాయమునే మిల్టనుకవి పూర్వమందు చక్కనిపద్యములోనిమిడ్చెను. "అక్కటా! సగముకాలము దాటకమునుపే యంధుండనయితిని. పరమేశ్వరునిచే బ్రసాదింపబడిన స్వల్పజ్ఞానముతో నాతనిమీద కృతినిగూర్చి తన్మూలమున తరింపనెంచితిని. సమకూడినది కాదు. జన్మ నిరర్థకమయ్యెగా!" ఇట్లు వగచి వగచి తుదకు ధైర్యము తెచ్చికొనెనట. "కాదు కాదు. అసమర్థుడనగు నాయొద్దనుండి పరిపాలకుడు పూర్తియగు కప్పమును వసూలుచేయునా? అతని సేవకులెందఱు లేరు? 'ఓ' యనినంత మాత్రమున కోటిమంది యాతని పాదములకడ వ్రాలగలరు. జగత్ప్రభునకు మనకానుకలతో బనియేమి? తండ్రీ నీదేభారమని నిజమైనభక్తిగలిగి దూరమున నున్నను వారికి ముక్తినిచ్చును."

ఆంధ్రభాషనుగురించి ముచ్చటించునపుడు సంస్కృతమునుగూర్చి యించుక ప్రసంగింపక తప్పదు. ఆంధ్రగీర్వాణములకు గలమైత్రి యెల్లరకును విశదమే. ఆంధ్రముతోబాటు సంస్కృతమునుగూడ మనము మాతృభాషతో సమానమైనదానినిగా పరిగణింపవలసినదే. అది చక్కనిభాష. దేవభాషయనియు గైర్వాణి యనియు చెప్పుట యర్థరహితములగు మాటలు కావు. 'మృతినొందిన భాష' యనికొందఱు తృణీకరించుట చూచియున్నాము. సంస్కృతములోని ముఖ్యకావ్యములు గ్రంథములలోని కనువదింపబడినవికదా యిక సంస్కృతమేలయని మఱికొందఱు వాదించుటయు వినియున్నాము. మన కీయుక్తివాదములతో బనిలేదు. పర్వతరాజసు హిమవంతుడును నదీరాణియగు గంగాస్రవంతియు నెంతకాలము సజీవులయియుందురో యంతకాలమును సంస్కృతభాష నిలచియే యుండును. ఆమె వ్యాసాదిమహర్షులను గాళిదాసాది సత్కవులను జనించిన పవిత్రగర్భ. మనసాహిత్యమును, భాషను, రెండుభాగములుగా విభజించి సంస్కృతభాగమునకును తెనుగుభాగమునకును వేర్వేరు వసతులేర్పాటు చేయుట పొరబాటు. ఈ రెండుభాషలమైత్రియు క్షీర నీర న్యాయమువంటిది. వీనిని విడదీయుటకు రాజహంసలు కావలెను. మనము మానససరోవరమునకు పోజాలము. పోయినను బ్రయోజనముండదు. కాబట్టి యాంధ్రయువకులు వ్యవధికల్పించికొని కొంచెమయినను సంస్కృతజ్ఞానమును సంపాదింపవలెను. ఇంగ్లీషుభాష మనదేశపుభాష కాకపోయినను దానిలో జక్కని వ్యాసములు వ్రాసినవారికి బహుమతినిచ్చుచున్నాము. వక్తృత్వ పరీక్షలు నడిపించుచున్నాము. విద్యార్థులలో సంస్కృతాభిమానమును బురికొల్పుటకు విద్యాధికులు జాగ్రతగా నాలోచించి తగినమార్గముల నేర్పాటు చేయవలెను. సంస్కృతమును ద్రోసివేయరాదు.

దీనివలెనే 'ఆంధ్రులు వేరు తెలుగువారు వేరు' నను వాదము లేకపోలేదు. దానియందు పెద్దపెద్దలు కొంద ఱుత్సాహమును జూపియున్నమాట నిజము. ఈపదముల కాదిని వ్యుత్పత్తి లేమయియుండినను ఇది రెండును ప్రస్తుతమం దొకజాతినే సూచించును. పరిశోధకులు తమ వినోదముకొఱకు పూర్వచరిత్రను. దానిలోని గాథలను బరీక్షించి యేమిచెప్పినను జెప్పవచ్చును.

## ఆంధ్రపత్రిక ఈశ్వర సంవత్సరాది సంచిక

ఎప్పటివలెనే రాబోవు ఈశ్వర సంవత్సరమునకు సంవత్సరాది సంచికను ప్రకటింప బోవుచున్నాము. అందు సారస్వత, సాంఘిక, రాజకీయార్థికాదివిషయములకు సంబంధించిన వ్యాసములు ప్రకటింపబడును. భాషాభిమానులు పూర్వమువలెనే దయయుంచి అమూల్యములగు తమ వ్యాసములతో సంచిక నలంకరించి మా యుద్యమమునకు దోడ్పడ బ్రార్థితులు.

సంచికయందు విషయవిభాగమును గావించి యేవిభాగమునకు సంబంధించిన వ్యాసముల నావిభాగమునందే ముద్రించి సంచికను సంవత్సరాదినాటి కాంధ్రుల కర్పింప దలచినాము. వ్యాసములను రాబోవు నవంబరు 15 వ తేదిలోపల మాకందజేయ వేడికోలు. నియమితకాలమునకు పూర్వమే వ్యాసములన్నియు మాకు జేరినగాని విషయవిభాగమును గావింప ననుకూలము కానేరదు. సంచిక ముద్రణ మారంభించిన పిదప బంపు వ్యాసములను సంచికయందు జేర్చుటకు వీలుండదు.

కాబట్టి వ్యాసములను, వ్యాసముల చిత్రములను, ఇతర చిత్రములను సంపూర్ణ వివరణములతో నియమితకాలమునకు బూర్వమే మాకు పంప బ్రార్థన. కా. నాగేశ్వరరావు,

ఆంధ్రపత్రికాధిపతి.

ప్రతివ్యాసమునను 'సంవత్సరాది సంచికకు' అని వ్రాసియుండవలెను.

కాని యిప్పటిమాత్రము 'ఆంధ్రమనగా తెనుగు; తెనుగనగా ఆంధ్రము' ఒకపదార్థమునకే వాడుకలో రెండు నామము లుండవచ్చును. సరస్వతికి భారతి యను నామాంతరమున్నది. జానకియనియు సీతయనియు లోకమాత పిలువబడుచున్నది. కాబట్టి యింతకాలము గడచినతర్వాత తెలుగును ఆంధ్రమనగూడదనియు, తెలుగువారాంధ్రులు గారనియు వాదింపబూనుట వృథాయాసమగును. దీనిని గ్రహించియే దొరతనమువారు నయితము తెనుగుజాతికిని, తెనుగుభాషకును పురోవృద్ధి కొఱకు నుద్దేశింపబడిన విద్యాసంస్థను 'ఆంధ్ర విశ్వవిద్యాలయ' మనిరి.

విద్యార్థులు వ్యాసములను వ్రాయునపుడు చక్కని శైలిలో వ్రాయుటకు యత్నింపవలెను. ఇటీవల సుమారు ౨౫ సం॥లనుండి గ్రామ్యగ్రాంథికభాషలకు జరుగుచున్న పోరాటము తెలిసియే యున్నది. దానిని గూర్చిన చర్చలోనికి దిగ నుద్యమింపనుగాని చిరకాలమునుండి బాధించుచున్న రెండుమూడు విషయములను మనవి చేయుదును. 'వాడుక భాష'లోని పదములు గ్రంథములకు పనికిరావని చెప్పను. మనము నిత్యమును మాటలాడు భాషకును పుస్తకములలో వాడవలసిన మాటలకును మధ్యను అడ్డుగా గోడకట్టి వానికి పరస్పరసంబంధము లేకుండ చేయవలెననియు నాయభిప్రాయము కాదు. 'వ్యావహారిక భాష' యనగా బజారులలోను కోర్టులలోను ఇతర వ్యాపారములందును మనమీ దినములలో వాడు 'మిశ్రమ' భాషయని యూహించినయెడల నట్టిది శాశ్వతముగా నిలువవలసిన గద్యపద్య కావ్యముల కుచితమగునా? శైలి యనునది భావము ననుసరించి యుండును. విషయమునుబట్టి శైలి మారుచుండును. సేవకులతో మాట్లాడునప్పుడును, పెద్దల సన్నిధి నున్నపుడును, స్త్రీలతో ప్రసంగించునపుడును, ఆయా పరిస్థితులనుబట్టి యనుకూలములగు పదముల నుపయోగింతుము. ఎప్పుడు మాట్లాడినను సందర్భము ననుసరించి నియమములకు లోబడియుందుము. నవీనులమని లేనిపోని గర్వమును దెచ్చిపెట్టికొని విశారముగా వ్రాయుట భాషాభివృద్ధికి దోడ్పడదు. రాజ్యములే ప్రజల యిష్టానుసారము పరిపాలింపబడుచున్నవి కనుక, వాఙ్మయము బహుజనాభిప్రాయమున కొదిగి యుండవలెయునని కొందఱు వదించుచున్నారు. స్వాతంత్ర్యము దేశములయొక్కయు, ప్రత్యేకవ్యక్తులయొక్కయు, పరమావధియయి యున్న దినములలో కట్టుబాటు లేలయని మఱికొందఱు ప్రశ్నించుచున్నారు. మహాకవులమాట వేరు. వారు నిబంధనలను లెక్కపెట్టక పోవచ్చును. వ్యాకరణము వారికే లొంగియుండును. పదప్రయోగముల విషయమున వారు సృష్టికర్తలనవచ్చును. కవులెప్పటికిని నిరంకుశులు. వారిభాషలో లోపములే యున్నయెడల 'ప్రమాదో ధీమతామపి' యను నార్యోక్తిని మఱువదగదు. మరియొక విషయము. తెనుగుభాష చాలదేశము వ్యాపించి యున్నది. ఒక జిల్లాలోని వ్యావహారికభాషను దేశమంతయును అంగీకరించుటయా లేక ఒక్కొక్క జిల్లావారు వారు తమతమ యిష్టప్రకారము వ్రాయుటయా యని విచారింపవలెను. మనము రచియించుగ్రంథ మాంధ్రభారతి ధరించెడి కుసుమమాలలో నొక పువ్వుము కావలెనని తలంచితిమా చక్కని శైలి యుండవలెను. అది యఖిలాంధ్రదేశము యొక్క యంగీకారమును బడయవలెను. చెన్నపురి రాజధానిలోని ౧౨ మండలములు, నిజాము రాజ్యములోని ౮ జిల్లాలు, మైసూరిలోని కోలారు మధ్యరాష్ట్రములలోని చాందాలోని ప్రజలకే కాక ద్రవిడదేశములోను ఇతర భాగములలోను నివసించుచు తెనుగునే యాశ్రయించియున్న యాంధ్రుల కందఱికిని రుచికరముగా నుండవలెను. ఆయాప్రాంతములవారు తమతమ సీమలయందు ప్రత్యేకముగా వాడబడుపదముల నక్కడక్కడ వాడిన వాడవచ్చును. ఒంటిమిట్టలోని పోతనయు, నెల్లూరి వాస్తవ్యుడగు తిక్కనయు, రాజమందిరమునందలి నన్నయయు, తంజావూరి త్యాగయ్యయు నాంధ్రులందఱి మన్ననలకు పాత్రులయిరి. ఆధునికమందును, గోదావరీ తీరస్థులగు కందుకూరి చిలకమర్తులను, బళ్లారి పురవాసియగు కృష్ణమాచార్యుడును, తమతమ గ్రంథములచే పూర్ణాంధ్రదేశములో తమకీర్తినివ్యాపింప జేయలేదా? ౨౬-౧౧-౧౯౩౫ తేదిని బొంబాయిలో జరిగిన కర్నాటక

సాహిత్యసభలో అధ్యక్షపీఠము నలంకరించిన ఎస్. ఎస్. సుబ్బారావు గారు కన్నడమునుగురించి యీ యభిప్రాయమును వెల్లడించిరి. సుబ్బారావుగారు మైసూరులో విద్యాశాఖాధికారులు, విద్వాంసులు. నవీన సాహిత్యమందు మిక్కుటముగు నభిమానము కలవారు.

"కర్నాటకములో వేర్వేరు సీమలయందు వసించు కన్నడులకందఱకును గాఢమైత్రిని పెంపొందింపవలెనన్నచో, మనభావమును, వాఙ్మయమును, ఏపద్ధతుల ననుసరింప వలసియుండునని యోచన చేయవలెను. మన మభివృద్ధిజెందవలెనని కోరునపుడు, హిందూదేశములోనున్న రాష్ట్రీయులతో వైరమెంత మాత్రమును కూడదు. మనతో కలసి మెలసి నివసించుచున్న యల్పసంఖ్యాకులగు అన్యభాషలవారి యాశయములకు భంగములేకుండ, కన్నడము మాతృభాషయగు వారందఱియందును ఐకమత్యమును గలిగించుటెట్లు? శబ్దజాలము, ఉచ్చారణము, వ్యాకరణము, భాషాప్రయోగము, ఇత్యాది విషయములలో నియమముగు భాషను క్రమముగా నిర్మాణముచేయుట మంచిది. టంకసాలలో ముద్రితమగు నాణెములు దేశమంతటను వర్తకమందు 'చలామణి' అయినట్లు, 'గ్రాంథిక వ్యాపారమునందు' అందఱిచేతను అన్నిభాగములందును అంగీకరింపబడిన శబ్దములను వాడినయెడల నది యుపయోగకరముగా నుండగలదు. మనకు సాధ్యమయినచో, మైసూరు, ధార్వాడ, ఉత్తర దక్షిణ కన్నడములు, ఈ మూడింటికిని భాషావిషయమగు నేకత్వమును సంపాదించుటకు యత్నింపవలెను. కర్నాటకములోనివి పెద్దఖండములగుటచే వీనినిమాత్రమే సూచించితిని. దీనికి సాధన మెద్ది? ఎంతిపండితుడయినను ఒక 'నియంత' వలన లాభములేదు. నలుగురితో కూడిన పరిషత్తు నేర్పాటు చేయుట శ్రేయస్కరము. పరిషత్తనగా తిరుగలివంటిది. పని నెమ్మదిగా నడచును. పూర్తియయిన తర్వాత పిండి మెత్తగానుండును. ఈ విద్వత్సంఘమందు అన్ని భాగములవారును నియమింపబడవలెను. ఈ సభ్యులు పట్టుదలలను విడిచి 'వారికివీరు వీరికివారు' అనినట్లుగా పరస్పర స్నేహభావముతో సంచరింపవలెను. కాని యింత మాత్రముతో చాలదు. ఎంతచెప్పినను ఈ పద్ధతి యెంత స్వాభావికమయినదని చెప్పజాలము. మనము ప్రత్యేకముగా కల్పించినదే యగును. కర్నాటకమందలి వివిధ ప్రాంతములవారు తఱచుగా సమావేశమగుట కవకాశములు సమకూర్చుట యింతకంటె నెక్కువ యుపయుక్తమని తోచుచున్నది. ఒకసీమవారి యుపన్యాసములను మఱియొక సీమవారు వినుట, ఒకరి గ్రంథములను మఱియొకరు చదువుట. నాటకము సినీమా రేడియో ద్వారా మనము కృషి చేసినచో క్రమముగా నన్నిసీమలవారికిని అర్థమగు గ్రాంథికభాష నిర్మాణము కాగలదు. మధ్యమధ్యను, ఒక్కొక మండలములో ప్రత్యేకముగా వాడబడు ప్రయోగములను గ్రంథకారులు వేసినను వేయవచ్చును. వానిని వారు పూర్తిగా వదలలేరు. ఈపరిస్థితి భాషయందే కాదు. అన్నిటియందును గలదు. ప్రత్యేకతను త్యజింపవలసిన యవసరమును లేదు."

కాబట్టి యెవ్వరితిన్న (?) వారు తమయిచ్చవచ్చినట్లువ్రాసినచో భాషకుగౌరవము తగ్గును. భాషా సంప్రదాయమునుబట్టి వ్యాకరణమేర్పడును. దానిని కొంతవఱకయిన మనము మన్నింపవలెను. ఇంగ్లీషువారి యుచ్చారణకును పదముల వర్ణక్రమమునకును సంబంధములేదు. అయినను దానినెదుర్కొనజాలము. చిన్న తరగతులందు సహితము వ్యాకరణము నుల్లంఘింపరాదు. మన స్వభాషకదాయని యలుసుడనము చూపుట న్యాయముకాదు. పదములు సులభములైనను శైలి యందు బింకముండవచ్చును. వాక్యములు సమాసభూయిష్ఠములు కాకపోయినను శైలియందు గాంభీర్యముండవచ్చును. భావము మనసున కింపుగాను పదములు చెవికింపుగాను ఉన్నప్పుడే శక్యము మంచిదన దగును. సారస్వతము పవిత్రమైనది. భాషా దేవత నారాధించునప్పుడు కొంచెము నియమముగా నుండవలెనని నా ప్రార్థన.

మఱియొక విషయము. ఇటీవలను కొన్ని కొన్ని పత్రికలు ప్రచురించుచున్న కథలలో హేయములు, దుర్నీతిబోధకములునగు విషయములు కాన్పించుచున్నవి

అట్టి 'చెత్తచెదారము' వలననే గ్రంథకర్తను ప్రచురించినవానికిని డబ్బుసంపాదన కవకాశ మున్నట్లు తోచుచున్నది. ఈ 'అల్లర చిల్లర' వ్రాతలు భాషా కౌన్నత్యమును చేకూర్పలేవు. సాధ్యమయినంతవఱకు నశ్లీలములు విసర్జింపవలెను. ఉత్కృష్ట భావములతో గూడునదియే సరి యగు వాఙ్మయము. కష్టములు వివరింపబడినపుడు మనకునకు జాలికలిగినను నిర్విణ్ణులము కాకూడదు. కవి విచారమును వర్ణించినను తన కవిత్వశక్తిచే నింపుగా జేయగలడు. శృంగారమును వర్ణించుట యనగా నీతిబాహ్యములగు బోధనలు చేయుటకాదు. స్త్రీ పురుషుల సరససల్లాపములు బొత్తిగా వచ్చిగానుండుట సమంజసముకాదు. 'గూఢకేళియు జాటుగానుండును' అని కవిసూచించినట్లు వ్యంగ్యముగానుండుటయే స్వారస్యము. శృంగారగ్రంథము చదివిన యువకుని మలస్సు వికలమాయెనా యదియుత్తమ గ్రంథముగా బరిగణింప కూడదు. ఈ యుదాహరణమును దిలకింపుడు: ప్రియురాలికి తనమీద కోపము జనించుటచే తన్ను వీడిపోయినదనియు, తాను మదనాగ్నిని భరింపలేకున్నాననియు, తనవిచారమును సూచించుచు ఆమెను తనయందకు రప్పించుటకయి ఎన్నియో మాయోపాయములను కథానాయకుడగు కృష్ణుడు పన్నుచున్నాడు:—

"సత్యమేవాసి యది సుదతి! మయి కోపినీ దేహి ఖరనఖర శరఘాతం

ఘటయ భుజబంధనం జనయ రదఖండనం

యేనవా భవతి సుఖజాతమ్.

ఇది ధ్వనితోగూడిన సున్నితమగు వర్ణన మని చెప్పవచ్చును.

'ఉన్నదియున్నట్లు చెప్పుటహద్దుమీరినది' యను శీర్షికక్రిందట త్రివేణిపత్రికాసంపాదకులు నవీనాంధ్రసాహిత్యమునుగూర్చి కొన్ని విషయములను౧౯౩౬సం॥ జూలయి పత్రికలో బ్రచురించియున్నారు. శ్రీయుత రామకోటీశ్వరరావుగారు దేశభక్తులు, భాషాభిమానులు, కళోపాసకులు, రసజ్ఞులు, అదికాక వారు సదా నవీనగ్రంథకర్తల యెడ సుహృద్భావమును సానుభూతియును జూపియుండుటచే వారివాక్యములు ముఖ్యముగా వినదగినవి. "సారస్వతములో నూతనపద్ధతులను గురించి చెప్పవలసివచ్చినపుడు మాకది విచారమును గల్గించినను, నేటికాలపు గ్రంథకర్తల కొక ముఖ్యవిషయము సూచించుట మావిధియయి యున్నది. 'ఉన్నదియున్నట్లు' చెప్పవలెనను మిషమీద బట్టబయలుగా వర్ణించుట రసమని తోచకపోదు. అది మురికిగుంటలోనున్న పుల్లతో పోల్చదగినది. నేడు ప్రచారములోనున్న పత్రికలను కొన్నింటిని చూడుడు. వాని సంఖ్యకు లెక్క లేదు. నీతివిరుద్ధములగు కథలును వానికనుగుణముగా బొమ్మలును. ఇవ్వడివియే స్వర్గము. ఇవియే మోక్షము. మొపాసా, లారెన్సు మొదలగు పాశ్చాత్యగ్రంథకర్తల ననుసరింపవలెనను తలంపుతో వారిపాటవము లేకపోయినను దుర్గుణముల ననుకరించుట; సినీమాలలో బ్రదర్శింపబడిన రీతిని సతీపతుల కుతూహలరహస్యములను వివరించుట; పురాణములలోని నాయికా నాయకులనుగురించి యసహ్యపుపలుకులు పలుకుట— సాహిత్యవీధి యిట్టిదుర్గంధమారముతో నిండియున్నది. వీనిలో రెండు నష్టములు. నీతికి వ్యతిరేకముగానుండుట యొకటి. రసాభాసము రెండు. ఆంధ్రదేశమందీ పరిస్థితులను ప్రత్యక్షముగా జూచుచుంటిమి. కాని యితరరాష్ట్రములందును నిట్టి పద్ధతులే ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది. ఈ పుస్తకములు దొరతనపువారిచే నేరస్థులకొఱకు నిర్ణయింపబడిన చట్టములకు దొరకవు. అయితే యీ చట్టముల కతీతమగు 'రసము'ను చట్టములేదా? ఆ చట్టమనగా పండితుల యొక్కయు రసికులయొక్కయు సామోదమును బడయుటయే: సాహిత్యమందు క్రొత్తదారులు త్రొక్కుట యనగా చెత్త వ్రాయుట కాదు. విద్వాంసులని కీర్తి సంపాదించినవారు కూడ పామరరంజకములని యిటువంటి తుచ్ఛపు వ్రాతల వ్రాయబూనుట శోచనీయము. ఇదియే బట్ట విప్పినట్లు చెప్పుట యనబడును. రాజకీయమందు ప్రజల యనుమతినిబట్టి రాజ్యాంగవిధానమెట్లు నడచినను, సాహిత్య సామ్రాజ్యమందు నీ విధముగా ప్రజలదే పరిపాలనమంటిరా యది దుర్భరము. ఇప్పటికయినను మనము మేల్కొని సాహిత్య ప్రవంతి

సాహిత్యసభలో అధ్యక్షపీఠము నలంకరించిన ఎస్. ఎస్. సుబ్బారావు గారు కన్నడమున ననుసరించి యీ యభిప్రాయమును వెల్లడించిరి. సుబ్బారావుగారు మైసూరులో విద్యాశాఖాధికారులు, విద్వాంసులు. నవీన సాహిత్యమందు మిక్కుటమగు నభిమానము కలవారు.

"కర్నాటకములో వేర్వేరు సీమలయందు వసించు కన్నడులకందఱకును గాఢమైత్రిని పెంపొందింపవలెనన్నచో, మనభాషయును, వాఙ్మయమును, ఏపద్ధతుల ననుసరింప వలసియుండునని యోచన చేయవలెను. మన మభివృద్ధిజెందవలెనని కోరునప్పుడు, హిందూదేశములోనున్న రాష్ట్రీయులతో వైరమెంత మాత్రమును కూడదు. మనతో కలసి మెలసి నివసించుచున్న యల్పసంఖ్యాకులగు అన్యభాషలవారి యాశయములకు భంగములేకుండ, కన్నడము మాతృభాషయగు వారందఱియందును ఐకమత్యమును గలిగించుటెట్లు? శబ్దజాలము, ఉచ్చారణము, వ్యాకరణము, భాషాప్రయోగము, ఇత్యాది విషయములలో నియమమగు భాషను క్రమముగా నిర్మాణముచేయుట మంచిది. టంకసాలలో ముద్రితమగు నాణెములు దేశమంతటను వర్తకమందు 'చలామణి' అయినట్లు, 'గ్రాంథిక వ్యాపారమునందు' అందఱిచేతను అన్నిభాగములందును అంగీకరింపబడిన శబ్దములను వాడినయెడల నది యుపయోగకరముగా నుండగలదు. మనకు సాధ్యమయినచో, మైసూరు, ధార్వాడ, ఉత్తర దక్షిణ కన్నడములు, ఈ మూడింటికిని భాషావిషయమగు నేకత్వమును సంపాదించుటకు యత్నింపవలెను. కర్ణాటకములోనివి పెద్దఖండములగుటచే వీనినిమాత్రమే సూచించితిని. దీనికి సాధనమెద్ది? ఎంతపండితుడయినను ఒక 'నియంత' వలన లాభములేదు. నలుగురితో కూడిన పరిషత్తు నేర్పాటు చేయుట శ్రేయస్కరము. పరివర్తనగా తిరుగలివంటిది. పని నెమ్మదిగా నడచును. పూర్తియయిన తర్వాత పిండి మెత్తగానుండును. ఈ విద్వత్సంఘమందు అన్ని భాగములవారును నియమింపబడవలెను. ఈ సభ్యులు పట్టుదలలను విడిచి 'వారికివీరు వీరికివారు' అనినట్లుగా పరస్పర స్నేహభావముతో సంచరింపవలెను. కాని యింత మాత్రముతో చాలదు. ఎంతచెప్పినను ఈ పద్ధతి యంత స్వాభావికమయినదని చెప్పజాలము. మనము ప్రత్యేకముగా కల్పించినదే యగును. కర్ణాటకమందలి వివిధ ప్రాంతములవారు తఱచుగా సమావేశమగుట కవకాశములు సమకూర్చుట యింతకంటె నెక్కువ యుపయుక్తమని తోచుచున్నది. ఒకసీమవారి యుపన్యాసములను మఱియొకసీమవారు వినుట, ఒకరి గ్రంథములను మఱియొకరు చదువుట. నాటకము సినిమా రేడియోల ద్వారా మనము కృషిచేసినచో క్రమముగా నన్నిసీమలవారికిని అర్థమగు గ్రాంథికభాష నిర్మాణము కాగలదు. మధ్యమధ్యను, ఒక్కొక మండలములో ప్రత్యేకముగా వాడబడు ప్రయోగములను గ్రంథకారులు వేసినను వేయవచ్చును. వానిని వారు పూర్తిగా వదలలేరు. ఈపరిస్థితి భాషయందే కాదు. అన్నిటియందును గలదు. ప్రత్యేకతను త్యజింపవలసిన యవసరమును లేదు."

కాబట్టి యెవ్వరితిన్న (?) వారు తమయిచ్చవచ్చినట్లు వ్రాసినచో భాషకు గౌరవము తగ్గును. భాషా సంప్రదాయమునుబట్టి వ్యాకరణమేర్పడును. దానిని కొంతవఱకయిన మనము మన్నింపవలెను. ఇంగ్లీషువారి యుచ్చారణకును పదముల వర్ణక్రమమునకును సంబంధము లేదు. అయినను దానినెదుర్కొనజాలము. చిన్న తరగతులందు పసిలకు వ్యాకరణము నుల్లంఘింపరాదు. మన స్వభావకదాయని యలంకరణము చూపుట న్యాయముకాదు. పదములు సులభములైనను శైలియందు బింకముండవచ్చును. వాక్యములు సమాసభూయిష్ఠములు కాకపోయినను శైలియందు గాంభీర్యముండవచ్చును. భావము మనసువలె సింగారముగాను పదములు చెవికింపుగాను ఉన్నప్పుడే కావ్య మందిరమ దగును. సారస్వతము పవిత్రమైనది. భాషా దేవత నారాధించునప్పుడు కొంచెము నియమముగా నుండవలెనని నా ప్రార్థన.

మఱియొక విషయము. ఇటీవలను కొన్నికొన్ని పత్రికలు ప్రచురించుచున్న కథలలో హేయములు, దుర్నీతిబోధకములునగు విషయములు కాన్పించుచున్నవి

అట్టి 'చెత్తచెదారము' వలననే గ్రంథకర్తను ప్రమరించినవానికిని డబ్బుసంపాదన కవకాశ మున్నట్లు తోచుచున్నది. ఈ 'అల్లర చిల్లర' వ్రాతలు భాషా కౌన్నత్యమును జేకూర్పలేవు. సాధ్యమయినంతవరకు వర్ణ్యాంశములు విసర్జింపవలెను. ఉత్కృష్ట భావములతో గూడునదియే సరి యగు వాఙ్మయము. కష్టములు వివరింపబడినపుడు మనకునకు జాలికలిగినను నిర్వీణ్ణులము కాగూడదు. కవి విచారమును వర్ణించినను తన కవిత్వశక్తిచే నింపుగా జేయగలడు. శృంగారమును వర్ణించుట యనగా నీతిబాహ్యములగు బోధనలు చేయుటకాదు. స్త్రీ పురుషుల సంభాషణలాపములు బొత్తిగా పచ్చిగానుండుట సమంజసముకాదు. 'గూఢకీయు జాటుతరంబును' అని కవిసూచించినట్లు వ్యంగ్యముగానుండుటయే స్వారస్యము. శృంగారగ్రంథము చదివిన యువకుని మలస్సు వికలమాయెనా యదియుత్తమ గ్రంథముగా బరిగణింప కూడదు. ఈ యుదాహరణమును దిలకింపుడు: ప్రియురాలికి తనమీద కోపము జనించుటచే తన్ను వీడిపోయినదనియు, తాను మదనాగ్నిని భరింపలేకున్నాననియు, తనవిచారమును సూచించుచు ఆమెను తనయందరు రప్పించుటకయి ఎన్నియో మాయోపాయములను కథానాయకుడగు కృష్ణుడు పన్నుచున్నాడు:—

"సత్యమేవాసి యది సుదతి! మయి కోపినీ దేహి ఖరనఖర శరఘాతం

ఘటయ భుజబంధనం జనయ రదఖండనం

యేనవాభవతి సుఖజాతమ్.

ఇది ధ్వనితోగూడిన సున్నితమగు వర్ణన మని చెప్పవచ్చును.

'ఉన్నదియున్నట్లు చెప్పుటహద్దుమీరినది' యను శీర్షిక క్రిందటత్రివేణిపత్రికాసంపాదకులు నవీనాంధ్రసాహిత్యమునుగూర్చి కొన్ని విషయములను ౧౯౩౬సం॥ జూలయి పత్రికలో ప్రచురించియున్నారు. శ్రీయుత రామకోటీశ్వరరావుగారు దేశభక్తులు, భాషాభిమానులు, కళోపాసకులు, రసజ్ఞులు. అదికాక వారు సదా నవీనగ్రంథకర్తల యెడ నుత్సాహమును సానుభూతియును జూపియుండుటచే వారివాక్యములు ముఖ్యముగా వినదగినవి. "సారస్వతములో నూతనపద్ధతులను గురించి చెప్పవలసివచ్చినపుడు మాకది విచారమును గల్గించినను, నేటికాలపు గ్రంథకర్తల కొక ముఖ్యవిషయము సూచించుట మావిధియయి యున్నది. 'ఉన్నదియున్నట్లు' చెప్పవలెనని మితిమీరిన బట్టబయలుగా వర్ణించుట రసమని తోచపోదు. అది మురికిగుంటలోనున్న కుళ్లుతో బోల్పదగినది. నేడు ప్రచారములోనున్న పత్రికలను కొన్నింటిని చూడుడు. వాని సంఖ్యకు లెక్కలేదు. నీతివిరుద్ధములగు కథలును వానికనుగుణముగా బొమ్మలును. ఇప్పుడివియే స్వర్గము. ఇవియే మోక్షము. మొపాసా, లారెన్సు మొదలగు పాశ్చాత్యగ్రంథకర్తల ననుసరింపవలెనను తలంపుతో వారిపాటవము లేకపోయినను దుర్గుణముల ననుకరించుట; సినీమాలలో బ్రదర్శింపబడిన రీతిని సతీపతుల కుతూహలరహస్యములను వివరించుట; పురాణములలోని నాయికా నాయకులనుగురించి యప్రచ్ఛపుపలుకులు పలుకుట— సాహిత్యవీధి యిట్టిగుమ్మురుమారముతో నిండియున్నది. వీనిలో రెండు నష్టములు. నీతికి వ్యతిరేకముగానుండుట యొకటి. రసాభాసము రెండు. ఆంధ్రదేశమందీ పరిస్థితులను ప్రత్యక్షముగా జూచుచుంటిమి. కాని యితరరాష్ట్రములందును నిట్టి పద్ధతులే ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది. ఈ పుస్తకములు దొరతనపువారిచే నేరస్థులకొఱకు నిర్ణయింపబడిన చట్టములకు దొరకవు. అయితే యీ చట్టముల కతీతమగు 'రసము'ను చట్టములేదా? ఆ చట్టమనగా పండితుల యొక్కయు రసికులయొక్కయు నామోదమును బడయుటయే: సాహిత్యమందు క్రొత్తదారులు త్రొక్కుట యనగా చెత్త వ్రాయుట కాదు. విద్వాంసులని కీర్తి సంపాదించినవారు కూడ పామరరంజకములని యిటువంటి తుచ్ఛపు వ్రాతల వ్రాయబూనుట శోచనీయము. ఇదియే బట్ట విప్పినట్లు చెప్పుట యనబడును. రాజకీయమందు ప్రజల యనుమతినిబట్టే రాజ్యాంగవిధానమెట్లు నడచినను, సాహిత్య సామ్రాజ్యమందు నీ విధముగా ప్రజలదే పరిపాలనమంటిరా యది దుర్భరము. ఇప్పటికయినను మనము మేల్కొని సాహిత్య ప్రవంతి

సరియయిన స్రోవలో బ్రవహించునట్లు చేయక తప్పదు. మనభాషల దుస్థితిని జూచి వగచువారును బ్రజలలో బలుకుబడి కలిగి ప్రజాభిప్రాయమును దమ వంకకు ద్రిప్పగల సమర్థులును లేచి నిర్భయముగ ధైర్యముగా జనసందేశమును బోధింపవలసిన సమయము వచ్చినది. శ్రోత్రియులనియును, బుద్ధిజాడ్యజనితోన్మాదులనియును హేళనలకు వారు గురియయిన యగుదురుగాక. భయపడవలదు.

భాషాసేవకుల మని సత్కీర్తి నపేక్షించువారు ఉత్కృష్టమగు భావములను ఉచితమగు పదజాలమును గలిగియుండవలెను. సాహిత్యధనము నార్జింపవలెను. దానికి గ్రంథపరిచయమును లోకానుభవమును ఆవశ్యకములయి యున్నవి. ఆంధ్రమంజరియు, నితరభాషల యందలియు గ్రంథములను జదివి యనేకస్థలములను జూచి యనేకులతో మెలగి లోకతత్త్వమును గ్రహించియు జ్ఞానమునకును గురువులు పఠింపించిన పుస్తకసముదాయమునకును సమ్మేళనము జేయుటయే యథార్థమగు సాహిత్యము. కవులకును పండితులకును ప్రత్యేకవ్యక్తిత్వ ముండవలెను. స్వతంత్రుల మని నియమములను బూర్తిగా విడనాడి లాభములేదు. క్రొత్తపోకడలు మన జనదినాభివృద్ధిని సూచించినను, భాషగాని, సంఘము గాని పూర్తిగా కట్టుదప్పినా యది యెన్నటికిని ముందునకు రాజాలదని యూహింపవలెను.

# భారతదేశ బంధువు డాక్టరు జే. టి. సండర్లెండు

పుట్టపర్తి టి. రామాచార్యులు

సండర్లెండుగారు ఇటీవలనే గతించినారు. వీరి పేరునుగూడ విననివారు మనలో నెందరో గలరు. అమెరికాదేశీయు లైనను, తమ జీవిత సర్వస్వమును భారతదేశసేవకై ధారపోసిన ఈమహానుభావునియొక్క మరణమువలన భారతదేశమునకు అమితనష్టము వాటిల్లినదని చెప్పవచ్చును. ఈ మహనీయుడు చేసిన హిందూదేశసేవను గూర్చి భారతీయులలో చాలమందికి బాగుగ తెలియకపోవచ్చును. కాని స్వాతంత్ర్య సమరమున భారతదేశమునకు వీరొనర్చిన మహోపకారమును, ప్రపంచశాంతిస్థాపనకై వీరు చేసిన ప్రయత్నములను భారతదేశ చరిత్రమునందే కాక, ప్రపంచ చరిత్రమునను గూడ స్వర్ణాక్షరములతో లిఖింపబడగిన వనియే చెప్పవచ్చును.

వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగా నుండినకాలమున మనదేశమునం దొనర్చిన యక్రమములను గూర్చి ఆంగ్లేయులు బర్కుమున్నగువారు హిందూదేశముతరఫున పోరాడుట గొప్పవిషయమని చాలమంది కొనియాడెదరు. అట్టిచో మనదేశమున కేట్టిసంబంధమును లేని అమెరికా దేశస్థుడు సండర్లెండుగారు, భారతీయస్వాతంత్ర్యమునకై తన జీవితమంతయు ధారపోసి పోరాడినప్పుడు వారిని ఎంతగా కొనియాడవలయునో?

సండర్లెండుగారు ౧౮౪౨ వ సంవత్సరమున ఇంగ్లాండుదేశమునందు జన్మించిరి. వీ రాదేశమునందు చాలకాల ముండలేదు. రెండుసంవత్సరములు కాకముందే వీరి తల్లిదండ్రులు అమెరికాదేశమునకు వెడలిపోయినందున వీరివిద్యాభ్యాస మంతయు స్వేచ్ఛాస్వాతంత్ర్య భావపూరితమైన అమెరికాదేశమునందే జరిగెను. చికాగో విశ్వవిద్యాలయమునందు ౧౮౬౭ వ సంవత్సరమున బి. ఏ డిగ్రీని తరువాత రెండుసంవత్సరములకు యం. ఏ. డిగ్రీని, పొంది పట్టభద్రులైరి. అటుపిదప చికాగోనగరమునందలి బాప్టిస్టుయూనియను సెమినరీలో తమమతమును గూర్చి చదివి బి. డి. డిగ్రీని పొందిరి. టఫ్ట్సు విశ్వవిద్యాలయమువారు వీరికి డి. డి. బిరుదమునుగూడ నిచ్చిరి.

వీరు విద్యార్థిగ నుండినప్పుడే యొక మహోపకారకార్యము నొనర్చిరి. ధనవంతులయిన యూరోపియనులు నీగ్రోలను బానిసలుగా కొనుచుండిరి. ఈనీచవృత్తిని మాన్పుటకు కొందరు ప్రయత్నించగా, తమ పరిశ్రమలయందు అధికలాభము పొందుటకు వీలుపడదేమో అని బ్రిటిష్‌పారిశ్రామికులు ఆప్రయత్నములకడ్డుపడిరి. ఇట్టినీచవృత్తిని నిర్మూలించుటకై జరిగిన యుద్ధమున సండర్లెండుగారు పోరాడిరి. అప్పటినుండియు, స్వాతంత్ర్యమునది తమకేగాక సర్వజనులకును ఉండవలసినదని నిశ్చయించి, ప్రపంచమునందు స్వేచ్ఛాస్వాతంత్ర్య స్థాపనకై తమజీవిత సర్వస్వమును ధారపోయవలయునని కంకణము కట్టుకొనిరి.

వీరిచదు వయినతోడనే బాప్టిస్టుమిషనరీ క్రైస్తవమత ప్రచారకులుగా వీరు అమెరికా ఇంగ్లాండు దేశములలో చాలకాలము పనిచేసిరి. ఇప్పటికిని అమెరికాదేశపు గొప్ప మత ప్రచారకులలో వీరి నొక్కరినిగ నెంచుచుందురు. మతవిషయములందు వీరు కడు ఉదారస్వభావులు. వీరికి ఏమతమందును పక్షపాతబుద్ధి లేదు. ప్రతిమతమునందును ఉండు సత్యమును, మంచిని మాత్రమే గ్రహించవలెనని వీరి యభిమతము.

భారతీయుల మత, సాంఘిక, విద్యాపద్ధతులను, పరిస్థితులను పరిశోధించుటకై ౧౮౯౫ వ సంవత్సరములో, బ్రిటిష్ అండు ఫారిన్ యూనిటేరియన్‌సంఘము తరఫున వీరు మొదటిపర్యాయము హిందూదేశమునకు వచ్చిరి. అప్పుడు మనదేశమునందున్న గొప్పగొప్ప సాంఘిక రాజకీయ సంస్కర్తలను కలిసికొనిరి. గాంధి, టాగూరు, లాలాలజపతిరాయి మున్నగు ప్రముఖులు వీరికి ముఖ్యమిత్రులయిరి. అంతటితో భారతదేశస్థితి

వీరికి బాగా బోధపడినది. భారతీయులు పడుచున్న కష్టములను చూచి వారు సహించలేకపోయిరి. స్వేచ్ఛా స్వాతంత్ర్యములు గోల్పోయి ప్రభుత్వమువారికి ఇందు

నది. ప్రపంచములో నున్న 3౨ కోట్లజనుల స్వాతంత్ర్యమును అడ్డుపెట్టిన ఇక ప్రపంచశాంతి ఎక్కడిది? ఇట్టి పరిస్థితులే ఇంకను నున్నచో హిందూదేశమునం



డాక్టరు జె. టి. సందర్లెండు

మించుగ బానిసలవలె వర్తించుచున్న హిందూదేశీయుల అభివృద్ధికి పోరాడవలెనని వారికి బాగుగ దట్టి

దొక గొప్పవిప్లవము సంభవింపకమానదు? ప్రపంచశాంతి భంగకరములగు ఇట్టివిప్లవము [illegible]

చేయుట ప్రభుత్వమువారి ధర్మము కాదా? "ప్రపంచ శాంతి నెలకొల్పుట అవశ్యకము" అని చెప్పు రాజకీయ వేత్తలమాటలు బూటకములు గావా? లేనిచో స్వాతంత్ర్యమునకును, వ్యక్తిత్వ వికాసమునకును నిరోధము కల్పించి, హిందూదేశమును తమ స్వంత ఆస్తిగా (Private property) ఉంచుకొనుటయందు అర్థమేమి? ఇంకను ఇటువంటి యోచన లెన్నియో వారిమనస్సునకు తట్టినవి కాని చేయగల్గినది ఒక్కటే—నడుము కట్టి, తమజీవితసర్వస్వమును ధారవోసి, హిందూదేశ స్వాతంత్ర్యమునకై పోరాడుట.

౧౯౨౩ వ సంవత్సరమున వీరు ఓబ్లింగ్సు ఉపన్యాసకులుగా మరల మన హిందూదేశమునకు వచ్చిరి. ఆసందర్భమున వీరు చైనా, జపాను, ఫిలిప్పైన్, సింహళ దేశములకు గూడ పోయిరి. వీరు హిందూదేశమునం దున్నపుడు అఖిలభారత తత్వజ్ఞాన సభాసమావేశమునకు అధ్యక్షులుగా ఉండిరి. అఖిలభారత జాతీయ సాంఘిక సమావేశమునందును, దేశీయ మహాసభా సమావేశమునందును వీ రెక్కువగా పాల్గొనిరి.

అటుపిదప వీరు త్వరలోనే అమెరికాకు వెడలి పోవలసి వచ్చినను భారతీయులపైన ప్రేమయు శ్రద్ధయు దినదినమునకు వృద్ధియగుచు వచ్చెను. హిందూదేశము యొక్క చరిత్ర, వాఙ్మయము, కళ, వేదాంతము, మతము, నాగరికత, సాంఘిక రాజకీయ ఆర్థికపరిస్థితులు మొదలగు ఎన్నియో విషయములనుగూర్చి వీరు శ్రద్ధతో కృషిచేసిరి. వీరింటిలో నెక్కడజూచినను హిందూదేశమునుగురించిన పుస్తకములే. అమెరికాలో ననేక పట్టణములందు భారతీయులనుగురించి ఉపన్యసించిరి. 'భారతీయసంఘము' 'హిందూదేశస్వాతంత్ర్య సంఘము' 'ఇండియన్ హోము రూలు లీగు'—ఇట్లు ఒక్క సంఘమేమి, అమెరికాదేశమునందు భారతీయుల విషయమై యేర్పడిన ప్రతి సంఘమునందును, సంస్థయందును సఖ్యము కలిగించుకొని, దానికి అధ్యక్షులుగనో ఉపాధ్యక్షులుగనో ఉండి శ్రద్ధతోను, అభిమానముతోను పనిచేయుచు వచ్చిరి. ఐరోపా మహాసంగ్రామ కాలమున అమెరికాయందు హిందూదేశమునకు విరుద్ధముగ పనిచేసిన ప్రతిసంఘమును ప్రతిఘటించి, పోట్లాడి, కడకు వాటిని రద్దుచేయించిరి.—ఇటు అన్యదేశీయులైనను భారతీయుల స్వాతంత్ర్యముకొరకు బ్రిటిష్ వారితో పోరాడుచుండ, ఇక ఏదో ఉద్యోగాభిలాషతోనో మరి ఇతరస్వలాభాపేక్షతోనో ప్రభుత్వపువారి పక్షమునచేరి, పనిచేయుచున్న భారతీయుల నేమనవలెను? వారు భారతదేశమునందు పుట్టియున్నారు కాని, భారతీయులరక్తము వారినాళములలో ప్రవహించుచున్నదా అను సందేహము తప్పక కలుగ గలదు. ఇట్టిమహాపురుషునిచరిత్రము సందర్భమున వీరలను స్మరించుటగూడ నింద్యమే.

అమెరికాకు వెళ్లిన భారతీయులకు వీరుచేసిన సహాయము ఇంతంతయని చెప్పవలవిగాదు. భారతీయ విద్యార్థులకు విద్యార్థివేతనములు ఇప్పించి ద్రవ్యసహాయమునుగూడ చేయించిరి. అమెరికాదేశమునుండి మనదేశమునకు మరలివచ్చు ప్రతిభారతీయుడును స్వాతంత్ర్యభటుడుగా రావలయునని వారి కోరిక. భారతీయులందరును అబ్రాహాంలింకన్ను అనుసరించవలయునని వీరి యభిప్రాయము. ఇట్టి వీరికోరికలను భారతీయవిద్యార్థులు తీర్పగలరా?

అమెరికాలో ప్రారంభించిన 'యంగ్ ఇండియా' కు వీరు సంపాదకులుగనుండి, దానిని చాలకాలము జయప్రదముగ నడపిరి. హిందూదేశములోని ముఖ్యపత్రికలన్నిటికిని వీరు వ్యాసములు వ్రాయువారు. మాడరన్ రివ్యూను చదువువారందరును వీరి నెన్నటికిని మరువరు. పరాధీనులై భారతీయు లనుభవించుచున్న కష్టనష్టములను ప్రస్ఫుటముగ వివరించు 'శృంఖలాబద్ధమైన హిందూదేశము' (India in Bondage) అను పుస్తకము వీరు వ్రాసినదే; ఈయమూల్యమైన పుస్తకమును ప్రభుత్వమువారు నిషేధించినందున, దీనిని మనదేశమునకు కొనితెచ్చు భాగ్య మెవ్వరికినిలేదు. ఇది ఎంతయు శోచనీయము. ఈపుస్తకము భారతీయ స్వాతంత్ర్యమునకు ప్రతికూలురుగనున్న వారి మనస్సులను గూడ గరగించి, వారి దురభిప్రాయములను మాన్పి

యున్నది. రవీంద్రనాథటాగూరు గారు ఈపుస్తకమును గురించి ఈవిధముగ వ్రాసియున్నారు. I regard this book as among the best informed, most just and most trustworthy, that has come fiom auy pen" మనదేశీయులేకాక, అన్యదేశీయులుకూడ ఎందరో దీని నెక్కుడుగ కొనియాడియున్నారు. 'The trutha bout India' 'Englaud's Debt to India' and 'World Brotherhood' మున్నగు వీరు వ్రాసిన పుస్తకములను అనేక భాషలలోనికి తర్జుమా చేసియున్నారు.

వీరు భారతీయులకేగాక ఇంకను ఇతరదేశస్థులకునుగూడ చాలాసహాయము చేసినారు. రష్యాదేశపు నిరంకుశాధికారమున కష్టములను పడుచున్న యూదీయుల పక్షమున చాలపోట్లాడి వారికి పాలస్టైనుదేశమున వసతినేర్పరచవలెనని చాలా శ్రమపడినారు. ఈజిప్టు, అరేబియా మున్నగు దేశముల స్వాతంత్ర్యముకోసరము చాల సహాయంచేసినారు.

సండర్లెండుగారు ఆజానుబాహులు. వారిని చిత్రమునందు జూచినను మనకు ఏదోఒక విధముగ ఉత్తేజనము కలుగకమానదు. విశాలమైన ఫాలము, రజతచ్ఛాయననుకరించి మిసమిసలాడెడి వీరి శిరోజములు, ఏదియోయొక గొప్ప యాలోచన సూచించు వీరికండ్లు, తేజోమయమయిన వీరిముఖము, పాదములవరకు వ్రేలాడెడి నల్లనికోటు—ఇవన్నియు కలసి వీరొక గొప్ప మహర్షి యనుభావమును కలిగింపకమానవు. వీరు నిజముగ మహాత్ములే. వీరిశాంతమును స్వభావమాధుర్యమును ఎల్లరను ఆకర్షించుచుండెను. వీరు జ్ఞానానుభవములందు ఆరితేరినవారు. సంతతధర్మబోధకులు, స్వేచ్ఛాస్వాతంత్ర్యనిరతులు, శాంతిప్రచారకులు కూడాను. వీరి ఉదారాశయ అభిలాషలకు తోడు ధైర్యముకూడ కుదిరినందువలన, చెప్పదలచిన దంతయును వీరు నిర్భయముగ జెప్పుచుండిరి. జీవితమునందలి కష్టానుభవముల కరకుదనమును తగ్గించి మార్దవముగ జేయు వీరిహాస్యరసము అద్వితీయము. ఏవిషయమునకైనను పురోభివృద్ధికై ముందంజవేయుట వీరికి సహజము.

దీర్ఘాయుష్మంతులుగ నుండు టెట్లని ఎవరో వీరి నొకమారు ప్రశ్నింప వీరీక్రిందిజవాబును జెప్పిరట. "నీఆరోగ్యమును గురించి పరామరికతీసికొమ్ము. జీవితధర్మములను తెలిసికొని, వాటిని అనుసరింపుము. ఎల్లప్పుడును సంతోషముతోను ఉత్సాహముతోను ఉండుము. సోమరిగనుండక సతతము ఏదైన పనిజేయుచుండుము. ఏదైననొకదానిలో శ్రద్ధగైకొని దానినెప్పుడును విడనాడకుము" ఈపైజెప్పినవాక్యములు ఎల్లరకును ఒకగొప్ప నీతిపాఠము. వీరు ఈపద్ధతినసుసరించియే చాలకాలము జీవితమునుగడపిరి. ముసలివారైననుగూడ దినమునకు ఆరు,లేక ఏడుగంటలకాలము వ్రాయుచుండువారు. అప్పటికిని వయస్సుచే ముసలివారైనను ఉత్సాహమునందుమాత్రము యువకులనుగూడ మించుచుండిరి.

ఇంచుమించుగ రెండునెలలక్రిందట వీరు తమ ఇంటియందున్న మెట్లనుండి దిగుచు తటాలున క్రిందబడిరి. ఇందువలన ఆరుప్రక్కయెముకలు విరిగిపోయెను. తీవ్రమైన నొప్పికి తాళలేక చాలబలహీనత జెందిరి. వీరి హృదయము చాలదుర్బలముగ నున్నందున వీరిదేహపటుత్వము క్రమక్రమముగా తగ్గి, ౧౯౩౬వ సంవత్సరము ఆగస్టునెల పదుమూడవతారీఖునాటి మధ్యాహ్నమున తమపుత్రుడగు ప్రొఫెసర్ సండర్లెండుగారి గృహమునందు వీరు చనిపోయిరి. మరణకాలమువాటికి వీరికి ౯౪ ఏండ్లు.

వీరు చనిపోవుటకుముందు ఈక్రింది మాటలను నుడివిరి.

'As my last message to India I send my love'

'I die in the beautiful Unitarian faith. The uuiversal brctherhocd cf man is the highest religion of the world and will be for ever'.

భారతీయ స్వాతంత్ర్యమునకై నిర్భయముగ పోరాడిన ఈమహనీయుని మరణమునకు భారతీయులందరును విలపింతురు. వీరి ఆత్మకు దేవుడు శాంతియొసంగుగాక!

# ప్రాచీనాంధ్రకవులు - తాళ్ళపాకవారు

నిడుదవోలు వేంకటరావు

తాళ్ళపాకవారు నందవరీకులు, ఋగ్వేదులు, ఆశ్వలాయన సూత్రులు, భారద్వాజ సగోత్రులు. శ్రీ తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై, పదకవితా ప్రవీణులై, భక్తాగ్రేసరులై జాతీయవాఙ్మయమును బోషించినవారు. పాల్కురికి సోమనాథునికిఁ దరువాత ద్విపదకవిత నుద్ధరించినవారు. అసంఖ్యాకములగు సంకీర్తనలు రచియించిగేయకవితను సుప్రతిష్ఠితముఁ గావించినవారు. వీరి గ్రంథములు రాగి రేకులపై వ్రాయఁబడి శ్రీ తిరుపతి క్షేత్రమున భద్రపరుపఁబడియున్నవి. ఆంధ్రసాహిత్యపరిషత్తువా రందుండి కొన్నివ్రాయించి ముద్రించియున్నారు. శ్రీపీఠికాపురాధీశ్వరులు వీరిలోఁజిన్నన్నకృతమగు పరమయోగివిలాస మను ద్విపదకావ్యమును ముద్రించి ప్రకటించియున్నారు.

శతకకవుల చరిత్రమున వీరిఁగూర్చి కొంత గలదు. అయినను తెలిసినదానికన్న తెలియఁదగినది వీరిఁగూర్చి హెచ్చుగాఁగలదు. వీరిగ్రంథము లన్నియు ముద్రింపఁబడకపోయినను వాని వివరణము లున్నచో నవి పరిశోధకులు, వాఙ్మయచరిత్రకారులు నుపయోగించి కృతార్థతఁ జెందఁగలరు. శ్రీతిరుమల వెంకటేశ్వర పత్రికయందు పరిశోధకశిఖామణి శ్రీరామకృష్ణకవిగారు తాళ్ళపాకవారిఁగూర్చి వ్రాసెద మని ప్రకటించిరి. కాని యాంధ్రుల దురదృష్టమున నాపత్రిక యాఁగిపోవుటచేఁ గవిగారి వ్యాసము వెలువడలేదు. నేఁడు శ్రీతిరుపతి దేవస్థానమువారు తాళ్ళపాకవారి కృతు లెక్కడ నున్నవియు సంగ్రహించి సంపూర్ణ చరిత్రమునుఁ బ్రకటింతురని వినుటతోడనే నా పొందిన యానంద మింతింతగాదు. ఆంధ్రుల భాగ్యవశమున నది వెలువడుననియే నాయాశయము. ఈవంశమునందలి కవులలో నొక్కొక్కరిఁ గూర్చి యించుక నివేదించెదను.

## అన్నమాచార్యుఁడు

ఈవంశమునకు మూలపురుషుఁ డన్నమాచార్యుఁడు (అన్నయాచార్యుఁ డనికూడ కొన్నిచోటులఁగలదు.) ఈతఁడు పాంచరాత్రాగమసార్వభౌముఁడు, శ్రీనాథుని సమకాలికుఁడు. ఈతఁడు (1) తిరుపతి వేంకటేశ్వర శతకమును చంపకోత్పల మాలికలతో రచియించినాఁడు. ఇందుండి

" అరిసెలు నూనెబూరెలును
    నౌఁగులుఁ జక్కర మండెగల్ వడల్
బురుడలు వాలమండెఁగల
    పూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందుఁబెట్టి పర
    మాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల
    నేతుల సోనల వేంకటేశ్వరా!"

అనుపద్యమును జగ్గన ప్రబంధరత్నాకరమున నుదాహరించియున్నాఁడు. ఇందు ౧౦౫ పద్యములు గలవు. శతకము శృంగారమయము.

ఆది.

"శ్రీసతి నీల జాంబవతి
    శ్రీయమునాసతి సత్యభామ ధా

1 వ్యాసమున నాయాచోట్ల వీనివివరముఁగాన నగును.

శ్రీసతి రుక్మిణీరమణి
దేవి యిలాసతి వీర లందఱుఁ
జేసిన సేవఁ జేసెదను
చేకొను శ్రీయలమేలుమంగ నీ
మూసినముత్యమై యురము
ముంగట చెంగట వేంకటేశ్వరా!''
చివర.
"అమ్మకుఁ దాళ్లపాక ఘనుఁ
డన్నఁడు పద్యశతంబుఁ జెప్పెఁ గో
కొమ్మని వాక్ప్రసూనములఁ
గూరిమితో నలమేలుమంగకుఁ
నెమ్మది నీవు చేకొని యు
నేకయుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మదమంది వర్ధిలను
జవ్వనలీలల వేంకటేశ్వరా!

౨. శృంగారమంజరి ఇయ్యది ౨౬౦ ద్విప దలు గల చిన్ని కబ్బము. ఇతివృత్తము శృంగార మని నామమే తెలుపుచున్నది. తొలి.

శ్రీకామినీవక్షు జిత హిరణ్యాక్షు
భువనపావనదక్షుఁ బుండరీకాక్షు
వివిధగీర్వాణాద్యు వేదాంతవేద్యు
పరమతత్త్వాపాద్యు భవరోగవైద్యు
* * * *
"కొలఁకులఁ గెలకులఁ గురివెందపొదల
భామలో రతిరాజు పసిమిసామ్రాజ్య
సీమలో, రసికుల చిత్తంబులోని
ప్రేమలో, యనఁగ గంభీరంబు మెఱసి
కళుకులోఁ జిగురాకు కరవాలుఁగొనల
తళుకులో, విటుల డెందముల జాపాడు
ములుకులో యనఁగ నిమ్ముల యుల్లసిల్లి
బాలలో, పుష్పాస్త్ర బంగారు నాట్య
శాలలో, పూవింటి జడిగొన్న యంప
కోలలో, తలఁపులో గుదిఁగొన్న తాల్మి
చీలలో యనఁగ నెచ్చెలు లెల్ల గూడి.''

గద్య- భూరికౌస్తుభరత్న భూషణువేర
గురుభరద్వాజైక గోత్రపావనుఁడు
నందవరపురవంశ నాయకోత్తముఁడు
ననఘుండు తాళ్లపాకాన్నయార్యుండు
మధురంపు శృంగార మంజరిఁ జెప్పె
ధరమీఁద నాచంద్రతారకంబగుచు
గరిమఁ బెంపొందు మంగళమహాశ్రీలు.

సంకీర్తన లక్షణము

దీనిని నన్నయాచార్యుఁడు వాక్యరూపమున రచియింప నీతని మనుమఁడు చిన్నన్న దీనిని పద్యముగ రచియించియున్నాఁడు.

ఇందు ద్విపదలు, చౌపదలు, రగడలు, ఏలపాటలు, కీర్తనలు మొదలగువాని లక్షణ ములు గలవు. చిన్నన్న యన్నయాచార్యుని పద కవితామార్గ సార్వభౌముఁడని యాతని పదకవ నము నిట్లు ప్రస్తుతించినాఁడు.

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై,
సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీథులై వివిధమం
త్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతి
క్రీడా రహస్యంబులై
నుతులై తాళులపాకయన్నయవచో
నూత్నక్రియల్ చెన్నగుఁ.''

పై గ్రంథములన్నియు నముద్రితములు.

## పెద తిరుమలయ్య

అన్నమాచార్యుని తనయుఁడు పెద తిరు మలయ్య. ఈతనికొడుకు తిరుమలయ్యయు నీ కాలమున నుండుటచే నీతని పెద తిరుమలయ్య యనియు, నీతని కొమరుని చిన్న తిరుమలయ్య యనియు వాడుచుండిరి. ఈతని కృతులు పెక్కులు.

౧. వేంకటేశ్వరవృత్త పద్యశతకము: దీనిని శృంగారవృత్తపద్యశతకమందురు. ఇందు 'వేంకటేశ్వరా' అను మకుటముతోఁ జంపకోత్పలమాలికలేకాక వేంకటాద్రీశ్వరా అను మకుటముతోఁ గొన్ని మత్తేభశార్దూల వృత్తములును గలవు. నూటమూఁడుపద్యములు గలవు.

"శ్రీరమణీమణి ప్రమద
జీవన జీవనవాస వాసవా
ధార విశేష శేషకుధ
రాధరనాథవిహారహార కే
యూరవిరాజి రాజిత మ
హాన్నత దేవభ-జంగ జంగమ
స్మేరవికల్ప కల్పకమ!
మిమ్ము సుతించెద వేంకటేశ్వరా!
తలరా నాకిల రామలెవ్వరయిన్గ
దా రీడుఁగా జోడుగా
గలరా నీవలరారఁ జూచుకొనువిం
కన్మానవా కానవా
వలరా జవ్వల రాయిడింపగ సటల్
వడ్డిలరా! ఏలరా!
కొలరా కాఁకలరావుఁ జేసిననునీ
కు న్వేంకటాద్రీశ్వరా!"

౨. వేంకటేశ్వరోదాహరణము - ఇది పరిషత్తువారిచేతను, తిరుమల శ్రీ వేంకటేశ్వర పత్రికయందునుఁ బ్రకటితము. త్రిపురాంతకోదాహరణమును వెన్నంటి వేంకటేశ్వరపరముగా రచియించిన యుదాహరణము:

"శ్రీ కరుణాకరుండగుచు
జీవుల తీవులఁ బ్రోచి కాచుచున్
గైకొని లోకము ల్మనిపి
కర్తయు భర్తయునైన మును ల్సురా
నీకము లోకముం బొగడ
నీరజజాతుని తాతయైన సు
శ్లోకుఁడు వేంకటేశ్వరుఁడు
జూడగ నొప్పెడు బ్రహ్మమింతయున్.
అరవితారకంబుగ ను
దాహరణంబు రచించె భక్తి వి
స్తారతఁ దాళ్లపాకపుర
శాసనుఁ డన్నయతిమ్మ నార్యుఁడిం
పారఁగఁ జక్రనందకగ
దాంబుజధారికి శ్రీ వధూమనో
హారికి వేంకటాచల వి
హారికి శౌరికి సంకితంబుగన్."

౩. చక్రవాళమంజరి: మంజరియందలి తొలి పాదమునందలి చివర రెండక్కరములతో రెండవ పాదము మొదలిడిరచియించుట చక్రవాళ మనఁబడును. పెదతిరుమలయ్య చక్రవాళమంజరినుండి మచ్చున కుదాహరించుచున్నాఁడను.

"శ్రీలలనాకారుఁ జిన్మయాకారు
కారుణ్యావర్తి వేంకటగిరిమూర్తి
మూర్తిత్రయశరీరు మునిజనోద్ధారు
ధారుణీసంగు నుత్తమ శోభితాంగు
* * * *
బేరగు జవరాలిపెనిమిటివేరఁ
బేర గీర్తనకెక్కి పెరసినందవర
వరముఖ్యుఁడై భరద్వాజసంతాన
తానకందన నెన్నఁదగు తాళ్లపాక
పాకశాసనుఁడు వైభవముల నెనరు
నరులలోఁ బూజ్యుఁ డన్నయవర్యతనయు
నయశాలి తిమ్మయ్య నవచతురతల
తలఁచి మంజరిఁ జెప్పె తజ్జ్ఞు లింపార
నారవితారాబ్దమై యొప్ప జగతి
గతియైన విష్ణుమంగళ మహా శ్రీశ్రీ."

ఇందుఁ గొంతభాగముమాత్రమే పరిషత్పత్రిక తృతీయసంపుటమునఁ బ్రకటితము.

౪. నీతి సీసపద్యశతకము :

కవిత లక్ష్మీశ సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ వేంకటేశ!

అను మకుటము గలిగినది. నూరుపద్యములు. ఈ శతకమునందలి 'తనవాసిఁదప్పిన తరుగువన్నె' మొదలగు పద్యపాదములు సామెతలై వాడుకలోనికి వచ్చినవి. ఉత్కృష్టమగు శతకము. శతకాంతమున

"శార్ఙ్గి హృషీకేశ నారాయణోపేంద్ర
తాలాంకముఖనామ తాళ్లపాక
యన్నయాచార్యసుత తిమ్మయార్యాహ్వయుండ
బ్రణుతిఁజేసితి రహి గొమ్మ పద్యశతము
కలితలక్ష్మీశ! సర్వజగన్నివేశ!
విమలరవికోటిసంకాశ! వేంకటేశ!''

అనికలదు.

౫. మేలుకొలుపు ద్విపద:

"శ్రీగురుఁ డర్థితో శేషాద్రియందు
యోగనిద్రాకేళి నున్నయుత్తరిని
వనజాసనాదిదేవత లేగుదెంచి
వినిపించి రపుడు నవ్విధ మెట్టిదనిన
శ్రీకర వేంకట క్షితిధరావాస!
నాకేశనుత రమానాథ! మేల్కొనుము
వసుదేవ దేవకీవరగర్భజాత
కిసలయాధర రామకృష్ణ! మేల్కొనుము
భోజకన్యాముఖాంభోజ ద్విరేఫ!
రాజీవనయనాభిరామ మేల్కొనుము
మంజుల సత్యభామా మనస్సంగ
రంజితగోత్రసంరంభ మేల్కొనుము
తారుణ్య మిత్రవిందాకుచమధ్య
హారసంయోగ విహార మేల్కొనుము
లలితకాళిందీ విలాసకల్లోల
కలితకేళీలోల ఘనుఁడ మేల్కొనుము
లక్షణావరిరంభ లక్షితోదార
వక్షోవిశాలకవాట మేల్కొనుము
వరరూపవతి జాంబవతి తోడిరతుల
నిరతిమై నోలాడు నిపుణ మేల్కొనుము
కలిత నక్రగ్రాహగంభీరజలధి
వలయితద్వారకావాస మేల్కొనుము
జలద నీలశ్యామ! జగదభిరామ!
వెలయు మేల్కొనుమని విన్నవించుటయు
అని చెప్పె తాళ్లపాకాన్నయాచార్య
తనయుతిమ్మార్యుఁడు తగ విన్నవించు
ఏఁచి యీకృతి ధరణీశ్వరుసభల
నాచంద్రతారార్కమై వెల్గుగాత!

పై యుద్ధృతాంశములచే గ్రంథవిషయమెఱుక పడుచున్నది. ఇయ్యదియు ముద్రితము.

౬. శృంగార దండకము:

శ్రీ వేంకటక్ష్మాధరోత్తుంగ శృంగాగ్రనిత్యస్థిరాగారు, గారుత్మతోదీర్ణ సౌవర్ణభూషావిశేషోజ్జ్వలాకారుఁ గారుణ్య తారుణ్య లావణ్య సార ప్రభాసద్మ పద్మాధరాధీర లీలాకరోదార సంసారు ........యిందిరా మందిరం బైన యాత్మీయ గేహంబునందుం బ్రవేశించి యుండెం దగన్.

సన్నుతిఁ దాళ్ళపాకపుర
శాసనుఁ డన్నయ తిమ్మనార్యుఁడ
త్యున్నతిఁ జెప్పె దండకము
దుగ్ధపయోనిధి కన్యకారతి
స్విన్నమృగీమదాంకునకు
వేంకటభర్తకు నిత్యభోగసం
పన్నన కారవీంద్ర కుల
పర్వతతారకమై చెలంగఁగన్.'

౭. రేఫఱకార నిర్ణయము :

పద్యరూప లక్షణగ్రంథము

మొదలు:

శ్రీ వేంకటేశ నీకుం
గావించెద నంకితంబుగా జారేఫల్

వావిరి నేర్పరిచినకృతి
శ్రీవనితానాధ రామ చేకొను కృష్ణా !
క్షీరనీరవిభేదంబుఁ జేసినట్లు
ధరణి రేఫఱకారముల్ తాళ్లపాక
తిరుమలార్యుఁడు వేర్వేఱఁ దేటపరచె
నుచిత మిదిగాదెపరమహంసోత్తమునకు

ఇయ్యది యప్పకవికాలముననే ప్రసిద్ధమైన లక్షణగ్రంథము. అప్పకవీయమున ద్వితీయాశ్వాసమున రేఫఱకారనిర్ణయసీసమాలికయందు
'తాళ్లపాకాన్వయోదధిపూర్ణధవళ
దీధితి పెదతిరుమల దేశికుండు'
అని యాతనిఁ బొగడియున్నాఁడు. ఇది ముద్రితము.

౭. సుదర్శనరగడ :

ఓంకారాక్షరయుక్తము చక్రము
సాంకమధ్యవలయాంతరచక్రము
సర్వమల్రపదసహజము చక్రము
పూర్వకోణసంపూర్ణము చక్రము

మంత్రాధిరాజమానిత చక్రము
యంత్రపీఠమధ్యాస్థిత చక్రము
వేయి విధంబుల వెలసిన చక్రము
వేయంచులు గల విశ్వపుఁ జక్రము

బాలించు సుజనపాలన చక్రము
శ్రీ వేంకటపతి చేతిది చక్రము''

ఇం దేఁబదినాలుగు రగడ చరణములు గలవు. అముద్రితము.

పెద తిరుమలయ్య వ్రాసిన హరివంశము లభ్యము గాలేదు.

౯. భగవద్గీత టీక :

దీని నాంధ్రవేదాంతమని వాడుదురు. ఇది తెలుఁగున భగవద్గీతకు వచనరూపమున వ్రాయఁబడినది. అముద్రితము.

ఈతనిఁగూర్చి చిన్నన్న వ్రాసిన యీక్రింది పంక్తుల నుదాహరించి ముగింతును.

తిరుమలాచార్యవర్యుఁడు
వేదాంతవిద్యాప్రవీణుఁడై యాంధ్ర
వేదాంత మొనరించె ద్విపదరూపమున
హరివంశకావ్య మాయతరసస్ఫూర్తి
హరివంశ మిగురొత్త ననువొందఁ జేసి
చక్రవాళములోన సరిలేరనంగఁ
జక్రవాళముగ మంజరిని రచించి
శ్రుతులు చిక్కులు దీర్చుశుకతాతవోలె
సతతరేఫఱకారసరణు లేర్పరిచి
సంగీతసాహిత్య సార్వజ్ఞకత్వ
మంగళసామ్రాజ్యమహితుఁడైయుండె.''

—పరమయోగి విలాసావతారిక

# బిచ్చగాఁడు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

వడవడ వడఁకుచుఁ జలికిన్ - దడియుచు వానలకు, నగ్నిధారలు వర్షిం
చెడి యెండ కెండుచును నో - క్కఁడు వృక్షమునీడ భిక్షుగాఁడు వసించున్.

కన్నులు గానరావు సరిగా; వినిపింపవు లెస్స వీనులున్;
దిన్నఁగ నేల కూఁదుకొని నిల్వఁగఁజాలవు కాళ్లు; బిట్టు వం
గెన్నడు; మెల్లురాల్పడె నోగిఁ; దడఁబాటుగ మాటలాడు నా
పన్నుఁ డతండు; లేఁడు భగవంతుఁడుఁ దక్కఁ బరాయిచుట్టముల్.

చివికిచివికి చినిఁగి చెదుగాలుగొట్టిడి - గుడ్డపాఁత; యొక్క కుండబొచ్చె;
పుచ్చియున్న వెదురుబొంగు చేకట్టయు - నతనియొద్దనున్నయావదాస్తి.

పెనముతెలుంగునన్ బుడమి వేఁడికిఁ గ్రాఁగఁగ, మంగలంబునన్
జెనఁగులవోలె జంతువులు చేష్టడ, నిప్పుల గ్రుమ్మఱించురీ
తిని వడగాడ్పు వీవఁ, దినఁ దిండియుఁ ద్రావఁగ నీళ్లు లేక పె
ల్చిన వడదాఁకి సొమ్మసిల సంజయు తేర్చును వానివేసఁగిన్.

నింగికిఁ జిల్లివడ్డకరణిం దుదిగాననివానఁ గ్రుమ్మరిం
పంగ మొగిల్లొగిం, దడియ వానిధరించిన చింకిపాఁతయున్
బొంగుచుఁ బ్రక్క కాల్వతరుమూలకుటీరము ముంప నాతఁ డా
ర్తిం గొనుచుండఁగాఁ దొలకరిన్ శిలలుం గరఁగున్ గనుంగొనన్.

ఇలవణఁకించు చీఁదర మహీధరముల్ కదలంగ నూఁచుచున్
బలువడి వీవఁగా, ముసుకుబట్టినయట్టులు మూడమంచు ని
చ్చలుఁ గురియంగఁ గప్పుకొని చాలియుఁజాలని గోనెచింపి బి
ట్టలజడిఁ బొందుచున్ ముడిచి యంగము లాతఁడు పండు సీతునన్.

పొట్టన్, నోటిని, నెత్తి బాదుకొని చాఁపున్ జేయి; వాకట్టు లే
నట్టుల్ వాగుచునుండు రేబవలు దీనాలాపముల్ మర్మముల్
ముట్టం జాలినయట్టిరీతిగ! సలాముల్ సేయు; దండంబులన్
బెట్టున్ జాలినిఁ గొల్పు బిక్క మొగమున్ వేయున్ దెసల్ గాంచుచున్.

కసరితిట్టుచేని విసరంగ గవ్వయు - నేదయార్ద్రచిత్తుఁడేని నాతఁ
డేనుఁగెక్కినట్టు లెద నుబ్బి దీవనల్ - పెద్దతడవు గురియు వేనవేలు.

రాఁడా? దారినిఁదప్పియే నొకఁడు నాప్రాంతంబు, నాదైన్యముం
జూడండా? పొరపాటుచేనయినఁ గాసుం ధర్మముం జేయఁడా?
ఈఁడా యీజఠరాగ్ని చల్లఁబడఁగా నేపండొ నా? కంచు న
వ్వాఁ డాసాసల దోయిలించుక కరద్వంద్వంబుఁ గూర్చుండెడిన్.

సింగారించి యమూల్యవస్త్రవితతిం జెల్వారునెమ్మేనులన్
బంగారుందొడుగుల్ ధరించి చను తీవంబోండ్ల, మేల్దుస్తులన్
రంగారంగను దాల్చి వచ్చుదొరలన్ దర్శించి వాఁ డాత్మ ను
ప్పొంగున్ ముందుగ గంపెడాసఁ దుదికూర్పుల్ పుచ్చు మిన్ జూచుచున్.

కనఁగలుగు గ్రుడ్డివారలు - వినఁగలిగిన చెవిటివారు వేవేలుగ నా
తనికడనుండియె యరుగుదు - రనుక్షణము రాయివంటి యాత్మలతోడన్.

ప్రవహించుచుండఁగ జన - ప్రవాహములు వెల్లివిరిసి పనివడి రేయుం
బవలును వారి గణింపఁగ - భువి బ్రహ్మనియుక్తుచందమున నతఁడుండున్.

కాళులు దొట్రుపాటుపడఁగాఁ దలయూఁగ నొడల్ వడఁకఁగాఁ
దూలుచు సోలుచుం బుడమి ధూళినిఁ దోఁగుచుఁ దట్టుకొంచుఁ జే
కోలను నేలఁ, జిప్పఁగొని కొండొక వేళల బిచ్చమెత్తఁగా
జాలినిఁ గొల్పుచున్ వెడలసాగు నతండు బజారువెంబడిన్.

చరచరపోవు నొండు చెయిసాఁచి యతం డడుగంగ లేదు చి
ల్లర తనయొద్ద నంచు నపలాపము సేయుచు, నెంతమంది కి
క్కరణి నొసంగ నేర్తుమను గవ్వయు నెవ్వరికీయకున్న నొ
క్కరువుఁడు మొన్న యిచ్చితినిఁగాదె యనున్ మరొకండు కస్సునన్.

చిట్టుబుట్టు లాడి చీకొట్టుదురు వాని - దేబిరించుచున్న దీనముగను
అడుగకున్న నొసఁగ రడిగిన నొసఁగరు - పెక్కుమంది పెద్దపెద్దప్రభులు.

“వేళగానివేళ బిచ్చ మేమిటి పొమ్ము” - “రమ్ము! భానువాసరమ్మునాఁడు”
“జేయి తీఱకుండఁ బోయిరా” యనుచుంద్రు-జనులు వాఁడు బికిరమునకు రాఁగ

తిరిపముఁ బెట్టఁగఁ దిథివా - సరనక్షత్రములు లెన్న సరిపడవలెనే?
సరిపడకుండిన దాతకు - దురితము ప్రాప్తించునే? యధోగతియగునే?
కలవాఁడు లేనివాఁడును - గలవానికె యిత్తురు కట్నకాన్కలు విందుల్
దులుపంబోవరు వారిం - గిలిచేయియు శోచ్యులగు నకించనతతికిన్,

ఒకటిరెండుపైన లుండునో? ఉండదో? - అనుదినంబు వాని యార్జనంబు
పొట్టకేమితినునో? బట్టేమికట్టునో? - బ్రహ్మదేవుఁ డెఱుఁగు వానిబ్రదుకు.

అవిరత మేకాదశియే; - శివరాత్రియె దినదినంబు; శ్రీహరిహరులే
ల? వరంబులీయరో? ని - క్కువముగ వ్రతములకు ఫలముఁ గూర్తురయేనిన్.

"నాఁకపోసినవాఁ డేల నీరుపోయఁ? - డేల పెట్టండు బువ్వఁ బుట్టించువాఁడు?"
అండ్రు పెద్దలు; కాని యాయబ్జయోని-ముసిమి మదిదప్పె మఱచుఁగాఁబోలుఁగొన్ని.

పులుసో? చారో? నంజుచుఁ - గలనాలుకత్రుప్ప దుల్లఁగా డెందమునన్
నులివెచ్చనైన గంజెం - బలి కుప్పిళ్లొఱుచుచుండు వాఁ డొక్కతఱిన్.

రెన్నెల్లకొ? మూన్నెల్లకొ? - అన్నప్రాశనము సేయుసాఁ; దది సామా
న్యాన్నప్రాశనముగా దమృ - తాన్నప్రాశంబ నిశ్చయముగఁ దలఁచన్.

తిందురొ? పస్తుపరుందురొ? - ఎండలు భూమండలమున నిట్టిదరిద్రుల్
వందురుచుందురొ? యెఱుఁగరు-కొందఱు ప్రభువు లిఁకఁ దెలిసికొనరు దెలిపినన్.

తలఁ దాఁచుకొనఁగ నియ్యాలఁ బూరిగుడిసెయుఁ గనక కొందఱు గడగండ్లఁ గుడువఁ
గడుపుఁజిచ్చార్పఁ గుక్కెఁడుగంజినీళ్లును దొరకక పెక్కండ్రు దురపిలంగఁ
గట్టుపాఁతకుమాఱు చుట్టి మేనికిఁ జాఁప మానరక్షణముఁ బెన్మంది సేయ
బలపాలుగట్టఁ గాళులు డాసి యిల్లిల్లుఁ బలువురు బికిరంబుఁ ఇడయ కేడ్వఁ
బసిఁడిమిద్దెలు గట్టుచుఁ, బంచపక్వముల మెసఁగుచుఁ, గ్రొంబట్టుఁబుట్టములను
దాల్చుచు, వ్యయించుచును వినోదములకొఱకు - బ్రదుకువా రెంతటిపరార్థ
[పరులు దలఁప?

తనవిషయభోగములకుం - దనదుదురభ్యాసములకుఁ దనవేషార్థం
బును గడియించును మనుజుఁడు - ధనంబు; మరిగాదు దానధర్మంబులకున్.

నరజన్మంబు వహించినాఁడనని యానందంబునన్ వీఁగుచున్
బురుషుం డక్కట! ఉత్తరోత్తరశుభంబుల్ పొందు నాలోచనం
బు రహింజేయక లబ్ధమైనస్వధనంబున్ గ్రుడ్డివాటంపుదూ
బరఁ గావించి యధోగతుండగు నవిద్వాంసుం డగుంబో! తుదిన్.

జనులకు లభింపఁ బుణ్యా-ర్జనావకాశంబు పద్మజాతుఁడు లోకం
బున వికలాంగుల సృష్టిం-చెనో? యది కాకున్న సరిగ సృజియింపండే?

# మేరీక్యూరీసతీమణి

శ్రీమతి శ్రమధాటి జానకిగిరి

నానాటికిని విజృంభించి విస్తరిల్లుచున్న నాగరకతా ప్రపంచమున విజ్ఞానవైదగ్ధ్యము ప్రప్రథమ స్థానము నాక్రమించినది. వైజ్ఞానికుల వినూత్న పరిశోధనా వైచిత్ర్యములు బ్రహ్మసృష్టిని మార్కొనుచున్నవి! విజ్ఞానపరిశోధకుల పోటాపోటి అన్వేషణలతో ఈశ్వర



సృష్టియందలి అద్భుతశక్త్యన్వితములైన నిగూఢవస్తువులెన్నియో ప్రకాశితములగుచున్నవి! వైజ్ఞానికాగ్రణియైన క్యూరీసతి ఈఅజ్ఞాతవస్తువులలో నొకదానిని కనుగొని అఖండకీర్తిసంపన్నురాలయ్యెను. కష్టనిష్ఠురముల కోర్చి, గొప్పకార్యమొకటి సాధించిన ఈమెజీవితచరిత్ర మవశ్య పఠనార్హము. స్త్రీబృందమునకీమెచర్యలాదర్శప్రాయములు.

మేరిక్యూరి సహనశీల; మేధావిని. ఆమె ఏకాగ్రచిత్తయై, తదేకదీక్షతో కార్యము సాధించి, వినూత్న ధాతువొకదానిని కనిపెట్టి కీర్తిముకుటము ధరించినది! స్త్రీలోకమునకు విలక్షణకళ నొనగూర్చినది! స్త్రీ భూషణమైనసహనమునకు శాశ్వతకీర్తిగడించిపెట్టినది! స్త్రీలు గృహాంగణముననేగాక బాహ్యప్రపంచమునగూడ స్వీయశక్తితోనే కార్యము సాధించగలరని నిదర్శించినది. ఏకకాలమునందే ఇటు తన సహజధర్మమైన 'గృహిణీపదము'ను నిర్వర్తించియు, అటు విజ్ఞానపరిశోధనలందు భర్తకు సకలవిధముల సాయమొనర్చియు 'అర్ధాంగి' నామమును సార్థకపరచిన ధీమతి ఆమె!

మేరికీర్తి దశదిశలు వ్యాపింపజేసినది 'రేడియం' అనెడి అపూర్వమైన అల్పమాత్రపదార్థ మొకటి. మేరిమోరిమిరే దీని పుట్టుకకు మూలకందము. సంవత్సరములకొద్ది పాటుపడి, ముచ్చెమటలుగార్చి, దీప్తిమత్ ధాతువుల (Radio active bodies) నుండి, ఈపదార్థమును వెలదీసి, 'రేడియం' అని నామకరణమొనర్చినది. అనల్పమైన శ్రమచే వెలువడినది గనుక ఇది అతివిలువకలిగిన దివ్యపదార్థము! ముడుక లోహము (Ore) తో సమ్మిశ్రమైన యొక కొండను 'చింతామణి'వంటి దేవమణిగా మార్చినది! ఈమె శ్రమ అద్వితీయము. ఈమెపని అవినాశి.

మేరీ క్రీ.శ. ౧౮౬౭-వ సంవత్సరమున 'వార్సా' (Warsaw) అనుస్థలమున జన్మించెను. వివాహమునకు పూర్వము ఈమె మేరీ స్లొడోస్కా (Marie sklod .wska). ఈమెతండ్రి స్లొడోస్కా ఫ్రాన్సు (France) నగరమందలి యొకానొక విశ్వవిద్యాలయమునందు భౌతిక, గణితశాస్త్రములను నేర్పెడి ఉపాధ్యాయుడుగ నుండెను.

పసితనములోనే మేరికి విజ్ఞానవిద్యల నేర్వ అమితమైన అభిలాష. అది జన్మసిద్ధమైన వరప్రసాదమే! ఆమెతండ్రి, ఉప్పొంగి పొరలుచున్న ఆమెవిజ్ఞాన పిపాసనెరిగి, ఆవిద్యయందు ఆమె పాండిత్యమును సంపాదించవలెననెడి యున్నతాశయముతోనే, ఆమె కన్ని విధముల అనుకూలములను కలుగజేసెను. మేరివిజ్ఞానబీజము సవైభవముగా నాటబడి మొలకెత్తెను! నానాటికిని విజ్ఞానముపై ఆమెప్రేమ గాఢమగుచుండెను. ౨౪ సంవత్సరముల ప్రాయము వచ్చుసరికి మేరీ విజ్ఞానవృక్షము వేళ్లుకొన్ని విస్తరిల్లెను! విజ్ఞానపరిశోధనలు (Scientific Researches) విస్తారముగ చేయవలెనను నాశతో మేరి ౧౮౯౧-వ సంవత్సరమున 'ప్యారిసు' (Paris) నగరము ప్రవేశించెను. అప్పటికి సరిగా తెలవనికాలంపుగా, ఆమెతండ్రి దివంగతుడైనందువల్ల మేరిస్థితిగతులు చాల కఠినతరములయ్యెను. కష్టములన నదియే ఆమెకు తొలియనుభవము. అంతపెద్దపట్టణమున ఆమెనడుగువారు లేకపోయిరి. ఇంటి కద్దను ఆత్మబంధువులెవ్వరును లేకపోయిరి! ఈస్థితిలో కూడ మేరికివిశ్వాసముకొనుటకు మనస్సుపోలేదు. ఎన్ని కష్టములైననుఓర్చి, విజ్ఞానవిద్యనభివృద్ధిచేసికొనవలెననెడి పట్టుదలతో, ప్యారిసుపట్టణమున బీదసాదలు నివసించెడి సత్రమువంటి ఒకయింటియందు, మిద్దెపైన ఒకగది అద్దెకుపుచ్చుకొనెను. ఎన్నియోతూర్లు ఆమెకు కేవలము రొట్టెముక్కకంటె ఎక్కువ ఆహారము తినడానికి డబ్బులేకుండెడిది! కోమలియయ్యు, అబలయయ్యు, ఈ యువతీమణి భీకరమైన ఈ యార్థికాభావమునకు అణుమాత్రమైనను జంకలేదు; తన జీవిత ముఖ్యోద్దేశ్యమును జంకి జారవిడువలేదు! ఆకాలమున స్త్రీలు విజ్ఞానవిద్యల నభ్యసించి పరిశోధనలుజేయుట అంతగా పద్ధతిలో నుండనప్పటికిని, మేరికి మాత్రము తాను వైజ్ఞానికురాలు కావలెననెడి యున్నతోద్దేశ్యము నానాటికి ప్రబలుచుండెను. కష్టము లెక్కువైనకొద్ది ఆశా, ఉత్సాహములు అధికములగుచుండెను. జాగ్రదవస్థలో సరిగదా నిద్రావస్థలోను ఆమె కిదియే కలవరము, ఇదియే యుద్యోగము! 'ప్యారిసు'నందు జీవనము జరుపుట చాలకష్టము కాగా, మేరి యచ్చటినుండి 'సార్బన్' (Sorbon) అను స్థలమునకేగి అచ్చటనొకపరిశోధనాగారము(Laboratory) నందు పరికరముల శుద్ధపరచు నుద్యోగము సంపాదించుకొని, ఆవచ్చిన కూలితో జీవనము కడపసాగెను. ఓరిమికునికిపట్టైన ఈమె తా పట్టిన పట్టు వీడలేదు; పనిలేని ప్రొద్దులో వృధాకాలయాపనము చేయక, కేవలము తనంతతానేవిద్యగడించి, ప్రథమపరీక్ష(Matriculation) యందుత్తీర్ణురాలయ్యెను! దృఢసంకల్పులకు కానిపని యేది! తదనంతరము మేరి భౌతిక, రాసాయనిక పాఠశాలయందలి పరిశోధనాగారమున విజ్ఞానపరిశోధనలు జరుప అనుమతివడసెను. విజ్ఞానసౌధము నారోహింప ప్రథమసోపానము దొరికెను! అదే ప్రయోగశాలయందే పియరి క్యూరి (Pierre Curie) అనునొక యువ పండితుడు విద్యార్థులకు పాఠముల జెప్పుచు, పరిశోధనకార్యములను చేయుచుండెను. మేరి వచ్చినదినములలో పియరిక్యూరి విద్యుత్సంబంధమైన పరిశోధనలను, లోహము యొక్క అయస్కాంతీయగుణముల(Magnetic properties of iron) పై పరిశోధనలను చేయుచుండెను. అత నప్పటికే స్ఫటిక భౌతికశాస్త్రము (Physics of Crystals) నందును, అయస్కాంతము (Magnetism) పైనను ఎన్నియో యుత్తమపరిశోధనలను చేసియుండెను. మేరి క్యూరీకి శిష్యురా లయ్యెను. అతని పరిశోధనలకు సకలవిధముల సాయమొనర్చుచు, ఆమె అతని మెప్పులకు పాత్రురాలయ్యెను. 'ఆసబోయిన తీర్థ మెదురాయె' నన్నట్లు మేరీకి క్యూరీ సత్సాంగత్యము దొరికెను! దినదినమునకు వారిమైత్రి అధికమై, ఉపాధ్యాయుడు ప్రియుడుగా, శిష్యురాలు ప్రేయసిగా, ప్రయోగశాల ప్రణయశాలగా మార్పుజెందెను! గురుశిష్య లొకశుద్ధముహూర్తమున పవిత్ర వివాహసంబంధముతో బద్ధులైరి. మేరీరొట్టె నేతిలో బడెను!

సతీపతు లిద్దరును చేదోడువాదోడుగా పరిశోధనలుచేయ ప్రారంభించిరి. 'పియరి' స్ఫటికనిర్మాణక్రమముపైనను, మేరీ లోహముల అయస్కాంతగుణములపైనను పరిశోధనలుచేయ మొదలిడిరి. అదేదిన

ములలోనే 'హెన్రీ బాక్వెరెల్' (Henry Bacquerl) అను వైజ్ఞానికుడు ముతుకలోహములందలి 'యురేనియం' (Uranium) అను ధాతువుపై పరిశోధనలు నడపుచుండెను. ఆ పరిశోధనల ఫలితముగ ఈ 'యురేనియం' ధాతువునకు ప్రసరింపజేసెడి వికిరణ (Radiatfon) శక్తి యున్నదనియు, ఆ విచిత్రగుణమువల్ల ఈధాతువు ఛాయాచిత్ర గ్రహణ పటమును (Photographic Plate) నల్లబరచుటయేగాక, విద్యుచ్ఛక్త్యావిష్టమైన పదార్థములను విసర్జించుననియు, కనుగొనెను. ఇదిగాక ఇతడు, 'యురేనియం' తో సమ్మిశ్రమైన శిలాపదార్థము (Uranium Pitchblend) నందలి ముతుకలోహమును ప్రత్యేకించి పరీక్షించుచుండగా ఆశ్చర్యకరమైన పదార్థము మరొకటి వెలువడెను. ఈ ధాతువు ఛాయాచిత్రగ్రహణపు పటములపై 'యురేనియం'కంటెను ఎన్నియోరెట్లెక్కువమార్పు కలుగజేయగల శక్తితో గూడియుండెను! మేధావియైన 'బాక్వెరెల్' శాస్త్రవేత్త విజ్ఞానపరిశోధనాగారము (Laboratory)న మేరీ సతియొక్క అనన్యశ్రద్ధాన్వితమైన కార్యదీక్షాపరత్వమును ఏమఱక ప్రతిదినము కనుగొనుచుండెను. ప్రయోగశాలయందు ఆమెనిదానము, ఓరిమి, హస్తలాఘవ చాతుర్యము కనుగొనినకొద్ది ఆమె ఉత్తమోత్తమ పరిశోధకాగ్రణి కాగలదని ఆశాస్త్రజ్ఞుని మనస్సునకు తట్టెను. ఆలసించక వెనువెంటనే తాను కనుగొన్న నూత్నధాతువులను రెంటిని విడదీసి ప్రచురపరచు సమస్యనామె కొప్పజెప్పెను. మేరీ, పియరీ లిద్దరును తామొనర్చుచుండిన పనులనన్నిటిని త్రోసిపెట్టి, శిలాసంయుక్తపదార్థము (pitchblend) నుండి ఈ వినూత్న అజ్ఞాతధాతువుల (unknown elements) ను కనుగొను పరిశోధనలు ప్రారంభించిరి.

కార్యము సాగించుటకు వారికి తగినంత డబ్బులేకపోయెను. ఎవరివద్దనో బదులు పుచ్చుకొని ఏకాగ్రచిత్తులై పనిని ప్రారంభించిరి. శిలాసంయుక్త పదార్థము 'ఆస్ట్రియా' గనులయందు దండిగముగ నుండి నందువల్ల అచ్చటి ప్రభుత్వమువారు ఈయిరువురు పరిశోధకులకును కావలసినంత పదార్థమును సరఫరా చేయుటకు సాయమొనర్చిరి. ఇంతపదార్థమును దాచుటకు ప్రయోగశాలయందు తావులేమిచే తమ యింటనే గదులలోను, దొడ్డిలోను, ఖాళీగానున్న స్థలములందెల్ల అదేఅదిగా రాశిపోసికొనిరి. గృహశుభ్రతకే సదా గాసిపడుచున్న గృహిణి నేడిల్లింపాదిగా నిండిన రాలరాశిని రత్నాలరాశిగా భావించెను! ఆమె తన భావిజీవితౌన్నత్యమును దానిగుండా చూచెనేమో! ఇల్లంతయు మట్టి, దుస్తులన్నియు మట్టి, పరికరములు ధూళిధూసరితములు. కార్యాతురులైన క్యూరీదంపతుల కంటికివి అగుపడనేలేదు! భార్యాభర్త లొకరొకరొకొకమూల కూర్చుండి, క్షణమైనను వ్యర్థపుచ్చక తదేకధ్యానముతో పనిచేయసాగిరి. మేరికి అడ్డంకు లమితములు; శారీరకముగా—స్త్రీసహజమైన కోమలకాయము ఎక్కువ కష్టపడనివ్వదు; సాంసారికముగా—బిడ్డపాపల పోరు, వంటవార్పుల అవసరము; సాంఘికముగా—స్త్రీ యింతటిపనికి పూనుకొన్నదన్న జనుల గుసగుసలు, ఓర్వలేమి! కాని ధీరస్వాంతయైన మేరీ వీనినన్నిటిని నిగ్రహించి కార్యసాఫల్య మొందినది. ఇదియే ఈమహిళామణి జీవిత చరిత్రలోని అతిశయము! ఈదినములలో ఈమెకూతుండ్రు 'ఐరీన్' (Irene), 'ఈవ్' (Eve) ఇద్దరును పసిపాపలు.

మేరీ ఆశయమునకు ఆమెప్రియభర్త ఎంతయు తోడ్పడి, ప్రోత్సాహ పరచుచుండెను. ఉడుకుబోతుతనపు వురవడికి తాళలేక, జనులు మేరీపేరు పైకి రారాదని ఎన్నియో ఆటంకములను కలుగజేసిరి; ఆమె పరిశోధనలకు విఘ్నముచేయజూచిరి. కాని ఆమె భర్తయొక్క రక్షకకవచ మామె కేలొందరను రానియ్యకుండెను! తుదకు మేరీఆశయము నెగ్గెను. సంకల్పసిద్ధురాలయ్యెను! బాల్యముననే నాటబడిన విజ్ఞానబీజము వృక్షమై నేటికి ఫలమొసంగి ఆమెను ధన్యగా జేసెను! వినూత్నధాతువును భర్తకంటె ముందుగా ఆమెయే కనుగొనెను! అష్టకష్టములుపడి పైకిదీసిన ఆపదార్థమునకు తన జన్మస్థానమైన 'పోలెండ్' నందలి 'పొలేనియం' (Polanium) అనుగ్రామము పేరిడెను. మేరి నూత్నధాతు వొకదానిని కనిపెట్టినదని తెలియు

గనే, జనులు చాల మాత్సర్యపడిరి! కేవలము స్త్రీమాత్రము గనుక తన పరిశోధనఫలితముల కీర్తి భర్తకొసగి, తాను వెనుక నిలిచి సంతసించుట లెస్సయనిరి పియరిక్యూరి మేరీకష్టమును తనపేర ప్రచురించుటకే మాత్రము నియ్యకొనలేదు తన ప్రేమనిధానము స్వతంత్రవిఖ్యాత గావలెనని అత డుదారహృదయముతో నొప్పుకొనెను! ౧౯౦౩-వ సంవత్సరమున లండనునందలి 'రాయల్ ఇన్‌స్టిట్యూషన్' వారు క్యూరీగారిని వారి నూత్న పరిశోధనపై ఉపన్యాసమిమ్మని ఆహ్వానించగా నితడు ప్రియపత్నీసమేతుడై వెళ్లెను. తన సతియొక్క అద్వితీయవ్యక్తిత్వమును ప్రపంచమున కెరుకపరచవలెననెడి ఆశయ మతని కమితముగ నుండెను గనుకనే ఉపన్యాసాంతమున మేరీయొక్క కార్యసాహసము నగ్గడించెను; ఆమెఓర్పిమిని నుతించెను. అసూయాధీనముగాని ఈతని ప్రేమ ఆదర్శప్రాయము! అదేసంవత్సరమున 'రాయల్‌సొసైటి' వారు 'డేవీ'గారి బహుమాన పతకము (Davy Medal)ను క్యూరీదంపతు లిరువురికిని చేర్చియొసగిరి. ౧౯౦౪-వ సంవత్సరపు 'నోబెల్' బహుమతి మేరీక్యూరీకిని, హెన్రీబాక్వెరెల్ గారికిని భాగింపబడెను. తరువాత మేరీ మరొకక్రొత్త ధాతువును కనుగొనెను. ఇదియే జగద్విఖ్యాతమైన 'రేడియం'!!

రేడియమును ప్రత్యేకించుటకొఱకై ఆస్ట్రియా ప్రభుత్వమువారు క్యూరీసతికి రేడియోదీప్తిమత్పదార్థమును విస్తారముగ నొసగిరి. క్రొత్తధాతువుయొక్క భౌతిక, రాసాయనికగుణములను కనుగొనుటకు కావలసినంత పదార్థమును సమకూర్చిరి. క్యూరీసతిపరిశోధనలు నిరంకుశముగ నడువసాగెను. అప్పటికీమెకుమార్తె లిరువురును శాస్త్రవేత్తలైరి. పరిశోధనలు చేయుచునే మేరీ కూతుండ్రకు విద్యయు గరపుచుండెను; భర్తకు పరిచర్యలును చేయుచుండెను. కాల మేకరీతిగ కడవజాలదుకదా! మేరీశుభమయజీవనమున కకస్మాత్తుగా పిడుగుపడెను. ౧౯౦౬ లో పియరిక్యూరి ఆకస్మికవిపత్తువల్ల కీర్తిశేషుడయ్యెను! మేరీహృదయాకాశమున కారుమేఘములు క్రమ్ముకొనెను. ప్రియపతిమరణమువల్ల మేరీకి ప్రపంచము నిరాశాజనక మయ్యెను. ఆనాడు కలిగిన మార్పు ఆమెజీవితాంతములోపుగ తొలగకనే పోయెను. ఐనప్పటికిని శాస్త్రీయపరిశోధనలన్న అన్నపానాదులను మానుకొని పనిచేయుచుండిన తన ప్రభువు ఆత్మశాంతికొఱకును, అతని ఆరాధనముకొఱకును మేరీ పరిశోధన కార్యములు మానుకొనలేదు; రెట్టింపు భక్తిశ్రద్ధలతో కార్యము సాగించుచుండెను. ౧౯౧౧ లో క్యూరీసహధర్మిణికి 'రేడియం' యొక్క ఆవిష్కరణ, పృథక్కరణములకొఱకై రసవాదశాస్త్రపు 'నోబెల్' బహుమతి యొసగబడెను! విజ్ఞానశాస్త్రమున 'నోబెలు' బహుమతి వడయుట కీమెయే మొట్టమొదటి స్త్రీ! పియరిక్యూరి గతించిన సంవత్సరములో 'సార్బన్' (Sorbon) లో ఆమెభర్త కొసగబడియుండిన ఉద్యోగమున ఆమె ప్రవేశించవలెనని ప్రార్థించిరి. ఈయొక స్థలముగాక మరెన్నియో విజ్ఞాన పాఠశాలలందును, ప్రయోగశాలలందును ఆమెను ముఖ్యురాలుగా నుండుట కాహ్వానించిరి. అసంఖ్యాకములైన మర్యాదలను జేసిరి; గౌరవబిరుదములను వర్షించిరి! సకలశాస్త్రపాఠశాలలందును ఈమెపేరు మాఱుమ్రోగెను! మేరీకి ఆడంబర మసహ్యము. కాని, ఆమెపరిశోధనఫలితమైన పదార్థము ఆమెకీర్తిని కస్తూరివలె నలుదిక్కుల వ్యాపింపజేసినది. పియరిక్యూరిగారి మరణానంతరము ప్యారిసువిశ్వవిద్యాలయమువారు రేడియంకొఱకు పియరిక్యూరిగారి పేరుతో ప్రత్యేక పరిశ్రమలయమొకటి ఏర్పరచిరి. ఇచ్చట ముఖ్యముగ దీప్తిమత్ ధాతువులయందు పరిశోధనలు జరుపన్నేర్పాటాయెను. ఈపరిశోధనాగారమునకు మొట్టమొదటి అధ్యక్షురాలు క్యూరీసతియే! స్థాపింపబడిన ౨౦ సంవత్సరముల లోపుగా 'క్యూరీ పరిశ్రమాలయము' (Curie Institute) గొప్ప పరిశోధనలకెల్ల మూలస్థాన మయ్యెను. నానాదేశముల విద్యార్థు లనేకులు మేరీసతియొక్క పరిశీలనక్రింద అనేక పరిశోధనలు చేయసాగిరి. మేరీ అంతిమదినముల వరకు ఇచ్చటనే అధ్యక్షురాలుగ నిలచి, స్వంతముగ నెన్నియో పరిశోధనలు చేయుచుండెను. ౬౦ సంవత్సరములైన పిమ్మటను మేరీ పరిశోధనలుచేయుట మాను

కానలేదు 30 సంవత్సరములనుండి దీప్తిమద్ధాతువులతో ఎడతెఱపిలేకుండ పరిశోధనలు చేయుచుండినందువల్ల సదావాని వికిరణ ప్రసరణచే శరీరము బలహీనమై, మేరీ రోగశయ్యాపట్టెను. వైద్యులు అచ్చటికి సమీపముననున్న కొండపైని ఆరోగ్యస్థానము (Sanatorium) న నుండుమని సలహానిచ్చిరి. కూతుంర్రు, అల్లుండ్రతో గూడి మేరీ అచ్చటికి వెళ్లెను. అచ్చటికి వెళ్లినప్పటికిని ఆమె ఎక్కువకాలము బ్రతుకలేదు. ౧౯౩౪వ సంవత్సరము జూలై ౪వ తేదిని మేరీక్యూరి భౌతికదేహము వదలి భగవత్సాన్నిధ్యము నందెను. ప్రియపుత్రికలును, బంధుజనమును, యావద్విద్యార్థిబృందమును మేరీ యొకటాటు కపారదుఃఖమందిరి. విజ్ఞాన పరిశోధనలకే జీవితమును ధారవోసిన ఆమెఆత్మకు వైజ్ఞానిక ప్రపంచమెల్లను హృదయపూర్వకముగ శాంతిని గోరెను. ఆమె చివరికోరిక ప్రకారము "స్కోక్సు" (Sceaux) అను స్థలమున ఆమెభర్త భౌతికశరీరముప్రక్కనే ఆమెదేహమును కూడ భూస్థాపితమొనర్చిరి.

మేరీకి శాస్త్రీయ విద్యయందు బాల్యముననే పుట్టిన ప్రేమ ఆమరణాంతము అనర్గళముగ నిలిచెను. సాంసారిక, శారీరకబాధలనొక్కటిని ఆమె సరకు చేయలేదు. శాస్త్రీయసభలేకాక ఇతర నానావిషయక సభలన్నిటికిని కూడ ఈమె తప్పక వెళ్లుచుండెను. శాస్త్రీయవిషయములందీమె వాదనలు మిక్కిలి విలువ కలిగినవై, మిక్కిలి సారవంతములుగ నుండెడివి. ఆమె ధీమతి!

మేరీ పరిశోధనలు చాల కచ్చితమైనవి; జాగరూకతానిదానములతో గూడినవి. శాస్త్రీయాంశములను వ్యాఖ్యానించునపుడు ఈమె లవలేశములను సైతము విడువక విమర్శించునట్టి దివ్యశక్తి కలిగియుండెను. ఈమె భౌతికశాస్త్రమున 'పండితపట్టము' (Doctorate degree) వహియించుటకు పరీక్షకులకు తానొనర్చిన శాస్త్రీయ పరిశోధనల శాస్త్రవాదనా పత్రముల (Thesis)ను పంపగా, అప్పటి పరీక్షకసభ (Examining committee) లోని విఖ్యాతశాస్త్రవేత్తలైదాగ్గురును విజ్ఞానచారిత్రమున ఇదివర కెన్నడిట్టియుత్తమోత్తమ పత్రములను చూచి, విని ఎఱుగమని ఏకీభావముగ సమ్మతించిరి. జాగరూకతా, నిదానములు మేరీకి పెట్టని సొమ్ములు.

మేరీమూర్తి సౌమ్యము, ఆమెగుణము సౌకుమార్యము. ఆమెకు లజ్జాభిమానములు మెండు. మొట్టమొదట ఈమె ప్యారిసునందలిశాస్త్రీయవిద్వత్సభ (Academy of-sciences) యందు ఒక సభ్యురాలుగా నుండుటకు కోరికొనగా ఆమహాసభయందు స్త్రీలను చేర్చికొనుట న్యాయవిరుద్ధమని చెప్పి అసమ్మతినిచూపిరి. తరువాత కొద్దిరోజులకే జనులు తమ యభిప్రాయమును మార్చుకొని, ఆమెను సభ్యురాలుగా జేరమని యాహ్వానించగా, అభిమాన పూరితయైన మేరీ నిరాకరించెను! కాలక్రమేణ ఆసభయందామె అనన్యమణి!

మేరీ ఆంగ్లేయ మహాసంగ్రామసందర్భమున 'రెడ్ క్రాస్' సంఘము (Red cross society) నందు చేరి తానే స్వతః రణాంగణమున నిలచి, యుద్ధమునకు కావలసిన 'రేడియం' మోటారుబండ్ల (Radium cars) ను చూచుకొనెను. ఆమె వీరరమణి!

మేరీసతిపరిశోధనలు భౌతిక, రాసాయనిక శాస్త్రములందు వినూత్నవికాసముల కెన్నిటికో మూలాధారములైనవి. ముఖ్యముగ 'రేడియం' ఉత్పత్తికి కారకురాలైన ఈమెను రోగార్తులెందరో నుతించక మానరు!

మేరీ తనజన్మధాత్రియైన పోలెండునకును, తన యభివృద్ధికి కారణమైన ఫ్రాన్సునకును భక్తిపూర్వకముగ సహకారమొనర్చెను. ఆమె దేశభక్తురాలు!

సమాలోచనసభలందును, సాంఘికసభలందును తను మనోధనములతో పనిచేసినది మేరీ. సంఘసేవ, ఆమె పవిత్రోద్దేశ్యము!

మానవసేవకును, సంఘోన్నతికిని, దేశాభ్యుదయమునకును, అతిముఖ్యముగ శాస్త్రీయ విద్యాభివృద్ధికిని క్యూరీసతి చాల శ్రమచెందెను. ఫ్రాన్సు నందేగాక ఇతరనానాదేశములందును 'రేడియం'ను వైద్యమున నుపయోగపరచవలెననెడి యాశ మేరీ కమితముగ నుండెను.

దీనహీనజనసేవకై ఆతురపడిన ఆమె ఆశయము నెరవేరెను.

సకలప్రపంచము గౌరవింపదగినట్టి అత్యుచ్చపదవి నందినప్పటికిని మేరీ చపలచిత్తగాక, ప్రయోగశాలయందు పరికరములను శుద్ధపరచునాటి మేరీవలెనే ప్రశాంతముగ నుండెను. ఆమెనిర్గర్వము నిండుకడవ వంటిది!

ఆమెను చూచినవారెల్ల, ఆమె అతిసరళ జీవితమును, అమితమైన కుశాగ్రబుద్ధిని పరిపోల్చి నివ్వెరపడిరి! ఆమె నిరాడంబరమైన నిర్మలహృదయ!

మేరీహృదయము దయాపూరితము. పిన్నపెద్దలు, బీదసాదలు అనక ఆమె సకలురను ఏకరీతిగ ప్రేమించుచుండెను. ఆమెకు మిత్రబృంద మతివిస్తారము.

ఆమె స్నేహమయి!

క్యూరీదంపతులు తామొనర్చిన అద్వితీయ పరిశోధనలతో కోట్లకొద్ది ద్రవ్యము ప్రోవుచేయగలిగియుండిరి. కాని నిష్కామకర్మతో కార్యమాచరించిన వీరి మనస్సును ద్రవ్య మాకర్షింపజాలకపోయెను! మానవకోటికి ప్రయోజనపడునట్టి యుత్తమకార్య మొకటి సాధించవలెననెడి ఒక్కటే ఆశయముతప్ప సిరిసంపదల కాశించలేదని, వీరు రేడియంయొక్క 'నూత్నకల్పనాధికార పత్రము' (Patent) ను, దానివల్ల వచ్చెడి ధనరాశిని ధిక్కరించిరి; పర్వతమంత శిలాసంయుక్త పదార్థమునుండి అతిపరిశ్రమతో తీసిన ప్రతియొక్క 'రేడియం' అణువును వైద్యశాలలకు బహుమతిగా నొసగివేసిరి.! వీరి త్యాగ మద్వితీయము!!

మేరీసతి జీవిత చరిత్రవల్ల స్త్రీబృంద మెంతటి యున్నతపదవి నందవచ్చునో తెలియుచున్నది అద్భుతసామర్థ్యముతోపాటు సౌశీల్యమును కలిగిన ఈయువతీమణి చర్యలు భారతరమణి కాదరణీయములు; అనుసరణీయములు!!

ఇటీవల మేరీపుత్రి 'ఐరిన్ జోలియటు క్యూరి' (Irene Joliot Curie) చే రచియింపబడిన క్యూరీసతీమణి జీవితచరిత్రమును 'కొలంబియా' చిత్రప్రదర్శకులు (Columbia pictures) వారివలన చిత్రరూపముగ ప్రదర్శింప ప్రయత్నములు జరుపుచుండుట ప్రశంసనీయము.

బీజ మొకటైనను వృక్ష మొకటికానేరదన్న లోకోక్తి క్యూరీదంపతుల పుత్రివిషయమున అద్భుతముగనొప్పినది! వీరిజ్యేష్ఠపుత్రి 'ఐరిన్ క్యూరీ' విజ్ఞానవైదగ్ధ్యమున తల్లిని మించుచున్నది! ఈమె 'జోలియటు' (Joliot) గారి ధర్మపత్ని. ఇతడుకూడ వైజ్ఞానికాగ్రణియే! 'జోలియటు' దంపతులు క్యూరీదంపతులవలెనే ఇరువురును కలిసి పరిశోధనలు చేయుచున్నారు. వీరు నూత్నముగ తయారుజేసిన కృత్రిమ 'రేడియం' (Artificial Radium) కొరకు నిరువురు రసాయనశాస్త్రపు 'నోబెల్' బహుమతిని బడసిరి! క్యూరీగారి యావత్కుటుంబము విజ్ఞానవేత్తలై బహుమతుల బడసినది వింతలలో వింత!

మేరీసతి అంతిమదినములలో 'ఆక్టీనియం' (Actinium) అను పదార్థముయొక్క ఉత్పత్తిని ఎక్కువ బలవత్తరము చేయుటకై పరిశోధనలు సలుపుచుండెను. స్వర్గగత కాగానే ఆకార్యమును సమర్థులైన తనకూతురు, అల్లుండ్రకు పూర్తిజేయ నొప్పగించెను.

జోలియటుక్యూరీసతికి అనేకగౌరవకార్యము లొప్పగింపబడెను. ఫ్రాన్సు ప్రభుత్వమండలి విజ్ఞానపరిశోధనలకెల్ల ఈమె ముఖ్యకార్యదర్శినిగా నియమింపబడెను. ఫ్రాన్సు రాజ్యాంతరంగ సభ (French cabinet) లో ఈమె యొకమంత్రిగా నియమింపబడెను! రాజకీయములం దింతటి గొప్పపదవికి స్త్రీల నేర్పరచుట ఇదియే ప్రథమము! ఈమెయౌన్నత్యము మాతాపితరుల కీర్తిమకుటమును మణిమయమొనర్చిన దన్న నతిశయోక్తి కానేరదు! ఇట్టి సుపుత్రిని కన్న మేరీక్యూరీలు ధన్యాత్ములు!

### రేడియం (Radium)

శాస్త్రజ్ఞు లిదివరకు పరిశోధనలుచేసి కనుగొన్న వస్తువులలోకెల్ల 'రేడియం' ఉత్తమోత్తమ మైనదని నిర్ణ

యింపబడినది. రజత, సువర్ణాది లోహములకంటెను, నవరత్నాది మణులకంటెను ఇది నూరారువంతు లెక్కువ విలువైనదన్న దీని మూల్యము సులభగ్రాహ్యము. ఈనూత్నధాతువుయొక్క కణములు స్వయం ప్రకాశకములు. అంధకారమున నివి చిట్టి విద్యుద్దీపముల వలె వెలుగుచుండును. ఇది సదా నులివెచ్చనైన వేడిమిని ప్రసరింపజేయుచుండును. "రేడియం" అతిగాఢమైన విషపదార్థము. దూరమున నుండినను దీని విషము చెరుపుచేయునంతటి శక్తివంతమైనది. దీనిని చర్మమునకు దగ్గరగా నుంచుకొనిన తీవ్రమైన వ్రణములు కలుగచేయును.

క్యూరీసతీమణిబుద్ధిబల, శరీరబలములనువ్యయపరచి సంవత్సరములకొద్ది పాటుపడి ఒక వినూత్నధాతువును కనుగొని, ప్రపంచము నచ్చెరువందజేసెను; కాని ఈధాతువుయొక్క గుణాతిశయములు, నానాశాస్త్రములందును దీని అసమానమైన యుపయోగము దీని యుద్భవమునాటి విస్మయమును విస్మరిల్లచేయుచున్నది! ప్రపంచమంతటను శాస్త్రీయ పరిశోధనలకును, అనేకరోగాగ్రస్తుల ఔషధములకును, మరెన్నియో పనుల కిదివరకు ఉపయోగించి యుండెడు రేడియంయొక్క ఒట్టు మొత్తము ౨౮౦ గ్రాములు, అథవా దాదాపు అరపౌను. ఈపిడికెడు పదార్థమును ఉత్పత్తిచేయుటకు నూరారుమంది సంవత్సరములకొద్ది పాటుపడవలసి వచ్చెను! 'రేడియం' ఉత్పత్తికి మూలస్థానములు విస్తారముగ నుండినప్పటికిని అమిత ప్రయాసము, అధిక ధనవ్యయము చేసి ప్రత్యేకించినచో దొరకు మొత్తము అత్యల్పమే! 'రేడియం' మూలస్థానములైన శిలాసంయుక్త పదార్థము, ముతుకలోహము వీటిని శుద్ధిచేయుటకొఱకై 'కొలరెడో' (Colorado) దేశమునుండి కెనడా, (Canada) దేశమునకు విమానములపై దెచ్చుచున్నారు! బహుమూల్య పదార్థమైన రేడియం ఈ విపరీతపు ఖర్చువెచ్చములను సులభముగ చెల్లింపజేయుచున్నది.

## 'రేడియం' ఉపయోగములు

'రేడియం'ను చికిత్సల కతిముఖ్యముగ వాడుచున్నారు. 'రేడియం'కిరణములు 'ఎక్స్' కిరణము (X – Rays) ల వలెనే మిక్కిలినూటిగా చొరబడు స్వభావము కలవి. ఇవి శరీరమును జొచ్చినవో కొన్ని విధములైన తంతుకోశములు (Tissue cells) నాశమొందును. ఈ తంతువులందుండు సూక్ష్మకోశములలో నుత్పత్తియయ్యెడు కొలుకుపుండు, పులిపిరికాయలు, మొటిమలు, పుండ్లు మొదలగు చర్మవ్యాధులను 'రేడియం' కిరణములు నివారించును. 'రేడియం' యొక్క 'గామా' కిరణములు (Gamma rays) శరీరమున దుర్మాంసము పెరుగకుండ నివారించును. ఇటీవల 'రేడియం' తో గొంతులోని గవదకాయ (Tonsils) లను నివారించ ప్రయత్నములు జేయుచున్నారు. ఇదిగాక 'రేడియం' నకు మూత్రికామ్ల (Uric acid) ద్రవమును ఎక్కువగ బయలువెడలజేయగల గుణము కలదు గనుక వాతరోగము (Gout), సంధివాతము (Rheumatism), బహుమూత్రవ్యాధి మొదలైన రోగముల నివారింప ప్రయత్నములను చేయుచున్నారు. 'రేడియం' ను రోగికొసగునప్పుడు కొన్నిరోగములకు పీల్చుకొననిచ్చెదరు; మరికొన్నింటికి ద్రవముగాజేసి త్రాగనిచ్చెదరు. చర్మవ్యాధుల కుపయోగించునపుడు 'రేడియం' ను లవణరూపమున ౨౫, ౫౦, అథవా ౧౦౦ మిలిగ్రాము (Milligrams) ల మొత్తమునకు చిన్నిగొట్టములందు వేసియుంచుదురు. పుండ్లు, గడ్డలు మొదలైన వ్రణముల చికిత్సకు 'రేడియం' ను వాడిమొనగలిగిన బోలునూదులలోని కెక్కించియుంచుదురు. వీటికి 'రేడియం' సూదులని పేరు వీటిని పుండ్లలోనికి సూటిగా చొరనిచ్చి, 'రేడియం'ను తగునంతప్రొద్దు ప్రసరింపజేసినతరువాత సూదిచివర నుండు బెజ్జములోనికి ఒక తంతినిగాని, దారమునుగాని జొనిపి, సూదిని బయటికి లాగివేయుదురు.

పరిశ్రమ (Industries) లందును 'రేడియం' యొక్క ఉపయోగము లమితములైయున్నవి. కొన్ని వస్తువులకు పూసెడు రంగులు స్వయంప్రకాశములుగ నుండుటకొరకై 'రేడియం' నుపయోగించుచున్నారు. గడియారములకు, ఫౌంటన్ కలములకు, విమానములకు, అంధకారములో కనబడుటకొరకై అతికించియుం

డెను స్వయంప్రకాశకములైన ఒళ్లలను, మరెన్నియో వస్తువులను 'రేడియం' ను ముఖ్యముగ నుపయోగించుచున్నారు. ఇదిగాక ఇటీవల 'రేడియం' కిరణముల ప్రసరణతో నవరత్నముల కాంతిని ఇనుమడింపజేయ ప్రయత్నములు పలువురు చేసియున్నారు. రేడియంయొక్క 'గామా' కిరణములు ఛాయాచిత్రగ్రహణపు పటముల గుండా చొచ్చి, వాటియందు మార్పు కలుగజేసినట్లే ఇది ఉక్కు మొదలైన లోహములలోనికిని చొరబడి మార్పుకలుగజేయగలదని శాస్త్రవేత్తలు నిరూపించిరి. ఈ నిరూపణ యంత్రకారుల (Engineers) కమితోపయోగకరము లయ్యెను. యంత్రకారుల సామగ్రులు, ఉక్కుస్తంభములు, చక్రములు మొదలైన అతివిలువ కలిగిన భారీవస్తువులు లోన బీటవారినగాని, చిరకలిగి యుండుటగాని, లేక ఉత్తమ స్థితిలోనుండుటయు అను నీయంశములను సులభముగ కనుగొనుటకు 'రేడియం' యొక్క 'గామా' కిరణములు అత్యంతోపయోగకరములైయున్నవి.

'రేడియం' విత్తనములను నిష్క్రియముగా చేయగలదు. సూక్ష్మజీవు (Bacteria) లను వినాశపరచగలదు. ఇంకను శాస్త్రజ్ఞుల పరిశోధనవల్ల దీని యుపయోగములు తండోపతండములుగ వెలువడునట్లు సూచనలు కనబడుచున్నవి. ప్రపంచమంతయు అన్వేషింపకుతూహల పడుచుండునట్టి దివ్యపదార్థము కేవల మొక స్త్రీవల్ల కనుగొనబడుట అత్యాశ్చర్య విషయము!

# ఎనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తి



౧౦. గుఱ్ఱపు పందెములలో జాకీ (కుడివైపు చివర) సిడ్నీ (ఆస్ట్రేలియా)లో



౧౧. పశుపాలనము (కానడాలో) (నడుమ)



౧౨. దాటులగుఱ్ఱపు పందెములో (వేల్సునందు)

౧౩. తండ్రి కుమారులు



౧౪. సాధారణ రూపచిత్రము





౧౫. రాయల్ నావికదళాధిపతి



౧౬. సోల్జరు (కుడివైపు)

# బొమ్మరిల్లు *

బుర్రా వేంకట సుబ్రహ్మణ్యం

రామదాసుగారు పీఠికలో చెప్పినట్లు ఆంధ్ర వాఙ్మయం అభివృద్ధిచెందడానికి స్వతంత్రరచనలే కాకుండా మిగిలిన భాషలలో ఉన్న ఉత్తమగ్రంథాలను ఆంధ్రీకరించడంకూడా అవశ్యకం. అంతేకాదు. మరొకమాటకూడా చెప్పాలి. నిజానికి మనభాషలో కొన్నిశతాబ్దాలనుంచి అసలు చెప్పుకోదగిన స్వతంత్రరచనలే అట్టేలేవు. వీటిలోనైనా గద్యంలో ఉన్నరచనలు చాలాతక్కువ. ఈగద్యరచనలలో మళ్లీ నాటకగ్రంథాలు మరీఅరుదు. ఈమధ్యవెలువడుతున్న మన స్వతంత్ర నాటకరచనలనుగురించి ఆలోచిస్తే, పద్యాలలోనూ పాటలలోనూ మునిగిపోని నాటకాలూ, అర్థం లేకుండా అంకానికి అనేకరంగాలచొప్పున అధమం అయిదుఅంకాలైనాలేని నాటకాలూ లేనేలేవు. అందువల్ల ఈపద్యాలూ, ఈపాటలూ, ఈఅర్థంలేని రంగాలూ మానుకుని నవీనపద్ధతులప్రకారం స్వతంత్రంగా నాటకాలు రచించడానికి కూడా తెలుగువాళ్లందరూ ఈ నవీనపద్ధతులేమిటో తెలుసుకునేందుకుగాను మిగిలిన భాషలలోఉన్న కొత్తకొత్త నాటకగ్రంథాలు అనేకంగా ఆంధ్రీకరింపబడాలి. నవీనపద్ధతులు మనస్వతంత్ర వాఙ్మయంలో బయలుదేరాలంటే ప్రస్తుతం ఇదేముఖ్య మార్గం కాబట్టి, దేశరాజు రామదాసుగారు ఇబ్సెన్ వ్రాసిన 'ఎ డాల్స్ హౌస్'ను ఆంధ్రీకరించినందుకు ఆంధ్రవాఙ్మయం అభివృద్ధిచెందాలనేవాళ్లందరూ ఆనందించాలి.

ఈ గ్రంథానికి అవతారిక వ్రాస్తూ గిడుగు వెంకట సీతాపతిగారు "కొన్నివిషయములలోమాత్రం స్వతంత్రించి గ్రంథమురచించుటకంటె పరభాషలోఉన్న గ్రంథము స్వభాషలోనికి పరివర్తనముచేయుట ఎక్కువ కష్టమైనపని" అన్నారు. ఈఅభిప్రాయం సమర్థించుకునేందుకు వారు నిరూపించిన కారణాలు ఎటువంటివైనప్పటికీ వారి అభిప్రాయంతో అందరూ ఏకీభవిస్తారు. ఒకదేశపు భాషలోఉన్న నాటకాన్ని మరొకదేశపు భాషలోకి తీసుకరావాలంటే రెండుకారణాలవల్ల కష్టాలుంటాయి మొదటి కారణం, రెండుభాషలకీ వాటి సొంపుసొంపులలోనూ, వాటి శక్తిసామర్థ్యాలలోనూ ఉండే భేదం. గ్రంథకర్తకి రెండుభాషలూ కూడా బాగా తెలియాలి. రెండుభాషలూ బాగా తెలిసినప్పటికీకూడా అప్పుడప్పుడు ప్రయోజనం లేదు. ఒకే భావాన్ని మొదటిభాషలో రెండుమూడుమాటలలో అందంగా సూచించడానికి వీలుండొచ్చును; రెండవ భాషలో ఎన్నిమాటలువాడినా ఆ అందం రాక పోవచ్చును. రెండవ కారణం, రెండుదేశాలకీ సంఘపరిస్థితులలోనూ, ఆచారాలలోనూ ఉండే భేదం. గ్రంథకర్తకి పరదేశపు సంఘపరిస్థితులు బాగా తెలియాలి. లేకపోతే తెలుగులో పునాదిలేని నాటకం తయారవుతుంది. అర్థంలేకుండా ఉంటుంది. ఈరెండు విషయాలలోనూ ఉదాహరణలు రామదాసుగారి 'బొమ్మరిల్లు' లోనే చూపించొచ్చును.

## భాషాభేదం ముందు ఆలోచిద్దాం

ప్రథమాంకం చివరున నోరా ఆఖరి రెండువాక్యాలూ ఇవి: It is not true. It can never, never be true) వీటిని. రామదాసుగారు ౬౨వ పేజీలో ఈవిధంగా ఆంధ్రీకరించారు: "అది నిజంకాదు. అదినిజమయ్యుండదు" It can never be true అన్నవాక్యం ఆసందర్భంలో It is not true అన్నవాక్యంయొక్క భావాన్నే మరీ ఖండితంగా చెప్తుంది. 'అదినిజమయ్యుండదు' అనడంలో

---

* (హెన్రిక్ ఇబ్సెన్ నుండి) గ్రంథకర్త: దేశరాజు రామదాసు.

ఖండితంగా చెప్పడంపోయి 'అదినిజంకాదు' అన్న వాక్యంలో లేని సందేహగుణం ఈవాక్యంలోకి దూరింది. "అదినిజంకాదు. మమ్మాటికీ నిజంకాదు" అని వ్రాయడంచే అర్థసౌష్ఠవం పోకుండా ఉండును.

తృతీయాంకంలో ౧౫౮వ పేజీలో (౨వ పంక్తి నుండి) నోరా, తను టోర్వాల్డుయొక్క నిజస్వభావం అంతవరకూ కనిపెట్టలేదన్న విషయమై ఆలోచిస్తూ ఇలా అంటుంది: "టోర్వాల్డు! ఈయెనిమిదిసంవత్సరాలై పరాయిమనిషితోనుండి అతనికి ముగ్గురు పిల్లలను కన్నానని ఇప్పుడు నాకుతట్టింది" ఇంగ్లీషులో ఈవాక్యం ఇది: "Torwald, in that moment it burst upon me that I had been living here these eight years with a strange man and had borne him three children." ఇంగ్లీషు వాక్యంలో ఉన్న ఆకతినత్వం, ఆదుఃఖం తెలుగువాక్యంలోకి రాలేదు. భావం ప్రధానంగా చూసుకోకుండా పదానికి పదం మాత్రం వేస్తూ Strange man అన్న పదానికి 'పరాయి మనిషి' అని వెయ్యగానే భావసూచన పూర్తి కాలేదు. "టోర్వాల్డు, ఎనిమిదేళ్లు నీతో కాపురం చేసేను కాని ఎనిమిదేళ్లూ నువ్వు నిజంగా ఎటువంటి వాడవో నాకు తెలియనే తెలియదు. ఎనిమిదేళ్లూ నువ్వు నాకొక పరాయిమనిషివంటివాడవే. నీకు ముగ్గురుపిల్లల్నికూడా కన్నాను!" అనికాని, మరొక విధంగాకాని విడమర్చి భావం తీసుకువచ్చేందుకు ప్రయత్నం చెయ్యవలసింది. ఇప్పుడు తెలుగులో ఉన్న వాక్యం ఉన్నట్టుగానే ఉండిపోతే నాటకం అంతటికీ ముఖ్యమైన మూడునాలుగు వాక్యాలలో ఒకటైన ఈ వాక్యం నిష్ప్రయోజనం అయిపోతుంది.

౧౬౯వ పేజీలో ౨, ౯వ పంక్తులు ఇవి:

"హెల్మరు—(ఇక్కడ నువ్వెప్పుడూ) సౌఖ్యంగా లేవు?

నోరా:—లేను. ఆనందంగా మాత్రమే ఉండేదాన్ని."

ఇంగ్లీషులో ఈ సంభాషణ ఇలాఉంది:

"Helmer:— Not - not happy?

Nora:—No, only merry."

'Happy' అన్న మాటకీ 'merry' అన్న మాటకీ ఉన్న భేదం తెలుగులో తేటపడలేదు.

౯వ పేజీలో పైన హెల్మరు "స్వీట్‌టూత్ మిమ్మల్నందర్నీ చెరిపేస్తున్నాది" అంటాడు. ఇంగ్లీషులో ఈ వాక్యం "Hasn't the little sweet-tooth been breaking the rules today?" గ్రంథకర్త ఇంగ్లీషు వాక్యం బోధపరచుకోలేదు. తీపి పదార్థాలంటే నోరాకి చాలాఇష్టం కనుక 'Sweet-tooth' అన్నమాట నోరాకొక ముద్దుపేరు. నోరా తీపి పదార్థాలు తినకూడదుకనుక హెల్మరు అనుమానంతో ఈ ప్రశ్న వేస్తాడు.

౭౨వ పేజీలో ౧౯వ పంక్తిలో "Call it (the letter) back" అన్నమాటలకి "దాన్ని పిలవండి" అని రామదాసుగారు తెలుగులో వ్రాసేరు. "ఆఉత్తరాన్ని మళ్ళీ తెప్పించెయ్యండి (తెప్పించెయ్యి)" అని ఉండాలి.

భాషాభేదంవల్ల వచ్చేకష్టాలు దాటేందుకు మార్గం ఒకటే. భావం గ్రహించి ఆభావం తీసుకురావాలని ప్రయత్నించాలి కాని, వాక్యానికి వాక్యమే ఉండాలనీ, పదానికి పదమే ఉండాలనీ తంటాలు పడకూడదు. అందులో ఇంగ్లీషునుంచి తెలుగులోకి భాషాంతరీకరణం చెయ్యాలన్నప్పుడు ఇంగ్లీషుకీ తెలుగుకీ పుట్టుపూర్వోత్తరాలలో ఏమాత్రం సంబంధంలేదు కనుక, భావమే ప్రధానంగా చూచుకోవాలి కాని వాక్యాలగురించీ, పదాలగురించీ కట్టుదిట్టాలు అసలే పెట్టుకోకూడదు. ఈ విషయంలో రామదాసుగారు కష్టపడి నాటకంయావత్తులోనూ మొత్తంమీద భావం బాగా నిలబెట్టేరనే చెప్పాలి.

ఆలోచించవలసిన రెండవవిషయం సంఘపరిస్థితులలోనూ, ఆచారాలలోనూ రెండుదేశాలకీ ఉండే భేదం. పాశ్చాత్యనాటకాన్ని ఆంధ్రీకరించడంలో ఈ భేదంమూలాన్ని కలిగేకష్టం ఇది. మనంవ్రాసేది

తెలుగుభాషకనుక, అసలుకథ పాశ్చాత్యసంఘాన్ని గురించి అన్నమాట మరచిపోయి, మనసంఘపరిస్థితులకు మాత్రమే చెందేమాటలూ పదాలూ, వాడడం జరగొచ్చును.

౫వ పేజీలో ౧౪వ పంక్తిలో నోరాకి హెల్మరు ఇంటిఖర్చుకి సొమ్మిచ్చినప్పుడు, నోరా "నమస్కారము, నాథా" అంటుంది. ఇది " Oh thank you, thank you, Torwald'' అన్నదానికి తెలుగు. ౧౨౦వ పేజీలో లిండీదేవి (లిండేకా దేవి?) " అమ్మా, నమస్కారము " అంటుంది. ఇది 'Good evening' అన్నముక్కకి తెలుగు. 'Thank you' అనడానికి కాని, 'Good evening' అనడానికి కాని 'నమస్కారం' అన్నపదం చాలావిరుద్ధంగాఉంది. ఆ ఇంగ్లీషుపదాలకి సరియైన తెలుగుపదాలు లేవన్నమాట వాస్తవమే. కాని పాశ్చాత్యసంఘానికి పూర్తిగా అనుకూలంకాని పదాలు వాడకూడదు. 'Thank you' కి సరియైన తెలుగుముక్క లేనప్పుడు 'Thank you' అన్న పదాన్ని ఆంధ్రీకరించడం మానుకోవాలి. ఒకవేళ Thank you అనడంలో ఉన్నభావం నాటకానికి అంతమరీ ప్రధానమైతే ఆభావం మరొక అనుకూలమైనవిధాన్ని బయలుపరచడానికి ప్రయత్నించాలి.

నోరా " నమస్కారము, నాథా! " అనడంలో 'నమస్కారము' అన్నమాటకి మాత్రమే తప్పుపట్టడం లేదు. " నాథా! " అని నోరా హెల్మరుని సంబోధించడంకూడా అసందర్భంగానే ఉంది. తెలుగుభాషలో 'నాథా' అని సంబోధిస్తే దేవుడి తర్వాత దేవుఅంతటివాడిని సంబోధిస్తున్నట్టుంటుంది. ఇంగ్లీషుభాషలో ' My husband ' అని కాని 'My dear' అని కాని సంబోధిస్తే భర్తగా ఉన్న ఒక మనుష్యమాత్రుడినే సంబోధించినట్టు. రామదాసుగారు ఈనాటకంలో అనేకచోట్ల 'నాథా', 'ప్రియా', 'ప్రేయసీ' మొదలైన సంబోధనలు విరివిగా ప్రయోగించారు. 'నాథా' 'ప్రియా' 'ప్రేయసీ' మొదలైన పదాలు చదువుతుంటే మనసంఘంయొక్క పరిస్థితులనే నిరూపించలేని తెలివితక్కువ తెలుగునాటకాలూ, తెలుగు కథలూ జ్ఞాపకం వస్తాయికాని పాశ్చాత్యసంఘపరిస్థితులు అసలేమీ పొడకట్టవు. Dear అని కాని ' My dear ' అనికాని పాశ్చాత్యసంఘాలలో భార్యాభర్తలు ఒకరినొకరు సామాన్యంగా అన్ని సమయాలలోనూ పిలుచుకుంటారు. ఆముక్కల బదులు తెలుగులో 'ప్రియా' 'ప్రేయసీ' అన్నముక్కలు వెయ్యగానే రసాభాసం అవుతుంది. 'ప్రియా' 'ప్రేయసీ' అన్నమాటలు గాఢానురాగం చూపించే సమయాలకి సరిపోతాయి కాని ప్రతిచిన్న సందర్భంలోనూ వాటికితే సరిపోవు. ఇంగ్లీషులో భర్త భార్యతో " Potatoes are very costly in the market, dear '' అంటే ఏమీ ఆక్షేపణలేదు. కాని అదే ఆంధ్రీకరిస్తూ, " బజారులో బంగాళాదుంపలు చాలాఖరీదుగా ఉన్నాయి, ప్రేయసీ '' అంటే అతి ఘోరంగా ఉంటుంది. దీనికి కారణం పాశ్చాత్య సంఘాలలో భార్యాభర్తలు మనభాషలో చూపించడానికి వీలులేని విధంగా ఒకరినొకరు పిలుచుకోవడమే. ' Dear ' అన్న సంబోధనకి అన్వయించేపదం మనభాషలో లేదు. 'Dear' 'Darling', ' Sweet-heart ' మొదలైన సంబోధనలలో పాశ్చాత్యులు చూపించే భావాలు మనం తెలుగుభాషలో చూపించలేము. ఆపదాలన్నిటికీ మనకి 'ప్రియా' 'ప్రేయసీ' తప్ప వేరుమాటలు లేవు. సామాన్యసమయాలలో పాశ్చాత్యులు 'Dear' అని సంబోధించినప్పుడున్న భావానికీ, వాళ్లే గాఢానురాగంలో 'Sweet heart' అని సంబోధించినప్పుడున్న భావానికీ మనం తెలుగులో భేదం చూపించలేము. కనుక అటువంటి పదాలు ఎటువంటి సమయంలోనైనా ఆంధ్రీకరించడం మానుకోకతప్పదు. అంతేకాని వాళ్లసంఘపరిస్థితులకి సరిపడని తెలుగు పదాలువాడి పాశ్చాత్యనాటకాలలో ఉన్న పాశ్చాత్య సంఘనిరూపణకి విరుద్ధంగా వెళ్లకూడదు. ' ప్రియా ' ' ప్రేయసీ ' అన్న సంబోధన లేకపోవడంవల్ల వాక్యం మరీ మొండిగా తయారవుతుందనుకుంటే ఆపదాల బదులు పేర్లు పెట్టి సంబోధిస్తే అందంగా ఉండొచ్చును

పాశ్చాత్యసంఘంలో భార్యా భర్తలు ఒకరి నొకరు పేర్లుపెట్టి పిలుచుకోడం చాలాసామాన్యమైన విషయం.

ఈ సందర్భంలోనే రామదాసుగారిది మరొక పొరపాటుకూడా చూపించాలి. ౧౩ వ పేజీలో ఆఖరి పంక్తిలో నోరా లిండే (లిండెన్?) దేవితో ఇలా అంటుంది: "నాప్రియురాలా! క్రిస్టైనీ! నన్ను క్షమించు." ౨౨ వ పేజీలో మొదటి పంక్తిలో లిండీ దేవి నోరాని "ప్రియురాల" అని సంబోధిస్తుంది ౩౭ వ పేజీలో ౧౦ వ పంక్తిలో లిండీదేవి నోరాని "ప్రియా" అని పిలుస్తుంది. ఇంగ్లీషుభాషలో స్నేహితురాళ్లు ఒకరినొకరు 'My dear' అనీ, 'Dear' అనీ పిలుచుకుంటారు. కాని 'ప్రియురాల' అన్నమాటా, 'ప్రియ' అన్నమాటా సమంగా ఆ స్నేహభావాన్ని మాత్రమే సూచించలేవు. అందువల్ల ఈసందర్భంలో కూడా ఆఇంగ్లీషు పదాలని ఆంధ్రీకరించడానికి ప్రయత్నించిన లాభం లేదు.

రామదాసుగారి పొరపాట్లలో వీటన్నిటినీ మించిన పొరపాటు నోరా హెల్మరుని 'మీరు' అని సంబోధించడం. అది రమారమి నాటకం అంతలోనూ ఈ విధంగానే ఉంది. తృతీయాంకంలో రానురాను నోరా 'మీరు' అనడం మాని అప్పుడప్పుడు 'నువ్వు' అంటుందికాని, నాటకం ఆఖరిని ఈమార్పులు మరీ కంగారుగా ఉన్నాయి. ౧౪౨ వ పేజీలో ఆఖరి పంక్తిలో నోరా "టోర్వాల్డు! ఇక్కడమీరిద్దాం." అంటుంది. ౧౪౩ వ పేజీలో ౫ వ పంక్తిలో మళ్లీ "వూరుకోండి" అంటుంది. ఇటువంటి ప్రయోగాలలో అసలేఅర్థంలేదు. అదటుండనిచ్చి మనం ఆలోచించవలసిన విషయం ఇదీ. పాశ్చాత్య సంఘాలలో భార్యాభర్తలు ఒకరినొకరు "నువ్వు" అనే పిలుచుకుంటారు. అటువంటి ఆచారం ౨౦ వ శతాబ్దంలో కొత్తగా మొదలుపెట్టిన ఆచారం కాదు. అనేకశతాబ్దాల బట్టి ఉంది. రామదాసుగారు ఈవిషయం ఆలోచించుకోకుండా పాశ్చాత్య సంఘాన్ని చూపించే నాటకంలోకి మనసంఘాచారాలని దూర్చడం గొప్పతప్పు.

౧౫ వ పేజీలో నోరా టోర్వాల్డు గురించి మిగిలినవాళ్లతో మాట్లాడుతూ "నాభర్తగారికి బాంకి మేనేజరు పనైంది" అని కాని, ౮౭ వ పేజీలో "నన్ను టోర్వాల్డుగారెంత గాఢంగా ప్రేమిస్తున్నారో మీకే తెలుసును" అని కాని అనడం సమంగా లేదు. పాశ్చాత్య సంఘపరిస్థితులు ఉన్నవి ఉన్నట్టుగా చూపించడం ప్రధానమైతే "నాభర్తకి బాంకిమేనేజరు పనైంది" అనాలి, "నన్ను టోర్వాల్డు ఎంతగాఢంగా ప్రేమిస్తున్నాడో మీకేతెలుసును." అనాలి.

౧౩ వ పేజీలో ఆఖరిపంక్తిలో "నా ప్రియురాలా! క్రిస్టైనీ! నన్నుక్షమించు" అన్ననోరా ౬౭ వ పేజీలో ౧౯ వ పంక్తిలో లిండీ (లిండెన్?) దేవితో "నువ్వెంతమంచిదానివే" అంటుంది. ౨౧ వ పేజీలో "నువ్వెంత దయావతివే" అంటుంది. మళ్లీ ౧౨౦ వ పేజీలో మొదటి పంక్తిలో "అమ్మా, నమస్కారము" అంటుంది. ఇదంతా చాలా కంగారుగానూ, అర్థం లేకుండానూ ఉంది. ఆంధ్రీకరిస్తున్నప్పుడు మనసంఘాచారాలు వీలైనంతవరకూ మరచిపోయి వాళ్ల సంఘాచారాలు ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. లేకపోతే ఇటువంటి పొరపాట్లకి అవకాశం చాలాఉంది.

ఈ ఉదాహరణలన్నీ కాక వేరుగా చదివేందుకూ, వినేందుకూ సవ్యంగాలేని కొన్ని సమాసాలూ, పదాలూ రామదాసుగారినాటకంలో ఉన్నాయి. అవి సవ్యంగా లేకపోవడానికి కారణం ఆయనకి ఇంగ్లీషుభాషకాని, తెలుగుభాషకాని సమంగా తెలియక పోవడమే అనేందుకు ఏమాత్రమూ వీలులేదు. ఆ కారణం ఆయన పాశ్చాత్య సంఘపరిస్థితులు సమంగా బోధపరచుకోక పోవడమే అనేందుకూ వీలు లేదు. ఇంగ్లీషులో "Is it my lark twittering there?" అంటే తెలుగులో "ఆ కిలకిల్లాడుచున్నది నా భరతపక్షేనా?" అన్నారు. ఇంగ్లీషులో "When did the squirrel come home?" అంటే తెలుగులో "నాచిన్న ఉడత ఎప్పుడు వచ్చింది?" అన్నారు. ఇంగ్లీషులో "Has my litte spendthrift been making the money

fly again ?" అంటే తెలుగులో "నాముద్దుల ఖర్చుదారి తిరిగీ సొమ్ము దండుగపెడుతున్నాదా?" అన్నారు. ఇంగ్లీషులో "So my wilful little woman is at a loss and making signals of distress ?" అంటే తెలుగులో "కడపటు నాతిలతిక్క చిన్నది ఎవరి సహాయానికో ఎదురుచూడవలసి వచ్చింది" అన్నారు. ఇంగ్లీషులో "your little squirrel" అంటే తెలుగులో "మీ ముద్దుల ఉడత" అన్నారు. ఇంగ్లీషులో "There, Madam Obstinacy" అంటే తెలుగులో "నాచిన్నారిమొండీ" అన్నారు. ఈ ఉదాహరణలన్నిటిలోనూ రామదాసుగారు ఆయనవాడిన మాటలూ, పదాలూ మాని ఏమాటలూ, పదాలూ వాడాలో చెప్పడం కష్టం. కాని ఇంగ్లీషులో ఆ పదాలన్నీ సంభాషణకి సహజమైన పదాలైనప్పటికీ తెలుగులోకి తర్జుమా కాగానే అవి కొంచెం తంటాలుపడి తెచ్చిపెట్టుకున్న పదాలుగా కనిపిస్తున్నాయి. నవీన పాశ్చాత్యనాటకాల గొప్ప సుగుణం ఏమిటంటే సంభాషణ మొదటినుంచి చివరవరకూ అతిసహజంగా ఉండడమే. ఆంధ్రీకరించేటప్పుడు మూలమైన నాటకంలో ఉన్న ఏగుణంపోయినా సంభాషణలో ఆసహజగుణం పోకూడదు. ఆంధ్రీకరించడంలో కొన్నినష్టాలు రాకతప్పదు. ఈనష్టం మట్టుకు రాకూడదు. ఇంగ్లీషులో My little spendthritl అంటే బాగానేఉంది. తెలుగులో "నాముద్దుల ఖర్చుదారి" అంటే చాలా అసహజంగాఉంది. Lark అంటే భరతపక్షీ కావచ్చును. కాని పాశ్చాత్యభర్త భార్యని "my little lark" అని పిలిచినప్పుడు తెలుగులో "నాచిన్నభరతపక్షీ" అనే పిలవనక్కరలేదు. అలాపిలిస్తే తెలుగుభాషలో అందంగాకూడా ఉండదు. వీలైనంతవరకు ఇటువంటి పదాలు ఆంధ్రీకరించకుండా ఉండేందుకు ప్రయత్నించాలి, ఇబ్సెన్ నాటకం స్త్రీలు పురుషుల చేతులలో బొమ్మలు కారని చూపించడానికి వ్రాయబడిన నాటకంకనుక హెల్మరు నోరాని ఇటువంటి ముద్దుపేర్లుపెట్టి పిలవడం నాటకానికి ముఖ్యమైన విషయమే. భార్యని అతను చంటిపిల్లని బుజ్జగించినట్లు బుజ్జగిస్తూ ఉండడం నాటకంలో చూపించాలి. కాని తెగులుభాషలో సంభాషణకి సహజంగానూ, అందంగానూ ఉండే పదాలూ, వాక్యాలూ వాడి ఆవిషయం తేటపరచాలి. అటువంటి పదాలూ, వాక్యాలూ ఏమిటో తెలుసుకోడం చాలాకష్టం అన్నమాటనిజమే. కాని రామదాసుగారు వారి అనుభవజ్ఞానంతో ముందుముందు మిగిలిన మంచి పాశ్చాత్యనాటకాలు ఆంధ్రీకరిస్తూ ఈకష్టం తొలగించుకోగలరనే నమ్మకం. ఆతప్పించుకునే మార్గాలు వారికి తట్టాలి.

ఈనాటకం ఇంత విపులంగా విమర్శించడానికి కారణాలు రెండు. మొదటిది, నాటకాలలో ఇబ్సెన్ యొక్క ఈనాటకం చాలాముఖ్యమైనది కనుక. రెండవది, రామదాసుగారి తెలుగునాటకం కొన్ని చిన్నచిన్న మార్పులతో చాలా అందంగా ఉంటుంది గనుక. అందరూ కోరవలసినది వారు దీక్షగా అనేక పాశ్చాత్య నాటకాలు ఆంధ్రీకరించాలనే.




## సూర్యునిపై దండయాత్ర

చాలా కాలంనుంచీ మానవుడు మొక్కలను తన యిష్టం వచ్చినట్టు ఆడిద్దామని తంటాలుపడుతున్నాడు. వృక్ష శాస్త్రజ్ఞులు కూడా కొందరు వీడికి తోడ్పడ్డారు. ఇద్దరూ కలిసేరంటే యిక చేయలేనిది యేముంది? సామాన్యమైన మొక్కలలోనుంచి శ్రేష్ఠమయినవీ, విలువ అయినవీ మంచిజాతి మొక్కలు లేవదీయడానికి ప్రయత్నాలు చేసేరు. వాటిలోనుంచి ఎట్టే డబ్బుఖర్చుఅవని పద్ధతులమీద కాలంగాని కాలంలో పువ్వులు పూసేలాగ చేయడానికి పరిశ్రమలు చేస్తున్నారు. ఈ ప్రయత్నాలన్నీ చెట్లను తొందరపెట్టి డబ్బున పూసేలాగచేసి అకాలంలో పువ్వులమ్ముకొని లాభం సంపాదిద్దామనే. అకాలంలో అమ్ముతున్నారు కాబట్టి ప్రతివాళ్లూ యెక్కువ డబ్బిచ్చి అయినా కొనడానికి సిద్ధపడతారు.

ఇందుకోసమని మొదటిరోజుల్లో యిళ్లలోనే సూర్యుని వెలుతురు అవసరంలేకుండా విద్యుద్దీపాల సహాయాన్ని మొక్కలు మొలిపించడానికి ప్రయత్నాలు చేసేరు. ఈ పరిశ్రమలో వెలుతురుకోసం యింకోఅంత సూర్యుణ్ని మళ్లీ నిర్మాణం చేయవలసివచ్చింది. దీనివల్ల చాలా ఖర్చుయిపోయింది. కాని క్రమంగా జరుగుతూ వచ్చిన పరిశ్రమలవలన మొక్కలను త్వరగా మొలిపించి పూసేలాగ చేయడానికి తీక్ష్ణమైన వెలుతురు అవసరం లేదనీ, రోజూ యెంతసేపు వెలుతురులో ఉంచుతామో ఆకాలంమీదే యెదగడం ఆధారపడిఉంటుందనీ తెలిసింది.

కొన్ని మొక్కలు ఒకసారి పూసిన తరవాత మళ్లా అయిదారు నెలలదాకా పుయ్యవు. మరికొన్ని మొక్కలు యేడాదిలోపుగా పూయవు. మొక్కలన్నీ రోజూ దాదాపు ఎనిమిది ఘంటలకాలం వెలుతురు అనుభవిస్తాయి. ఆరునెలలలో పూసేవాటికన్న ౧౨ నెలలలో పూసే మొక్కలకు రెట్టింపు వెలుతురు కావలసి ఉంటుంది. ఒక మొక్క తను అనుభవించిన యెండపరిమాణాన్నిబట్టి పూతకు వస్తుంది. అందుకనే యేడాదికిగాని పూయని మొక్కలను ఆరునెలలకే పూయించాలంటే ప్రతిదినమూ పగటిపూట అనుభవించే సూర్యరశ్మికాక, రాత్రిపూట కూడా మరో ఆరుఘంటల కాలం విద్యుద్దీపాల వెలుగులో ఉంచితే సాధ్యపడుతుంది. పగలంతా ఆరుబయట యెండలో ఉండే మొక్కలకు రాత్రిపూట చాలా తీక్ష్ణమైన వెలుతురు ఉపయోగించనక్కరలేదు. అట్టి మొక్కలకు ౧౦ ఫుట్ కాండిల్స్ వెలుతురుగల దీపములు వాడిన చాలును. యెప్పుడూ యిళ్లలోనే ఉండి యెండమొహం యెరుగని కొన్ని మొక్కలకి ౧౦౦ మొదలు ౩౦౦ ఫుట్ కాండిల్సు కాంతిగల దీపములు వాడవలసి ఉంటుంది.

అన్ని మొక్కలూ ఒకే మోస్తరు వెలుతురునూ, తీక్ష్ణతనూ భరింపలేవు. కొన్ని మొక్కలకు వెలుతురు తేలాంటిదయినా రాత్రిపూట యెక్కువకాలం కావలసి ఉంటుంది. కొన్నిటికి యెక్కువ తీక్ష్ణత ఉండాలి.

ఒక తోటలో ౨౪ రకాల పువ్వులమొక్కలమీద రాత్రిపూట ౧౦ కాండిల్ పవరు కాంతి గలదీపాలు ౪ ఘంటలకాలం ఉపయోగించడంవల్ల పూతకాలంకంటె నెలరోజులు ముందుగా పూసేయి. ఈ చెట్లు రాత్రివెలుతురులో ఉంచని మొక్కలకన్న బలంగా యెదిగాయి. పువ్వులు పెద్దవిగా తయారయాయి. మొత్తంమీద మామూలుచెట్లకన్న ప్రతిచెట్టుకీ ౧౨

పువ్వులు ఎక్కువ పూసేయి. వీటికయిన దీపాలఖర్చు అకాలంలో పువ్వులమ్మగా వచ్చిన లాభంలో పదో వంతేనా ఉండదు. వీటికి ఉపయోగించినవి మామూలుగా ఆఫీసులలో వాడేలాంటి దీపాలే.

రంగువెలుతురు మొక్కల మీద ఉపయోగిస్తే యేమయినా లాభం ఉంటుందేమోనని కొన్ని ప్రయోగాలు చేసేరు. కేవలం యెర్రటి వెలుతురులో మొక్కలను మొలిపిస్తే కొమ్మలు సన్నగా తీగలాగ సాగి పెనవేసుకు పోతాయి. నీలం వెలుతురులో యెదిగే మొక్కలు పొట్టిగాలావు పాటికొమ్మలు కలిగి ఉంటాయి మానవశరీరానికి కొంతో ఆరోగ్యకరమైనదనుకున్న అల్ట్రా వైలెట్ కాంతిలో మొక్కలను యెదిగిస్తే ఈముబ్బురంగు వెలుతురు



[౨. మొక్కలపై పగటి సూర్యకాంతి గాక రాత్రిపూట వివిధ తీక్ష్ణతగల దీపములకాంతిని ఉపయోగించుటవలన కలిగిన ఫలితములు. ఎడమవైపున కేవలముసూర్యకాంతిలోనే యెదిగిన మొక్కకలదు.]


[౧. ఎండలోనూ, అల్ట్రా వైలెట్ వెలుతురులోనూ, యెర్రటి వెలుతురులోనూ మొలిపించిన మూడు మొక్కలూ వరుసగా ఉన్నవి.]

మొక్కలను యెదగనివ్వకపోవడమే కాకుండా హాని చేస్తుంది. నియాన్‌లాంపులు, మెర్క్యురీట్యూబులూ, సోడియంలాంపులూ మొదలైనవాటి వెలుతురువల్ల మొక్కల కేమైన ఎక్కువమేలు కలుగుతుందేమో నని పరీక్షలు చేస్తున్నారు.

పువ్వు మొక్కలు మొలిపించడానికి, గాలి వెలుతురు, చెమ్మ మొదలైనవాటికి ప్రత్యేక సదుపాయాలుండేలాగ నిర్మించే గాజు ఇళ్లు (Green houses) ఉంటాయి. వాటిలో కొన్నింటిలో మొక్కలమీదికి వెలుతురుపడేలాగ తాళ్లుకట్టి దీపాలు వేలాడవేసేరు. మొక్కలు యెదిగినకొద్దీ దీపాలను పైకి లాగుతూ వచ్చేరు. ప్రస్తుతం చాలావాట్టేజి శక్తిగలదీపాలను కదలకుండా చూరులలో అమర్చేరు. వాట్టేజి ఎక్కువయినకొద్దీ ఆ దీపములవలన కలిగే వెలుతురు సూర్యకాంతితో సమానంగా ఉంటుంది


[3. మొక్కలు మొలిపించే గదులలో చూరునకు శాశ్వతముగా అమర్చబడిన తీక్ష్ణమైనకాంతినిచ్చే దీపాలు.]

ఇలాగ దీపాలను రాత్రి కొన్నిఘంటల సేపు మొక్కలమీద వెలిగించేరు. వీటిలాగ యెప్పుడూ వెలిగే దీపాలకన్న మధ్యమధ్యన వెలుగుతూ ఆరిపోయే దీపాల వలన ఎక్కువ లాభం కనబడింది. ఈ దీపాలతో కొన్ని పరిశ్రమలు చేసేరు. నిమిషానికి పదిసారులు వెలుగుతూ ఆరిపోయే దీపాలుకూడా ఎప్పుడూ వెలుగుతూండే దీపాలలాగే పనిచేశాయి. మధ్యమధ్య ఆరి

పోవడంవల్ల మొక్కలలో యేమీ తేడా కనిపించ లేదు. కాని యిలాగ మధ్య మధ్య ఆరిపోవడంవల్ల సగం విద్యుచ్ఛక్తి కలిసివస్తుంది. దీనివల్ల సగం ఖర్చు కూడా తగ్గుతుందన్నమాటే. దీపముల కాంతి యెట్టిదైనా వెలుతురంతా మొక్కమీదే పడేలాగ సరియైన రిఫ్లెక్టర్లు వాడాలి.

కాలిఫోర్నియాలో కొలవరు వృక్షశాస్త్రజ్ఞులు కొన్ని మంచిజాతి మొక్కలను లేవదీయాలని పరిశ్రమలు చేస్తున్నారు. వాళ్లకి గింజలలోనుంచి మొక్కలు మొలిపించడం, ఆ మొక్కలలో అన్యోన్య సంబంధం కలిగించి కొత్తరకం మేలిమైన విత్తనాలు తయారు చేయడం, వాటిలోనుంచి మళ్లీ ఉత్తమమైన మొక్కలు లేవదీయడం- యిలాగ యెన్నో పర్యాయాలు చేస్తేనే గాని ఒక ఫలితం తేలేదికాదు. దీనికి అయిదుసంవత్సరాల కాలం పట్టేది. కాని యీదీప సహాయంవచ్చిన తరవాతా భూమిలో తీగలు పాతి భూమిని వేడిచేయడం వల్లా, అయిదేళ్లలో జరగవలసిన తంతంతా సగంకాలానికే జరిగిపోతూ వచ్చింది. దీనినిబట్టి రాత్రిపూట వెలుతురు ఉపయోగించడంవల్ల కలిగే సదుపాయం తెలుసుకోవచ్చు.

అయోవా, సియోనగరాల్లో ౧౦౦ వాట్ల దీపములు ఉపయోగించగా జనేవరినెల ౧౦ వ తారీకు నాడు నాటిన వరిచేను మే నెల ఒకటో తారీకుకు కోతకు వచ్చింది. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో భూమీ, మట్టీ అవసరంలేకుండా మొక్కలు మొలిపిస్తున్నారు. ఒక నీటికుండీకట్టి దానిలో రాసాయనికమైన ఆహారపదార్థాలు కరిగివున్న నీరు పోసేరు. నీటికి తగిలేలాగ ఒక తీగలతో అల్లిన వల వేసి దానిమీద గడ్డి, రంపపుపొట్టు మొదలైనవి వేసి, వాటిలో దుంపలూ, మొక్కలూ ఉంచేరు. వేళ్లు గడ్డిలోనుంచి నీటిలోకి దిగి ఆహారపదార్థాలు తీసుకుంటాయి. బంగాళాదుంపల్ని యీ విధంగా చేయడంవల్ల బాగా పండించవచ్చునట. మరికొన్ని విశ్వవిద్యాలయములలో యిసకలో మొక్కలు నాటి ఆహారం ద్రవరూపంగా ఉపయోగించి మొలిపించుటకు ప్రయత్నాలు చేస్తున్నారు.



[౮. వేడిమిని ఆపుదలచేసెడి సామగ్రితో నిర్మించబడిన కొత్తరకము మొక్కలనుమొలిపించెడి గది.]

బాయస్ థామ్సన్ గారి పరిశోధనాలయంలో నిరుడు చక్కని మొక్కలు మొలిపించడానికి సదుపాయమైన ఒక యింటిని నిర్మించేరు. అగది నాలుగుగోడలూ, నేలా, సగము చూరూ వేడిమి పైకిపోకుండా ఉంచే పదార్థంతో తయారుచేయబడింది. దానిలో మొక్కలకు యెంత వెలుతురు బాగా తగలడానికి మిగిలినసగం చూరుకూ ఒక పెద్ద గాజుచట్రము అమర్చబడిఉంది. గోడలమీదపడే వెలుతురుకూడా మొక్కలమీదకు ప్రతిబింబించేలాగ గోడలకు తెల్లరంగు వేసేరు. రాత్రిపూట వెలుతురుకోసం ఉంచిన ౫౦౦ వాట్ల దీపాలే అగదిని వేడిచేస్తాయి. పగటిపూట ఆగాజుచట్రములో నుంచి వచ్చే సూర్యరశ్మి గదిని వేడిగా ఉంచుతుంది. వెలుతురు చాలని మబ్బురోజులలో పగటిపూటకూడా అప్పుడప్పుడు దీపాలు వెలిగిస్తారు. ప్రతిరాత్రీ దాదాపు ఆరుఘంటలకాలం మొక్కలకు వెలుతురు తగిలేలాగ దీపాలు వెలిగిస్తూ ఆర్పుతూ ఉంటారు. ఇట్టిగదివల్ల చాలా లాభాలుకనబడ్డాయి. అన్నివేపులా గాజులున్న పాతరకం పువ్వుటిండ్లలో మొలిపించిన మొక్కలకన్న యీ ప్రత్యేకపు గదుల్లో మొలిపించిన మొక్కలు బాగా పెద్దవిగా యెదిగాయి వాటికన్న యెనిమిది వారాలు ముందుగా పూతకు వచ్చాయి. సెలఖరీ దొరక్కవగా ఉండేస్థలాల్లో యిలాంటి వేడిమి నిలిపే గదులు ఒకదానిమీద ఒకటి అంతస్తులులాగ కూడా నిర్మించవచ్చు

నట. ఇట్టియిళ్లు చాలా స్వల్ప ఖరీదులో తయారుచేయ వచ్చును. దానంతట అదే శీతోష్ణస్థితులను ఒక్క–







[చి. 2. ఈ మూడుచిత్రములలోను సామాలు పూవుటిండ్లలో మొలిపించిన మొక్కలూ, ప్రత్యేకముగా నిర్మించిన వేడిని ఆపుచేసే గదులలో భేదము చూపడం కోసం పక్కపక్కనే పెట్టబడి ఉన్నాయి.]

మోస్తరుగా ఉంచుతుంది. ఈ గదులలో మొక్కలకు మాటిమాటికి నీరుపొయ్య అవసరంలేకుండా గది యెప్పుడూ చెమ్మగా ఉంటుంది. మొక్కలకు కావల సిన సదుపాయాలన్నీ దానిలోనే యిమిడి ఉండుటచేత ప్రత్యేకంగా మొక్కలని కనిపెట్టుకొని చూస్తూ ఉండ వలసిన బాధ పోతుంది. అందుకోసమునే యిలాంటి గదు లను నిర్మించడానికి కావలసిన సామానుఅమ్మే రెండు కంపెనీలు అప్పుడే యేర్పడ్డాయి.

విత్తనాలను మొలిపించేటప్పుడు నేలను కొంచెము వేడిచేస్తే మొలకలు దబ్బున లేస్తాయి. అందు కోసమని భూమిలో విద్యుచ్ఛక్తి ప్రవహించే తీగలు కప్పిఉంచుతారు. ఆరుఅడుగుల చదరంగల తొట్టిలో యెరువువేసి విత్తనాలు నాటుతారు. తొట్టిని విద్యుత్సహాయమున వేడిచేస్తారు. మొలకలు బయలుదేరిన దగ్గరనుంచీ దీపాలనుకూడా రాత్రిపూట ఉపయోగిస్తారు. ఈదీపాలు కేవలం వెలుతురు కలిగించడమే కాకుండా నేలనుకూడా వేడిచేస్తుంది. మొక్కలు మొలవగానే దీపాలు వెలిగించినట్లయితే వేళ్లకి వెలుతురుకీ విరోధంగనక, వెలుతురు కనబడకుండా వేళ్లు పొడుగుగా యెదిగి మట్టిలోకి దిగుతాయి. దీనివలన బలమైన వేళ్లు యేర్పడతాయి.



[౮. దీపసహాయంచేత వెలుతురు, వేడిమి యిచ్చి, గింజలనుండి మొక్కలు మొలిపించుటకు ఉపయోగించు తొట్టి.]

ఇటువంటి వేడిగాఉండే తొట్లలో వాడే దీపాలకు ఉన్న రిఫ్లెక్టర్లు బాణీవలె గుండ్రముగా ఉండక అల్యూమినము రేకుముక్కలు అనేకములు దగ్గరదగ్గరగా మధ్య యెడం ఉండేలాగ చేర్పడంవల్ల యేర్పడుతుంది. పగటిపూట దీపాలు ఉపయోగించనప్పుడు ఈ అల్యూమినము రేకులసందులలోనుంచికూడా సూర్యుని వెలుతురు మొక్కలమీద పడుతుంది. అంటే యీరిఫ్లెక్టర్లవల్ల

మొక్కలకు నీడ తగలదన్న మాట. ఇట్లు వెలుతురు, వేడిమి సహాయాన్ని మొలిచే మొక్కలు మామూలుగా నేల మీద మొలిచే మొక్కలకన్న బలంగా ఉంటాయని యీ క్రిందిపటాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

కొన్ని వేడిచేసేసదుపాయంలేని తోట్లలో గింజలు మొలిపించేటప్పుడు చలిరాత్రులలో నేల కేరుకు పోయేటంత చల్లబడిపోతుంది. అలాంటి సమయాలలో ౩౦ వాట్ల దీపాలు రెండు వాడినట్టయితే మొక్కలకు చలివలన ఏమీ ప్రమాదము కలుగదు.

ప్రతి యింట్లోనూ మొక్కలు ఉంటాయి గాని ఒక యింట్లోనూ వాటికి సరియైన వెలుతురుసదుపాయం ఉండదు. పూర్వపుగోజులలో యీ ఆవశ్యకత తెలుసుకొని మొక్కలకుండీలను కిటికీలలో ఉంచేవారు. ఇప్పటి గోజులలో కొన్ని లోపలగదులలో ఉన్న మొక్కలికి మామూలు వెలుతురేకాని సరియైన సూర్య రశ్మి తగలదు. అటువంటి మొక్కలకోసం యిప్పుడు కొన్ని కొత్తరకముల దీపపుస్టాండులు తయారవు తున్నాయి. ఒక స్తంభం చివర ఒక దీపం ఉంటుంది. ఆ స్తంభానికి మధ్యగా మూడు నాలుగు కుండీలు నిలవ డానికి గుండ్రని యినపపలకలు ఉంటాయి. వాటిలో పువ్వుల కుండీలను అమర్చవచ్చును. దీపములో ౧౦౦, ౨౦౦ వాట్ల కాంతి యిచ్చే రెండు యేర్పాట్లు ఒక బల్బులోనే చేయబడిఉంటాయి. దీనివలన ౧౦౦, ౨౦౦, ౩౦౦ కాండిలు పవరుకాంతిని ప్రత్యేకముగా గాని, రెండు యేర్పాటులూ కలిపిగాని కలిగించ వచ్చును. ఇలాంటి దీపాలవల్ల గదిఅంతటా ఒక్క మోస్త రయిన వెలుతురు తగులుతుంది. ఈ వెలుతురులో బాగా చదువుకోవొచ్చు కూడాను. దీనివల్ల మొక్కలు కూడా బాగా యెదుగుతాయి. ఈ మొక్కలకు సూర్య స్పర్శ లేకపోయినా మామూలుగా సాయంకాలం మొదలు పడకవేళదాకా మనం వెలిగించిఉంచిన దీపపు వెలుగు సమృద్ధిగా సరిపోతుంది. దీపాలు, మొక్కల కుండీలు కలిసిఉండే రెండు రకాలయినవీ యీక్రింది పటాల్లో చూడొచ్చును.





[ప. ౧౦ దీపపు స్తంభములూ, మొక్కలకుం డీలు కలిసిఉన్న రెండు విధములైన యేర్పాట్లు.

ఈ విధముగా ప్రత్యేకముగా పువ్వుల పరిశ్ర మను అభివృద్ధిచేయుడానికని వివిధదేశాల్లోవారు పాటుపడుతున్నారు. వీరి ప్రయత్నాలకన్నీ విద్యు చ్ఛక్తి చేసిన ఉపకారం యింతా అంతా అని చెప్ప లేము. [సైంటిఫిక్ అమెరికా]

## థర్మామీటరులను మనమే తయారుచేసుకొనవచ్చును

**ఈప్రక్రియకు కావలసిన పరికరములు:** పెంద్రుక పాటి నడిమిరంధ్రముగల యొక గాజుగొట్టము, ఒక బన్సెను బర్నరు. ఇంతే.

గాజుగొట్టముయొక్క యొక కొనను ఆబర్నరు మంటలో నెమ్మదిగా కాల్చవలయును. (చిత్రము ౧). కొంచెముసేపటి కాప్రాంతపు గాజుకరగి ముద్దకట్టి ఆ వైపురంధ్రము మూసుకొనిపోవును. ఆ ముద్దకట్టిన భాగమును పూర్వము వలెనే మరియొకమారు వేడిచేసి, గాజు కరగుస్థితికి వచ్చినపుడు గొట్టముయొక్క రెండవ




కొనను నోట బెట్టుకొని మెల్లగ లోనికి గాలి నూదవలయును. (చిత్రము ౨). అప్పుడు ద్రవప్రాయముగ మెత్తనైయుండు నా మొదటికొన యుబ్బియొక గోళముగ నేర్పడును. ఆవెనుక గొట్టము చల్లబడునంతదనుక నుంచి, మరల దాని నొకమారు వేడిపరచి, వెంటనే మూతపడనికొనను ఒకపాదరసపు పాత్రలో ముంచవలయును. (చిత్రము ౩). గొట్టమును వేడిపరచినప్పుడు గొట్టములోని గాలియంతయు నిష్క్రమించియుండును గనుక పాదరసము గొట్టములోని కెక్కి ఆగాలిస్థానము నాక్రమించుకొనును. అంతట గొట్టమును పాత్రనుండి జాగ్రత్తగ వెలుపలికి దీసి మరల నొకమారు వేడిచేసి తొల్లిటి క్రమముననే యా రెండవకొనను గూడ మూసివేయవలయును.

ఇప్పుడు పాదరసము నిండిన యాగొట్టమును మంచుగడ్డ, ఉప్పు కలిపిన యొక పాత్రలో కొన్నిగంటలుంచవలయును. (చిత్రము ౪). ఆచల్లదనమునకు పాదరసము కుంచించుకొనిపోవును. అప్పటి ఆపాదరసపు తలము ఘనీభవనాంకమగును. దానిని గొట్టముపై గుర్తించుకొనవలయును.

మరల నా గొట్టము నొక సల సల కాగు నీటి పాత్రలో నుంచునది. (చిత్రము ౫). పాదరసము ఆ వేడిమికి విరివియైపోవును. అప్పటి దాని తలము క్వథనాంకమును తెలుపును. దానిని సైతము గుర్తించుకొనవలయును.

ఆ రెండు అంకములకును నడుమనుండు భాగమును అంశములుగా విభజించి అంకెలువేసి యుంచవలయును.

ఇట్టి యీ యుష్ణమాపనులు మూడురకములుగ వాడుకలో నున్నవి. అనుదినోపయోగమున మనము చూచుచుండునది ఫారన్‌హీటు ఉష్ణమాపని యనబడును. దానిలో ఘనీభవనాంకము ౩౨° గాను, క్వథనాంకము ౨౧౨° గాను గుర్తింపబడియుండును.

## ఈజిప్టువారి పుట్టుపూర్వోత్తరములు బయటపడినవి



నెపోలియన్ బోనపార్టీ ఈజిప్టులో నుండగా అతని యుద్యోగికొకనికి ౧౭౯౯ లో నీరాతిపలక దొరికినదట. దీని నిడివి నాలుగుఅడుగులు, వెడల్పు ౨ అడుగులు. దీని బహిష్కృతితో అర్షశాస్త్రజ్ఞుల సమస్య యొకటి పరిష్కృతి యయినదని విశదపడుచున్నది. ప్రాచీనైగుప్తుల భాషతోపాటు మరికొన్ని యంశములు గూడ తత్సంబంధమైనవి దీనితో తేలిపోయినవి.

ఈ రాతిని, దీనిమీది మూడురకముల వ్రాతలను పలువురు శాస్త్రజ్ఞులు పరిశీలించి ఇందు కడపటి రచనా శ్రేణి గ్రీకు అనియు, నడిమిది డెమోటిక్ అనియు, తొలిది ఐగుప్త భాష యనియు నిర్ణయించిరి. ఇందు చివరిరెంటిలోను ఒకటే యంశ మిమిడి యున్నందున నాతొలిదానకూడ నదేయంశ ముండవలయు ననియు, ప్రాచీనైగుప్తులు ఇట్టి చిత్రరూపములనే భాషగా ప్రచారమున నుంచి యుండవలయు ననియు కూడ నిర్ణయించిరి. ఈ భాషా పరిచయము మూలమున చరిత్రకారులకంతవరకు దొరకరాని కొయ్యలుగనుండిన యనేకాంశములు-ప్రాచీన ఈజిప్టునుగురించి-బోధపడిపోయినవట.

ఈచారిత్రిక శిలాఫలకము లండనులోని బ్రిటిషుమ్యూజియమున పదిలపరుపబడియున్నది.

---

## రైలుబండ్లలోని అపాయపుగొలుసు గాథ

అపాయపు గొలుసులు లాగినచో రైలుబండ్లు ఆగిపోవునని మనకు తెలియును. కాని అది యెట్లో మన కెవరికి నిదివరకు తెలియదు. ఈ చిత్రమును చూడుడు. గొలుసును లాగినంతనే ఒకానొక యంత్రప్రక్రియ బండివేగమును తగ్గించును. అంతట ఇంజను డ్రైవరు ఏదో అపాయము ప్రయాణికులకు గలిగినదని గ్రహించును. బండివేగపు తగ్గుదలయేకాక అతని బండిలోని యొక సాధనముకూడ నీసంగతి నాతని కెరుక పరచును. ఇట్లే గార్డుకుకూడ నీసంగతి యెరుకపడ వచ్చును. ఈగొలుసులాగుట, డ్రైవరు యాదృచ్ఛికముగ బ్రేకువేయుట ఏకకాలమందే జరిగినచో నీగొ




లుగులాగుట నిష్ప్రయోజనమగును. అప్పుడు గొలుసుపనిచేయజాలదు.

ఈగొలుసు బండి నెట్లు ఆపుచున్నదో చూడుడు. బండివెనుకవైపున నెదురుగ నా కొనను, ఈకొనను రెండుగుబ్బలవంటి పెట్టెలుండును. (C. C) వానిలో హెచ్చరిక బిళ్లలుండును. (b) ఈ రెంటికిని చేరికగ నొక కమ్మియుండును. ఆ కమ్మికి నట్టనడుమ కవాటపేటిక (Valve Box) యొకటియుండును. (c) ఆ పేటికనుండి రైలుపెట్టె యడుగుభాగమునందు వాక్యుమ్ బ్రేకుగొట్టములోనికి చొరుచుకొని యొక గాలిగొట్టముండును. మనము గొలుసును లాగినంతనే (చిత్రము 2) పైజెప్పిన యినుప కమ్మియు, కవాటపేటికలోని A అను నడియు (చిత్రము 3) ౯౦ డిగ్రీలకు తిరుగును; D అనునది B అను మీటను పైకి తన్నును. ఈప్రక్రియతో కవాటము తెరచుకొని లోనికి గాలి ప్రవేశించుటయు, అది గాలిగొట్టముగుండా బ్రేకుగొట్టములోనికి పోయి బ్రేకు వేయుటయు తనంతన జరిగిపోయి బండివేగము మందగించును. డ్రైవరుకును, గార్డునకుగూడ ఈసైనము వెంటనే తెలియవచ్చును గనుక బండినాపి వచ్చి గొలుసును లాగినకారణమేమో విచారించి తగిన నివారణ చేయుదురు. ఏ పెట్టెలో గొలుసు లాగబడినదో హెచ్చరికబిళ్లల ముందువెనుకలవలన వారు సులభముగ తెలుసుకొనగలరు.

## పాలయుపయోగము పెరుగువెన్నలు మాత్రమే కావు!

ఆహారపదార్థములు మాత్రమే కాక పారిశ్రామిక, వాణిజ్యపదార్థములుకూడ పాలనుండి తయారగుచున్నవన్నచో నెవరును సులభముగ నమ్మరు. ఈ సృష్టి యిటీవలి శాస్త్రపరిశోధనల ఫలితము.

పాలను ఆమ్లసంయోజనముచే విరిచి, ఆవిరిగిన పాలను ఆరబెట్టి, పొడిచేసి యుంచుకొందురు. దీనిని మనము పాలవిరుగుడుచూర్ణమని యందము. ఆచూర్ణమును ఒకానొక క్షారద్రావణమును కలిపి ఇంకనుకొన్ని సంభారములను చేర్చి బాగుగ పిసికి ముద్దచేయుదురు. ఈ పిండిముద్దతో నెన్నియోరకములగు వస్తువులను మనము తయారుచేసుకొనవచ్చును. ఇవి మిక్కిలి గట్టిదనము గలిగియుండి, వంచగూడునవిగ నుండును. ఇవి సులభముగ నిప్పంటుకొనవు. ఇవి మంది విద్యుద్బంధనములుగ గూడ నుపయోగపడగలవు. అందువల్లనే యీపాలవిరుగుడుముద్దతో విద్యుద్దీపాదుల స్విచ్చిలు మొదలైనవి చేయబడుచున్నవి. గుండీలు, సిగరెట్టుపెట్టెలు, దువ్వె




నలు, పూసలు, ఒక టేమిటి రకరకముల వస్తువులు దీనితో చేయవచ్చును. రంగులు మొదలైనవి చేయుటకుకూడ నిది యుపయోగపడుచున్నది. కాలికో మొదలైన గుడ్డల ముద్రణమునకును దీని యుపయోగ మెక్కువగానున్నట్లు తెలియుచున్నది.

ఈ వస్తువుల నన్నిటిని తయారు చేయుట కేటేట వేలకొలది పౌనుల పాల విరుగుడు చూర్ణము సిద్ధము చేయబడుచున్నది. పాలు విరిగిపోవుటకు ఆమ్ల సంయోజన మొక్కటే ప్రక్రియకాదు. ఆవుదూడల ఆమాశయములలోని యొకానొక పదార్థముకూడ ఆపనిని నెరవేర్చుచున్నది. ఇవి యేవియు లేకపోయినను కూడ పాలనుకొంతకాల మట్టి పెట్టియుండినను అవిపులిసిపోయి, విరిగిపోవుటయు నొకపద్ధతిగ వాడుకయందున్నది.

## మాసిపోయిన వ్రేలిముద్రలను కనిపెట్టు సాధనము

ఇది యొక రసాయననాళిక. దీనిలోనుండి వెలువడు అయొడీన్ పొగ మాసిపోయిన వ్రేలిముద్రలను బయలుపరచును. ఈనాళికలోనుండు గాజుగొట్టములలో



అయొడిన్ పలుకులు, కాల్షియముమిశ్రద్రవ్యము వేయబడియుండును. రబ్బరుగొట్టములోనుండి యూదబడు గాలి యాపదార్థములమీదుగా పారినంతనే అది యొక బరువైన ఆవిరిగా మారిపోవుచున్నది. ఆ యావిరి తగిలిన భాగములలో నిజముగ వ్రేలిముద్రలుండునో వాని కాయావిరి అతుకుకొనిపోయి, అవి నల్లగ నిజస్వరూపము ప్రదర్శించును. అపరాధపరిశోధకులకు ఈసాధనము మిక్కిలి యుపయోగపడగలదు.

---

## నాలుగంచుల క్షౌరపుబ్లేడ్లు

దేశములో ఆర్థికపరిస్థితులు చాల వక్రించిపోయియున్నవి. ఖర్చులను తగ్గించుకొను నుపాయముల అన్వేషణ ఎక్కువయినది. ఈ యుదాహరణమును చూడుడు. ఇన్నాళ్లు బ్లేడ్లు రెండేయంచులుగలిగి సామాన్యముగ రెండే క్షౌరములకు పనికివచ్చుచుండెడివి. ఈక్రొత్త రకపువానితో మరిరెండు క్షౌరములకు అవకాశము కలిగిన





దన్నమాట. ఈ చౌకముహూర్తములో బ్లేడ్లఖర్చు సగము తగ్గించుకొనవచ్చును. వీని నాలుగంచులును వాడిగలిగి యుండును.

## మోటారుకారులకు ఇక గాజులు, మేకులు వలన భయములేదు

రోడ్లలో ప్రజలు అవివేకముగ పారవేయు గాజు తుండ్లు, మేకులు ఇత్యాదులవలన మనుష్యులకే కాక మోటారుబండ్లకును, తత్సజాతీయములైన యితరశకటములకునుగూడ తరచు ప్రమాదములు సంభవించుచుండును. శకటచక్రముల రబ్బరుగొట్టములకవి గ్రుచ్చుకొని, రంధ్రము



లేర్పడి లోనిగాలి బుస్సని వెడదారి చూచుకొనును. అంతట బండ్లు పైకి సాగనేరక, ఆరంధ్రములకు అతుకులు అతికించుకొని, మరల గాలికొట్టి పై ప్రయాణమునకు సన్నాహపడుకొను కష్టము లనుభవైకవేద్యములు. వీనిని నివారించుకొనుటకు కారుల కీవిధముగ రెండు చీపురుకట్టల నమర్చియుంచుకొన్నచో రహదారులలోని మేకులు మొదలైనవాని నవి చిమ్మిపారవేయును, చక్రముల రబ్బరు తొడుగుల కపాయము కలుగకుండ కాపాడుచుండును. P. S.

## చిన్నయంత్రములలోని భాగములకు నూనె వేయుటకు క్రొత్తరకమైన తైలస్యందిని

టైపుయంత్రములు వగైరాలలోని మరలకును, చక్రములకును అప్పుడప్పుడు నూనె వేయుచుండకపోయినచో నవి సులువుగ ఆడవు. ఆ నూనెవేయు పని కిదివరకు వాడుకలోనుండిన పరికరములు (Oil cans) యంత్రములలోని కొన్నికొన్ని లోప్రాంతపుభాగముల సందుకొనలేక ఇబ్బందిగ నుండెడివి. ఫౌంటెన్ కలము ఆకారముతో నిప్పుడా పరికరములు తయారు చేయబడు



చున్నవి. ఈ తైలస్యందినులు యంత్రములలోని ప్రతియొక మరకును అనాయాసముగ నూనెవేయుటకు అనువైనవిగ నున్నవి. ఇవి పారదర్శకముగకూడ నుండి లోపల నింపియుండు నూనెకూడ మనకు కనబడుచుండును. వీనికి క్లిప్పులను తగిలించుకొని జేబులలోకూడ తీసుకొని పోవచ్చును. P. S.

---

## ఓడలలో మరియొక క్రొత్తరకము

పీపాయి ఆకారముతో నౌకలు నిర్మింపబడుచున్నవి. వానిలో నిది తొలిసృష్టి. దీనిపొడవు [illegible] అడుగులు. సుమారు ౨ అడుగుల వ్యాసము. దీని ముఖభాగము శంఖాకారమున నుండును. అడుగు దూలము ౬౦౦ పౌనుల బరువుగలిగి యుండును. ఈ చిన్ననౌకతో నీ ప్రక్కనున్న వ్యక్తి అట్లాంటిక్ సముద్రమును దాటించియున్నాడు. దాదాపు ౪౦ రోజులు ఈ సాగర యాత్రకు పట్టవచ్చునట. P. S.





'Heaven is full of the Gods'. Aristotle.

"ఊర్ధ్వలోకము దేవతలతో నిండియున్నది."
అరిస్టాటిల్ ఆచార్యః.

ఉ. "భూసతికిం దివంబునకు
        బొత్తొసగంగ శరత్సమాగమం
    బాసకల ప్రమోదకరమై
        విలసిల్లె మహర్షి మండలో
    పాసిత రాజహంసగతి
        భారతి ప్రసన్న సరస్వతీక మ
    భ్యాసన సప్రశంబగుచు (?)
        నబ్జజు యానముతో సమానమై"
                                        —నన్నయభట్టు.

"Ye Stars ! Which are the Poetry of Heaven !—Byron.

(ఓ నక్షత్రములారా ! స్వర్గలోకము యొక్క ఉత్తమ కావ్యగీతములు మీరే సుమండీ !- బైరన్ మహాకవి.)

ఉ. శారదరాత్రు లుజ్వలల
        సత్తర తారకహారపంక్తులన్
    జారుతరంబులయ్యె విక
        సన్నవకైరవ గంధబంధురో
    దారసమీర సౌరభము
        దాల్చి సుధాంశువికీర్యమాణ క
    ర్పూరపరాగ పాండురుచి
        పూరము లంబరశోభితంబులై."
                                        —నన్నయభట్టు.

ఈ ధాతృనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి ౮-౧౧-౧౯౩౬ మొదలు కార్తీక బహుళ దశమి ౮-౧౨-౩౬ పర్యంతమును అవ మాసములో రాత్రి తొలిజామున గగనవీథిని పొడచూపు గ్రహనక్షత్రాది విశేషముల నారయుదము.

## The Milky Way

### పాలవెల్లి

ఈ మాసములో రాత్రి తొలిజామున పాలవెల్లి తూర్పునుండి పడమటకు ధనురాకారముతో వ్యాపించి యున్నది. ఆ విల్లుయొక్క మధ్యభాగము ధ్రువక్షితి సామీప్యమునకు వ్యాపించియున్నది. తూర్పు క్షితిజమున నార్ద్ర మొదలు పైకెగయు నీ ధవళదృశ్యము సారథిమండలముకడ సన్నగిలినను, గగనమధ్య రేఖా ప్రాంతమున విరివిచెంద, పడమటకు వ్రాలి శ్యామసీమలను గడచిన పిమ్మట రెండుపాయలుగా చీలినది. పాయల మధ్య ఛాయాపథము నల్లనల్లగ తోచుచున్నది. ఈ వెల్లువ ఇపుడు గానవచ్చు గగనసీమను రెండుభాగములుగా విభజించినట్లు స్ఫురింపగలదు. అందు ఉత్తర భాగముకంటె దక్షిణముగానున్న భాగము రెండురెట్లు పెద్దదైనట్లు తోచుచున్నది. ఈ ధవళదృశ్యమును ఆకాశగంగ యని భావించినపుడు పడమట అస్తమించిన విష్ణుదేవుని పాదమునం దుద్భవించి తూర్పుగా వంకరలతో ప్రవహించి రుద్రమూర్తియైన ఆర్ద్ర నక్షత్రముపై గొలకొనినట్లిపుడు స్ఫురింపగలదు ! కనుకనే మనవారు ఆకాశగంగను "భోగికంకణు తలపూలదండ" అని వర్ణించుచుందురు.

ఈ సందర్భమున దివిజగంగాభవానినిగూర్చి వెనుక అడిదము రామకవి చెప్పిన పద్యభాగములు కొన్ని మనమున నిడికొని యీ తెల్లవెల్లువను గమనించుట మిక్కిలి ప్రమోదకారియగునని యెంచి ఇట వ్రాయుచున్నాను:-

సీ. బ్రహ్మాండభాండ సంపత్తి కుక్షినిగల్గు
        పద్మనాభుని పదాబ్జమునబుట్టి
    అఖిలలోకాధ్యక్షుడై మించి విహరించు
        శివు జటాజూటాగ్రసీమ నిలిచి

*     *     *     *

సీ. భావింప నిలువెల్ల భంగంబులేకాని
        భంగముల్గాలగు చెప్పటికిలేదు

తిరుగుచో వంకరతిరుగు డింతియుకాని
తిన్నగ దిరుగుట యెన్న డెఱుగ
పరులకల్మికిగోసి పల్చనగుటె కాని
పలుచని గతిమాని మెలగు టెఱుగ
......నిలువునీరైన నీవు............

ఈ మిన్నేటిమధ్య ద్వీపములవలె- శ్యా1-శ్యా2- అను గురుతులుగల శ్యామనీవలును, పెద్దలంకవలె ఛాయాపథమున కనబడుచున్నవి.

First Magnitude Stars

తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు

ఈ మాసములో రాత్రి తొలిజామున తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రము లెనిమిది కనబడుచున్నవి.

౧ వీణామండలమున బ్రహ్మ (Vega in lyra)

౨. గరుడమండలమున శ్రవణము. (Altair in Aquila).

3. ఇంద్రద్యుమ్నుడు. (Fomalhaut in Pisces Australis.)

౪. శంతనుడు. (Acheruer at the end of Eridanus యమున

౫. రిగల్. (Rigel)
౬. ఆర్ద్ర (Betelgeaux) } Both in Orion

౭. రోహిణి. (Aldebaran.)

౮. బ్రహ్మహృదయము. (Capella auriga)

ఈ యెనిమిది మేలి నక్షత్రకాంతులకు తోడు గ్రహముల కాంతియు శరత్కాల ధావళ్యమును వృద్ధి చేయుచున్నవి.

గ్రహములు

గ్రహములలో శుక్రుడు ఈ మాసములో ధనూరాశిలో సంచరించుచున్నాడు. గురుడు కూడ ధనువులోనే ఉన్నాడు. నవంబరునెల ౧3 వ తేదీని మూల ౨ వ పాదములో గురు శుక్రులు సమాగమము పొందుచున్నారు. అటుపైని శుక్రుడు గురుని దాటిపోవును. నవంబరుమాసాంతమున నగపడు శుక్రునిస్థానమే పటములో చూపబడినది. పశ్చిమమున గురు శుక్రులకుతోడు కుంభమున శనియు, తూర్పున ఆర్ద్రారోహిణీ నక్షత్రములును, ఉత్తరాకాశమున బ్రహ్మ, బ్రహ్మహృదయ నక్షత్రములును, దక్షిణమున ఇంద్రద్యుమ్న శంతనులును, నలుదెసలను నిలిగి, ఆకాశరంగమంతయును శోభావంతముగ చేయుచుండుట గమనింపతగును. తూర్పున బాగుగా నుదయమైన ఒరయన్ యోధుని రూపమున 87ల్ చుక్కలకు సరిగా. పశ్చిమమునకు వ్రాలి అస్తమింపబోవుచు శ్రవణమున్నది.

ఉత్తరాకాశమున

ధ్రువపక్షిలో చిన్న ఎలుగు వాయవ్యమునకు వ్రాలియున్నది. ఋక్షముగాగాక, వేదకాలములో నీ చుక్కలగుంపు చిన్న శింశుమారముగా భావింపబడుచు పూజనొందుచున్నట్లు యజురారణ్యకములోని ధ్రువోపస్థానమంత్రమువలన స్పష్టమగుచున్నది. చూ: కృష్ణయజురారణ్యకము: ద్వితీయ ప్రపాఠము, పందొమ్మిదవ అనువాకము:-

"అగ్నిః పుచ్ఛస్య ప్రథమం కాణ్డం తత ఇన్ద్రస్తతః ప్రజాపతి రభయం చతుర్థగ్ం సవాఏష దివ్యశ్శాక్వర శ్శింశుమారస్తగ్ం......"

ఈ చిన్నశింశుమారముయొక్క తోకలో మొదటిచుక్క అగ్ని, తరువాతిచుక్క మహేంద్రుడు, ఆ తరువాతిచుక్క కశ్యపప్రజాపతి- నాలుగవది చలనము లేనట్లగపడు-అభయం- ధ్రువనక్షత్రము. అగ్నికి పడమటగా ధాతయు, మిత్రునకు పడమటగా విధాతయు ధ్రువరక్షకులై (Guards of the pole) ధ్రువుని చుట్టు పరిభ్రమించుచున్నారు. ఈ చుక్కలతోకూడిన ధ్రువమండలమునకు పశ్చిమముగా,అనగా వాయవ్యాకాశమున నరకుడు-ధరాసూనుడు త్వరలో నస్తమింపనై యున్నాడు. పూర్వము దీపావళినాటికి నరకుడు పూర్తిగా అస్తమించి అదృశ్యుడగుచుండెడివాడు. కాని ఇప్పు

శతాబ్దములు గడచిపోవుటచేత ఇంకొకమాసమునకుగాని వరకుడు సాయంకాలమ స్తమింపడు.

## పశ్చిమమున

శ్రీ మహావిష్ణువు అస్తమించినాడు. ఆతని నాభికమల సంజాతుడైన బ్రహ్మయు, వాహనమైన గరుత్మంతుడును పశ్చిమమునకు చాల వ్రాలియున్నారు. త్వరలో వస్తమింపగలరు. ఇపుడు శరత్కాలము. భూమి ఆకాశమునకు శరత్సమాగమమయినది. అస్తమింపనై యున్న బ్రహ్మ, సరస్వతీ దంపతులకు తెల్లని రాజహంస వాహనము. ద్యావాపృథివీదంపతులకు శరత్కాల శీలమైన ధవళతేజము వాహనము. పశ్చిమాకాశమున నీ దంపతులకు ధవళవాహన సహితముగా నగు సమావేశము ఈ ఋతువుయొక్క విశిష్టతకు హేతువు. ఈ విశిష్టత కింకను విశిష్టత కల్పించుటకు ఆదిగువనే సురుశుక్ర సహితుడై ధన్వి అలరుచున్నాడు. అందును నవంబరు ౧౬-౧౭ తేదీలను చంద్రుడుగూడ ఆ ప్రాంతమున మసలగలడు. అపుడు పశ్చిమాకాశదృశ్యము మిక్కిలి దర్శనీయమై యుండును.

## దక్షిణమున

వాయు దైవత్యమైన స్వాతిమరుగుననంటుట చూచుకొని బకాసురుడు యమునాహ్రదప్రాంతమున మిక్కిలి మిసిమిపడుచున్నాడు. తత్పూర్వయుగములలో నాళీకజంఘు డనబరగిన ఆబకమే, ప్రావారకర్ణఘూకము, యుగంధర కమఠములతో కూడి, ఇంద్రద్యుమ్నుని ప్రాచీనతను ఋజువుచేయుచుండుట గమనింపదగును. కమఠముప్రక్కనే క్షీరోదముయొక్క దక్షిణధ్రువమున్నది. ఇది నిజముగా తెల్లగా చుక్కవలె కనపడునది కాదు. పాలసముద్రమునకు ఉత్తరధ్రువము కన్యకడను, దక్షిణధ్రువము కమఠముకడను కలవని భావించుకోవలెను. పాశ్చాత్యవిద్వాంసులు వీటిని North and South Galacticpo!es అందురు. మనపురాణములలో మందరము మునుగకుండ అడుగున ఆపినది కూర్మము. అమృతము పంచిపెట్టినది (జగన్మోహిని) కన్య. ఆగ్నేయాకాశమున నిపుడు ముఖ్యముగా కానవచ్చునది పామువలె మెలికలు తిరుగుచు నగపడు యమునానది. ఘూకముదిగువ నానదిచెంత శంతనుడు మెఱయుచున్నాడు.

## తూర్పున

"Orion, with his glittering belt and sword, Gilded since time has been : While time shall be. Thou splendid scull[e]ss warrior what to thee, Marching along the bloodless fields are we ?

అని యొక కవయిత్రి వర్ణించియున్నది. వజ్రకాంతులతో ప్రకాశించుచున్న పటకానుండి బంగారు ఛాయతో గ్రాలుచు వ్రేలు ఖడ్గముతో ఒరయన్ యోధుడు అనాదినుండి మన ఆకాశరంగమున మెఱయుచున్నాడు; కాల మున్నంతవఱకు మెఱయగలడు. శాశ్వతమూర్తివైన యో దివ్యయోధుడా! రక్తరుధిరవిరహితమైన అంబరవీథిని చరించు నీకు మేము ఎంత అల్పులుగా తోచుచున్నాము! అని యిట్లు వర్ణింపబడిన దివ్యతేజోమూర్తి ఒరయన్ యోధుడు బాగుగా ఉదయించి మెఱయుచున్నాడు. ఆ యోధుని యొగువను ఎద్దుకన్నువలె రోహిణి ఎఱ్ఱగా మెఱయుచున్నది. వాటి కెగువ సారథిమండలము బాగుగా ఉదయమైనది. అందు బ్రహ్మహృదయము అద్భుత ధవళ తేజముతో మెఱయుచున్నది.

## మధ్యను

పాలవెల్లికిని గగనమధ్యరేఖకును నడుమ వసుదేవతాత్మకమైన ధనిష్ఠయును, ఆ దిగువ మకరకుంభ రాసులునుగలవు. వాని కెగువ పేద్వఘూళ్యమున పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములును వానికి దిగువను ప్రక్కను రెండు చేపలతో కూడిన మీనరాశియు కలవు. పాలవెల్లికిని, క్రాంతిరేఖకును మధ్యను వరుసగా తూర్పునకు అశ్విని, భరణి, కృత్తికలున్నవి. కృత్తికలనుండి ఉత్తరమునకు భృగుపరశు మండలమును, ఆ మండలమునకును పేద్వఘూళ్యమునకును మధ్య ఇంద్రమడయు గలవు. ఆమె గర్భచ్యుతుడైన చ్యవనుడును, చ్యవనునిచే

జచ్చిన పుణ్యమరక్కసుడును చక్కగా కానవచ్చుచున్నారు అశ్వినికి దిగువ క్రాంతిరేఖకును, యమునకును మధ్య శింశుమారము (Cetus the Whale) ఉన్నది.

## విశేష విషయములు

### November Meteors

నవంబరు ౧౩ తేదీ మొదలు ౨-౩ రోజులవఱకును సింహరాశిలో మఘ నక్షత్రముపై పల్లకీ బొంగు వంటి వక్ర ప్రదేశ ప్రాంతములనుండి విశేషమైన ఉల్కాపాతము కనబడును. అందును ౧౫ వ తేదీని చాల ఎక్కువగా కనబడును. వేగము గల మెఱుపులట్టు ఇవి మిక్కిలి వేగముగా జారిపడుచుండును. ఇది దేవతల బాణసంచా యనుకొని దీనికిని ప్రతిగా మనవారు దీపావళి బాణసంచాక్రమము నేర్పాటుచేసినారేమో అని తోచుచున్నది. As above so below; the drama of the earth runs parallel to the drama of the sky. మీద నెట్లో క్రిందనట్లే; ఆకాశ నాటకమును అనుసరించియే భూమిమీద నాటకము నడుచుచున్నదని పెద్దలు చెప్పుచున్నారు. మన పంచాంగకర్తలు దీపావళినాడు ఉల్కాభ్రమణమని వ్రాసినారు.

౧౮-౧౧-౩౬ నాగులచవితి:—పశ్చిమమున నస్తమించినవిష్ణువు తూర్పున సూర్యోదయాత్పూర్వముపాడచూపకముందు, అతడు పరుండిన పాన్పు అయిన శేషుని శిరములు ముందు కనబడును. కావున ఆనాడు పాములను పూజించి పుట్టలో పాలుపోసి చలిమిడి, చిమ్మిలినై వేద్యము పెట్టుచున్నారు.

౨౪-౨౫ నవంబరు: శ్రీ విష్ణుమూర్తిశిరమగపడును. అతడు నిద్రలేచిన బోధన ఏకాదశి- ద్వాదశి రోజులు పుణ్యదివసములుగా పరిగణింపబడుచున్నవి.

౨౮-౧౧-౩౬ కార్తీకపున్నమ. జ్వాలాతోరణము. ఆనాడు క్రాంతిరేఖపై వరుసగా తేజోవంతములైన నక్షత్రముల దివ్యదృశ్యము తోరణమువలె కనబడును. అందును ఈమాసమున మూడుగ్రహము లద్భుత తేజముతో ఈతోరణమున చేరి యగపడుచున్నవి. చూడుడు:—(౧) సారథిలోని Beta taurus. బీటా

వృషభము అను అగ్నినక్షత్రము.

(౨) రోహిణి.

(౩) కృత్తిక చుక్కలు. అగ్ని దైవత్యములు. ఈమాసమునకు కార్తికమని పేరు వచ్చుటకు కారణమైనవి.

(౪) శని.

(౫) శుక్రుడు.

(౬) గురుడు.

తూర్పున నార్ద్రి - 8 7ల్ చుక్కలీ శోభను హెచ్చించుచున్నవి. మూల, పూషా, ఉషానక్షత్రములు పడమట తేజరిల్లునవి యైనను గురు శుక్రుల తేజము నెదుట నివి గణనకురావు. ఈ దీపమాలికలు దివమున మెఱయుచుండ మనవారు కార్తికమన దీపములు వెలిగించి ముద మొందుచున్నారు.

# నానాదేశ సందర్శనము

'గ్రహ' వీక్షణము

### 3. ఫ్రాన్సు :

ఫ్రాన్సుదేశస్థులు ఆకారమున పిన్నలు. వారి తలలు చిన్నవి. వారి శరీరములు చిన్నవి. వారి పాదములు చిన్నవి. కావుననే వారు యూరపుఖండపు జపానీయులుగా పేర్కొనబడుచున్నారు.

వారి పూర్వోత్తర పరిశీలనలో వైశాల్యదృష్టి యనునది లేదు. భవిష్యత్తునెడ వారిది పరిమితదృష్టి. సమరములులేని ప్రపంచ మేమి ప్రపంచమని వారు వెక్కిరింతురు; మానవ ప్రపంచమున నైక్యమనునది యుండగలదాయని సంశయదృష్టులు సారింతురు.

ఇప్పుడులేని దొకప్పుడూడిపడునా యనియే వారి తలంపు. ఈ నిశ్చయదార్ఢ్యమున కూతగ వారి దేహములును దృఢములయినవి. కర్షకజనసంఖ్య ఫ్రాన్సులో అధికము. ఆ సంఖ్యయే ఆదేశపు ధనధాన్య సంపదకు మూలకందము. ఒకప్పుడు ఇంగ్లాండు స్కాట్లండులు కూడ ఈ వ్యవసాయసంపద ననుభవించినవికాని నేడు యంత్రాలయసంపత్తి ఆ సంపత్తిని తుడిచివేసినది.

కాని ఫ్రెంచి వ్యవసాయదారులు ఆధునిక వ్యవసాయదారులుకారు. వారివి ప్రాచీనపద్ధతులే కాని నవీన పద్ధతులుకావు. వ్యవసాయమునకు ఆధునిక పరికరములను వారేనాడును ప్రయోగించరు దినమంతయు వారు పాటుపడుచునే యుందురు. వారికి అలసటయనునది ఎరుగరానిది.

విరామవేళలందు చూచి యానందించి వచ్చుటకు వారికి సినిమాలు లేనూలేవు. ఉన్నను వారు పోనూపోరు. వార్తాపత్రికలను వారు చదువరు. ఇతరదేశములందు జరుగుచుండు విశేషములకు వారు వీనులుగాని, మనములుగాని ఒగ్గరు. వ్యవసాయమే వారి పరమార్థమనుటకన్న నేలయే వారి మతమనుట యొప్పినమాట.

కర్షకజనమున సంతానబాహుళ్య మొక విశేషమగనుండ మధ్యస్థితిపరులు కేవల మొక్కొ కాన్పుతోనే తనియుట పరిపాటియయినది. జానపదుల యీ ధారాళమైన దృష్టియే కారణమైయుండుచో నాగరికుల హ్రస్వదృష్టి కేనాడో దేశమున జనసంఖ్య విలోమగతి పట్టియుండెడిది.

ఫ్రాన్సులో కార్మికులు, పారిశ్రామికులు, సామాన్యప్రజయుకూడ ఒడళ్లు విరుచుకొని పనిపాటలు చేయుచుందురు. విరామమును వారెరుగరు. ధనవంతులయెడ వారు కరకుదృష్టులను బరపుచుందురు.

రాజకీయములందు వారికి పరమప్రీతి. వారి భావములు విప్లవముదెస పరుగులెత్తుచుండును.

నాయకులు చూపినమార్గమును వీరు అక్షరాలా అనుసరింతురు. ఏయుద్యమమునకైనను, నాయకుని యానతో, తమపనులను మానుకొని పరవళ్లుత్రొక్కుచు తయారగుదురు.

బ్రిటిష్ప్రజవలె ఫ్రెంచిప్రజలు నోళ్లునొక్కుకొని, ప్రభుత్వము విధించుహెచ్చుపన్నులను చెల్లింపరు. అట్టి విధానము లమలులోనికి వచ్చినప్పుడు తగు రీతిని వాని నెదిరించి తప్పించుకొందురు. ప్రభుత్వము సైతము గత్యంతరము కానక, మిన్నకను ఉండనేరక ఉపాయాంతరమున రాజ్యాదాయమును పరిపుష్ట జూతురు. దిగుమతి సుంకములను హెచ్చించుటతో దానిని భర్తీచేయజూచుచున్నారు కాని అది యేమూలకును చాలుటలేదు. ఆయవ్యయపట్టికలు క్రిందుమీదులుగనే యుండిపోవుచున్నవి.

నైతికముగ ఫ్రెంచివారు న్యాయపద్ధతియందున్నారు. అవివాహితలైన బాలికల విషయమున నెంతో జాగ్రత్త తీసుకొనబడుచున్నది. వారి సాంసారిక జీవనముకూడ మెప్పుదల కనుకూలముగ నుండును. కాని

ఒక విశేషము. అతిథి-అభ్యాగతులసమాదరణ వారిలో కొంచెము తక్కువగనుండును. ఏవోకొన్ని సందర్భములలోతప్ప వారిలో మధుపానముకూడ తక్కువయే. విద్యను వారు అతిముఖ్యమైన విషయముగ భావింతురు. కాని ఆవిద్య ఆనుశిలకవిద్యయు కాదు; సాంకేతిక విద్యయును కాదు. వారివిద్య ఫ్రెంచిసారస్వతమును, ఫ్రెంచి చరిత్రను నిరూపించు జాతీయవిద్య.

ఫ్రెంచిస్త్రీలు అందముగను, పరిశుభ్రముగను ఉందురు. ఆకర్షణయందు వారు ఇంగ్లీషువారికన్నను, జర్మనులకన్నను రెండాకు లెక్కువ చదువుకొన్నారు. అందము వారికి వరప్రసాదము. ప్రపంచమునకు అందపు తీరులను చూపుటలో వీరిదే వరవడి. శారీరకముగ ఇంగ్లీషుస్త్రీలును, అమెరికాస్త్రీలును వీరికన్న సౌందర్యవతులే కావచ్చును. కాని వారికి రూపురేఖలను తీర్చుకొను వైనములను ఇచ్చునది ఫ్రెంచిస్త్రీ. వేషమును సొగసుగ, దర్శనీయముగ కల్పించుకొనుటలోను, పరిమళముల నలముకొనుటలోను ఫ్రెంచిస్త్రీలు చాకచక్యమును చూపుచుందురు. పరిమళములయెడ ఫ్రెంచి వారి కెనలేని యభిమానము. మగవారుకూడ వేషాలంకారములతో, పరిమళవాసనలతో నీటుకాండ్రుగ తయారగుచు ఆనందించుచుందురు. పనిపాటులుచేసి కాలము పుచ్చువారి కీకోవపు పిచ్చిలేదు. సామాన్యపుదుస్తులే వారికి చాలును.

నాగరికత, సంస్కృతి ఫ్రాన్సు పరమోద్దేశ్యములు. లలితకళలకు ఫ్రాన్సు పట్టుగొమ్మ. చిత్రకారులు, శిల్పులు పలువురకు ఫ్రాన్సు అభిమానపాత్రమైయున్నది. ఫ్రెంచి భాషకూడ ఒక సంస్కృతిభాషగ పలువురచే నెంచబడుచున్నది.

ఫ్రెంచివారు ఇతరులవలె ప్రజ్ఞలు చెప్పుకొనరు. 'మా ఫ్రాన్సు ఇంతటిదంతటి'దని దానిని ప్రశంసించరు. ప్రకటనలు చేసుకొనుట వారి కిష్టములేదు. వారు చేసిన కార్యములే వాని స్వరూపమును ప్రకటించుకొనును.

ఫ్రాన్సులో స్వాతంత్ర్య మెక్కువ. ఎవ రెట్లు తిరిగినను ఇదియేమి యని యడుగువా డుండడు. స్త్రీ పురుషు లిరువురు వీథిలో నడచుచుండినచో నా స్త్రీ అతనిభార్యయేనా, కాదా యని పరిశీలనగ గమనించువారు నుండరు. ఎవరి రాజకీయాభిప్రాయములు వారివి. ఎవరు బహుపత్నీకులైనను, ఎవరు విప్లవకారులైనను ఫ్రాన్సుకు ఆ ప్రసంగములతో జోక్యములేదు. పరదేశములవారు అక్కడికి వెళ్లినను అంతియే. వారియిష్టము వచ్చినట్లు వారు దుస్తులను ధరించవచ్చును. వీథులలో వారి నెవరును గేలిచేయరు.

ఫ్రాన్సు అందముల బరిణ. విదేశీయుల యాకర్షణకు అది కేంద్రము.

4. ఇటలీ:

రోమనులలో ప్రముఖుడు ప్రపంచమునకెల్ల ప్రప్రథమ పత్రికారచయిత యగు జూలియస్ సీజర్. నేటి మేటిరోమన్ ముస్సోలినీకూడ నొక పత్రికారచయితయే. మారుమిక్కిలి యొక్క వీరాగ్రణికూడ. ఇటలీ వారు నేటికాలపు రోమనులు. రోమన్ సామ్రాజ్యమునకు ఇటలీ నిదర్శనము.

కాని ఇటాలియనులకును రోమనులకును వైదృశ్యములుకూడ పొడకట్టుచున్నవి. రోమనులు కదన కర్మలయందు క్రమశిక్షణ తెలిసినవారు. ఇటాలియనుల కట్టి క్రమశిక్షణ రాజకీయములలోను, సాంఘిక జీవితమునను, ఫాసిజం పద్ధతిలోనుమాత్రమే.

ఇటాలియనులు వైయక్తికముగ ధైర్యముగల వారే కావచ్చునుకాని సంఘములో, గుంపులో, కూటములో నాధైర్యము సన్నగిల్లి, దిగులు వారి నావహించుచుండును. నరముల బలహీనత యిటాలియనుల కధికము. రోమను లీనరములేమో, ఈబలహీనతయేమో యెరుగరు. ఇటాలియనుల కివి బాగుగా తెలియును.

సాహసికులు, నిర్భీకులునైన మోటారుడ్రైవర్లు, వైమానికులు, నావికులు ఇటాలియనులలో నెందరో కలరు. వారి సాహసిక్య, ధైర్యము లిట్లు వైయక్తికముగానే పరిణమించిపోయినవి.

ఇటాలియనులు ధనార్జనచేయుదురు. రోములోను, యూరపులోని ఇతరనగరములలోను తమశక్తిసామర్థ్యములను వినియోగించి ధనార్జనచేయు ఇటాలియనులు వందలాదిగ గలరు. కాని వారిలో భిక్షుకులు చాల తక్కువ. వారిలో దరిద్రులైనను ఏదోయొక పనిచేసి ప్రతిఫలముగ ద్రవ్యమును కోరుదురేకాని తేరకు కోరరు.

అట్లు సంపాదించిన ధనమును వారు వృథావ్యయము చేయక పొదుపుగ వాడుకొందురు.

ఇటాలియనులు బంధుజనముపెడ ధారాళముగ నుందురు. వారు తమ కుటుంబములకు, తమ గ్రామములకు కట్టుబడి, యనుకూలముగ నుందురు. తమవారు, తమ గ్రామములు అని చెప్పుకొనుటకు వారు మక్కువ పడుచుందురు. జన్మస్థానమును వీడి యేదూరదేశమున సంచరించుచున్నను సరే వారు తమదేశమును, తమవారిని సంస్మరించుచుండకమానరు. అట్టిది వారి ఆత్మాభిమానము!!

ఇటలీవారికి వ్యక్తిధర్మముగ కోరికలు తక్కువ. ఉన్నదానితో తృప్తిపడియుండుట వారి కభిమతము.

ధనమును కూడబెట్టుటయన్న ఇటలీవారికి చాల ప్రేమ. ఖర్చుపెట్టుటయే వచ్చినచో వారు అతిథి సమాదరణలకును, వేషాలంకారములకును, దానిని వెచ్చపెట్టుదురు. రమణీయములైన గొప్పకారులనైన కొనెదరు కాని తమ బాలుర విద్యాభివృద్ధికై వారంతగా ఖర్చుచేయ నిచ్ఛగింపరు.

పగతీర్చుకొను నావేగము ఇటలీవారిలో మెండు. అపకృతియొనర్చినవారు న్యాయశాస్త్రమునకు వెఱచుట లేదుగాని ప్రత్యపకృతికి మాత్రము వెఱతురు. అపకృతి బొందినవారు పగదీర్చుకొననిది యూరకొనరు.

దౌర్జన్యపద్ధతులతోనైనను సరియే యిటలీవారు తమస్త్రీల గౌరవమర్యాదలను రక్షింపబూనుకొందురు. ఇటలీస్త్రీల కేవిధమైన గౌరవమర్యాదాలోపము కలిగినను ఆస్త్రీ తండ్రులకు చేటుమూడినదన్నమాట. అన్నదమ్ములట్టి స్థితిరాకుండవలసిన ప్రయత్నములమీదనుందురు.

ఇటలీస్త్రీలకు ఫాసిజము మరియొక సంప్రదాయమును నేర్పినది. యూరోపియనులవలెకాక ఇటాలియనులుగానే యుండవలసినట్లు వారు హెచ్చరింపబడినారు. అధునాతనస్త్రీల పద్ధతులు వారవలంబించరాదు. కేశపాశములను వారు కురుచగ కత్తిరించుకొనగూడదు. కనుబొమలను విరళపరచుకొనరాదు. వారు రోమకగృహిణులుగానే ప్రవర్తించవలయును. బాలికలు వివాహమగునంతదాక కేశములను వీపులపై వ్రేలాడవేసుకొనుచుండవలయునేవినా ముడివగైరాలు వేసుకొనునలవాటు అక్కడలేదు.

ఇటలీస్త్రీలు తాము నల్లగానున్నందుకు గర్వపడుచుందురేకాని లేనిపోని వేషములతో తెల్లగనున్నట్టు ప్రదర్శించుకొనుటకు వారు సమ్మతించరు. ప్రకృతి కనుకూలముగ నడచుకొనుటయే ఫాసిజముపద్ధతిలో ముఖ్య సూత్రముగ గణింపబడుచున్నది.

ఇటాలియనులు వీరరోమనుకాథలిక్కులు. ఫ్రెంచివారివలె నాస్తికత వారి నావహించియుండలేదు. ఫ్రెంచివారు సంతానపరిమితిని గోరుదురు. అది రోమను కాథలిక్కు మతమునకు విరుద్ధము గనుక నట్టి కృత్రిమ పరిమితులను ఇటాలియనులు సమ్మతించరు. సంతాననిగ్రహమును వారి మతము ఒప్పదు. ఇటాలియనుల కుటుంబములు పెద్దవి. సంతానబాహుళ్యమునకు మతము మొదలుగాను; ప్రభుత్వ మాదరించును. 'శిశుజననమును వృద్ధిపరచుడు. ఇటలీకి జనము కావలయును' అనియే ముసోలినీ ఘోష. అందువల్లనే ఇటలీజనసంఖ్య పెరిగిపోవుచున్నది. కాని జీవనాధారములుమాత్రము చాల తక్కువ. ఫలితము వందలకొలది ఇటాలియనుల వలస. ప్రపంచమందలి ప్రతియొక్క పెద్దపట్టణమును ఇటాలియనులు ప్రవేశించినారు. ఈజీవనాధార సంకోచమే వారి రాజ్యవిస్తరణవాంఛకు మూలకారణము.

ఇటాలియనులు సంగీతప్రియులు. పలువురు గాయకులు జంత్రగాత్ర సంగీతములందు ప్రవీణులై యిటలీలో వెలయుచున్నారు. ప్రాచీన రోమనులకును వీరికిని ఇదియే వ్యత్యాసము. ప్రాచీనులకీసంగీతాభిమానము సర్వశూన్యము. ఇటాలియనులు పనిపాటలుచేయునపుడును, ఆటలాడుకొనునపుడును పాటలుపాడుకొనుచుందురు. ప్రపంచమంతట ఇటాలియనుల సంగీతమునకు గౌరవస్థానమబ్బియున్నది.

ఫ్రెంచివారివలె వీరు చమత్కృతి, హాస్యము కలవారు కారు; జర్మనీవారివలె ముకుముకుదనముకలవారును కారు. సామాన్యముగ వీ రెప్పుడును కడుపుబ్బ నవ్వియెరుగరు. గాంభీర్యము వారియం దెప్పుడును తొణికిసలాడుచుండును.

ఇటాలియనులు మంచి ప్రసంగధోరణి గలవారు. ప్రసంగమున కారంభించిరా ముందువెనుకల యాలోచనగాని, ఏమిచెప్పవలయునో దానియోచనగాని వారికుండవు. నిరాఘాటముగ నాప్రసంగము యథేచ్ఛగ సాగిపోవలసినదే. చెప్పబూనుకొనినదాని యాలోచనయే వారికనవసరము. చెప్పిముగిసినపిమ్మట తాము చెప్పినదానిని అక్షరాలా వారు విశ్వసించితీరుదురు.

ఇటాలియనులలో విశ్వవిఖ్యాతులైన సారస్వతరచయితలును, చిత్రకారులును, శిల్పులును పలువురు కలరు.

# రష్యన్ కథలు

## మంచుతుపాను

శ్రీ శ్రీనివాస శిరోమణి

[ఇది అలెక్‌జాండర్ పోష్కిన్ అనే రష్యన్ కథకుడు వ్రాసింది.

పంథొమ్మిదో శతాబ్దమువరకున్నూ రష్యన్ వారికి అంతగా చెప్పుకోతగిన వాఙ్మయము ఏమీలేదు. ఏకొస్తో కూస్తోవున్నా అందులో రష్యన్‌జాతీయత అనేది ఏమీలేదు. అసలు పంథొమ్మిదో శతాబ్దము వరకూ రష్యాదేశములో విద్యావంతులంతా ఫ్రెంచివాఙ్మయాన్నో, ఇంగ్లీషు వాఙ్మయాన్నో చదివి ఆనందిస్తూవుండేవాళ్లు. ఆ శతాబ్దారంభకాలములో అలెక్‌జాండర్ పోష్కిన్ అనేవాడు రష్యనుభాషలో కవిత్వము చెప్పడానికీ, కథలు వ్రాయడానికీ ఆరంభించినాడు.

పంథొమ్మిదో శతాబ్దము ఆరంభము అయ్యేసరికి ఫ్రెంచిభాషలోనూ, ఇంగ్లీషు భాషలోనూ పద్యరచనకన్నా వచనరచన వృద్ధికాసాగింది. నవలకూ (చిన్న) కథకూ ప్రాముఖ్యత ఏర్పడడము మొదలుపెట్టింది. కాలము గడిచినకొద్దీ నవలకంటే కథకే ప్రాముఖ్యతవచ్చింది.

ప్రపంచములో అన్ని వాఙ్మయాలలోనూ సాహితీ రీతులలో నాటకము అగ్రస్థానము వహించింది. అయితే పంథొమ్మిదో శతాబ్దం మధ్యకాలమునాటికి పాశ్చాత్య వాఙ్మయములో కథకు అగ్రస్థానము వస్తూవున్నట్టు సూచనలు కనబడుతవి. చివరకు ఇరవయ్యో శతాబ్దము ఆరంభమయ్యేసరికి వచన వాఙ్మయములో కథకు అగ్రస్థానము లభించింది. ఇందుకు కారకులు ఫ్రెంచి, రష్యన్ కథకులని చెప్పవచ్చును. ఇంగ్లీషు వాఙ్మయములో కూడా కథకు అటువంటిస్థానమే వచ్చిందని చెప్పడము అతిశయోక్తి కాదు. అయితే యింగ్లీషు వాఙ్మయములో మొదటినుంచీ ఏవోరకమయిన వుంటూనేవున్నవి. వచనవాఙ్మయములో వాటి కొకప్రత్యేకస్థానమున్నట్టు యింగ్లీషువారు యెన్నడో తెలుసుకొన్నారు. కాని కిందటి శతాబ్దములో ఫ్రెంచి రష్యన్ కథావాఙ్మయము వృద్ధిఅయిపోయి అందరిదృష్టీ కథలవంకకు తిరిగేసరికి ఇంగ్లీషువారుకూడా నూతనపద్ధతితో కథారచన ప్రారంభించినారు. ఈ నూతనపద్ధతిలో వ్రాసినకథకు "షార్టుస్టోరి" అనే పేరుపెట్టినారు.

"షార్టుస్టోరి" (చిన్నకథ) అని అంటే ఏ ఒకటి రెండు పేజీలలోనో పూర్తి అయిపోయేకథ అని వారి అభిప్రాయముకాదు. అట్లా ఎవరయినా అనుకొనేట్లయితే వారికి పాశ్చాత్యకథావాఙ్మయ వాసన ఏమీ లేదని అనుకోవలసివస్తుంది. ఒకకథ ఎన్ని పేజీలయినా పట్టవచ్చును. కొంతమంది ప్రసిద్ధ కథకులకథలు క్రౌన్ ౯ సయిజు (అంటే యీ భారతిలో సగమునయిజు)లో నూరు నూటయాభయి పేజీలుపట్టినవి. ఆ కథకులే ఒకప్పుడు ఒకటి రెండు పేజీలలో కథపూర్తిచేసివేసినారు. అప్పుడున్నూ దాన్ని షార్టుస్టోరీ అనే అన్నారు. ఫ్రెంచి భాషలో బెల్జాకు అనే ప్రసిద్ధకథకుని ఉత్తమకథలేవీ అరవై డెబ్బయి పేజీలకు తక్కువ లేవు. ఇంగ్లీషుభాషలో డి. హెచ్. లారెన్సు అనే ప్రసిద్ధకథకుడు నూటయాభైఆరు పేజీల కథలు వ్రాసినాడు. ఇక రష్యనులసంగతి చెప్పనవసరమేలేదు. షేకవ్ అనే ప్రపంచ విఖ్యాత రష్యా కథకుడు నూటడెబ్బైయెనిమిది పేజీలకథను వ్రాసినాడు. వీటినన్నింటినీ విద్వాంసులు "షార్టుస్టోరి"లుగానే పరిగణించినారు.

ఒకానొక మానసికావస్థనో, ఒకానొక సంఘటననో ఒకానొక ముచ్చటనో వస్తువుగా తీసికొని అందుకు అవసరమయిన పూర్వాపరసందర్భాలనే చెప్పి దాన్ని సర్వాంగీణ రసస్ఫూర్తి కలిగేట్టుగా చిత్రించడమే "షార్టుస్టోరి" అని వారి అభిప్రాయము.

ఈకథావాఙ్మయములో ఫ్రెంచివారిది అగ్రస్థానమని కొంతమందీ, రష్యా వారిది అగ్రస్థానమని కొంతమందీ పాశ్చాత్యులలోనే అభిప్రాయపడుతున్నారు. కథాశిల్పము (Techn que) విషయములో ఇంగ్లీషుకథలను మించినవి లేవని చెప్పవచ్చును. వస్తుగౌరవ విషయములో రష్యనుకథలను మించినవి లేవని అనుకోవడము తప్పుకాదు.

దేశము సుభిక్షముగా వుండి కడుపులో చల్ల కదలకుండా వున్న సమయములో యింగ్లీషు కథావాఙ్మయము ఆరంభ మయింది. మహోత్కృష్ట విషయాలను ఉద్ఘాటించడానికి సంఘములోవున్న కశ్మలాన్ని కంప్లమెదట పొడగట్టేట్టు చిత్రించి సంఘాన్ని చక్కజేయడానికి ఫ్రెంచికథకులు ప్రారంభించినారు.

దేశములో జనులంతా అన్నాతురులయిపోయి దుర్భరదారిద్ర్యము అనుభవిస్తూ వుంటే ఏ కొద్దిమందో జమిందారులలాంటివాళ్లు సమస్త ప్రాపంచికసుఖాలూ అనుభవిస్తూ వుంటే అసలీమానవజన్మ సార్థకమా; నిరర్థకమా? అనే జిజ్ఞాస కలిగి బుద్ధిమంతులు కథారచనకు పూనుకొన్నారు.

ప్రపంచము పుట్టినది మొదలుకొని నేటివరకూ ఎవ రెవ రెన్నివిధాలా ఎన్నెన్ని శాస్త్రాలవల్ల ఈ మానవజన్మ సర్థకమేనని బోధించినా ప్రతివాడికీ సందేహాము సందేహము

గానే వుంటూవుంది. కాని పదిమంది రష్యన్ కథకులు కథలువ్రాసి జన్మసార్థకమేనని నిరూపించినారు. ఆవాఙ్మయము మూలకముగానే ఆదేశములో రాజకీయముగానూ, సాంఘికముగానూ యెన్నో మార్పులు వచ్చేటట్టు చేయకలిగినారు. ఈనాటి సోవియట్ రష్యా కిందటి శతాబ్దపు రష్యన్ కథకుల మహాస్వప్నమని చెప్పవచ్చును.

ఆ దేశములో ప్రసిద్ధకథకులంతా తమరచనలకు మూలపురుషుడు నికొలాయ్ గొగోల్ అని చెప్పినారు. అయితే గొగోలుకు పూర్వమే అలెక్‌జాండర్ పోష్కిన్ కథలు వ్రాసినాడు. రష్యన్ కథకులలో పోష్కిన్ ప్రథముడు. ఆఖరువాడు యీమధ్యనే చనిపోయిన మాగ్జిమ్‌గోర్కి. ఈ ఉభయులమధ్య ప్రపంచ ప్రఖ్యాతిపొందిన రష్యన్‌కథకులు తొమ్మిదిమంది అని చెప్పవచ్చును.

పోష్కిన్ ౧౭౯౯ సంవత్సరములో జన్మించినాడు. ౧౮౩౭ వరకూ జీవించినాడు. ఈయన అప్పటికివచ్చిన యింగ్లీషు వాఙ్మయాన్ని కూలంకషముగా అభ్యసించి రష్యన్ భాషలో మొట్టమొదట కవిత్వము చెప్పడానికి ఆరంభించినాడు ఈయన కవిత్వములో బైరన్- స్కాట్ మొదలయిన యింగ్లీషు రచయితల ఛాయలు కనబడతవి. ఆఖరురోజులలో కథలువ్రాయడము మొదలుపెట్టినాడు. ఈయన కథలలోకూడా అప్పటికి యింగ్లీషులోవచ్చిన కథలలో ఛాయలు అక్కడక్కడ కనబడతవి. అయితే రష్యన్ జాతీయజీవనాన్నిమాత్రము చక్కగా ప్రతిబింబింపజేసినాడు. ఈయన కల్పనాశక్తి అమోఘము. ప్రతి రచనలోనూ కొంచెము శృంగారాన్ని రుచిచూపిస్తాడు. అద్భుతసంఘటనలను చిత్రించడమంటే యెంతోయిష్టము. ఈయనకున్నూ యితరరష్యన్‌కథకులకున్నూ యెంతో వ్యత్యాసమువుంది. మహోదాత్త విషయాలను కాసీ, మహాగంభీర విషయాలను కాసీ యీయన కథలలో చెప్పకపోయినప్పటికిన్నీ యీయన కథలు మనోహరముగా మాత్రము వుంటవి.

ఈయన కథలలో Snow Storm (మంచుతుపాను) అనే కథను లోకము చాలా మెచ్చుకొన్నది. దీనిలోకూడా ఒక అద్భుతసంఘటనా, కొంచెము శృంగారమూ వుంది.]

౧౮౧౧ సంవత్సరం చివర రోజులు మరిచిపోవడానికి వీలులేనివి. ఆరోజులలో గాబ్రియల్ అనేపరమయోగ్యుడు భూమిపుత్రా చూసుకొంటూ నెనర్డోవా గ్రామములో నివసిస్తూవున్నాడు. అతిథి సత్కారానికీ దయార్ద్రహృదయానికీ జిల్లాజిల్లా అంతటా అతడు పేరూ ప్రఖ్యాతీ సంపాదించినాడు. ఆయన యింటికి చుట్టుపక్కలవాళ్లంతా తరుచు వస్తూవుండేవాళ్లు. ఇంతతినడానికీ తాగడానికీ కొంతమందీ, ఆయన పెళ్లాముప్రాస్కోవియాతో అదొకరకమయిన చీట్లపేక ఆడడానికి మరి కొంతమందీ, తెల్లగా చువ్వలాగా పదిహేడేళ్ల వయస్సులో వున్న వాళ్ల అమ్మాయి మేరియాను చూడడానికి యింకా కొంతమందీ వస్తూవుండేవాళ్లు. బాగా

డబ్బున్న సంబంధము కాబట్టి తామే ఆమెను పెళ్లి చేసుకోవలెననీ (చిన్నవాళ్లు), (పెద్దవాళ్లు) తమ పిల్లవాడికయినా ఆమెను చేసుకోవలెననీ కాంక్షించేవారు.

మేరియా ఫ్రెంచి నవలలో నాయికలాగా పెరిగింది. అందువల్ల ఆమె ఒకరిని ప్రేమించింది. పటాలములో సబ్‌లెఫ్టినెంటు వుద్యోగము చేస్తూ సెలవుమీద వచ్చి ఆ ప్రాంతములలో వుంటూవున్న అతిసామాన్య స్థితిపరుడు వ్లాడిమర్ మీద ఆమె మనస్సు లగ్నమయింది. ఆ యువకుడూ పరిసమానమయిన భావోద్రేకముతో ఆమెను ప్రేమించినాడు. అయితే వాళ్లుభయులూ కామోద్రేకముతో ఉన్ముఖులయినట్లు ఆమె తలిదండ్రులు తెలుసుకొన్నారు. అతన్ని గురించి ఏమీ తలపెట్టవద్దని వారు కూతురిని మందలించినారు. ఇక నా యువకుణ్ణి వారు ఉద్యోగము పోయినవాడికంటే నీచముగా చూడసాగినారు.

ఆ కాముకులు వుత్తరాలు వ్రాసుకొంటూనూ, ప్రతిరోజూ తోటలోనో చర్చిలోనో ఏకాంతముగా కలుసుకొంటూనూ తమ మనోగతప్రేమను వెల్లబోసుకోసాగినారు. విధినిందిస్తూ కర్తవ్యాన్ని ఆలోచించసాగినారు. ఉత్తరప్రత్యుత్తరాలవల్లనూ, సంభాషణలవల్లనూ ఒకరినొకరు విడిచిపెట్టివుండలేని స్థితి వారికి వచ్చింది.

ఎంతో క్రూరముగా తమకు అంతరాయము కలిగిస్తూ తమ సౌఖ్యానికి భంగకారకులుగా వుంటూవున్న ఆమె తలిదండ్రులను ప్రతిఘటించవలెననుకొన్నాడు.

ఈ అభిప్రాయ మాయువకుడి బుర్రలో కలిగింది. అందుకా యువతి ఊహాప్రపంచములో ఉప్పొంగిపోయింది.

చలికాలము వచ్చింది. వాళ్లు ప్రతిరోజూ కలుసుకోడానికి వీలులేకుండా పోయింది. కాని వుత్తరాలు వ్రాసుకోవడము మాత్రము చాలా జోరయింది. వ్లాడిమర్ ప్రతివుత్తరములోనూ ఆమెను లేచిరమ్మనీ, రహస్యముగా పెళ్లిచేసుకోమనీ వ్రాయసాగినాడు. కొంతకాల మయినతర్వాత తలిదండ్రుల కాళ్లమీద పడితే, ప్రేమనుంచి, అధమము తమ ధైర్యసాహసాలకయినా మెచ్చుకొని మన్నించి వాళ్ల రెక్కలకిందికి తీసుకొంటారని అతని నమ్మకము.

మేరియా చాలారోజులు యిందుకు వెనకకు తగ్గింది. లేచిపోవడానికి వేసినప్లాన్లు ఎన్నోసార్లు పాడుచేసింది. చిట్టచివరకు ఆమె అంగీకరించింది. లేచిపోయే రోజు రాత్రి తలనొప్పివచ్చిందనే మిషతో అన్నము తినకుండా ఆమె ఒంటరిగా ఆమెగదిలో పడుకొనేట్టు యేర్పాటు. ఈ పన్నగడలో ఆమె దాసీదికూడా వుంది. తరువాత వాళ్లిద్దరూ వెనకవైపు మెట్లమీదినుంచి కిందికిదిగి తోటలోకివచ్చేట్టూ, తోట వెనక హాజరుగా వుండే గుర్రపుబండియెక్కి అక్కడికి అయిదుకోసుల దూరములోవున్న జాడ్రినో గ్రామపు చర్చికి సరాసరి వచ్చేట్టూ, అక్కడ వ్లాడిమర్ వాళ్లకోసము కనిపెట్టుకొని వుండేట్టూ నిశ్చయించుకొన్నారు.

ఈ నిశ్చయానికి వచ్చినరోజు రాత్రి మేరియా నిద్రపోనేలేదు. ఆమె గుడ్డలూ గిడ్డలూ చొక్కాలూ గిక్కాలూ అన్నీ మూటకట్టుకొన్నది. ఆమె స్నేహితురాలు ఒకానొక యువతికి భావోన్మాదముతో పెద్ద పొడుగుపాటివుత్తరం వ్రాసింది. తలిదండ్రులకు మరొకటి వ్రాసింది. ప్రేమవల్ల తనకుకలిగిన అనిర్వాచ్యబలముతో తాను లేచిపోతున్నట్టూ, తన్ను మన్నించి వారి పాదములమీద వాలడానికి వారనుజ్ఞయిచ్చే సమయమే తన జీవితములో మహోత్కృష్ట సమయముగా యెంచుకొనేట్టూ, అతికరుణంగా వాళ్లహృదయము కరిగిపోయేట్టుగా వ్రాసింది.

ఆ రెండు వుత్తరాలమీదా సీళ్లువేసింది. ఆసీళ్లమీద రెండుహృదయజ్వాలలు చిత్రించింది. మంచముమీద వాలింది. తెల్లవారుఝాము అవుతున్నది. వణకడము మొదలుపెట్టింది. నిద్ర తిన్నగాపట్టలేదు. మధ్యమధ్య భయంకరమయినకలలు వస్తూవున్నవి. పెళ్లిచేసుకోడానికి పోబోతూ గుర్రపుబండి యెక్కినట్టూ, ఆమె తండ్రివచ్చి బండినిఆపి ఒక అగాధములోకి ఆమెను తోస్తున్నట్టూ, ఆమె తల్లకిందులుగా పడిపోతూ

హృదయముమాగిపోయినట్టూ తోచింది. అప్పుడు అక్క-
డనే గిరికమీద వ్లాడిమర్ నెత్తురుమరకలతో పడిపోయి
ప్రాణావశిష్టముగా వుండి ఆమెను పెళ్లిచేసుకోడానికి
త్వరగారమ్మంటూ చెవులు చిల్లులుపడేట్టుగా అరుస్తూ
కనిపించినాడు. ఒకటి తర్వాత యింకొకటి-చిత్రవిచి
త్రాలయిన దృశ్యాలు ఆమెకళ్లకు పొడగట్టసాగినవి.
చివరకు నీరసముగా నిజంగా తలనొప్పితో ఆమె నిద్ర
లేచింది. తలిదండ్రులు ఆమెస్థితిని గుర్తించినారు. ఎంతో
ఆదరముగా పదేపదే "ఏమిటి మేరియా - జబ్బేమిటి
మేరియా" అని ప్రశ్నిస్తూవుంటే ఆమెగుండెలు తరుగు
కొనిపోయినవి. జబ్బేమీ లేనట్టూ, ఖులాసాగానే
వున్నట్టూ నటించబోయింది. కాని లాభంలేక
పోయింది.

సాయంకాల మయింది. ఆ కుటుంబముతో గడప
డాని కదే ఆఖరురోజని ఆమెకుతోచగానే ఆమెగుండె
బరువెక్కింది. ఆమెకు మరణావస్థగా వుంది. ఆమె నాశ్ర
యించుకొనివున్న సమస్తవస్తువులకూ సమస్తమయిన
వారికీమనస్సులోనే సెలవు చెప్పివేసింది.

రాత్రి అన్నముదగ్గిర కూచుంది. ఆమెగుండెలు
దడదడ కొట్టుకొన్నవి. గద్గదస్వరముతో తనకు అన్న
మక్కరలేదని తలిదండ్రులతో చెప్పిలేచింది. యథా
ప్రకారము వాళ్లామెను ముద్దుపెట్టుకొన్నారు.

ఆమె దుఃఖము ఆపుకోలేకపోయింది.

గదిలోకి వెళ్లేవెళ్లడముతోటే కుర్చీలోవాలింది.
కళ్లవెంట నీళ్లుకారుతున్నవి. ఆమెను శాంతమువహించ
మనీ, ధైర్యము తెచ్చుకోమనీ దాసీది హుషారుచేసింది.
అంతా సిద్ధమయిపోయింది. ఇంకఅరగంటలో మేరియా
తలిదండ్రులనూ, ఆయింటినీ, ఆగదినీ, తనబాలికా
వస్థనూ త్యజిస్తుంది.

ఆవరణ అంతటా మంచు దట్టముగా పడుతూ
వుంది. హోరున గాలివీస్తూంది. కిటికీల తలుపులు టక
టక కొట్టుకొంటూవున్నవి. ఆమెకు అంతా దుఃఖభూ
యిష్ఠముగా తోస్తూవుంది.

ఇల్లంతా నిశ్శబ్దముగా వుంది. అంతా గాఢనిద్ర
లో వున్నారు. మేరియా శాలువ కప్పుకొంది. పయిన
దట్టముగా వుండడానికి కోటువేసుకొంది. ఆమె చిన్న
పెట్టె చేతులో పుచ్చుకొని వెనకవైపు మెట్లమీదినుంచి
కిందికిదిగింది. ఆమెదాసీది రెండుమూటలతో ఆమెను
వెంబడించింది. తోటలోకి వచ్చినారు. మంచు దట్ట
ముగా పడడము ఏమీ తగ్గలేదు. సాహసము చేస్తున్న
ఆకుర్రదాన్ని ఆపివేసేట్టుగా గాలివీస్తూవుంది. అతికష్టము
మీద తోటచివరకు వచ్చినారు. ఆ మంచుకు గుఱ్ఱాలు
సగము గడ్డకట్టుకొనిపోతూ నిశ్చలముగా నిలువలేకుం
డావున్నవి. అవి కదలకుండా మెదలకుండా వుండడా
నికి అదలిస్తూ వ్లాడిమర్ పంపిన బండివాడు అటూ
ఇటూ పచారుచేస్తూవున్నాడు. వాడు ఆయువతినీ,
దాసీదాన్నీ యెక్కించి మూటలూ పెట్టె బండిలో పడ
వేసి పగ్గాలు వదిలినాడు. గుఱ్ఱాలు రంయ్యమని పరుగెత్త
సాగినవి.

* * * * *

ఆరోజంతా స్వారిచేయడముతోనే వ్లాడిమర్ కు
సరిపోయింది. ఉదయము జాడ్రినో గ్రామములో పురో
హితుడి దర్శనముచేసి అతికష్టముమీద ఆయన్ను
ఒప్పించి ఆ చుట్టుప్రక్కల భూస్వాములెవరయినా
సాక్షి సంతకాలకు దొరుకుతారేమోనని బయలుదేరి
నాడు. డ్రావిన్ అనే పెన్షన్ పుచ్చుకొన్న నలభై
యేళ్ల సర్కారు ఉద్యోగస్థుణ్ణి వ్లాడిమర్ మొట్టమొదట
పోయి కనుకొన్నాడు. అందుకు అతడత్యంతసంతో
షముతో అంగీకరించినాడు. తనచిన్ననాటి కాముక
వ్యాపారాలన్నీ అతనికి స్మరణకువచ్చి ఎంతో ఖులా
సాతో వ్లాడిమరును అక్కడనే ఆమధ్యాహ్నము విం
దారగించమని బలవంతము చేసినాడు. మిగతా యిద్దరు
సాక్షులను సంపాదించడము అట్టే కష్టమయిన పని
కాదనికూడా ధైర్యము చెప్పినాడు. భోజనముచేసి
ఆయనతో బయలుదేరి ఒకసర్వేయరునూ, ఒకపోలీసు
వుద్యోగస్థుడి కుమారుణ్ణీ వ్లాడిమర్ సాక్షి సంతకాలు
చేయడానికి కుదుర్చుకొన్నాడు. సాక్షులుగా వుండ
డమే కాకుండా వ్లాడిమరుకు సాయపడడములో

ప్రాణాలు సయితము అర్పిస్తామని వాళ్లు వాగ్దానము చేసినారు. మహదానందముతో వ్లాడిమరు వాళ్లను కౌగలించుకొన్నాడు. ఇకసమస్తమూ సిద్ధము చేసుకోడానికి అతను యింటికి బయలుదేరినాడు.

చీకటి పడింది. నమ్మకస్థుడయిన బండివాడితో అవసరమయిన విషయాలన్నీ వివరముగాచెప్పి నెనర్డ్రో వాగ్రామము పంపించినాడు. ఒంటిగుర్రపుబండిలో బండివాడు లేకుండా వ్లాడిమర్ ఒంటరిగా బయలుదేరినాడు. మేరియా జాడ్రినో చేరడానికి రెండుగంటల సేపు పడుతుంది. అతనికి ఆదారి బాగా తెలుసును. మహా అయితే మొత్తముమీద యిరవైనిమిషములలో అతనక్కడకు చేరవచ్చును.

వ్లాడిమర్ బయలుదేరి బయటికి వచ్చినాడో లేదో గాలి జోరుగారేగింది. మంచుతుపాను దట్టమయి పోయింది. ఏమీ కనిపించడము లేదు. ఒక్కనిమిషములో రోడ్డు కనబడకుండా పోయింది. భూమ్యాకాశాలకు భేదము తెలియకుండా అంతా గల్లంతు గావుంది. వ్లాడిమర్ ఒకచేనికి అడ్డంపడ్డాడు. రోడ్డు ఎక్కడ వుందో తెలుసుకోడానికి నానాతిప్పలూ పడుతున్నాడు. గుర్రము దానిచిత్తము వచ్చినట్లు పోతూవుంది. మంచువల్ల నేల యెక్కడో తెలియక ఒకప్పుడు కాళ్లు యెత్తుతూనూ, మరొకప్పుడు ఫుటేగుంటలలోకి దింపుతూనూ బండిని యెత్తెత్తి పడవేస్తూవుంది. దారితెలుసుకోడానికి వ్లాడిమర్ విశ్వప్రయత్నము చేసినాడు. అప్పటికి బయలుదేరి ఒకఅరగంట అయివుంటుందనుకొన్నాడు. కాని జాడ్రినోగ్రామపు చెట్లూ చేమా కనిపించలేదు. ఇంకొక పదినిమిషాలు అయింది. ఏమీ కనబడడము లేదు. గుంటలూ గింటలూ బాగావున్న ఒకచేలోనుంచి బండి పోతూవుంది. మంచుకురవడము కాస్త అయినా తగ్గలేదు. ఆకాశము నిర్మలముగాలేదు. గుర్రము అలిసిపోయింది. దానిమీదనుంచి వర్షములాగా చెమటలు కారుతున్నవి. అతను మంచులో కూరుకుపోతున్నాడు.

తప్పుదారినపడ్డట్లు వ్లాడిమర్‌కు చివరకుతోచింది. ఆగిపోయినాడు. ఆలోచించడము మొదలుపెట్టినాడు. జ్ఞాపకముతెచ్చుకోడానికి ప్రయత్నము చేసినాడు. కుడిచేతివైపు వెళ్లివుండవలసిందని తోచింది. వెంటనే కుడివైపు మళ్లినాడు. గుర్రము, ఒక్క అడుగయినా వేయలేకుండావుంది. అతను బయలుదేరి అప్పటికి గంట పయిచిల్లు అయివుంటుంది. జాడ్రినో యింకా యెంతోదూరాన వుండడానికి వీలులేదు. ఎంతదూరము పోయినా అపొలానికి అంతూ పంతూ లేకుండావుంది. మంచుకూ ఫుటేగుంటలకూ లోపము మాత్రము లేదు. సమయము మించిపోతూవుంది. వ్లాడిమర్‌కు వ్రత్తిపోతూవుంది.

చిట్టచివరకు దూరాన నల్లగా ఏదో కనిపించింది. వ్లాడిమర్ ఆవైపుకు పోసాగినాడు. సమీపించేసరికి అదొక చిట్టడివి. "అమ్మయ్యా! అట్టే దూరములేదు" అనుకొన్నాడు. జాడ్రినో ఒక చిట్టడివి పక్కనేవుంది. ఆ అడవిపక్కనుంచే బండిని వ్లాడిమర్ పోనిచ్చినాడు. పక్కనే రహదారి వుంది. త్వరలోనే రస్తా కనిపించింది. గాలి కాస్తతగ్గింది. రోడ్డు నున్నగావుంది. గుర్రానికి బలము వచ్చింది. వ్లాడిమర్‌కు నమ్మకంకలిగింది.

ఎంతోదూరము పోయినాడు. కాని జాడ్రినో గ్రామము కనిపించనేలేదు. అడివి అంతులేకుండా వుంది. ఏదో ఎరగని అడివిలోవున్నట్లు వ్లాడిమర్‌కు తోచింది. అతనికి భయమువేసింది. నిరాశచెందినాడు. గుర్రాన్ని కొరడాతో చరిచినాడు. గత్యంతరములేక అది తరటుపోవడము మొదలుపెట్టింది. అయితే అతి త్వరలోనే దానివేగముతగ్గింది ఒకపావుగంటఅయ్యేసరికి కాలుతీసి కాలుపెట్టే శక్తికూడా దానికి లేకుండా పోయింది. వ్లాడిమర్ బాదినాడు. కాని ప్రయోజనము లేకపోయింది.

మెల్లిగా చెట్లన్నీ దాటినాడు. ఆ అడవిలోనుంచి బయటపడ్డాడు. కాని జాడ్రినో కనిచూపుమేరలో ఎక్కడా కనిపించలేదు. అప్పుడు అర్ధరాత్రయివుంటుందనుకొన్నాడు. అతనికళ్లవెంట నీళ్లు వుబుకుతున్నవి. మంచు కురవడము వెలిసింది. మబ్బులన్నీ విడిపడ్డవి. చదునుగా తివాచీ పరచినట్టుగా తెల్లటి మయిదానము అతనికి మొదట కనిపించింది. చీకటి కాస్తవిచ్చింది.

సమీపములోనే నాల్గయిదుకొంపలున్న కుగ్రామము కనిపిస్తూవుంది. వ్లాడిమర్ అటుదారి పట్టించినాడు. మొట్టమొదటి గుడిసెదగ్గరనే బండిమీదనుంది దూకి అతను తలుపు దబదబ బాదినాడు. వెంటనే తలుపుతెరచుకొని తెల్లటిగడ్డముతో ఒక ముసలివాడుబయటికివచ్చి

"ఏంకావలెను తమకు ?" అన్నాడు.

"జాద్రినో యిక్కడికి చాలాదూరమా?"

"అవునవును !"

"చాలాదూరమా?"

"మరీదూరంకాదు. పదికోసులుంటుంది." ఈ జవాబుకు వ్లాడిమర్ తలగోకుకొన్నాడు. నిశ్చేష్టితుడయిపోయినాడు.

"ఎక్కడనుంచి వస్తున్నారు ?" అని ప్రశ్నించినాడు ముసలివాడు.

జవాబుచెప్పడానికి వ్లాడిమర్‌కు ధైర్యము చాలలేదు.

"ఇదుగో తా - తా ! జాద్రినో పోవడానికి గుర్రాన్ని కుదిర్చిపెడతావూ?" అన్నాడు.

"గుర్రాలులాంటి జంతువులు మా కెక్కడున్నవి బాబూ" అన్నాడా ముసలివాడు.

"పోనీ దారిమాపించేటందుకు ఎవడయినా దొరుకుతాడా - ఎంతకావలెనంటే అంతాయిస్తాను."

"ఉండండి. నా పిల్లవాణ్ణి పంపుతాను," అంటూ ముసలివాడు లోపలికిపోయి తలుపు వేసుకొన్నాడు.

వ్లాడిమర్ అక్కడే నిలుచున్నాడు. ఒక నిమిషమయినా కాలేదు - తలుపుకొట్టడము మొదలు పెట్టినాడు. మళ్లీ ముసలివాడు తలుపుతెరిచి "ఏమిటిస్వామీ" అన్నాడు.

"ఏదీ నీపిల్లవాడు ?"

"ఇప్పుడే వస్తాడు. కాలికి జోడు వేసుకొంటున్నాడు - చలి వేస్తున్నదా ఏం? లోపలికి దయచేసి కాచుకోండి".

"సంతోషించాను, నీ కుమారుణ్ణి తక్షణం పంపించు"

తలుపు కిర్రుమన్నది. ఒక దుడ్డుకర్రతో కుర్రవాడు బయటికివచ్చి రస్తానుచూపిస్తూ మంచువల్ల రస్తా కనబడనిచోట వెతుకుతూ ముందు నడవసాగినాడు.

"ఎంత పొద్దుపోయి వుంటుంది?" అని వ్లాడిమర్ వాణ్ణి ప్రశ్నించినాడు.

"కాస్సేపటిలో తెల్లవారుతుంది" అన్నాడా కుర్రవాడు. వ్లాడిమర్ యింకొక్కమాట మాట్లాడలేదు.

కోళ్లు కూస్తున్నవి. వాళ్లు జాద్రినోగ్రామము చేరేసరికి తెల్లవారిపోయింది. చర్చితలుపులు మూసివేసి వున్నవి. కుర్రవాడికి వెంటనే వ్లాడిమర్ డబ్బులుయిచ్చి పంపించివేసి పురోహితుడి ఆవరణలోకి పోయినాడు. అతను పంపించినబండి కనిపించలేదు. "ఏమయివుంటుంది..."

* * * *

నెనర్డోవాలో......

ఉదయమే ముసలివాళ్లిద్దరూ నిద్రలేచినారు. కూతురు ఆ రాత్రి ఎట్లాగడిపిందో కనుక్కోనిరమ్మని నౌఖరును మేడమీదికి పంపినారు. ఆ రాత్రి అంతా సరిగా నిద్రపట్టనట్టూ, అప్పుడే కొంచెము ఖులాసాగా వున్నట్టూ, కిందికిదిగి ఆమె వస్తూవున్నట్టూ నౌఖరువచ్చి చెప్పినాడు. ఇంతలో మేరియా అక్కడికివచ్చి తల్లిదండ్రులకు వందన మాచరించింది.

"తలనొప్పి యెట్లా వున్నది" అని గావ్రిల్ అడిగినాడు.

"కొంచెము నింపాదిగానే ఉంది" అన్నది మేరియా.

"నిన్న బహుశః బొగ్గుపొగ పీల్చివుంటావు." అన్నది ప్రాస్కోవియా.

"అంతే అయి వుండవలెను...అమ్మా!"

ఆరోజు పగలు హాయిగానే వెళ్లిపోయింది. అర్ధరాత్రే ఆమెకు జబ్బుచేసింది. అక్కడికి దగ్గరపట్టణములో వున్న డాక్టరుకు కబురువెళ్లింది. ఆయన ఆ సాయంత్రానికి వచ్చినాడు. అప్పటికే జ్వరము సంధించింది. కొండల పెట్లుగా జ్వరమువుంది. రెండువారాలు పాపము ఆమెకు వచ్చేప్రాణము పోయేప్రాణముగా వుంది.

ఆమె లేచిపోవడము యింట్లో యెవరికీ తెలియదు. ఆమె వ్రాసినవుత్తరాలు తగలబెట్టివేసింది. యజమానురాలి మీదవున్న శ్రద్ధాభక్తులవల్ల దాసీది ఎవరితోనూ ఆ సంగతి చెప్పలేదు. పురోహితుడు మొదలయినవారంతా యోగ్యాయుక్తజ్ఞానము కలవాళ్లు. అందువల్ల వాళ్లు అసందర్భముగా ప్రవర్తించలేదు. బండివాడు సయితము తాగివున్నప్పుడయినా యీసంగతి ఎక్కడా అనలేదు. ఇంతమంది దొంగలూ యీ రహస్యాన్ని బయటికి పొక్కకుండా కాపాడినారు.

అయితే సన్నిపాతములో మేరియారే ఆ విషయాలన్నీ వాగివేసింది. కాని ఆమాటలు ఒకదానికొకటి సందర్భములేకుండా పోయినవి. ఆమెమంచాన్ని వదలకుండా తల్లి వుంటూవుంది. అందువల్ల కూతురు వ్లాడిమర్‌ను గాఢంగా ప్రేమించిందని మాత్రము ఆమాటలవల్ల అనుకొంది. అందునుంచే యీజబ్బుకూడా చేసిందని ఆమె వూహించింది. ఈ విషయాన్నిగురించి పెనిమిటినీ యిరుగు పొరుగువాళ్లనూ ఆలోచించింది. ఫలానావాడు పెనిమిటే అని వ్రాసిపెట్టివుంటే తప్పదనీ, దారిద్ర్యము ఒకపెద్దదోషముకాదనీ, ఎవరయినా మనిషిని పెళ్లిచేసుకొంటారు కాని డబ్బును చేసుకోరనీ — యింకా యిట్లాంటి వృద్ధవాక్యాలన్నీ అందరికీ స్ఫురణకు వచ్చినవి. సామెతలూ వృద్ధవాక్యాలూ యిట్లాంటి సందర్భాలలో సరిపెట్టుకోడానికి మహాద్భుతముగా వుపయోగపడతవి. చివరకు వ్లాడిమర్‌కు ఆమెను యివ్వడమే మంచిదని అంతా అభిప్రాయపడ్డారు.

ఇంతలో మేరియాకు కొంత స్వస్థత చిక్కడము మొదలుపెట్టింది. వ్లాడిమర్ గావ్రిల్ యింట్లో కాలుపెట్టి చాలాకాలమయింది. అక్కడకువెళితే పూర్వము మాదిరిగానే చూస్తారేమోనని అతనిభయము. మేరియా వ్లాడిమర్‌ను పెళ్లిచేసుకోడానికి తలిదండ్రులు అంగీకరించినట్టు శుభవర్తమానం వెళ్లింది. అందుకు అతను పిచ్చపిచ్చ గాజవాబువ్రాసినాడు. పయిగా వాళ్లయింట్లో యెన్నటికీ కాలు అయినా పెట్టదలచుకోనట్టూ తనకు మరణమే లక్ష్యము అయినట్టూ తెలియజేసినాడు. ఆ జవాబుకు వాళ్లు నిర్ఘాంతపోయినారు. కొద్దికాలానికే అతను పటాలములో చేరినట్టు కూడా వాళ్లు విన్నారు.

మేరియా ఆరోగ్యము కోలుకొంటూ వుంది. ఈ సంగతి ఆమెకు వారు చెప్పడానికి భయపడిపోయినారు. తర్వాత ఆమె వ్లాడిమర్ పేరయినా తలచుకోలేదు. కొన్ని మాసాలయినతర్వాత బోర్డినో యుద్ధములో అపాయకరమయిన దెబ్బలు తగిలినవారి పట్టీలో అతని పేరుకూడా కనిపించేసరికి మేరియా మూర్ఛపోయింది. మళ్లీ ఆమెకు సన్నిపాతజ్వరము వస్తుందేమోనని వాళ్లు భయపడ్డారు. అయితే దైవవశాత్తు ఏ యిబ్బందీ రాలేదు.

ఇంకొక కష్టము మాత్రము ఆమెకు ప్రాప్తించింది. గావ్రిల్ చనిపోయినాడు. అయితేఆయన యావదాస్తికీ మేరియాను వారసురాలుగా చేసిపోయినాడు. ఆస్తివచ్చిందన్నమాటే కాని ఆమె దుఃఖానికి మాత్రము మేర లేకుండాపోయింది. తల్లిని ఆమె వదలిపెట్టకుండా వుండదలచుకొన్నది. అనేకదుఃఖస్మారకమయిన నెనర్డోవానుంచి వారుభయులూ లేచిపోయి మరొకచోట నివాసము యేర్పాటుచేసుకొన్నారు.

యువతి - అందులో ఐశ్వర్యవతి- ఆమెనుచేపట్టవలెననే వుద్దేశముతో అనేకమంది యువకులామె చుట్టూ మూగసాగినారు. అయితే ఆమె వాళ్లనెవళ్లనూ ఆశపెట్టలేదు. ఎవళ్లనయినా ఒకళ్లను యెన్నుకోమని తల్లి అప్పుడప్పుడు చెపుతూవచ్చింది. ఆమె చెప్పినప్పుడల్లా కాదని తలత్రిప్పి ఏదో తీవ్రమయిన ఆలోచన చేయసాగేది ...... వ్లాడిమర్ యుద్ధములో చనిపోయినాడు. అతిపవిత్రముగా అతన్ని ఆమె స్మరించసాగింది.

ఆమె స్మృతిపథములోనుంచి అతను పోకుండా వుండడానికోసము అతను చదివిన పుస్తకాలూ, అతని పటాలూ, ఆమెకోసము అనేకఅర్థాలతో వ్రాసిపెట్టిన పద్యాల పుస్తకాలూ - చివరకు దొరికిన చిల్లర మల్లర వస్తువులన్నీ సంపాదించి ఆవస్తువులన్నింటినీ పెన్నిధిలాగా చూడడము మొదలు పెట్టింది. ఈవిషయమంతా చుట్టుపక్కలవాళ్లు తెలుసుకొన్నారు. ఆమె అచంచల ప్రేమకు వాళ్లంతా ఆశ్చర్యపోయినారు. అయితే చివరకు ఆ దుఃఖపూరిత హృదయాన్ని ఏయువకుడు సంతోషపెట్టగలడోనని అందరూ వ్యగ్రభావముతో కనిపెట్టసాగినారు.

ఇంతలో రష్యనులు యుద్ధములో జయించినారు. దేశాంతరమునుంచి పటాలములు వస్తూన్నవి. వారికి స్వాగతములు చెప్పడానికి జనులంతా బయలుదేరినారు. జయకీర్తనలతో శాంతువాయిద్యాలు దిక్కులు పిక్కటిల్లిపోతూ వున్నవి. కుర్ర కుర్రవాళ్లుగా యుద్ధానికి పోయినవాళ్లంతా పెద్ద పెద్ద యోధాగ్రేసరులయిపోయి వక్షఃస్థలాల జయచిహ్నాలుధరించి పాటలు పాడుతూ మధ్యమధ్య ఫ్రెంచి-జర్మన్ భాషలు మాట్లాడుతూ వచ్చినారు. ఆరోజులు మరిచిపోవడానికి వీలులేనివి. దేశానికి వచ్చినజయమూ - ఉత్సాహమూ - యింతింత కాదు. "పితృభూమి" అనేసరికి అందరికీ ఆనంద బాష్పములు రాలసాగినవి.

స్త్రీలు-రష్యన్ స్త్రీలు- నిరుపమానమయిన రాజభక్తితో దేశభక్తితో జయ - నముచేసినారు.

—ఉంటూవున్న మేరియాకు ముఖ్యపట్టణాలలో యెంతవుత్సాహముతో యెంతసంతోషముతో ఆసమయములో వుత్సవములు జరుగుతున్నది తెలియదు. అయితే పల్లెలలోకూడా యెక్కువవుత్సాహముతో వుత్సవములుచేస్తున్నారు. ఆ సమయములో ఏ యోధుడాప్రాంతాలలో కనిపించినా వాడికి జరిగేమర్యాద యింత అంత అని చెప్పనలవికాదు. ఎన్నో యెందుకు? అటువంటివాణ్ణి చూసి ప్రతికాముకుడూ తనకు ప్రతిస్పర్థి అనుకోసాగినాడు.

మేరియా యెంత వుదాసీనముగావున్నా ఆమె చుట్టూ యిదివరకే కాముకులు తిరుగుతూవున్నారు. యుద్ధములో గాయపడివచ్చిన కలనల్ బోర్మిక్ అనే ఆయన ఆమెకోసము తయారయ్యేసరికి అందరూ వెనకకు తప్పుకోవలసివచ్చింది. అతనికి యిరవై ఆరుసంవత్సరాల వయస్సు వుంటుంది. కొలువులోనుంచి సెలవు తీసుకొని భూమీ పుట్రా చూసుకోడానికి వచ్చినాడు. అతని యెస్టేటు మేరియాదానిపక్కనేవుంది. మేరియా అతన్ని ప్రత్యేకాదరముతో చూడసాగింది. ఆమె కలవాటయిపోయిన పరధ్యాన మంతా అతనిసాన్నిధ్యములో పటాపంచలయిపోయేది. అయితే అతన్ని రంజు చేయడము మొదలుపెట్టిందని మాత్రము చెప్పడానికి వీలులేదు.

నిజంగా బోర్మిక్ చాలా అందమయినవాడు, స్త్రీలకు వ్యామోహపెట్టేలక్షణాలన్నీ అతనికున్నవి. కోచాలు కోయకుండా ఎంతవరకు మాట్లాడవలెనో - ఎంతవరకు ఛలోక్తులు వేయవలెనో - ఏసమయములో ఎట్లాప్రవర్తించవలెనో అతనికి బాగాతెలుసును. అతను మేరియాతో అతిమామూలుగానూ, నిష్కర్షగానూ వుంటూవున్నాడు. కానిఆమె ఏమిచేస్తూవున్నా - ఏమి మాట్లాడుతూవున్నా అతనికండ్లన్నీ ఆమెమీదనేవుండేవి. వినయముతోనూ మంచిచిత్తస్థయిర్యముతోనూ ప్రవర్తించినాడు. ఒకప్పుడు అతితిరుగుబోతుఅనేపేరు అతను సంపాదించినాడని మేరియాకు తెలుసును. అయితే అందు కతనిమీద ఆమెకు దురభిప్రాయము కలగలేదు, అంతఃయువతులలాగా ఆమె ఆదోషాన్ని మన్నించడమేకాకుండా అతని వుత్సాహసాహసాలకు మెచ్చుకొన్నది.

అయితే అన్నిటికన్నా ముఖ్యముగా— అతని చక్కనిప్రవర్తనకన్నా అతను చేసేమనోహర సంభాషణకన్నా అతని గాంభీర్యముకన్నా అతని నిశ్చలత ఆమెభావప్రపంచములో కుతూహలాన్ని రేకెత్తించింది. అతడుతన్నురంజింపజేయగలిగినాడని ఆమె ఒప్పుకొనక తప్పనిసరిఅయింది. బహుశః అతనుకూడా ఆమెయితరులను భావించినట్లుగా తన్ను భావించడములేదని అను

భవమువల్ల గమనించేవుంటాడు. అయితే అతి నెందువల్ల ఆమెపాదములమీద వాలలేదు? ఎందువల్ల అతని కంత నిగ్రహముకలిగింది? అదంతా ప్రేమలక్షణమయిన భీడియమా? – అనుభవజ్ఞుడయిన కాముకుడు అవలంబించేయుక్తా?- అదంతా ఆమెకుతీరనిసమస్య అయింది. చాలాదూరము ఆమె ఆలోచించింది. దానికంతా కారణము భీడియమేనని నిశ్చయించింది. ఇంకా అతన్ని ఆదరించి ధైర్యము పురికొల్పడానికి ఆమె తీర్మానించుకొంది. అనుకూలపరిస్థితులు ఏర్పడేట్లయితే ఆమె హృదయాన్ని అర్పింపదలచుకొంది. అనుకోకుండానే యీ అద్భుతఘటన కామె తయారయింది. వ్యగ్రభావముతో రసాతిరేకసమయాన్ని ఎదురుచూడసాగింది. ఎటువంటి రహస్యమయినాసరే హృదయము భరించలేదు. అది బయటపడితీరుతుంది. ఆమెరొమ్ము పొంగింది. చివరకు బోర్మిక్‌కు భావోద్రేకము కలిగింది. ఆమె దర్శనానికి అతనినల్లటికళ్లు దివ్యకాంతులను వెదజల్లసాగినవి. ఇంక ఆవుభయులకూ అతి శీఘ్రకాలములో నిశ్చయమయ్యేట్టుగాతోచింది. ఆదివరకే నిశ్చయమయిపోయినట్టుగా వారి వివాహాన్నిగురించి యిరుగుపొరుగువా రంతా ముచ్చటించ సాగినారు. చిట్టచివరకు కూతురికి తగినవాడు దొరికినందుకు ప్రాస్కోవియా యెంతో సంతోషించింది.

ఒకనాడు చీట్లపేకతో ఆముసలిఆమె ఖులాసాగా కాలక్షేపముచేస్తూ తనగదిలో కూచునివుంది. బోర్మిక్ అక్కడకువచ్చి 'మేరియాయెక్కడవున్నదని' ప్రశ్నించినాడు.

"ఆతోటలోవుంది." అంటూ ఆముసలామె "నీవు అక్కడికివెళ్లు బాబూ,... నీవు మళ్లీ వచ్చేదాకా నేను యిక్కడనే కనిపెట్టుకొనివుంటాను" అన్నది.

బోర్మిక్ వెళ్లినాడు. అది ఆమెశుభసూచకముగా యెంచుకొని "బహుశః యీ వ్యవహారం యీనాడు నిశ్చయమయిపోతుంది!" అని నిశ్చయించింది.

బోర్మిక్ మేరియాను కలుసుకొన్నాడు.

ఆమె అక్కడ కొలనుదగ్గిర తురాయిచెట్టుకింద— శృంగారకావ్యము చేతులోపట్టుకొని ధౌతవస్త్రముతో —అవతరించిన శృంగారరసమూర్తిలాగా తోచింది. కుశల ప్రశ్నలయిపోయి ఒకటి రెండు మాటలు మాట్లాడిన తరువాత మేరియా కావలెననే సంభాషణ కట్టిపెట్టింది. అందుకు ఉభయులూ కొంచెమునిర్విణ్ణులయినారు. బోర్మిక్ అస్థితికి యమయాతన పడ్డాడు. ఖండితంగా తననిశ్చయాన్ని అతడు తెలుపదలచుకొన్నాడు. ఎంతోకాలంనుంచీ తనమనోగతాన్ని వెలిబుచ్చడానికి అవకాశముదిక్కలేదనీ — కాస్తచెవి యొగ్గమనీ ఆమెను ప్రార్థించినాడు. మేరియా సరేనన్నట్టుగా పుస్తకాన్నిమూసివేసి నేలవంక చూడసాగింది.

"నేను నిన్ను ప్రేమించాను......" అన్నాడు బోర్మిక్.

మేరియా సిగ్గుపడింది. తల వంచుకొన్నది.

"ప్రతిరోజూ నీదర్శనముచేసీ-నీమధురవాక్కులు వినీ అవ్యక్తానందాన్ని పొందుతూ వున్నాను....ఇప్పుడిక నిగ్రహించలేకుండావున్నాను. నిరుపమాన నీమధుర మూర్తిని ఎంతసేపని ధ్యానిస్తూకూర్చునేది? ఇకముందు యీధ్యానము నా జీవితాన్ని వ్యథపెట్టకతప్పదు. కాని నావిధ్యుక్తాన్ని నేనూ నిర్వహించక తప్పదుకదా... మన యిద్దరమూ భరించ శక్యముగాని భయంకర రహస్యము - మనయిద్దరి మధ్యవున్న అడ్డంకి-చెబుతాను"

"మనయిద్దరిమధ్యా యెప్పుడూ అడ్డంకి వుండనే వుంది," అని మేరియా మళ్లీ "నేను మీగృహిణిని కాజాలనేమో!" అన్నది.

"నాకు తెలుసును." అతిజాగ్రత్తతో, "ఒకప్పుడొకరిని ప్రేమించినావు. అయితే అతని వియోగదుఃఖము అనుభవించినావు......ఓదయామయీ, మేరియా, హృదయశాంతిని భగ్నముచేయకు. నన్ను నీవు సుఖపెడతావనే భావము........."

'వద్దు మాట్లాడకండి. మీపుణ్యమాయిరి. నన్ను బాధపెట్టకండి'

'అవును నాకు తెలుసును...నీవే నాదానివయితే ఎంతబాగుంటుంది. ఈభూభాగములో నేను పరమదురదృష్టవంతుణ్ణి...నా కిదివరకే వివాహమయింది.'

మేరియా నిర్ఘాంతపోయింది. ఆతనివంక తదేకముగా చూడ సాగింది.

'నాల్గుసంవత్సరాల నాడు నాకు వివాహ మయింది. అయితే ఆనాభార్యయెవరో — ఎక్కడవుందో నాకు తెలియదు. తిరిగీ ఆమెను చూడగలనసే ఆశఅయినా లేదు.'

'ఏమిటి అంటున్నారు: ఎంత విపరీతము!... చెప్పండి... నేను ... తర్వాత చెబుతాను. మీకథ చెప్పరూ...'

'ఆరోజులలో విల్నా గ్రామములో మాపటాలమువారు మకాము వేసినారు. నేను అక్కడికి బయలుదేరి వెళుతున్నాను. వెనక మకాముకు ఒక సాయంత్రము చాలాఆలస్యముగా చేరినాను. అందువల్ల త్వరగా వెళ్లవలెనని గుర్రాలను తెప్పించినాను. నేను బయలుదేరేసరికి మంచుతుపాను లంకించుకొంది. తుపాను వెలిసేవరకూ బయలుదేరవద్దని బండివాడూ యింకా యితరులూ సలహానిచ్చినారు. కాని నాకు మనసు స్తిమితముగా లేకుండా వుంది. ఏదో శక్తి నన్ను ముందుకు పొమ్మని తోస్తూ వున్నట్లుగా వుంది ఎంతసేపటికీ ఆమంచుకురవడము తగ్గలేదు. ఇకనక్కడ నేను ఒక్కక్షణము నిలవలేక పోయినాను. ఆమంచుతుపానులోనే గుర్రాలను కట్టించి బయలుదేరినాను. మూడుకోసులదూరము కలసివస్తుందని ఏటిఅంచునే బండివాడు గుర్రాలను పోనిస్తున్నాడు. మంచుమనుంచి ఏటిగట్టు కనబడకుండావుంది. బండిని రోడ్డు పట్టించవలసిన చోటు దాటి పోయినాము. దారీ డొంకా తెలియని చోటికి చేరినాము. మంచు యింకాతగ్గనేలేదు. దూరముగా ఒకదీపము కనబడుతూ వుంది. బండివాడితో ఆవైపుపోలమని చెప్పినాను. ఒక గ్రామము చేరినాము. అక్కడ చర్చిలో దీపము వెలుగుతూవుంది. చర్చితలుపులు తెరిచివున్నవి. బయట బండ్లు నిలిచివున్నవి, మనుష్యులు అటూయిటూ తిరుగుతున్నారు.

"ఈవైపు... ఈవైపు!" అని అందరూ అరచినారు.

బండివాణ్ణి ఆపే తోలమన్నాను.

"అమ్మయ్యా - భగవంతుడా! - ఎక్కడతిరుగుతున్నావు బాబూ" అని ఎవరోనన్ను అడిగినారు. "పెళ్లికూతురు సొమ్మసిల్లిపోయింది. పురోహితుడికేమి చేయడానికీ తోచడములేదు మేమంతా వెళ్లిపోదామనుకుంటున్నాము. రా- త్వరగా రా" అన్నారు.

ఒక్కమాటయినా అనకుండా బండిదిగి చర్చిలోకి పోయినాను. రెండు మూడు దీపాలు మిణుకు మిణుకు మంటూ వున్నవి. ఆచర్చిలో ఒకమూల చీకట్లో బల్లమీద ఒకయువతి కూర్చునివుంది. ఇంకొక కుర్రది ఆమె కణతలను పిసుకుతూవుంది.

"బ్రతుకు జీవుడా!" అంటూ ఆ రెండోఆమె "ఇంతకూ వచ్చారూ. మాఅమ్మాయిని చంపివేసినారు," అన్నది.

వృద్ధపురోహితుడు నన్ను సమీపించి "ఆరంభించమన్నానా" అన్నాడు.

"ఆరంభించండి బాబూ" అన్నాను పరధ్యానముగా నేను.

ఆయువతిని నిలువోబెట్టినారు. ఆమె అందముగానే కనిపించింది ...... వేదికముందుకు ఆమె సరసను నిలుచుండడానికి అర్థములేనటువంటిన్ని-క్షమించడానికి వీలులేనటువంటిన్నీ అనాలోచన నన్ను నెట్టింది పురోహితుడు త్వరత్వరగాముగించినాడు. ముగ్గురుపురుషులూ దానిదీ ఆమోదించినారు. మాకు వివాహమయిపోయింది.

"ఉభయులూ ముద్దుపెట్టుకోండి" అన్నారొకరు.

నా భార్య వివర్ణమయిన తనముఖాన్ని నావైపు తిప్పింది. నేను ముద్దుపెట్టుకోబోయినాను. ఇంతలో "ఓ్ ఆయనకాదు! ఆయనకాదు!" అంటూ స్మృతి తప్పి ఆమె పడిపోయింది.

సాక్షులు నావంక గాభరాతో చూసినారు. ఏమీ రగడలేకుండా వెనకకు తిరిగి చర్చిలోనుంచి తక్షణం బయటికివచ్చి బండియెక్కి పోనీయమన్నాను.

"అరెరె అయితే పాపం ! మీపెళ్లాము ఏమయి పోయిందో మీకు తెలియదూ?" అన్నది మేరియా.

"నాకేమీ తెలియదు. నాకుపెళ్లి అయిన వూరు పేరుగానీ-నేను ఏమకామునుంచి బయలుదేరినానో దాని పేరుగానీ నాకు తెలియదు. అప్పుడు-ఆసమయములో ఆఅపచారాన్ని మనస్సుకు అంతగా పట్టించుకోలేదు. చర్చినుంచి రాగానే నిద్రపట్టింది కూడాను. మర్నాడు ఉదయము మకాముచేరేవరకూ నిద్రమెలకువ రానే లేదు. అప్పటిలో నాదగ్గిరవున్న నౌఖరు యుద్ధములో చనిపోయినాడు. అందువల్ల ఆయువతి-నేనంత నిర్లక్ష్యముగా క్రూరవిలాసముతో పెళ్లిచేసుకొన్న ఆయువతి ఎవరో తెలుసుకొనే ఆశ అయినాలేదు. ఆనాడు నేను అట్లాప్రవర్తించినందుకు ఆ యువతి యీనాడు నామీద కసి తీర్చుకొంటున్నది.

"అబ్బ" అంటూ మేరియా అతనిచేయిపట్టుకొని "మీరా-మీరా! అయితే నన్ను గుర్తుపట్టలేరూ?" అంది.

బోర్మిక్ నివ్వెరపోయినాడు....ఆమెపాదముల ముందు అతను మోకరిల్లి నాడు.



తెగ మేఘము D. A. R.

# టాకీలదశ — నేడు: రేపు

యు. జగన్నాథరావు

టాకీలు రాకముందు, మాట్లాడని ఫిల్ములే మన వారంతా విరగబడి చూస్తూవుండేటప్పుడు, ఎవరైనా మాట్లాడేఫిల్ములుకూడా వస్తాయని అంటే జనసామాన్యం ఆవ్యక్తిని ఏ పిచ్చివాడికిందో, భావకవికిందో జమకట్టు కొని ఉండేవారు. ఆరోజుల్లోనేకాక ఈరోజుల్లోకూడా సినీమాఅనేది కేవలం కలియుగ విపరీతాల్లో ఒకటనీ, ఆపరిశ్రమకి అభివృద్ధికాని, ఆదర్శముకాని, భావికాలములో బ్రతికివుండడానికి తావుకాని లేదనీ అభిప్రాయముగలవాళ్లు చాలామంది ఉన్నారు. ఎప్పుడో ఒకరోజున కుక్కగొడుగుల్లాగో (ప్రస్తుతపు టాకీలు తీసే కంపెనీలవలె), నబ్బుబుడగల్లాగో, ఏదూరదృశ్యమో, లేకపోతే మన మింకా పేరైనా విననిది ఇంకేదైనానో వచ్చేస్తే తెల్లవారేటప్పటికి మళ్లా మంచినీళ్ళడగకుండా పరిశ్రమంతా చచ్చిపడి ఉంటుందని వారి అభిప్రాయం. అయితే ఈ అభిప్రాయాలు కలగడానికి కారణం లేకపోలేదు.

మాట్లాడని ఫిల్ములు మంచిరద్దీగా రక్తికట్టే రోజుల్లో-అమెరికానుంచివచ్చిన ఎడ్డీ పోలో, డగ్లస్ ఫెయిర్‌బాంక్సు ఫిల్ములైనా, ఫాక్సువారి పౌరాణికాలయినా, బొంబాయి, కలకత్తాలనుంచి వచ్చిన సాంఘికాలైనా, ప్రతిరాత్రిములోను, కథచెప్పేవాడి నేర్పువల్ల, అర్థమవడమేకాక చాలావరకు ఆనందదాయకంగాఉండే సమయంలో, టాకీలు వచ్చి వాటిదీపం టూకీగా ఆర్పేశాయి. ఆస్థితి మనదేశంలోకంటె ఏదో రెండుమూడు సంవత్సరములముందరే యూరపులోనూ సంభవించింది. అమెరికానుంచి టాకీ రావడముతోనే మంత్రించినట్లు సినీమాహాలులన్నీ టాకీలుచూపే యంత్రాలు అమర్చుకొన్నాయి అయితే ఇంతత్వరగా, మాట్లాడనిఫిల్ములను తలదన్నివచ్చిన టాకీ సినీమా కంతకు మునుపున్నదానికంటె ఎక్కువప్రాముఖ్యం తీసుకురాలేదు. మొగమాటంలేకుండా చెప్పవలసివస్తే అంతకంటె చాలాతక్కువయింది పరిశ్రమయొక్క అభివృద్ధి —కళోపాసకుల దృష్టిపథములోనయితేనేమి, గల్లాపెట్టి దృష్టిపథములోనయితేనేమి. దానికి దృష్టాంతము: అంతకుముందు సైలెంటుగా (మాట్లాడకుండా) తయారయిన అనార్కలిగాని, లె మిసరబ్లెకాని, కౌంటాఫ్ మాంటిక్రిస్టో కాని, మరియేయితరఫిల్ముగాని టాకీగా తిరిగి తయారైనప్పటికి అదిచూచినవాళ్లు "ఇదీ బాగానే వుందికాని, సైలెంటులో ఇంకాబాగుందోయి" అనడం నేననేకపర్యాయములు విన్నాను; అలాగే నేను కూడా అనుకొన్నాను. దీనికి అనేక కారణాలున్నాయి. యూరపులో మాటలాడనిఫిల్ములు చూపించే ప్రతిహాలులోనూ యథాశక్తిగా ఒక్కొక్క ఆర్కెష్ట్రా (జంత్రవాయిద్యమేళము) ఉండేది. ప్రతీ ఫిల్ముని అనుసరించిఉండేది ఈసంగీతము. చాలా హాలులలో ఈ సంగీతము అమర్చటానికి ప్రస్తుతటాకీలలో మ్యూజిక్ డైరెక్టర్లలాగ మంచినిపుణులు (Experts) ఉండేవారు. మనదేశములో యుద్ధసీనులలో వాయించే తపలా, హార్మోనియముల వాయిద్యం విదేశీయుల ఆ సంగీతంముందర స్మరించడానికి కూడా అర్హత లేదేమో! — ఇక మనదేశంలో చాలా హాలుల్లో కథలు చెప్పేవాళ్లుండేవారు. వీరిలో ఎక్కువమంది ఈవృత్తిలో ప్రత్యేకకృషిచేసి 'నూతు'లై 'బాగుబా' గనిపించుకొని బంగారుమెడల్సు తెచ్చుకొన్న వాళ్లిప్పటికీ ఉన్నారు.

సినీమా ముఖ్యశక్తి ఏదంటే, అది మనోనేత్రంముందర ఎప్పటికీ మరపురాని దృశ్యాలు ముద్రిస్తుంది[1]; హృదయాన్ని చలింపజేసే సీనులు కళ్లముందర కట్టివేస్తుంది. దీనికితోడు యూరపులో యుక్తియుక్తంగా

---

1 "The visual appeal is the more important and the power of speech secondary, so far as the cinema is concerned......" And again "Impression of pictures seen, provided they have been presented as they should be— remain on the mind for indefinite periods, frequently for ever, whereas spoken words are quickly forgotten by most people"— Andrew Buchanan.

అమర్చిన సంగీతమూ, మనదేశంలో సందర్భానుసారంగా సంస్కృతశ్లోకాలనుంచి పరసోక్తులవరకూ సమ్మేళనంచేసి ప్రతీఊరిలోనూ అచ్చటచ్చట వాడుకలోవున్న ఊతపదాలు అతుకుతూ చెప్పేకథా కోదుపడి చాలామట్టుకు ఫిల్ములు మాటాడడము లేదనేలోపము తీర్చివేశాయి. సినీమా చక్షురింద్రియానికి ఎంతక్షణమాత్రంలో పాటుతుందో అలాగే అంతర్బుద్ధికి నాటేట్టుచేస్తుంది1 సంగీతమూ, కొంచెము తక్కువడిగ్రీలో ఆత్మికభాషలో (Language of the Soul) చెప్పేవకథాను.

కాని, టాకీలో, మాట్లాడేమాటలు ఉచ్చారణకి అలవాటులేక అయితేనేమి, రికార్డింగు బాగులేకపోవడంచేత అయితేనేమి, యూరప్‌లో ప్రాంతీయ వ్యావహారికభాషాభేదం (డైలెక్టుభేదం) చేతనైతేనేమి, మనదేశంలో వ్యావహారికమూ, గ్రాంథికమూ నాటకధోరణీ-ఇంకా యెన్నో భేదాలుండి అయితేనేమి, — మాటలు తెలియడమే కష్టము. ఒకవేళ తీరా తెలిసినప్పుటికీ ఆమాటలను మనస్సు శ్రవణేంద్రియంద్వారా గ్రహించేలోపునే మనకంటిముందు మరొక సీను ప్రత్యక్షం. ఇందువల్ల టాకీని సైలెంటుఫిల్ములాగ అన్నిభాషలవాళ్లూ చూడడానికి కదృష్టంలేకపోగా, ఫిల్ముభాష తెలిసినవాళ్లకయినా అది అర్థమయ్యే యోగ్యత కనిపించడంలేదు. సైలెంట్‌ఫిల్ములో మాటలులేని కారణ పాత్రల అభినయంవల్లనే తిరి అభిప్రాయాలు అర్థమయ్యేవి. ఇప్పుడు టాకీలలో అతివృష్టి అయి నుతిమించుతుందని అభినయాన్ని మితిలో ఉంచుతూవుంటే, మాట్లాడినమాట అర్థంకాక చూచేవాళ్లకి నిద్దరో, తలనొప్పో వస్తున్నది. అందుచేత భాషాభేదమూ, సంకుచితాభినయమూ టాకీలను సైలెంటుఫిల్ములకంటె తక్కువ జనాదరపాత్రంగా చేశాయి.

ఇంతేకాక, టాకీలలో సాంకేతికముగా ఇంకొక లోపం(Imperfection) వచ్చింది. సినీమా—టాకీకానీ, సైలెంటుదికానీ,—చలనచిత్రము. చలనము దానిప్రధాన గుణమూ2, అదే ప్రాణమూను. సైలెంట్‌సినీమాలలో (మూకచలనచిత్రాలలో) చలనానికి కావలసినంత అవకాశం ఉండేది, అంతరాయమేమీ లేకుండాను. అతిత్వరగా అగపడేలాగ అమర్చిన వేర్వేరు బొమ్మలతో సైలెంటుసినీమా చూపరహృదయాన్ని ఆడించివేసేది. కాని టాకీలలో (శబ్దచలనచిత్రాలలో) ఆయాపాత్రల భావార్థమును తెలిపేమాటలు (మరీ అన్యాయము-పాటలు) అయేవరకూ ఇంకొకరంగమును, వేరొకదృశ్యమును చూపడానికి వీల్లేదు. ఇందుచేత కొంతవరకు ఫిల్ములయొక్క 'టెంపో' (ప్రకృతి) చెడిపోయింది. భావోద్రేకకారకమైన 'ఫిల్మిక్ టైమ్' (చలనచిత్రగతి) పదోచ్చారణకావశ్యకమైన 'ఏక్ట్యుఅల్ టైమ్' (Actual time—వాస్తవికగతి)కి తావివ్వవలసి వచ్చింది.

ఈ 'ఫిల్మిక్ టైమ్' (చలనచిత్రగతి)కీ, 'ఏక్ట్యుఅల్ టైమ్' (వాస్తవికగతి)కీ చాలా తేడా ఉంటుంది. ఏదో ఒక పెళ్లిసీను చూపించడానికి తీసిన రెండుకల అడుగుల ఫిల్ముతోటి ఎడిటరు (పరిష్కర్త) జాగ్రతగా పనిచేసి, సప్తపది, అగ్నిహోత్రాలు, మంగళసూత్రధారణ, తలంబ్రాలు, ఊరేగింపు ఒక నిముషంలో చూపించి అయిదురోజులపెళ్లి అవగొట్టేస్తాడు. పాత్రలు చెప్పవలసివచ్చే మాటలవల్ల టాకీలలో అయితే ఆయవకాశము కొన్నికొన్ని సందర్భాలలో చాలాతక్కువగా ఉంటుంది.

ఇక ప్రస్తుతపుటాకీ నాటకముయొక్క ఒక అభివృద్ధిగా, లేకపోతే నాటకముయొక్క ఒక అనుకరణ

---

1. " We must not confuse the work of the ear in its reception of music, and of voice. In a cinema the former is a sub-conscious reception, the latter most definitely conscious "—Andrew Buchanan.

2. " And the real essence of the film is that it does not remain stationery — it is for ever moving, knowing no bounds, now presenting hundreds of flashes, now moving carefully and rhythmically around, but never static ".—Andrew Buchanan.

ముగా తయారయింది. లలితమైనకళలలో సినిమా ఒకటి 1 అనవలసివస్తే, పూర్వపు సైలెంటుసినిమాల ననుసరించి — అది నాటకము ననుకరించినా, ఆధారంగా తీసుకున్నా — కళగాపొందవలసిన యౌన్నత్యమును ఎన్నటికీ పొందలేదు.

అవర్ణ్యప్రాయమైన ప్రతికళాకూడా సర్వజన మనోరంజకము. సైలెంటుసినిమా (మూకచలనచిత్రము) ఇటువంటిది. అది ఏభాషవా నందైననుసరే అన్నిదేశములవారి ఆదరానికీ తగేఉంటుంది. ఇందుకు దృష్టాంతము — మనకథకళి, భరతనాట్యము, అమెరికానటుల అభినయము మొదలయినవెన్నో అఖిల ప్రపంచామోదమును పొందుటయే. ఈపరీక్షకు టాకీలు నిలవవు.

ఇంతేకాక, ప్రతికళా ఇతరమార్గాలచేత కలిగించలేని ఒకప్రత్యేకప్రయోజనం కలిగిస్తుంది2. ఇంతవరకు సైలెంటుసినిమాలు (మూకచలన చిత్రములు) అట్టి భావనే కలిగిస్తూఉండేవి. కాని నేటిటాకీలు (శబ్దచలన చిత్రములు) చాలామట్టుకు నాటకాలమాదిరిగా తయారయాయి. అందుచేత టాకీలు కళాదృష్టినిబట్టి రావలసిన ఉత్తమస్థానానికి రాలేదని చెప్పవలసివస్తుంది.

పోనీ కళాలేదు ఏమీలేదు, టాకీ లేమయినా సైలెంటుసినిమాలకంటె ఎక్కువగా డబ్బు తీసుకువస్తున్నవేమో అంటే అది మొదలే లేదు.

ఇదివరకు ఒక 'కెమెరామాను'(Camera-man) ఒకడైరెక్టరుతో పదిహేనురోజులలో తయారై ముగిసేది ఫిల్ము. అట్టిది, ఇప్పుడంతకు రెండురెట్లు 'టెక్నిషియన్సు' (భిన్నకళానిపుణులు) మూడునెలల నుంచి మూడు సంవత్సరాలవరకు కావలసివస్తోంది టాకీ తయారుచేయడానికి. ఈఖర్చులకుతోడు శబ్దగ్రహణ యంత్రంఖరీదు అత్యంతవిపరీతము. వీటి ననుసరించి మార్చవలసి వచ్చేలైట్లు, 'కెమెరాలు', ఇంకా ఎన్నో చెప్పడానికి వీలులేనన్ని నూతనపకరణాలతో పెట్టుబడి ఖర్చులు (Production Costs) పెరిగిపోయాయి అన్నిదేశాలలోను కూడాను. అమెరికనులు మిలియనుడాలర్ల (రు. 30,00,000) ముందర మనలక్షరూపాయలు లెక్కలేకపోవచ్చుకాని, వాళ్ల దేశంలో సగటున మనిషికి మనదేశంలోకంటె అరవైరెట్లెక్కువ ఆదాయము; అందువలన మనదేశంలో ఈవ్యయము పూడాలంటే, రోజుకు అణాసంపాదించేజనంరాబడివల్ల పూడాలి—. అందులోనూ ప్రతిటాకీకూడా భాషావైవిధ్య, భేదాలవల్ల ఒకచిన్నరాష్ట్రాన్ని అతిక్రమించి వ్యాపారరీత్యా బయటికి పోవడానికి అవకాశం లేదు కూడాను3. ఈపరిశ్రమకుగల ప్రయోజనాలు రెండు: (౧) కళోద్ధరణము; (౨) ద్రవ్యసంపాదన. కలుగవలసిన ఈరెండు

---

1. టాకీ అన్నది ఫొటోగ్రఫీ, సంగీతము, అభినయము మొదలయిన కళలయొక్క కలయికగాని, కళకాదని శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు సూచించారు. కాని, కళని చిత్రకారుని రంగులతో పోల్చి సినిమా ప్రాథమిక వర్ణ సంక్రమ జనితమైన నూతనవర్ణమువలె, నూతనకళ యనవచ్చునని నా యభిప్రాయము.

2 " The film must express in its own unique way, with moving images, only these things which no other medium can express — A B.

3 " Undoubtedly the introduction of dialogue has transformed a medium of limitless universal appeal into an entertainment definitely national in character, with all the inevitable limitations nationalism must create......

" A dialogue film not only loses its greatest power, but in the process assumes a shape which is but a necessarily inferior imitation of the stage, from which it should steer clear

" Imitation never has been and never can be the basis of any important creative art.

" To-day the director of the talking film finds himself bound by the material he is attempting to portray, in terms of the cinema. He endeavours, or one hopes he

ప్రయోజనాలూ సరిగా కలగడమే లేదు. టాకీలమూలముగా చెడిపోయాయి సైలెంటుసినీమాలు, వాటితో పోల్చిచూస్తే. శబ్దగ్రహణము—వాటినన్నిటినీ బట్టి చూస్తే సినీమాపరిశ్రమను ధ్వంసం చేయడానికి వచ్చిందా అని ప్రశ్న వేసుకోవలసివస్తుంది. ఈటాకీలు ఇప్పటిలాగే ముందుకూడా వుండేటట్టయితే 'ఔ'నని చెప్పవలసివస్తుంది.

అందుచేత శబ్దగ్రహణయంత్రాన్ని మనిషిచేత మాటలాడించడానికి మాత్రం కాకుండా సరియైన సంగీతానుసరణానికీ, తదితర అత్యవసరశబ్దప్రయోజనాలకూ (Sound effects) మరీ అవసరమైన చోట్ల మితంగానూ, వీలైనంతవరకు అచ్ఛాదితంగానూ ఉపయోగించితే ఈశబ్దచలనచిత్రాన్ని పూర్వపుసైలెంటు సినీమాలవలె అఖిలప్రపంచాహ్లాదకరంగానూ, అంతకంటె ఎక్కువ రసస్ఫోరకంగానూ, మనకుకు నాటెట్టుగానూ చేసి 'ఇదికూడా ఒకకళ' అనిపించవచ్చును. వీలయినంతవరకు సినీమాలోని వ్యక్తిముఖం చూపరకు చూపించకుండా మాటలాడేటట్టు చేయడమువల్ల ఆమాటను ఏభాషలోనికయినా మార్చుకోవచ్చును. అంతేకాక 'ఫిల్మిక్ టైము' (చలనచిత్రగతి)కి ఏమాత్రమూ అభ్యంతరము రాదు.

అయితే ఇలా సంభాషణ తగ్గించి తీసిన ఫిల్ము ప్రస్తుతపుటాకీల కలవాటుపడిన జనానికి నచ్చదేమో అని అనుమానం కలుగవచ్చు. సరియైన పద్ధతిని తీసినట్టయితే అవే ఎక్కువ నచ్చుతవి—వాల్టు డిస్నీ (Walt Disney) వ్యంగ్యచిత్రాలలాగ[1]. అయినప్పటికీ క్రమముగా ఈఆదర్శానికి దగ్గరకు తీసుకొనివస్తూ ఒక్కొక్క ఫిల్ములోనే మాటలు వ్యక్తిముఖం కనిపించకుండానూ, సంగీతము కొంచెము ప్రాముఖ్యంగానూ అమర్చి జనాన్ని క్రమంగా అలవాటు చేయవచ్చు. ఈపద్ధతివల్ల ప్రథమంలో కొంచెం నష్టం కలిగినా, ఒకసారి తీసిన ఫిల్ము పలుభాషలలోకి తర్జుమాచేయవచ్చును గనుక ఇతరభాషలు మాటలాడు రాష్ట్రాలలోనూ, దేశాలలోనూ కూడా ప్రచారం సాగి క్రమంగా లాభించవచ్చు. అదిన్నీగాక ఎక్కువ ఖర్చులేకుండా తయారయి మొత్తము మీద ప్రస్తుతపుటాకీలకంటె అన్నివిషయాలలోనూ

---

endeavours, to create action, the basis of the film and finds it impossible. Instead he is holding a mirror up to the stage and attempting to infuse new life into the reflection, of course in vain"—Andrew Buchanan.

1. ఈ సందర్భంలో ఈ వ్యంగ్యచిత్రాలు టాకీలకన్న ఎక్కువ ఆకర్షణకలిగి ఉండడానికి కారణాలు సూక్ష్మంగా సూచించవచ్చుననుకుంటా. సినీమాకు అత్యవసరమయినది 'చలనము' (Movement) అని ఇదివరకే చెప్పబడినది. వ్యంగ్యచిత్రాలలో ఉన్నదే చలనము. ఇంతేకాక ఈ సినీమాలలో సంగీతమూ, అవసరమయినచోట అతి నేర్పుగా కలిపిన శబ్దప్రయోజనాలూ (Sound effects) చేరి ఈ చలనచిత్రానికి జీవము పోశాయి. ప్రపంచమంతా దాన్ని చూచి ఆనందిస్తోందంటే దీనికి కారణము, వీటిలోనున్న హాస్యరసమొక్కటేకాక, ప్రతి మనిషికీ సహజంగా సంతోషం పుట్టించే గుణము ఇందులో ఉంది. ఇది చాలావరకు సరియైన సంగీతం చేర్చడంవల్లనే కలిగింది.

"There is no work on the screen more truly cinematic than Disney's creations. Here is movement, rhythmic movement brilliant in every detail, to which the audience all over the world immediately respond,......by reason of human reaction to natural rhythm". — A. B.

# గయచిత్రాలు



౧. వటవృక్షము



౨. ఒకానోకదృశ్యము



3. స్నానఘట్టము



౧. టోకియోలో టైపిస్టు ఉద్యోగంలో ఉన్నవారు.



౨. పిల్లలను ఆటలలో తయారుచేయుచున్న ఉపాధ్యాయురాలు



3. మంచి దుస్తులతో నున్న యువతి



4. వంట యిల్లు-వంట లక్క



చెన్నపురి
విశ్వవిద్యాలయ
నూతన కార్యాలయ



చెన్నపురి
విశ్వవిద్యాలయ
నూతన పరీక్షాలయం



చెన్నపురి
సముద్రతీరము
ఒకానొక మనోహ
దృశ్యము

అది ఆదర్శప్రాయంగానూ ఉంటుంది. సినిమాడైరెక్టర్లలో అద్వితీయుడని అన్నిదేశాలలోనూ పేరుగాంచిన రష్యను డైరెక్టరు పుడోవ్కిన్(Pudovkin) కూడాఈలాగే సూచించాడు.

1. "I think that their future is enormous; But when I use the expression 'Sound film' I do not in any way mean the dialogue film in which the speech and various sound effects are perfectly synchronised with their corresponding visual images on the screen. Such films are nothing but a photographic variety of stage plays. This is a cheap imitation and an ingenious trick that is useless to any one.

"The real future belongs to sound film of another kind .........(With) all the sounds of the whole world, beginniug with the whisper of a man or the cry of a child and rising to the roar of an explosion, the expressionism of a film can reach unthought-of heights.

"It can combine the fury of a man with the roar of a lion The language of the cinema will achieve the power of the language of literature.

"That is how I imagine to myself a film that sounds, and I must point out that such a film will remain international; words and sounds heard, but not seen on the screen, could be rendered in any language and changed with the film for every country."

—Pudovkin.

# దీపావళి

కృత్తివెంటి వెంకటసుబ్బారావు

అచ్చెరు వౌర! ఏరి మగనాలులు నే డటువంటివా రింకన్ ?
గ్రచ్చఱ భర్తృసేవయు మగంటిమి తేవయుఁ జూప పోరిలోఁ
జొచ్చి పరాక్రమింప దనుజుండు గతించెను నాఁడె, —నెత్తుటన్
వెచ్చనవోయి చల్లఁబడె, వేనకువేలు వ్యయమ్ముచేసి యా
చచ్చినపాము గొట్టఁగలసాహసు లందరు నేటి కెందు కీ
నచ్చనిమాట ? స్వర్గసుఖనారకదుఃఖము లీఁగలార, లీ
వచ్చుఁ దలంచినన్ సతులు— బాపురె! కాతుకొలంది గుజ్జుమున్
మెచ్చికసేయుచున్ నడపు నాథులయందును కొంత యుండదే ?

పరదేశమ్ముల తెలివల - వెరవుల నాధారపడి వివేకముసని యా
నటకునిగాని నరకుఁ జంపుట - పరువా యిది సత్యభామబలిమికలిమికిన్ ?

నరకుం డెవ్వఁడు నారకం బెది యెటుల్ నాశంబు గావించె న
త్తరుణీరత్నము? భర్తసాయ మెటుసార్థం బయ్యె? ఆయంశముల్
మఱువన్ రాదుగదా-వృథావ్యయము సంపన్నాశమా నేకదా,—

సరిగంచుల్ జలతారుపట్టుమడఁతల్ చౌశీతిపూజావిధుల్
జరిపింపన్ సరిపోక పోకిళులఁ జోసాగించునల్లుండ్ర చిం
పిరిత్రోవం బడకుండఁ జూతురుకదా— మేఘౌఘముల్ వోవు టీ
శరదాశన్ ముదమంద నైజ, మయినన్ జక్కంగఁ బోనిండు, వి
స్సురు రాకుండ విశాఖగూండ నటుపై శోభించు నీపండుగుల్.

కడలను చిమ్మచీకటులు గ్రమ్మ జనాళి విమోహరాశిలోఁ
బడక నభోవృతాంధ్య మెడపన్, పరిశోధన కేర్పరింప వే
మదుగుల దీప్తి గొల్పుటకు మా ఱొడ లిల్లునుఁ గాల్పఁ బంచు నె
క్కడి దిటువంటి తెల్వి? సరిగా పరమార్థ మెఱుంగలేరొకో?

దీపావళి, తగులంబడు - దీపావళి యంచు తలఁతె? ధీరమనీషా
ధూపావళి, పాపావళి - తాపావళి నడపఁగల ప్రతాపావళి చూ.

తారాజువ్వనుఁ గాల్చగ - తారాపథశోధనముగ దారిని రవ్వల్
తారాపతి కవులం జని - తా రాడినగాదె తెలివి తదమృతభుక్తిన్.

సారంగధరుగువ్వసరణి తారాజువ్వ గణికముస్తాబు మించిన మతాబు,
పరివళింపనిగుత్తి పగిది కాకరవత్తి ప్రముచ్చుటప్పలవడ్డి చిచ్చుబుడ్డి,
కనరానిజూటాలు కడగండ్ల తూటాలు తప్పత్రాగినతంతు కప్పగంతు,
చెవుల, గుండెల రాయి చెనటిటపాకాయి చిరుతందనాలు సిసింద్రీలు,

ఏటికీ ఆయుధాలు? సొమ్మేటిపాలు—గొనబు దిపిటీలు భువిడాలు గుమ్మటాలు,
బుద్ధినిమ్మళములు, త్రిప్పపొట్లములును, - ఆంధ్రయువతీయువకులార అరయలేర?

రవ్వలేల వట్టిరభసేల వెఱ్ఱిస్వా-తంత్ర్యవాంఛ లేల? ధవునిసేవ
ప్రాపకమ్ముగాదె పదివేలు భామకు, - ఒకరియర్థదేహ మొకరు నిజము—

నరక మిడఁగలారు నరక మ్మొడపువార - లబలలా? వలసిన సబలలుగద
దీప్తిగనుడు తెలివి దీపావళిని చుట్టు - ముట్టు తద్విమోహ మట్టె తొలఁగి.

పరులసొమ్ము లెఱువుగోరి భ్రమయనేల? - వనిత లుండిరి భారతావనిని, వారి
విద్య నెక్కువతక్కువల్ వెనుకలేవు, - భరతసతులార, పతులార, భవ్యులార!-

#  కలగూరగంప 

## వార్తాపత్రికల చెల్లుబడిలో జపానుది పైచేయి

కొంతకాలమునకు పూర్వము ఇంగ్లండులోని 'డెయిలీ ఎక్స్‌ప్రెస్సు'కు 'డెయిలీహెరాల్డు'కు చాల తీవ్రమయినపోటీ యుండెడిది. రెండుపత్రికలును ఇరువదిలక్షల ప్రతుల కెక్కుడుగ నమ్ముడుపోవుచుండెడివి. ఈ రెండుపత్రికలవారును మాపత్రికవ్యాప్తి అధికము నిన మాపత్రిక వ్యాప్తియే అధికమని పోట్లాడుచుండు వారు. కాని జపానునుండి వచ్చినవార్తతో వారినోటికి తాళము పడిపోయినది.

జపానులో 'ఒసాకా మైనిచి' అను దినపత్రికకు ముప్పదిలక్షలకాపీలును, 'టోకియోమైనిచి' అనుదినపత్రికకు ఇరువదినాలుగులక్షల ప్రతులును చెల్లిపోవుచున్నవి.

వార్తాపత్రికా ప్రపంచమున జపానుయొక్క యీ యౌన్నత్యమునకు కారణము అచ్చట పసిబిడ్డలుతప్ప తక్కినవారెల్లరు విద్యావంతులగుటయే.

(నవంబరు మాడెరన్ రివ్యూ)

---

## మరబియ్యము తినకూడదు

కామెర్లు, ఉబ్బు అనే జబ్బులు సర్వసాధారణమైపోయాయి యీ రోజుల్లో. ఈ జబ్బులకు ముఖ్యమైన కారణాలు పరిశోధనవల్ల ఇంకా సరిగ్గా తేలనప్పటికీ, ఆహారములో బి. విటమిను చాలినంత లేకపోవడము ఒక కారణమని మాత్రము బాగా తెలిసిపోయింది. ఆ బి. విటమిను యేమాత్రం తక్కువైనా యీ జబ్బులు వస్తాయని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. అయితే యీ విటమిను 'బి' మనం తినే పదార్థాలలో వేటిల్లో వుంది - అది కూడా పరిశోధించారు.

భారతీయులకు ముఖ్యమైన ఆహారము బియ్యము. విటమిను, బి. బియ్యంలో సామాన్యమైన పరిమాణంతో వుంది. కాని ఆ బియ్యము మరబియ్యమైనట్లయితే అందులో కొంచెంకూడా వుండదు. కారణము మరలో వడ్లు పోసినప్పుడు పైపొట్టుతో సహా బియ్యముమీద వుండే విటమిను 'బి' పొరకూడా వూడిపోతుంది. అందుచేత మరబియ్యము తినేవారిలో చాలామందికి కామెర్లు, ఉబ్బు, గుండెనీరసము, కాళ్లు చేతులు లాగటము మొదలైన జబ్బులు అనేకం వస్తాయి దంపుడు బియ్యములో యీ జబ్బును తెచ్చే గుణములేదు. ఎందువలననంటే, దంచినపుడు బియ్యముపైనున్న వూక మాత్రమే పోతుంది. కాని విటమిను 'బి' పొర పోదు. అందువలన దంపుడుబియ్యము చాలా శ్రేష్ఠము. పల్లెటూళ్లలో వుండేవాళ్లు కూడా యీ మర బియ్యమే వాడుతున్నారు ఇప్పుడు. అందువల్ల కలిగే కష్టాలు తెలియకపోవడముచేతనూ, సుఖం మరిగీ యిదివరకు కష్టపడి బియ్యం దంచుకునేవాళ్లుకూడా ఇప్పుడు దంచుకోడం మానివేస్తున్నారు. అది చాలా శోచనీయమైన విషయము.

తరువాత బియ్యం ఎక్కువగా కడగటము కాని, గంజి వార్చటము కాని పనికిరాదు. అందువలన కూడా 'విటమిను 'బి' పొర ఊడిపోతుంది. జబ్బులు తెచ్చిపెట్టుకొని, మందులకోసము వేలకొలది రూపాయలు వ్యయపరచడముకన్న, యిలాటి విషయాలలో జాగ్రత్త పడటము చాలా మంచిది.

'చక్రవర్తి'

---

## సూయజ్ కాలువలో ప్రయాణము

సూయజ్ కాలువగుండా ప్రయాణము చెయ్యటము వినోదకరంగా వుంటుంది. సీమకువెళ్లే ప్రతివాళ్ళూ యీ వినోదాన్ని చూస్తూ ఆనందిస్తారు. ప్రయాణీకులకు కులాసాగావున్నా, ఓడనడిపేవాళ్లకి మాత్రము ఇది ప్రాణసంకటంగా వుంటుంది. ఎంతో జాగ్రత్తగావుండాలి ఓడవాళ్లు.

సూయజ్ కాలువ పొడవు ౧౦౦ మైళ్లు. వాటిలో ౨౧ మైళ్లు బాల, టిస్మ, బిట్టర్ అనే సరస్సులలో పోతాయి. లెక్కిన ౭౦ మైళ్లపొడవునా, ఆకాలువలలో రెండు ఓడలు ప్రక్క ప్రక్కగా పోవడానికి వెసల్పుచాలదు. రెండు ఓడలు ఎదురయినప్పుడు, ఒకటి ఆగి, రెండోది పోవలసివస్తుంది. ఏది ముందుపోవాలి అనేపోట్లాట కలగకుండా కొన్ని నియమాలు యేర్పాటు చేశారు.

బెంజైన్ (Benzyne) కాని, యింకా అలాంటి సూసెపదార్థాలు కాని తీసుకొనివెళ్లేఓడను ముందు వెళ్లిపోనిస్తారు. తరవాత యుద్ధనౌకలకీ టపాలు తీసుకొనివెళ్లేనౌకకీ ప్రాముఖ్యం యిస్తారు. ఒక్కొక్కప్పుడు, యెదురుపడ్డ రెండునౌకలూ ఒకేవిధమయిన సామానులున్న వయితే, గాలి యెటువీస్తోందో, కాలువలో నీటిప్రవాహము ఎటు బలవత్తరంగా వుందో, ఆవైపువెళ్లేఓడను ముందు పోనిస్తారు. ఎర్రసముద్రపువైపున, సూయజుకాలువలో నీటిప్రవాహము గంటకు మూడుమైళ్ల వేగంతో వుంటుంది. అందుచేత ఎర్రసముద్రానికి దగ్గరగా రెండునావలు కలుసుకున్నట్లయితే, ఎర్రసముద్రంలోకి వెళ్లే ఓడను ముందు పోనిస్తారు.

సూయజుకాలువలో ప్రయాణముచేస్తూవున్నంతసేపూ నావికుడు చాలా కష్టపడాలి; అతిజాగ్రతతో మెలగాలి.

సూయజ్ కాలువలో ప్రయాణం యింత కాలంలో పూర్తిఅవుతుందని చెప్పటానికి వీలులేదు. ప్రయాణికులు యెక్కినపడవలో వున్న సామానులను పట్టి ఆలస్యం జరుగుతుంది. టపాలువెళ్లేఓడలో ఎక్కితే త్వరగానే వెళ్లవచ్చును. బెంజైన్‌వున్న ఓడలో ఎక్కితే యింకా త్వరగా వెళ్లవచ్చును.

కాలువకి రెండుప్రక్కలా యిసుకయెడారులు ఉండటముచేత పగలంతా ఎండ మండిపోతూవుంటుంది. రాత్రంతా చలి కరుస్తూవుంటుంది. పగలూ, రాత్రీ కూడా ఓడపైభాగముమీదికి రావడానికి వీలుకాదు.

ఓడ నడిపేవాళ్లకి చాలా విసుగుపుట్టించినా, ప్రయాణీకులకిమాత్రము సూయజుకాలువలో ప్రయాణము ఒకమాదిరి వింతగా వుంటుంది. సీమకు వెళ్లివచ్చేవారంతా యీ వినోదాన్ని చూసి అనుభవించినవారే.

'చక్రవర్తి'

---

## చైనావిద్యార్థుల సెలవుదినాలు

"చైనావిద్యార్థులు తమ సెలవుదినములను ఇచ్చకువచ్చిన వినోదములతో గడపరు. వారు టీన్‌స్టిను నగరమున Obligatory Education Promotion Association అను ఒక సంస్థను స్థాపించి ప్రజాసామాన్యమున విద్య వ్యాపింపజేయుటకయి వినియోగించుచున్నారు.

సంస్థయొక్క ప్రయోజనములను విద్యార్థులే యిట్లు చెప్పుకొనుచున్నారు.

'ప్రకృతము మా దేశము స్థితి చాల అపాయకరముగ నున్నది. మా దేశము ప్రజలు - పనిపాటులవారు, వ్యవసాయదారులూ, చిన్నపట్టణములలోనివారు - ప్రకృతపరిస్థితులను తెలిసికొనుట అత్యావశ్యకముగానున్నది. అందుకోసము మే మిట్టిసంస్థను నెలకొలుప నిశ్చయించితిమి. మఱియు మా సెలవుదినములను సార్థకముగ వినియోగించుట కిదియే యుత్తమకార్యమని మేము తలచితిమి. దీనికంతయు నాధారమయిన ప్రయోజన మొకటేకలదు: అది జాతీయవిముక్తి. ప్రజాసామాన్యముయొక్క సంస్కారప్రమాణము చాలతక్కువ. కాబట్టి వారు తమ రాజకీయపరిస్థితులను పెంపొందించుకొనుట కుపకరించునట్లు వారికి చదువుకరపుటయే మాపని.'

ఇతరజాతీయ సంస్థలు ధనసహాయము చేయుచున్నను ఈకార్యమునంతయు కేవలము విద్యార్థులే నిర్వహించుచున్నారు. వారనుచున్నారు:

'ఇందు రెండుశాఖలున్నవి. ఒకశాఖ నగరమునను, రెండవశాఖ చుట్టుపట్టుగ్రామములందును పనిచే

యును. నగరమున నాలుగుపాఠశాలలున్నవి. ముఖ్యముగా పనిపాటులవారును, పిల్లలును వానియందు చదువుదురు. చుట్టుపట్టుల గ్రామములందు నాలుగు పాఠశాలలున్నవి. వ్యవసాయకులు, చదువురాని పిల్లలు వానియందు చదువుదురు. ప్రతిపాఠశాలయందును సరాసరి ౧౩౦-౧౮౦ మంది యున్నారు. అందు పెద్దలయిన మగవారు, ఆడువారు, పిల్లలు వేరువేరు తరగతులుగా నుందురు. తరగతి మిక్కిలి పెద్దదయినయెడల రెండుగ విభజింపబడును. కార్యనిర్వహణము సామాన్యముగ నేయొడుదొడుకులు లేక సాగిపోవుచుండును. ఉపాధ్యాయులును విద్యార్థులును మంచియొద్దిక కలిగియుందురు.'

Voice of China అను పత్రికయొక్క విలేఖరి యొకడు పాఠశాలలను పరికించి యిట్లు వ్రాయుచున్నాడు.

'పాఠశాల ఆఫీసుగదిలో మేము ప్రవేశించితిమి. అక్కడ గాలిలేక ఉక్కిరిబిక్కిరి అయినది. అచ్చే కొలువుచావడి కూడ. అది కోళ్లగూడంతది. అక్కడ ఈగలు విపరీతముగా ముసురుకొనుచుండినవి. విద్యార్థులు సంపాదించుకొనగలిగిన పాఠశాల భవనము ఇదియొక్కటనే. తక్కిన పాఠశాలలన్నియు ఆయాచోటుల దేవాలయములయందు నెలకొలుపబడినవి.

ఉపాధ్యాయులు స్వయంపాకము చేసికొందురు. మత్స్యమాంసములు గ్రామములందు లభింపవు. కూరగాయలు దొరకును. వానికిని ఎంతయో ప్రయాసపడవలెను. సామాన్యముగా గ్రామములవారు తెచ్చియిచ్చు కూరగాయలే వారికిగతి. వంటపాత్రలుకూడ వారే యిత్తురు.

విద్యార్థులు తమతో నుండునది అత్యల్పకాలము మాత్రమే అయినను గ్రామములవారు వారికి ఎంతయు శ్రద్ధాభక్తులతో స్వాగతము చెప్పుదురు. అంతలోనే వారితో కలసి మెలసి పోవుదురు.'

ఈ ఉపాధ్యాయులు భోజనాది సౌకర్యములమరక చాల కష్టములకు లోనగుచుందురు.

'సాయంకాలమున, పాఠశాలపని అయిన వెనుక మేజాబల్లలు పడకబల్లలుగ మార్పబడును. వానిమీద కొందరుపాధ్యాయులు పండుకొనెదరు. ఇతరులూరక కటికినేలమీదనే పండుకొనెదరు. గ్రామములలో దోమలబాధ యత్యధికముగ నున్నను, అనేకులు దోమతెరలయిన లేకుందురు. వారు సరిగా గ్రామస్థులవలెనే తమజీవితమును గడుపుచుందురు. ఈ జీవితమును వేసవి దినములలో 'కూలింగ్' మొదలగు చోటుల శ్రీమంతులు సకల భోగములతో ననుభవించు జీవితముతో పోల్చినపుడు స్వర్గనరకములకు గల యంతరము గానుపించును. ఈ జీవితము చాల దుర్భరమని నేను చెప్ప సాహసించినపుడు వారు మందహాసముతో శిరఃకంప మొనరించి యూరకుందురు. వారియందు కాన్పించు మనఃపూర్వకమగు విశ్వాసము, ఉత్సాహము, శ్రద్ధ వారు చేయుచున్న కార్యముయొక్క ఫలమే వారు కోరెడు ప్రతిఫలమని తోపజేయుచున్నవి. వారు ప్రయాసబహుళమగు జీవితమునే వరించిరి. వారికి కష్టములనిన వెరపులేదు.

ఆవిలేఖరియే యిందుకు కొన్ని నిదర్శనములను తెలుపుచున్నాడు.

'ప్రతిదినమును మండుటెండలో కాలినడకను రెండుగ్రామములలో విద్యను బోధించుటకు ఏడుమైళ్లెక్కుడుదూరము పోవునాతడొకడుండెను. బోధకులు చాలకున్నపుడొకయువతియు నీవిధమున నడచిపోయి విద్యాబోధ చేయుచుండెను. ఒకగ్రామమునుండి యింకొకగ్రామమునకు పోవుచున్న యామెను నేను చూచితిని. రెండవగ్రామమును చేరినతోడనే ఆమె వంటచేసికొన మొదలిడెను. స్వార్థరహితమగు నట్టి శ్రద్ధ యెవరి హృదయమును ద్రవింపజేయదు! కడచిన కొలదియేండ్ల పరిస్థితులే చైనాయువజనము ఇట్టి నూతనరూపమును దాల్చుటకు ముఖ్యకారణములు. కాలదేశముల పరిస్థితులు, తదనుగుణముగ తాము నిర్వహింపవలసిన కార్యములు వారికి స్పష్టముగా గోచరించినవి. తమ సౌఖ్యములను తలంపునకయిన తెచ్చుకొనక వారిట్లు నిరంత

రము పనిచేయగలిగి యుండుటయే యిందుకు చాలిన నిదర్శనము.'

విద్యార్థినులుకూడ చైనాలో ఇట్లు ఈకార్యమును సాగించుచున్నారు. మరికొన్ని వివరములనుగూడ విలేఖరి యిచ్చుచున్నాడు.

'ఈ యుపాధ్యాయులకు, అబడిపిల్లలకు నుదిరిన అన్యోన్యత వారియం దభిన్నభావమును నెలకొలిపినది. ఇందు కెన్నియో నిదర్శనములు గలవు. భోజనమునకు పూర్వమును, పరమును విద్యార్థు లుపాధ్యాయులకు తమంతదామ మిక్కిలిగా సాయపడుచుందురు. తరుచు తమయిండ్లనుండి పాత్రసామగ్రిని, ఒకప్పుడు భోజనమునుకూడ కొనితెచ్చి ప్రీతితో నిచ్చుచుందురు వానకురియునపుడు ఆపిల్లలుపాధ్యాయులకు గొడుగులను పట్టుచుందురు. ఒకప్పు డొక యుపాధ్యాయురాలు రెండుగ్రామములలో విద్యనేర్పుటకు నడచిపోజాలక తనకుమా రింకొకరిని నియమింపగోరెనట. ఈవిషయము గ్రామములో నాడువారికి తెలిసి అట్లు చేసినయెడల మేము ప్రతిఘటింతు మని వారు బెదరించిరట.'

ఒకానొక గ్రామమున బడికిని, వంటకును ఒక్కగదిమాత్రమే యుండెను. పానములయిన తరువాత ఉపాధ్యాయులు వంటపనిలో మునిగియుండిరి. వారికి బడిపిల్లలందరు వలసిన సాయమును చేయుచునేక కుటుంబములోనివారివలె మెలగుచుండిరి. ఉపాధ్యాయులు దినమంత ప్రొద్దు పనిచేసి శ్రమనొందినపు డూరివారి నిండ్లకు పొండని చెప్ప వారు విధి లేక పోవుచుందురు.

ప్రతి పాఠశాలయందును తరుచు సాయంసమయముల చదువు పని ముగిసిన తరువాత నేదో యొక విశేష కార్యక్రమ ముండును. అపుడు పెద్దలు పిన్నలు, ఆడువారు మగవారు నొకకూటముగా కూడుదురు. ఉపాధ్యాయులు పాటలు పాడుచు వారిచేత పాడింతురు. ఇంచుమించు అర్ధరాత్రమువరకు నిది సాగుచుండును.

ఒకానొక గ్రామమున గల పాఠశాలలో బల్లమీద నుప్పులో నూరిన గ్రుడ్లు రెం డొకకాగితమున మడిచి యుంచబడియుండెను. ఆ పొట్లముమీద 'నిది మా యుపాధ్యాయులకు' అను నక్షరము లుండెను. ఆ వ్రాలనుబట్టి అది పల్లెటూరి పిల్లలొసంగిన కానుక యని స్పష్టపడుచుండెను.

ఇవన్నియు నల్పవిషయములుగా తోచవచ్చును. కాని వారిలో వారికి గల గాఢమగు సౌభ్రాత్రమును, దాని అనుదినాభివృద్ధిని అవి ప్రకటించుచున్నవి. ఇది యొక్కటిమాత్రమే యీఘనప్రయత్నముయొక్క విజయమును చాటుచున్నది." (నవంబరు మాడరన్ రివ్యూ)

చైనావిద్యార్థు లిట్టికార్యమునకు దొరకొని విజయమును గాంచుచుండుట తెలిసినపుడు అంతరంగము హర్ష తరంగితముకాని మానవు లుండబోరు విద్యాభివృద్ధి విషయమున భారతదేశమునకంటె మేలుగనున్న చైనాదేశమున నింకను తద్విషయమున నిట్టిప్రయత్నమును విద్యార్థులు నడుముకట్టి, కష్టములపాలగుచు కొనసాగించుచున్నారు. ప్రపంచమున నన్నిదేశములకంటెను విద్యలో నెంతయో వెనుకబడియున్న భారతదేశమునవిద్యార్థుల కిట్టిభావము కలుగకుండుటకు వారియలసతయు, అప్రయోజకతయు, స్వార్థపరతయు కారణములు. విద్యార్థులమాట యటుండుగాక! వేలకువేలుగ వ్యయించి విద్యావంతులనబడి, తరువాత బ్రతుకుతెరువుగానక, నిరుద్యోగులమని యంగలార్చుచు పలుబాముల పడుచుండు వేలకొలది యువకుల కిట్టి యుపాయము మనసున కింకను తట్టకపోవుట విచారకరము.

ప్రస్తుతము భారత దేశోద్ధరణమునకు విద్యావ్యాప్తి యెంత యావశ్యకమో విద్యావంతుల జీవన మార్గాన్వేషణము నంతయావశ్యకమని చెప్పబనిలేదు. ఇట్టి స్థితియందు భారతదేశము చైనావిద్యార్థులమార్గము ననుసరించుట యుభయతారకము కాగలదు. జీవనమున కిట్టి మార్గము విద్యావంతులకు చాలసుకరమయినది. సహజముగ భారతదేశము భూతదయకు పుట్టినిల్లు. ఈగుణమే దాని యధోగతికి కొంతవరకు కారణమని చెప్పినను తప్పుకాదు. అట్టి భారతదేశమున తమంతతాముగ బయలుదేరి విద్యా విజ్ఞానములను సమకూర్చు విద్యావంతులకు శరీరయాత్రామాత్రావశ్యక సౌకర్యములు ప్రజాసామాన్యమువలన తప్పక సమకూరగలవు. కావున విద్యా

కొలవుదినములయందును, నిరుద్యోగపట్టభద్రులు నిరంతరమును ఈయుభయతారకకార్యమునకు పూనుకొనుట వివేకము. సం. భా.]

---

## భూమి వయస్సు

అమెరికాదేశమువారగు భూగర్భ శాస్త్రజ్ఞులు, ఖనిజ శాస్త్రజ్ఞులు, విస్మృతజీవ శాస్త్రవేత్తలు ౫౦౦ మంది కధికముగ నిటీవల సమావేశమయిరి. ఆ సమావేశమున విలియండి. మక్రైు అనువారు శిలల జీవితకాలమును కనుగొను పద్ధతులను విశదీకరించిరి. ఒక శిలనుండి చిన్నముక్క నొకదానిని గైకొని నవీన సూక్ష్మ రాసాయనిక (Micro-chemical) పరిశోధనల మూలమున దానియందు గల కిరణోద్గారక వస్తు (Radio active) స్థితిని కనుగొని దానినుండి శిలయొక్క జీవితకాలమును లెక్కపెట్టవలెననిరి. ఈపద్ధతుల ననుసరించి సౌడ్‌సకొనది (U. S. A.) గట్టుననున్న శిలలు ౧౫,౦౦,౦౦,౦౦౦ సం॥ మించిన వయస్సు గలవనియు, డులుత్, మినిసోట (U S. A) యందలి శిలలు, ౨౫,౦౦,౦౦,౦౦౦ సం॥ మించిన వయస్సు గలవనియు, మరికొన్ని చోట్ల ౨౦,౦౦,౦౦,౦౦౦ సం॥ మించిన వయస్సుగలవి కలవనియు తెలిసినది. ఈ పరిశోధనలనుబట్టి భూమి వయస్సు రెండువందలకోట్ల సంవత్సరములకు మించి యుండునని అల్‌ఫ్రెడ్ సి. లేన్‌గారి యభిప్రాయము.

(టైమ్సు ఆఫ్ ఇండియా)

---

## జర్మనులు

(సండే స్టాండర్డునుండి)

ఐరోపాయుద్ధానికి పూర్వపు జర్మనుల జీవితానికీ యిప్పటి జీవితానికీ ఎంతో తేడావుంది. అప్పుడు జర్మనీవారు ఎద్దులలా తినటానికి తగినంత ఆహారాన్ని కలిగివుండేవారు. ఇప్పుడు అలాకాదు.

జర్మనులలో వుండే సుగుణాలుకాని దుర్గుణాలు కాని యేమీ పరిసిపోలేదు. ఆ గుణాలే మార్పుపొందిన పరిస్థితులకి అనుకూలంగా అమరుతున్నాయి. 'మమ్మల్ని సక్రమంగా నడపగల నాయకులు కావాలి' అని జర్మనులు అప్పటికీ యిప్పటికీ ఒకే విధంగా కోరుతున్నారు. ఇప్పటికి తమకు సరియైన నాయకుడు దొరికాడని జర్మనులు సంతోషిస్తున్నారు. ఈ విషయం ప్రపంచమంతా అంగీకరించితీరవలసిందే. ఆ నాయకులు క్రూరులని అంటే అనవచ్చును. కాని కబుర్లరాయళ్లు మాత్రం కాదు. మధ్యతరగతికి చెందిన జర్మను దేశస్థుడు యితర దేశాలలోవున్న తనతోసాటివారికన్న ఏ విధంగానూ సుఖజీవికాడు. కొంచెం కష్టజీవి అని చెప్పవలసివస్తుంది కూడాను. సాధారణంగా జర్మనీలోని గుమాస్తా తరగతి వుద్యోగస్థుడి జీతము వారానికి ౩ పౌనులు, అంటే జర్మనీ లెక్క ప్రకారము ౬౦ మార్కులు. జర్మనీమార్కు మన రూపాయితో సమానమైన విలువ కలది. జర్మనీలో జీవితంగడపడానికి సాధారణంగా అయే ఖర్చుకి యిది చాలదు కూడాను. దమ్మిడీ సంపాదన లేకపోయినా పన్నులు మాత్రం తప్పక యిచ్చుకోవాలి. ఇవ్వకుండా తప్పించుకోడానికీ, వాయిదాలు వెయ్యడానికీ వీలు రవంతమాత్రమూ లేదు.

ఉద్యోగంచేసే జర్మనుదేశస్థుడి జీతంలోనుంచీ పట్టుకొనే పన్నులు యివి.

పెళ్లి అయి ముగ్గురికన్న ఎక్కువబిడ్డలు లేని ఆతనికి రాబడిపన్ను ౫౯ మార్కులు
ఉద్యోగము భీమా ౮ మార్కులు
నిరుద్యోగులకు ప్రభుత్వపక్షాన సహాయానికి పన్ను ౬౯ మార్కులు
అపాయాలు మొదలైనవాటికి ప్రభుత్వపు భీమా ౬ మార్కులు
తలపన్ను ౩౮ మార్కులు
మొత్తం ౩౮ మార్కులు

ప్రతినెలా యీ పన్నులు పోతాయి జీతంలోనుంచి. బ్రహ్మచారిగావున్నట్లయితే, బ్రహ్మచర్యపుపన్ను క్రింద ౭౮ మార్కులూ, రాబడిపన్నుక్రింద ౫౯ మార్కులకి బదులు ౧౫ మార్కులూ యిచ్చుకోవాలి.

ఇక్కడికి పన్నులగొడవ వస్తుంది. ఇహ, జర్మనీలో యిళ్ల అద్దెలు చాలా ఎక్కువ. ఇంగ్లండులో ౫ మార్కులకివచ్చేభాగము జర్మనీలో వారానికి ౨౦ మార్కులకి తక్కువరాదు. భోజనంమాత్రము కొంతవరకు చవకగానే దొరుకుతుంది. వారానికి పది పన్నెండు మార్కులతో భోజనం సరిపోతుంది. అదీ సాధారణ భోజనమే. కులాసాగా ఖర్చుపెట్టడానికి ఒక్కదమ్మిడీ మిగలకుండా, అంతా ఖర్చయిపోతుంది. ఇతరదేశాల వారికన్నా మితతనంతోనే భోజనంచేసినా జర్మనీ వాళ్ల ఆరోగ్యం మాత్రము బాగానే వుంటుంది. ఆరోగ్యంతోటే వాళ్లు ఉత్సాహాన్నికూడా కలిగివుంటారు.

హిట్లరుపేరుచెప్పితే వాళ్లవుత్సాహము యింతా అంతాకాదు. అన్నిటికన్న చిత్రమైన విషయము యేమిటంటే, ప్రతిరేడియోదగ్గరా, ప్రతివుపన్యాసానంతరమూ 'హిట్లరుకీ జయ్' అంటారు అంతేకాదు, వ్యాపారస్థుల వుత్తరాలలోనూ, బంధువులు ఒకరికొకరు రాసుకునే వుత్తరాలలోనూ కూడా చివర 'హిట్లరుకీ జయ్' అని రాస్తారు. ౬౦ మిలియనుల జర్మనులు - వారిలో అనేకమంది మహామేధావులు, శాస్త్రపరిశోధనలలో అద్వితీయులు వున్నా- యేకకంఠంతో ఒక్క హిట్లరుని దేవుడిని కొలిచినట్టు కొలవడం చాలా ఆశ్చర్యకరమైన సంగతే.

జర్మనుదేశీయులలో ప్రతివాడూ ఏదో ఒక సంఘంలో సభ్యుడుగానే వుంటాడు.

విధేయతా, సక్రమశిక్షణా లేకపోతే ఏపనీకాదని వారి నమ్మకము. నాయకులకి విధేయులై వుండి సక్రమపద్ధతిలో నడచుకోవడం జర్మనులకి పెట్టని సొమ్ము.

చివరికి వచ్చేటప్పటికి ప్రతి యుద్ధంలోనూ బ్రిటిషువారు గెలిచారని జర్మనులకి కడుపుడుకు ఉన్నా బ్రిటిషువాళ్లు తమ దేశానికి వచ్చినప్పుడు అమర్యాదలో ప్రవర్తించరు. జర్మనీలో చాలా ప్రజాదరణ పొందే విదేశీయులు ఇంగ్లీషువారే అని చెప్పవచ్చును.

జర్మనుదేశీయుడి దినచర్య చాలా కట్టుబాట్లతో వుంటుంది. కోడికూతతోటి నిద్రలేచివెంటనే వ్యాయామము చేస్తాడు. తరవాత టిండి, ఆఫీసు మొదలైన మామూలు పనులూ. సాయంత్రము రాజకీయసభలూ, శరీర పరిశ్రమా, లైబ్రరీలకి వెళ్లడమూ; అంతే కాని, వృథాగా కాలం పుచ్చటమంటే జర్మనులకు గిట్టదు.

తండ్రి పెద్దవుద్యోగంలోవుంటే కొడుక్కీ పెద్ద వుద్యోగం దొరికిందన్నమాటే. వుద్యోగాలు యిచ్చేటప్పుడు చాలావరకు వంశ పారంపర్యమును పరిగణిస్తున్నారు ఇప్పటి జర్మనీలో.

'చక్రవర్తి'

---

## చీట్లపేక చిత్రకథ

ఉబుసుపోకకై మనవారాడు ఆటలలో చీట్లాట కూడ ఒకటి. ఈ చీట్లపేక మన దేశములో ప్రవేశించి అప్పుడే ౧౨ శతాబ్దులు దాటిపోయినవి. అనగా నిది ౭ వ శతాబ్దిలో నిక్కడికి వచ్చినదన్నమాట. అసలిది తూర్పునుండి బయలుదేరి పోయిపోయి పశ్చిమ యూరపులో ప్రస్తుతపు రూపును దాల్చి నిల్చిపోయినది.

ఆరంభమునుండి యిప్పటివరకు చీట్లపేకలో చాలాచాలా మార్పులు కలుగుచు వచ్చినను ప్రధాన లక్షణములందు మాత్ర మేలాటి మార్పులును రాలేదు. ఫ్రెంచి విప్లవమునందు జాకీలకు ఎఱ్ఱటోపీలు వచ్చినవి; రాజులు, రాణులును కిరీటములను గోల్పోయిరి.

ఇందులోని నాలుగు రకములును సంఘమందలి నాలుగు తరగతులను తెలియజేయునట. ఇస్పేటు సైనికుల, లేక ఉత్తములతరగతిని, ఆఠీను ఫాదిరీల తరగతిని, డైమను వర్తకుల శ్రేణిని, కళావరు రైతుజనమును నిరూపించునట! ఈచీట్లపేకలోని బొమ్మలన్నియు నేవో కొన్ని సుప్రసిద్ధ చారిత్రకవ్యక్తుల నిరూపణమట. సంప్రదాయవేత్తలిట్లు వీనిని పరిగణించుచున్నారు.

ఇస్పేటురాజు డేవిడ్‌రాజుగ భావింపబడుచున్నాడు. డేవిడు గోలియతును చూడబోయినప్పుడు ఒక కత్తితో సహా పోయినాడు. ఇస్పేటురాణి యుద్ధ

దేవతయగు పల్లాసు. ఇస్పేటుజాకీ ఛారల్‌మాన్ యోధులలో నొకడును, మంచి ఖడ్గకౌశలముగలవాడును అగు ఓగియర్.

ఆఛారల్‌మానే ఆఠీనురాజు. పేకకంతటికిని అతి ముఖ్యమైనరాజగుటవలన ఇతడు రాజదండమును దాల్చియున్నాడు. ప్రాతరోజులలో నితడు యుద్ధపుగొడ్డలిని బట్టెడువాడు కాని ప్రస్తుతము ఖడ్గమాస్థానము నాక్రమించినది. ఇతనికుడిచేయి ఎలిజబెత్తురాణి రోజులలోవలెనే యితని దుస్తులమీద నున్నది. ఆఠీనురాణి జూడిత్తు. ఆమె మంచి ధైర్యము గలది. అందరు రాణులవలెనే ఈమెయు నొకచేత పుష్పమును దాల్చియున్నది. ఆఠీనుజాకీ ఒక సుప్రసిద్ధ వీరుడు. పేరు లాహైరు. అతని చేత అరువంటి దేదోయొక వస్తువున్నది.

డైమన్ రాజు జూలియస్ సీజరు. ఏదో చేరమాడుచున్న ట్లాతని చెయ్యి చాపబడియున్నది. అతని రాణి రాఖేల్. ఈమెకుగానే జాకోబు అన్నాళ్లు అవస్థపడినది. డైమన్ జాకీ రౌండుటేబిలుతాలూకు హెక్టరు. అతినిచేత వెల్లుకొక్కె మున్నది.

ప్రపంచమంతటిని అరచేత నిముడ్చుకొన్న వీరాలెగ్జాండరు కళావరు రాజు. అతని వింతకిరీటము గూడ చిత్రములో నిలిచియేయున్నది. కొన్నాళ్లు ఇతడు ఆకిరీటము నొకచేత బట్టుకొనియున్నట్లు చిత్రింపబడుచుండెడిదికాని క్రమముగ నాక్రమము మారిపోయినది. అతినిరాణి అర్గయిను. అర్థగురాజవీరులలో నొకడును, హెక్టరు సవతిసోదరుడును అగు లాన్సులాట్ కళావరుజాకీ. వ్యాయామక్రీడలకు, ముఖ్యముగ ధనుర్విద్యకు లాన్సులాట్ ఎంతేని ప్రోత్సాహమిచ్చును. అతని బాణాగ్ర మింకను చీట్లలో దృశ్యమానముగనే యున్నది.

ఈ వ్యక్తిచిత్రణ మీవిధముగా మనవారు భావించుచున్నారు. అంతరార్థమేమో మాత్రము సుగమముగ లేదు. ఇస్పేటుఆసులోకూడ ఒకవిశేష మున్నది. అది ప్రభుత్వపుపన్నుచీటీ. ఇప్పటికిని చాలమందినిర్మాతలు దాని నట్లే తయారుచేయుచున్నారు. కాని కొంతమందిమాత్రము తమతమపేర్లను ఆ చీట్లమీద వింతవింతగ చిత్రించుకొనుచున్నారు.

ఇంకొక సంప్రదాయము ప్రకారము ఈ నాలు గురకములు నాలుగు ఋతువులను తెలుపుననియు, ౫౨ చీట్లు ౫౨ వారములను, చీట్లమీది యంకెలనన్నిటిని కూడగావచ్చిన మొత్తము ౩౬౫ దినములను తెలుపుననియు భావింపబడుచున్నది. ఈ పద్ధతిలో జాకీలు ౧౧ గాను, రాణులు ౧౨ గాను, రాజులు ౧౩ గాను లెక్కింపబడవలయును. జోకరు ౧ క్రింద లెక్క.

---

## చైనా వధూవరులు

ప్రాచీనసంప్రదాయముల ననుసరించి జరుగు వివాహములు నేడు చైనాలో చాలసకృత్తు. నవీనపద్ధతులనే సామాన్యముగా నెల్లరు నేటికాలమున నవలంబించుచున్నారు. ప్రాచీన సంప్రదాయముల ననుసరించి వివాహసంగ్రహము పెక్కునాళ్లు నడచును. చుట్టములకు లెక్కలేదు. విందులు, వినోదములు మితిమీరియుండును.

వధువున కొక కఠిననియమము కలదు. ఆమె నవ్వకూడదు. వధువుగానున్నకాలమున ఆమె నవ్వుట చైనీయ సంప్రదాయమునకు బనికిరాదు. అనేకులు బంధుమిత్రులు వధువును మందహాసముతో సంభావింతురు; పరిహసింతురు. ఆమెమాత్రము నవ్వగూడదు. ఏకాంతమునగూడ నాకాలమున నవ్వగూడదు. ఈ నియమమును పాలించుట దుశ్శకము.

వరున కిట్టినియమము లేదు. కాని మరొకచిక్కు కలదు. వివాహసమయమువరకు వధువు నాతడు చూడగూడదు. ఆతని తలిదండ్రులే వధువును నిర్ణయించి తెచ్చెదరు.

వివాహవధువు నలంకరించు టొక పెద్దపని. అది యందరకును చేతగాదు. కొందరాడువారుమాత్రము అందు నిపుణులుగ నుందురు. ఇందలి వధువు అట్టి నైపుణ్యముగల యామెచే నలంకరింపబడినది. ఇట ప్రకటింపబడిన చిత్రములు సింగపూరులో ప్రాచీన సంప్రదాయముల ననుసరించి వివాహితులయిన చైనా వధూవరులవి.

---

## వజ్రము ప్రాణాంతకమా?

వజ్రము నవరత్నములలో నొకటి. వజ్రములు, తద్భేదములు, లక్షణములు, గుణములు, వాని శోధన

మారణమృదూకరణాది ప్రయోగములు వైద్యగ్రంథములందు సవిస్తరముగా వర్ణింపబడియున్నవి. నవరత్న చింతామణి, త్రైలోక్యచింతామణి ఇత్యాది ఔషధయోగములలో వజ్రభస్మము కలియును. ఈ యౌషధముల ప్రభావము లోక మెరుగనిది కాదు. "మృత్యుంజయం తదమృతోపమమేవ వజ్రమ్" అని చెప్పుటచేత ఇది అమృతముతో సమానమయినదని తెలియుచున్నది.

ఇట్టి శాస్త్రాధారములకు భిన్నముగా, వజ్రము ప్రాణాంతక మనియు, ఆత్మహత్య చేసుకొనుటకై కొందరు దీనిని ఉపయోగింతురనియు ప్రతీతి మనదేశమున చిరకాలమునుండియు గలదు. ఇట్టి ప్రతీతికి సాధకముగా కొన్ని గాథలును చెప్పబడుచున్నవి. ప్రమాణగ్రంథములనుండి ఆధారములుగాని, ఎవరైన దీనివల్ల ఆత్మహత్య చేసుకొన్నట్లు సాక్ష్యముగాని దొరకుట లేదు. వైద్యగ్రంథములం దెక్కడను దీనిని విషముగా పరిగణించి, దానిలక్షణములు, చికిత్స చెప్పియుండలేదు.

అక్టోబరుమాసపు "ఇండియన్ మెడికల్ గెజెట్" నందు తత్ పత్రికాధిపతులు, మదరాసు గవర్నమెంటు కెమికల్ ఎగ్జామినర్ పంపిన రిపోర్టును విమర్శించుచు, వారి రిపోర్టునుండి, ఇతర విషయములతోపాటు, ఈ క్రింది విషయమునుగూడ ఉద్ధరించి ప్రకటించినారు:

"హిందూదేశముననే కాక ఇతరత్రాగూడా వజ్రపుపొడి విషమని విశ్వసింపబడుచున్నది.

ఒకడు ఎనిమిది వజ్రములను పొడిచేసి ఆత్మహత్య గావించుకొనుటకై మ్రింగెను. వజ్రముల పరిమాణము ఎంతో తెలియలేదు. ఒకగంట గడిచిన తరువాత కడుపులో నొప్పికలుగుటచేత వైద్యుడు వచ్చి చూచెను. శరీరోష్ణము సరిగా నున్నది. నాడి దృఢముగా నుండెను. నాడీస్పందనము నిమిషమునకు ౧౨౦. ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిమిషమునకు ౩౦. కడుపు కడిగి, తరువాత మజ్జిగ అన్నము పెట్టబడెను. అతడు తేరుకొనెను. కడుపు కడిగినపదార్థము మాకు (కెమికల్ ఎగ్జామినరుకు) పంపబడెను. అందులో స్వచ్ఛమైన వజ్రపు లున్నట్లు మైక్రోస్కోపులో కనుగొంటిమి."

ఈ పై విషయములనుబట్టి చూడగా, వజ్రము ఇతర విషములవలె ప్రాణాంతకమైనది కాదనియు, అట్టిమాటలు వట్టి బూటకములనియు సందేహము పొందవలసివచ్చుచున్నది. జిజ్ఞాసువులు ఈ విషయమై చర్చించి సత్యమును వెల్లడింతురుగాకయని కోరుచున్నాను.

వేటూరి శంకరశాస్త్రి

---

## జపాను యువతులు

జపాను యువతుల కింకా స్వాతంత్ర్యం సరిగా లభించలేదు. వాళ్లు మొగుడికీ, కుటుంబానికీ అణిగి వుండవలె. జపానువారిజీవితానికి ఇల్లు, కుటుంబము మూలకందాలు. చెడిచేరినవాళ్లను ఏకుటుంబమూ నిరాకరించదు. యువతులూ, యువకులూ, ఎన్నిదేశాలు గినా, ఎంతసంపాదించినా మళ్లా యింటికివచ్చిచేరుకోవలసిందే.

వాళ్ల యిండ్లలో ఉపకరణాల ఆడంబరం తక్కువ. ఇండ్లనుశుభ్రంగా, అందంగా పెట్టేపని ఆడవాళ్లది. కాగితాలతో, అట్టలతో తెరలూ, గోడలూ తయారు చేస్తారు. పగల్లా గడ్డిచాపలుపరుచుకుంటారు ఇండ్లలో. రాత్రిళ్లు సన్నపరుపులు పరుచుకొని పడుకుంటారు. పొద్దున్నే లేచి వాటినిచుట్టి అటకలపైన పెట్టుకుంటారు. మళ్లా అగదే భోజనాలకూ, కచేరికీ, జల్సాకూ ఉపయోగిస్తారు. ఇంట్లో ఒకటిరెండు పొట్టి లక్కపనిబల్లలు, వాటిపైనపూలకుండు మాత్రము ఉంటవి. అలా తెరతప్పిస్తే బయట ఒక అందమయిన చిన్నతోట కూడ కనుపడుతుంది.

వాళ్లదుస్తులు జాతీయంగా వుంటవి. రంగులంటే చెవికోసుకొంటారు. అయితే చిన్నవయసువారు మాత్రమే పళపళమనేరంగుబట్టలు కట్టుకుంటారు. పెద్దవారయ్యేకొద్దీ లేతరంగులోకి వస్తూవుంటారు.

వంటయింట్లోను విశేషంగా పాత్రసామాను ఉండదు. ఉన్న వాటిని చాలా జాగ్రత్తగా, శుభ్రంగా ఉంచుకుంటారు. అక్కరలేనివాటిని దాచి ఉంచుతారు. వంటలక్కలు కఱ్ఱ చెప్పులు తొడుక్కొం

టారు. వంటకు విద్యుచ్ఛక్తిని ఉపయోగిస్తారు. పాత కాలపు తీరువాళ్లయినా బొగ్గులతో వండుకుంటారు, కాని పొయిలలాంటివేవీ ఎక్కడా లేవు. ఆదేశంలో కూడా ఆడ వాళ్లు ఉద్యోగాలు చేస్తారు. వాళ్లు యూరపియనుల దుస్తులు వేసుకుంటారు. ఇతర యూరపు దేశాలల్లో వలెనే ఉదయం ౮ ఘంటలు మొదలు సాయంత్రం ౫ ఘంటలదాకా పనిచేస్తారు. టోకియోలో వుండే లక్షలకొలది యువతుల్లో టైపిస్టు, సెక్రెటరీ ఉద్యోగాలు చేసేవాళ్లు మాత్రమే యీలాటిదుస్తులు వేస్తారు. వాళ్లయినా ఇంటికి రాగానే ఆదుస్తులుమార్చి మామూలు తమదేశీయపు-దుస్తులు వేసుకుంటారు. ఆదుస్తులే వాళ్లజీవితానికీ, సంప్రదాయాలకూ చాలా అనుకూలంగా ఉంటవి.

ఉపాధ్యాయురాండ్రుకూడా వాళ్లలో ఉన్నారు. పిల్లలను ఎక్కువదయతో శ్రద్ధతో చూచుకునేవాళ్లను ఎక్కువగా మెచ్చుకుంటారు. బడిలో గాని, ఆటల్లో గాని, కుఱ్ఱాళ్లు-శ్రీమంతులుగానీ, సంపన్నులుగానీ,- ఎచ్చు తక్కువ అనేది యింతయినా లేకుండా కలిసిమెలిసి ఉండేటట్లు తయారుచేయడం వాళ్లపని. ఆడవాళ్లకు ఉన్నతపాఠశాలలు ఉన్నాయి. విశ్వవిద్యాలయపు చదువు లేదు ఇంకా. అలాటిచదువు చెప్పే కళాశాలలు మాత్రం రెండున్నాయి. యంత్రాలయాల్లో కూడా వాళ్లు పనిచేస్తారు; వాళ్లు భర్తలతో కలిసి విందులకని హోటళ్లకు పోరు. కాని తమకు తాము ప్రత్యేకంగా-సామాన్యులుగూడా-కొందఱు కలిసి విందులూ, వినోదాలూ చేసుకుంటూవుంటారు. విశ్రాంతి దినాల్లో తోటలకు పోయి పాటలూ, ఆటలూ సాగిస్తూ వుంటారు.

పిల్లల్లో నాట్యములోనూ ప్రసిద్ధికెక్కినవాళ్లు ఉన్నారు.



చైనావధూవరులు



# ఆంధ్రాభ్యుదయము





### శ్రీ ప్రభల ఆదిలక్ష్మీ నారాయణశర్మగారు

కలకత్తా విశ్వవిద్యాలయమున ఎం. ఎ. (వాణిజ్యము) పరీక్షయందు ప్రప్రథములుగా నుత్తీర్ణులయిరి.

సదరు విశ్వవిద్యాలయమువారి సువర్ణ పతకమును ౨౫౦ రూ. విలువగల గ్రంథములను పారితోషికముగ బడసిరి.

---

### శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావుగారు

వీరు నిజాం రాష్ట్రాంధ్రులు నిజాము కాలేజియందు పట్టభద్రులయి మద్రాసునందు బి. ఎల్. డిగ్రీని పొంది గత పదమూడు పదునాల్గు సంవత్సరములనుండి సికింద్రాబాదు హైదరాబాదు కోర్టులందు ప్రాక్టీసు చేయుచు మంచి పేరు కీర్తులను గడించియున్నారు. ఉదారస్వభావులు. ప్రజాహితకార్యములం దెక్కుడు శ్రద్ధ వహించుచు పేదలయం దెక్కుడు ఆదరణ చూపుచుందురు. నవ యువకులయ్యును సనాతనధర్మ నిష్ఠాపరులు.

వీరిటీవలనే యం. యల్. పరీక్షయందు ఉత్తీర్ణులయి రాష్ట్రమునందు యం. యల్. బిరుదాంకితుల లేనికొరతను దీర్చినారు. (వి. వెం. ర)

---



డాక్టరు తాతా సూర్యనారాయణగారు,
ఎం. ఎస్సి., పిహెచ్-డి.

వీరు విజయనగర వాస్తవ్యులు. శ్రీమన్మహా మహోపాధ్యాయ కళాప్రపూర్ణ శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రిగారి జ్యేష్ఠపుత్రులు. వీరు బి. ఏ. పట్టభద్రులయిన తర్వాత కాశీ విశ్వవిద్యాలయమున ఎమ్-ఎస్సి పరీక్షకై చదివి అందు ప్రథములుగా సత్తీర్ణులయిరి. ఆతరువాత బెంగుళూరున ఇండియన్ ఇన్‌స్టిట్యూటులో రెండుసంవత్సరముల కాలము పరిశోధనవిద్యార్థిగా నుండిరి. ఇప్పుడు ఆంధ్రవిశ్వ కళాపరిషత్తులో జయపుర విక్రమదేవ కళాశాలలో రసాయనశాస్త్రమందు పరిశోధన గావించుచున్నారు. వీరిటీవల తాముగావించిన Budde effect on Halagens అను పరిశోధనకు ఆంధ్రవిశ్వ కళాపరిషత్తువారు డాక్టరు బిరుదము నొసంగినారు. ఇట్టి పట్టము నీవిశ్వవిద్యాలయమున బొందుటకు వీరే ప్రథములు. (గ. శ్రీ. న)



స్తంభశిల్పము     S. S. S.






శ్రీమతి కమలాదేవిగారు

అంతర్జాతీయ మహిళాసమావేశమునకు భారతీయ ప్రతినిధి. ఈమెకు ప్యాసుపోర్టు నీయ ప్రభుత్వమువారు నిరాకరించిరి.



సి. సేతూబాయిగారు బి. ఏ.

మైసూరు మహారాణి కాలేజిలో చదివిరి. మైసూరు విశ్వవిద్యాలయమువారు ఈమెపాండిత్య విశేషసూచకముగా రెండుబంగారుపతకములు, నాలుగు యితర బహుమతులు నొసగిరి.

# నటపితామహుడు కీ. శే. హరిప్రసాదరావు

[ ప్రజామిత్రలో ప్రకటితమయిన శ్రీనివాసశిరోమణిగారి రచనమునుండి ]

౫-౮ తేది రాత్రి శ్రీహరిప్రసాదరావు స్వర్గస్థుడయినాడు.

తెలుగుదేశములో భాగవతపుకత్తూ వీధినాటకాల కత్తూ తోసిపారవేసి ఒక కొత్తకత్తు నాటకాలలో తీసుకొనివచ్చినవాడున్నూ తెలుగుపద్యము ఒక కొత్తకత్తులో పాడడము నేర్పినవాడున్నూ ఈయనే. అతఃపూర్వము ఎవరికీ ఆపద్ధతి తెలియనే తెలియదు. ఈనాడు తెలుగు పద్యము చదివేపద్ధతికి మూలపురుషుడు ఆయన.

అసలు ప్రసాదరావు కూచిపూడిభాగవతుల యింట్లో పుట్టినాడు. (ఆయనతండ్రి హరివారికి పెంపుడు.) అందువల్లనే ప్రసాదరావు నటనాకౌశలము వంశక్రమానుగతమయినది. ఆంగ్లభాషాభ్యాసమువల్లనూ, సమస్తప్రాచ్యపాశ్చాత్యసారస్వత మహోదధిని మధించిన విద్వాంసులు కీర్తిశేషులు శ్రీ వంకిపురము వెంకటకృష్ణమాచార్యులవారి సహవాసమువల్లనూ ఆకాలములో ఆనాటికి కలుగుతూవున్న మార్పులవల్లనూ ఆయన ఆంధ్రనాటకప్రదర్శనములో యీనాడు ప్రచారములో ఉన్న నాటకప్రదర్శనాలకు దారి చూపించినాడు.

ఈ ప్రసాదరావు అనేవాడే పుట్టివుండకపోయినట్లయితే బళ్లారి కృష్ణమాచార్యులుగారి నాటకాలు అచ్చులోనేవుండిపొయ్యేవి. అవియెన్నడూ ప్రదర్శనయోగ్యతను పొందేవేకావు.

ప్రసాదరావు నాటకాలు ఆడడము ప్రారంభించినప్పుడు మొట్టమొదట కందుకూరి వీరేశలింగము పంతులవారి శాకుంతలమూ వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారమూ మొదలయిన సంస్కృతనాటకాలతర్జుమాలనే యెత్తుకొన్నాడు. అయితే అందుకు ఒకవిధముగా వంకిపురమువారే కారకులని చెప్పవచ్చును.

ఆరోజులలో గుంటూరులో నాటకప్రదర్శనాలు పామరులకోసముకాదు. విద్వాంసులకోసమే జరుగుతూవుండేవి. ప్రదర్శనము పామరరంజకమయితే కావచ్చును. కాని యోగ్యత (Cultured Few) వున్నవారికోసమే నని వారి అభిప్రాయము. అంతేకాదు. విద్వాంసులే తరుచూ అటువంటి నాటకప్రదర్శనాలకు హాజరవుతూ వుండేవారు. ౧౯౧౦-౧౨ సంవత్సరములలో నాటకప్రదర్శనానికివెళ్లి ఆనందించడమే ఒక గొప్పవాడి లక్షణముగా గుంటూరులో తయారయింది.

అటువంటి లక్ష్యములతో ప్రసాదరావు నాటకఖేలనము నడిపించినాడు. ఆయన గొప్ప నటనాకౌశలమున్నవాడని ప్రతివారూ చెప్తారు. ఆయన సంగీతానికి అంతగా ప్రాధాన్యత యీ రోజులలో యివ్వడము లేదు. అసలు ఆయన నటనాకౌశలముకన్నా సంగీతకౌశలమే యెక్కువని ఆరోజులలో పండితులు గమనించినారు. అయితే కర్ణాటక సంగీతహృదయము తెలుసుకొన్న విద్వాంసులకే ఆయన సంగీతములో గొప్పతనము తెలుస్తుంది.

ప్రసాదరావు కొత్తకత్తుపెట్టకపూర్వము తెలుగు పద్యము రెండుపద్ధతులతో చదువుతూవుండేవాళ్లు. వేదమంత్రాలు చదివేటట్టు చదివేపద్ధతి ఒకటి. రెండోది సంగీతమువచ్చినవారు చదివే పద్ధతి. పంక్తిలో విరామస్థానములో—అక్కడ విరామమువున్నా లేకపోయినా అప్పయికనక్కడ సంగీతపుసంగతులన్నీ వేసి గిరిగింతాలు కొట్టించి అగ్గిథరాటాలాగా రాగాన్ని లాగిలాగి మళ్లీ మొదటికివచ్చి పద్యము ఆరంభించి మళ్లీ కొంతదూరము పోయి ఆగి సంగీతముప్రారంభించి అక్కడ మళ్లీ గిరిగింతాలన్నీ కొట్టించి చివరకు పద్యము ఆపి పావుగంటో ముప్పావుగంటో రాగము వదులుతూవుండేవాళ్లు. ఈ పద్ధతిలో పద్యాలు పాడితే యెట్లావుంటవో యీనాడు తెలుసుకోవలెననేట్లయితే తెలుగులో మొట్టమొదట పద్యాలు గ్రామఫోన్ రికార్డులకిచ్చిన శ్రీ తెంగుటూరు నాగరత్నము రికార్డు యెక్కడయినా దొరికితే వింటే బోధపడుతుంది.

ప్రసాదరావు యీరెండు పద్ధతులూ తీసి దూరంగా పారవేసినాడు. తెలుగు ఛందస్సుకున్నూ కర్ణాటక సంగీతములోవున్న రాగాలకున్నూ సంబంధము వెతికినాడు. ఏయేఛందస్సులకు యేయే రాగాల ఆరోహణావరోహణలు సరిపోతవో తెలుసుకొన్నాడు. ఆయా ఛందస్సులకు ఆయా రాగాలు వుపయోగించేవాడు. పద్యములో యెక్కడ విరామమువస్తే అక్కడనే సంగీతము కూడా విరమించేట్టుచదివేవాడు. పద్యము ఆగితే సంగీతముకూడా ఆగిపోయేది. ఆయన సంగీతమంతా పద్యపంక్తులలో అంతర్లీనమయి వుండేది. ఇది ప్రతివారున్నూ యిట్టే అనుకరించడానికి వీలులేని పద్ధతి. ఎంతో సంగీత జ్ఞానము వుంటేనే సాధ్యమవుతుంది.

ప్రసాదరావు కర్ణాటకసంగీతములో తెలుగు పద్యాలకోసము ఏరుకొన్న రాగాలలో ముఖ్యమయినవి: —పున్నాగ—పంతువరాళి—శహన—శ్రీ—పూరీ కళ్యాణిరాగాలని చెప్పవచ్చును. సీసపద్యములు చదువ వలసి వచ్చినప్పుడు తరచూ ఆయన పున్నాగ—శహన రాగాలు వుపయోగించేవాడు. ఆయనపద్యము చదివితే శబ్దాలంకర్థము తెలిసినా తెలియకపోయినా భావము పామరులకు కూడా ద్యోతకమయ్యేది.

ఖేలనమువిషయములో ఒక్కమాట చెపితే చాలును. వేణీసంహారనాటకములో ప్రసాదరావు దుర్యోధనపాత్ర ధరించేవాడు. యుద్ధవార్తాహరుడుదుర్యోధనుడి దగ్గిరకువచ్చి యుద్ధవార్తలు చెపుతాడు. ప్రతివార్తకూ దుర్యోధనుడు తరువాత తరువాత అనడమున్నా పుస్తకములో మరొకపంక్తిలేదు. అదంతా అయ్యేసరికి షుమారు ఒక ముప్పావుగంట పడుతుంది. మామూలు దుర్యోధనులంతా కట్టెలల్లె నిలుచుంటారు. ప్రసాదరావు మాత్రము ఆవార్తలు వినేటప్పుడు ఆయనముఖములో కలిగే హావభావములకు సుండీలు తరుగుకొనిపోయేది.

ఈవిధముగా చెప్పడమారంభిస్తే ఎంత గ్రంథమవుతుందో!

ఇక ప్రదర్శనానికి నాటకాలను ఏరుకొనేటప్పుడు కొద్ది పాత్రలతో నిర్వహించడానికి వీలయ్యే నాటకాలనే తీసుకొనేవాడు. ఈకాలములో సినిమాలలో 'టెంపో'ను ప్రసాదరావు యెన్నడో గ్రహించినాడు. ఏయేరంగాలు యెంతత్వరగా నడవవలెనో ఏయేరంగాలు యెంత ఆలస్యముగా నడవవలెనో ఆయనకు తెలిసినట్టు ఎవరికీ తెలియదేమోనంటే అతిశయోక్తి ఏమాత్రమూకాదు. సంస్కృత నాటకాలు ప్రదర్శించేటప్పుడుకూడా రసభంగము కాకుండా కొన్నిఘట్టాలు కుదించేవాడు. ఒకప్పుడు ఒకటిరెండు రంగాలు కలిపి ప్రదర్శించేవాడు.

ఈయన నాటకప్రదర్శనాలను చూచి బళ్లారి కృష్ణమాచార్యులవారు చిత్రనళీయమూ పాదుకాపట్టాభిషేకమూ సారంగధరా ప్రదర్శించడానికి యిచ్చినారు. ఈయన ఆనాటకాలు ప్రదర్శించడము ప్రారంభించినతర్వాతనే ఆనాటకాలకు పేరుప్రతిష్ఠలు వచ్చినవి. చిత్రనళీయము యథామూలముగా ప్రదర్శించేట్లయితే రెండురాత్రులు పడుతుంది. అంతపెద్ద నాటకాన్ని నాలుగుగంటలకాలములో అయిపోయేట్టుగా రంగాలు ఏరుకొని ప్రదర్శిస్తూవుండేవాడు.

ఏ లోపము ఏనాటకాలలోనూ యీయన చేసినాడని చెప్పడానికి ఏమీ వీలులేదు. ఏభావముకావలెనంటే ఆభావమూ,ఏరసము ఒప్పించవలెనంటే ఆరసమూ ఇట్టే పరుగెత్తుకొనివచ్చి ఆయనను అవరించేవి ఆయన నాటకప్రదర్శనాలు చూచినకండ్లే కళ్లు!

ఆరోజులలో ఆయన నాటకాలలో పడకుండా ఏ సర్కారు వుద్యోగములోనయినా నిలవబడిపోయినట్టయితే మరణసమయానికి ఏవందరూపాయలు ఫింఛనో పుచ్చుకొంటూవుండేవాడు కాని అట్లాజరగలేదు. నాటకాలకోసమే ఆయన జీవితముఅంతా వెళ్లిపోయింది. వృద్ధాప్యములో దారిద్ర్యము అనుభవించినాడు. పాపము పూర్వజన్మములో ఏదో తపోభంగమయిపోయినందువల్ల ఆంధ్రదేశములో పుట్టినాడు.

ఆయన నటనానుభవమువల్ల పొందవలసినంత లాభము ఆధునికనటులు పొందలేదు......అది ఆయన దోషముకాదు.




11|1936

## అస్ఖలిత యోగము

ఇది ౪౬ పుటల చిన్నపుస్తకమైనను ధర మాత్రము ౧-౦-౦. పుస్తకమునకు ధర తగియున్నను లేకపోయినను హెచ్చుధరలు మాత్రము పుస్తకములపై వేయుట ఆంధ్రదేశములో చాలాచోట్ల ఆచారముగా కనుపించుచున్నది. ఇది చాల గర్హింపదగిన విషయము.

పేరు మాడిపముతో యిది వేదాంత గ్రంథమా యనిపించినది కాని లోపల చూడ వీర్యస్తంభన విషయము. గ్రంథములోని విషయమునకును గ్రంథనామమునకును సమన్వయము లేదు. గ్రంథకర్త పీఠికయందు శంకరునికిని విధాతకును పరస్త్రీలను చూచిన వీర్యస్ఖలనమైననియు, ఆ శంకర కరుణాకటాక్షమువలననే తానీ దుర్ఘటమగు వీర్యస్తంభనయోగమును కనిపెట్టితిననియు వ్రాసియున్నారు. తానే వీర్యమును స్తంభింపచేసుకొనలేని శంకరుడు గ్రంథకర్త కెట్లు తోడ్పడెనో తెలియకున్నది.

గ్రంథమున బ్రహ్మచర్యమును గురించియు, వీర్యవృద్ధికరములు స్తంభనములు మొదలగు వాటికి మందులును వీర్యము స్రవింపకుండ మనోనిగ్రహము చేయుటయు కోకోక్కకమునందలి స్త్రీల కళాస్థానములు తిథులు సంభోగ నియమములు మొదలగువాటిని గురించియు గలదు. ఈ విషయములన్నియు ఆయుర్వేదగ్రంథములు, కామశాస్త్రములు మొదలగువాటిలోనివే.

గ్రంథకర్త, పబ్లిషర్: కె. పి. సత్యం, తాళ్లపూడి, పశ్చిమగోదావరిజిల్లా.

జగన్నాథ.

---

## జీవితసంక్రియ (టాల్‌స్టాయి)

అనువాదకుడు: శల్లాప్రగడ ప్రకాశరాయడు

ప్రకాశకులు: హరిజన గ్రంథమాల, రాజమండ్రి. వెల ౦-౮-౦.

నైతికమును ప్రజలేల తెచ్చుకొందురు; మతమనగేమి; లోలాకులు; హేతుజ్ఞానము; మొదటిమెట్టు; అను అయిదు వివిధ ప్రకరణముల సంపుటి యీపుస్తకము. టాల్‌స్టాయి వ్రాతల కివి అనువాదములు. సుప్రసిద్ధ రష్యను వేదాంతియగు టాల్‌స్టాయి వ్రాతలలోని హేతుపూర్వక చర్చలు అతనిగ్రంథములను చదివినవారందరికిని తెలిసినవే. కాని రష్యనుభాషనుండి ఇంగ్లీషునకును, ఇంగ్లీషునుండి తెలుగునకును రూపాంతరమునొందిన యీగ్రంథమున టాల్‌స్టాయి భావములు ఎంతవరకు చక్కగా తెలుపబడినవో మాత్రము గమనింపవలసిన విషయము.

ఈవిషయమున అనువాదకులు చాలవరకు కృతకృత్యులైరని చెప్పవచ్చును. కొన్నిచోట్ల భావములు దుర్గ్రాహ్యముగా నిలిచిపోయినవి. శైలి మాత్రము సులువుగా నర్థమగునట్లున్నది.

నీతిబోధకములగు ఇట్టిపుస్తకములను, యిట్లే స్వల్పధరకు యింకను పెక్కింటిని హరిజనగ్రంథమాల వారు ప్రకటించుట యెంతయు వాంఛనీయము.

క. స.

---

## కులలక్ష్మి

రచయితలు: విద్వాన్ బస్తులపల్లె నరసింగరావు; కదిరి శ్రీనివాసాచార్యులు. ప్రకాశకులు గ్రంథకర్తలే.

చిరునామా: కదిరి, అనంతపురంజిల్లా. వెల. ౦-౧౨-౦.

శ్రీ సురేంద్రనాథరాయ్ గారు వంగభాషయందు రచింపగా, శ్రీ పురుషోత్తమదాసు లోహియాగారు హిందీలోనికి అనువదించిన యీ గ్రంథమును, వీరు తెలుగునకు అనువదించిరి.

పౌరాణిక యుగమునాటి స్త్రీల పాతివ్రత్య ధర్మమును, ప్రాశస్త్యమును వెల్లడించు గాథలతో, సాంసారిక స్త్రీలకు దైనందిన చర్యలను బోధించు విషయ

ములను ఈగ్రంథము చాల కలిగియున్నది. కొన్నివిష యములలో సనాతనపద్ధతుల నింకను అవలంబించవల యునని చెప్పుట ఆధునిక కాలమున అపహాస్యపాత్ర ముగ దోచుచున్నది. హిందీలోని గ్రంథమును అనువ దించుటకంటె, అందలి భావమును సనాతన, అధునా తన దృష్టిని సమన్వయము చేయుచు ప్రత్యేకగ్రంథముగా వ్రాసియుండిన నెంతయో బాగుండెడిది.

క. స.

### శాకాహార ప్రయోజనము

డెమ్మి ౧/౮ సైజు. పు. ౫౬. వెల రు ౦-౮-౦

అనువాదకుడు : మండా వెంకట నరసింహారావు.

ప్రకాశకుడు : రా. సా. యం. వి. అప్పారావు పంతులు, వెంకటేశ్వరస్వామిగుడివీథి, బరంపురం (గంజాముజిల్లా).

---

### వ్యామోహము (నవల)

డెమ్మి ౧/౮ సైజు. పు. ౧౫౬ వెల రు. ౧-౦-౦

గ్రంథకర్త : కొత్తభావయ్యచౌదరి.

ప్రకాశకులు : శ్రీ సత్యనారాయణ బుక్ డిపో వారు, రాజమండ్రి.

### ఇంగ్లీషు-కన్నడ నిఘంటువు

ఒకటవభాగము (A మొదలు Billow వరకు) పు. ౯౯.

ప్రధానసంపాదకులు: బి. వెంకటనారాయణప్ప.

ప్రకాశకులు : మైసూరు విశ్వవిద్యాలయము, బెంగుళూరు.

---

### లీలావతీ గణితము

(శ్రీ భాస్కరాచార్య విరచిత వాసనాభాష్య సహితము)

ఆంధ్రవ్యాఖ్యాత : పిడపర్తి కృష్ణమూర్తి; పొడగట్లపల్లి, గోపాలపురం సబ్ పోస్టు, తూ. గో.

డెమ్మి ౧/౮ సైజు. పు. ౫౬౦. వెల రు. ౪-౦-౦

### శ్రీరాముని శీలము

క్రౌను ౧/౮ సైజు. పు. ౩౦ వెల ౦-౪-౦

గ్రంథకర్త : దువ్వూరి జగన్నాథశర్మ, కాశీ నాథ.

---

### వయోజనవిద్య (మూడవది)

క్రౌను ౧/౮ సైజు. పు ౨౪. వెల ౦-౧-౦.

తనివారపు సుబ్బారావు, కొవ్వూరు.

### వైదిక వివాహ తత్త్వప్రకాశిక

క్రౌను ౧/౮ సైజు. పు. ౩౬౦. వెల రు. ౧-౮-౦.

రచయిత : పండిత పి. యస్. ఆచార్య, బ్రహ్మ చర్యాశ్రమము, తుందేరు.

---

### సంయుక్త (నాటకము)

క్రౌను ౧/౮ సైజు. పు.౧౩౭. వెల రు ౦-౧౨-౦

కర్తలు : భాగవతుల వెంకటశాస్త్రి, బి. ఏ. యల్. టి. తంగిరాల రామమూర్తి, విద్వాన్, బి.ఏ., బి. ఇడి.

ప్రకాశకులు: సరస్వతీ గ్రంథమాల, కాకరపర్రు, ప. గోదావరిజిల్లా.

### స్వామి వివేకానంద యతి గీతము

పండ్రెండు పుటల చిన్న పుస్తకము, గీతపద్య రచనము.

అనువాదకుడు : కూచి నరసింహము, పిఠాపురము.

వెల ఒక అణా.

---

### బసవేశ్వర్ కే వచన్

(కన్నడమూలమునకు హిందీ అనువాదము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౧౦. వెల రు. ౦-౮-౦.

అనువాదకులు : ఏ. వి. శ్రీనివాసమూర్తి, యం. సి. శివానందశర్మ.

ప్రకాశకులు : యం. యస్. శివప్ప అండు బ్రదర్సు, చిక్ పేట్ చౌక్, బెంగుళూరు సిటీ,

---

# నాభిప్రాయ విశేషములు

ప్రపంచవ్యాప్తమైన మానవధర్మ పరివర్తనము భయంకరమైనను అనివార్యము. ప్రళయము పునర్నిర్మాణమునకు మూలాధారము. ప్రళయములు దేశకాల పాత్రరూపములైన నామరూపములను నాశనము చేసినను నిత్యమైన ధర్మవికాసమునకు వినియోగపడుచున్నవి. కల్పములు గతించినవి. యుగములు, శకములు కాలప్రవాహమునందంతరించినవి. ధర్మము మాత్రము నాశనము లేక వికాసమును పొందుచున్నది. మహాభారత యుద్ధములు ధర్మసంస్థాపనార్థము సంప్రాప్తములగుచున్నవి. దుర్యోధన ధర్మరాజులు సర్వకాలసర్వావస్థలయందును ధర్మపరిణామవికాసములకు వినియోగపడుచుందురు. గాంధారి వచనమే "యతో ధర్మస్తతో జయః" సార్థకమగుచుండును. వినాశము లేకను శాంతిపర్వమసాధ్యమని ప్రాచీన భారతసంగ్రామము వలెను వర్తమానప్రపంచపరిస్థితులును విశదము చేయుచున్నవి. శాంతిపర్వము ప్రపంచమునకు ప్రియమైనను యుద్ధపంచకము లేకను శాంతిపర్వము ధర్మవికాసమునకు సంభవము గాదు.

వివిధ రాజ్యములందును రాజ్యాధికారనిర్వాహకులు ప్రతిపాదించెడి శాంతివాక్యములు కార్యములందు సంగ్రామపరిణామమును పొందుచున్నవి. కవులు, పండితులు, వేదాంతులు, శాస్త్రజ్ఞులు, రాజులు, మంత్రులు, మహారథులు, రాజనీతిజ్ఞులు, ధర్మాత్ములు విషాదయోగభరితులైనను కర్మయోగ సిద్ధి గలుగకను విషాదయోగ మంతరించదు. అంగబలమునకును, అర్థబలమునకును, ధర్మబలమునకును ప్రవర్ధమానమగు సంరంభము నందర్థాంగబలముల ప్రతిభ పండితులకును సమ్మోహమును గలుగజేయును. హిట్లరు, ముస్సొలోని వర్గప్రతిష్ఠ పండిత పామర జనాదరణమునకు పాత్రమగుచున్న విధము ప్రపంచము నావరించిన ఆసురసంపద్యోగ ప్రభావమును విశదము చేయుచున్నది. హిట్లరుగారి నాయకత్వమున నాజీవర్గము స్థాపింపదలచిన ధర్మసమస్య సర్వసంహారమునకు సాధనము గాగలవిధమును ప్రపంచము నావరించిన సంగ్రామసన్నిపాతము విశదము చేయుచున్నది.

* * *

జర్మను రుష్యాసంఘర్షణము

సోవియటురుష్యా స్థాపించిన నవయుగ ధర్మవిజయము సాధ్యమగుటకు జర్మను రుష్యా సంగ్రామమనివార్యముగ నున్నది. ముస్సొలోని, ప్రగల్భములు బ్రిటీషుసింహాము నందును సంచలనమును గలుగజేసినవి.

మానవధర్మ సంస్థాపనమునకు భయంకరమైన సోవియటు నాజీసంగ్రామము సన్నిహితముగ నున్నది. యూరపురాజ్యములు చేయుచున్న సంగ్రామోద్యమమునకు సంగ్రామ ఫలము సహజముగ గలుగనున్నది. ఆనన్నమైన సంగ్రామదావానలమునందు స్వల్ప రాజ్యము లాహుతిగాగల విధమును కాలము విశదము చేయగలదు. బలములేని నానా జాతిసమితి సంగ్రామనివారణమునకును శాంతి స్థాపనమునకును నిరుపయోగముగ నున్న విధమును అబిసీనియా స్పెయిను సంగ్రామములు, హిట్లరు సంభాషణలు వెల్లడి చేయుచున్నవి. గ్రేటుబ్రిటను వహించుచున్న తటస్థ భావము, సంశయస్థితి శాంతిప్రయోజనములకు నిరుపయోగముగ నున్నది. హిట్లరు యథేచ్ఛగను సకలదిశలను సంగ్రామబీజములను నాటుచున్నను గ్రేటుబ్రిటను చూపుచున్న నిర్లక్ష్యము బ్రిటీషు ప్రతిష్ఠను క్షీణింపజేయుచున్నది, బ్రిటీషు సామ్రాజ్య పరావలంబమునందు మునిగి తేలుచున్న హిందూస్థానస్థితి సకలవిధముల సంధకార బంధురముగ నున్నది.

* * *

హిందూస్తానము

పారతంత్ర్య బద్ధమైన హిందూస్తానస్థితి జడమయమై దుఃఖభూయిష్ఠముగ నున్నది. ప్రజాహృదయమునం దజ్ఞానము తాండవమాడుచున్నది. గృహములందు దారిద్ర్యము విహరించుచున్నది. గ్రామసీమలందు మృత్యుదేవత సంచారము చేయుచున్నది. అగ్రజాంత్యజభేదము, రాజప్రజాసంరంభము, స్వాతంత్ర్యాచారసంరంభము రయితుజమీందారి సంరంభము, సనాతనసంస్కార సంరంభము, హిందూమహమ్మదీయ సంరంభము మొదలగు విభేదములు దేశావ్యాప్తమైన యరిష్టములకు దోహదము నొసగుచున్నవి. పారతంత్ర్యపాశములందు నిశ్చేష్టతనుపొందిన అర్థాంగధర్మములు ప్రజల నిత్యజీవనమునకును నిరాధారములైనవి. సామాన్య స్వల్ప విషయములును దురాలోచనలకు, దుర్బోధనలకు, దుర్మార్గములకు నిమిత్తము లగుచున్నవి. వోటరుల పట్టీలను తయారుచేయుటయందు శ్రీమంతులు, జమీందారులు, విద్యావంతులు, అధికారులు చేసిన యన్యాయములు దేశావ్యాప్తమైన యసంతుష్టిని వెల్లడిచేయుచున్నవి. పరావలంబనమే శరణ్యమైన ప్రజలందు నవజీవన ప్రవాహములు శుష్కించి ఆత్మవిశ్వాస గౌరవములు దుర్లభము లగుచున్నవి. ప్రజాహృదయము నావరించిన నిరాశ, నిశ్చేష్టత, నిస్పృహ ప్రజల నిరుద్యోగము జీవనవాహినులను స్తంభింపజేసి నవజీవనోదయము దుర్లభముగనున్నది. రాజకీయ నైతికార్థిక సాంఘిక మతాదిసకల విషయములందును ఆత్మవిశ్వాస మంతరించి ఆచారపరావలంబనములు శరణ్యములైనవి. ముప్పదియైదుకోట్ల ప్రజల దైన్యస్థితి జిజ్ఞాసువులకు జాతిమత భేదములేకను విచార

